"ఈ గ్రంథములు ముద్రించుటకు అవసరమైన
కాగితము కేంద్ర ప్రభుత్వమువారిచే
తగ్గింపు ధరకు అందజేయబడినది"

సంపుటి 1 - 2

కోటగిరి

శ్రీమాతారవింద సత్సంగ కేంద్రంవారి విరాళంతో

శ్రీ దివ్యమాత శతజయంతి గ్రంథ ప్రచురణ సమితిచే
ప్రచురింపబడినది.

ముద్రణ : శ్రీఅరవిందాశ్రమ ఆంధ్రభవనం ముద్రణాలయం, పుదుచ్చేరి.



ప్రభూ, నీయెడ కృతజ్ఞతాపూర్వకము, పరమవిశ్వాస
సంభరితమునైన యీ నా భక్తినివాళి నందుకొనుము.

# శ్రీ మాత

జననం

ఫిబ్రవరి 21, 1878

భారతదేశానికి ఆగమనం

మార్చి 29, 1914

మహాసమాధి

నవంబరు 17, 1973

శతజయంతి

ఫిబ్రవరి 21, 1978

# ప్రస్తావన

గత శతాబ్దియందలి 1878 సంవత్సరము ఫిబ్రవరి నెల 21 వ తేదీ పుణ్య దినమందు శ్రీ దివ్యమాత భూలోకమున కవతరించి ఫ్రాన్సుదేశములోని ప్యారిసు నగరమున జన్మ గైకొనినది. ఆమె జీవితము చిన్ననాటినుండియు పెక్కు ఆధ్యాత్మికానుభూతులతో నిండియుండెను. తన దివ్య స్వప్నములలో సాక్షాత్కరించుచు వచ్చిన యిష్టదైవమును 'కృష్ణా' యని పిలుచుకొనుచు, భూలోకమున తదన్వేషణలో 1914 మార్చి 29 వ తేదీని పుదుచ్చేరి వచ్చి, అచ్చట శ్రీఅరవిందులను దర్శించి, ఆయనయే తనకు దర్శన మిచ్చుచు తన సాధనకు తోడ్పడుచు వచ్చిన మహానుభావుడని గుర్తించి, ఆ సందర్భమును మరునాడు 'ప్రార్థనలు- ధ్యానములు' అను తన వ్రాతపుస్తకమున నిట్లు ఉల్లేఖించుకొనెను:

''వందలకొలది జీవులు ఘనిష్ఠమైన అజ్ఞానములో కూలద్రోయబడి యున్నను ఆందోళన చెందవలసిన పనిలేదు. నిన్న మేము పొడగాంచిన మహనీయుడు భూమిపైనున్నాడు. అంధకారము ప్రకాశముగా పరివర్తనము చెంది, పృథ్విపై నీ (ఈశ్వర) రాజ్యము ప్రతిష్ఠింపబడు దినము రాగలదని నిరూపించుటకు ఆయన సన్నిధియే చాలును.''

ఆ క్షణమునుండియు ఆమె శ్రీఅరవిందులను అవతారపురుషునిగను, పరమ గురుదేవునిగను స్వీకరించి ఆయనకు సర్వార్పణము గావించుకొనెను.

మొదటి ప్రపంచయుద్ధపు అంతరాయము కతమున శ్రీమాత తన స్వదేశమైన ఫ్రాన్సు వెళ్ళవలసివచ్చెను. కాని, 1920 ఏప్రిల్ 24 వ తేదీన ఆమె

తిరిగి పుదుచ్చేరికి వచ్చి, శ్రీ అరవిందుల సన్నిధిలో స్థిరనివాసస్థాన మేర్పరచుకొని యుండిపోయెను.

శ్రీ అరవిందులును, శ్రీమాత దివ్యజన్మ కర్మలను గుర్తించి, తన యోగముచే నాకర్షింపబడిన తన శిష్యులందరి జీవితమును, సాధనను తీర్చిదిద్దగలందులకు ఆమెను ఏర్పాటు చేసిరి. సచ్చిదానందస్వరూపుని ఆద్యశక్తియే మానవుల నుద్ధరించుటకు ఈ లోకమున జన్మగైకొనినట్లు గుర్తించి, ఆమె శక్తివిశేషములను "ది మదర్" (శ్రీమాత) అను చిన్న పొత్తములో అత్యద్భుతముగ వర్ణించి తన శిష్యులందరకును తెలియజేసిరి.

తదాది, శ్రీమాత శ్రీ అరవిందాశ్రమవాసు లందరకు తల్లియై విరాజిల్లినది. నిర్విరామ కృషితో, ఆశ్రమమునందును, బయటిప్రపంచమునందును గల తన బిడ్డలందరి యోగక్షేమమును ఆమె వహించి వారిని తీర్చిదిద్దినది. శ్రీమాత కొంతకాలముక్రిందట, ప్రభువు సంకల్పించినదంతయు తాను సాధించినట్లుగా ప్రకటించెను.

శ్రీ అరవిందుల లక్ష్యము మానవునకు మోక్షమార్గమును ప్రబోధించి చూపుట మాత్రమే కాదు; మానవ ప్రకృతిని దివ్యప్రకృతిగా మార్చి, మానవుని దేవునిగా రూపొందించుటయు, భూమిని పరంధామముగ పరివర్తింప జేయుటయు ఆయన పరమలక్ష్యము.

1950 డిసెంబరు 5 వ తేదీని శ్రీ అరవిందులు శరీరత్యాగము చేయగా, శ్రీమాత నిర్విరామ కృషితో, శ్రీ అరవిందులు చాటిన అతిమానస చేతనను భౌతిక మానస చేతనలోనికి అవతరింపజేసి నూతన సృష్టికి పునాదులు వేసెను. 96 సంవత్సరముల వయస్సు వరకు అనన్య సామాన్యమైన ఆధ్యాత్మిక కృషిని అన్ని రంగములలోను సలిపి, అవరోధములేని నూతన సృష్టికార్యము త్వరితముగ ఫలసిద్ధి పొందింపజేయుటకొరకో యనినట్లు, 1973 నవంబరు 17 వ తేదీన ఆమె తన కుదించుకొనిన కాయమును వదలి విశ్వము నావరించినది.

1972 ఆగస్టు 15 వ తేదీని శ్రీ అరవిందుల శతజయంతి ఉత్సవములు శ్రీమాత సమక్షమున జరుపబడెను. శ్రీ తల్లిగారి బిడ్డలును అటులనే ఆమె శత జయంతిని 1978 ఫిబ్రవరి 21 వ తేదీని జరుపుటకు నిశ్చయించిరి. ఈ సందర్భములో, శ్రీ తల్లిగారి పుస్తకములు — 'ప్రార్థనలు- ధ్యానములు', 'ప్రశ్నోత్తరములు' 'పరిసంగములు,' మొదలగునవన్నియు 15 సంపుటములుగా ఆంగ్ల భాషలో వెలువరించుటకు కృషి జరుగుచున్నది. ఆశ్రమవాసులు, తదితరులగు ఆయా రాష్ట్రవాసులు తమ ప్రాంతీయ భాషలలో పై గ్రంథములను వెలువరించుటకు ప్రయత్నించుచున్నారు.

అటులనే ఆంధ్రులును 1976 ఫిబ్రవరి మాసమున హనుమకొండలో నిర్వహించబడిన తృతీయ అఖిలాంధ్ర శ్రీఅరవింద సొసైటీల వార్షికోత్సవ సందర్భములో, శ్రీమాత శతజయంతి ఉత్సవమునాటికి ఆంధ్రములో కూడ కనీసము ఆరు సంపుటములు అచ్చొత్తించి ఆంధ్రప్రజానీకమునకు అందజేయుటకు కృతనిశ్చయులై "శ్రీ దివ్యమాత శతజయంతి గ్రంథ ప్రచురణ సమితి" అను పేరుతో ఒక సంఘమును ఏర్పాటుచేసి, శ్రీమాతారవిందుల ఆశీస్సుల నర్థించుచు రంగములోనికి దుమికిరి.

కాని, అనేక కారణముల వలన, 1977 ఆగస్టు నాటికి ఒక్క సంపుటి మాత్రమే వెలువరించుటకు వీలైనది. శ్రీ అమరవాది వేంకటరామశాస్త్రి, శ్రీమతి అమరవాది ప్రభావతిగారలు అనువదించిన '1953 ప్రశ్నోత్తరములు' లో సగము భాగము 9 వ సంపుటిగా వెలువరించబడెను. దీనికి గారణము, ఆంగ్ల సంపుటములను తెలుగులో రెండేసి సంపుటములుగా ప్రచురింపదలచుటయు, '1953 ప్రశ్నోత్తరములు' ఆంగ్లమున 5 వ సంపుటిగా ప్రకటింపబడుటయే.

ఆంగ్లములో 1 వ సంపుటముగా వెలువరించ నుద్దేశించబడిన శ్రీమాత 'ప్రార్థనలు-ధ్యానములు' ఆ ప్రకారము తెలుగులో రెండు సంపుటములుగా తావలసియుండెను. ఆ ప్రయత్నమే తొలుత జరిగినది. కాని, ఆంగ్ల సంపుటి ప్రచురణ విధానములో వచ్చిన మార్పుల కారణమున, ఈ 'ప్రార్థనలు-ధ్యానములు'

ఒకే సంపుటిగ వెలువడుటయే యుక్తమని తోచినది. 'సంపుటి 1- 2' అని దీనిని పేర్కొనుటకు ఇదియే కారణము.

ఆంగ్లసంపుట మింకనూ వెలువడలేదు. అందుచే, 1948 లో విస్తృతముగా ప్రచురితమైన కూర్పు ననుసరించి యీ అనువాదము పూర్తిచేయబడినది. హిందీలో ప్రచురణకూడ ఈ ప్రకారమే జరిగినది. వీలైనంత త్వరలో ఈ అమూల్య గ్రంధమును పాఠక లోకమునకు అందీయవలెనన్న ఉత్సుకతయే దీని నిట్లు వెల్వరచుటకు హేతువైనది.

1914 లో శ్రీ అరవిందులను గలిసికొనక పూర్వమే శ్రీమాత అనుదినము ఈ 'ప్రార్థనలు - ధ్యానములు' వ్రాసియుంచు నభ్యాసము కలిగియుండెడి దనియు, కారణజన్మురాలగుట చేతనే ఆమె సాధన ప్రక్రియ అంతయూ శ్రీఅరవిందుల సాధన ప్రక్రియకు అనురూపమై వెలసినదనియు ఈ రచనలవలన విశదము కాగలదు.

మన పరమమూలస్వరూపుడైన పరమేశ్వరునకు అనన్యప్రేమ పూర్వకముగా ఆత్మార్పణ మొనర్చుకొని, సృష్టివిధానములో ఆయన దివ్యాభివ్యక్తి రూపమైన మహాకార్యమున మనము గూడ పాల్గొనుట యెట్లో ఆచరణమూలకముగా బోధించి చూపునట్లున్న యీ దివ్యరచనలు, చిత్తశుద్ధితో సాధనచేయు వారికెల్ల రకూ ఎంతేని ఉద్దీపకములై, చేయూతనిచ్చి నడిపించునవియై వెలయగలవనుటలో సందియము లేదు.

ముద్రణ సంబంధమైన ఆటంకము లెల్లతీరి, దీని వెనువెంటనే 10 వ సంపుటిగ వెలువడవలసియున్న '1953 ప్రశ్నోత్తరములు' శేషభాగము, అటు పిమ్మట తదితర సంపుటములు త్వరితగతిని వెలువరించ గలుగుదుమని ఆశిస్తున్నాము.

శ్రీ దివ్యమాత శతజయంతి
గ్రంథ ప్రచురణ సమితి

# శ్రీ మాత వాక్కు

కొందరు భగవంతునకు తమయాత్మ నొసంగుదురు. కొందరు తమ జీవితమును, కొందరు తమ కర్మను, కొందరు తమ విత్తమును అర్పణము చేయుదురు. అల్పసంఖ్యాకులు తమకు గల సర్వస్వమును — ఆత్మను, జీవితమును, కర్మను, విత్తమును — దైవ సమర్పణము గావింతురు. వీరే భగవంతుని నిజమైన బిడ్డలు. కొందరు భగవంతుని కేమియు నర్పింపరు. వీరి కెంత పదవి యున్నను, అధికారబలమున్నను, ఐశ్వర్యమున్నను, వీరు దైవ విషయమున నిరర్థకమైన పిండుసున్నతే యగుదురు.

ఈ పొత్తము ఎవరు భగవంతునికై తమ సర్వస్వమును సమర్పణ మొనర్చ్చ యాతని బొంద గాంక్షింతురో, అట్టి వారికై యుద్దేశింపబడినది.

సెప్టెంబరు 1941

# ప్రార్థనలు - ధ్యానములు

నవంబరు 2, 1912

ఓ పరమేశ్వరా, నీవు సకలవస్తువులయందును ప్రాణమై, జ్యోతివై, ప్రేమవై వెలయుచున్నావు. భావవత్తికముగా నా సత్త యంతయు నీకు సమర్పితమై యున్నను, సాకల్యముగ నన్ను నే నీకు సమర్పించుకొనుట ఇప్పటికిని కష్టతరముగనే తోచుచున్నది. ఈ ధ్యానములను వ్రాతరూపమునకు దెచ్చుటకు సమీచీన కారణము నిన్ను నే ననుదినము సంబోధించుచుండవలె నన్నదే; ఇది నే నెరుంగుటకు నా కెన్నియో వారములు పట్టినది. నీతో ప్రతిదినము పలుమారు నేను ఈ విధముగ గావించు సంభాషణములో ఏ కించిదంశమునో ఈరీతిగా రూపొందజేయుచున్నాను; సాధ్యమైనంతవట్టు నా మనోనివేదన మొనర్చుకొనుచున్నాను. ఇట్లు నేను నివేదించుట నీకు నా యంతరాత్మ తెలియదని కాదు. నీవు సర్వాంతర్యామివి. అంతయు నీవే. అయినను, లోతు చూరలేని, పైపయి చూచు మా కృత్రిమ దృష్టి, మా గ్రహణశక్తి నీ కస్వాభావికములు; నీ స్వభావమునకు విరుద్ధములు గూడ. అయినను, ఈ విషయవిచారణ సమయమున, నీవంత దిరిగి, నీ తేజస్సునందు మునిగి ఆ విషయముల గాంచినప్పుడు, వాని యథార్థ స్వరూపమును అనుదినమును అధికాధికముగ నేను తెలిసికొనజాలుదును. ఇట్లు కొంత కాలము గతిగమగు నప్పటికి, నేను నీతో సంపూర్ణముగ నైక్యము గాగలుగుదును. అంత నీతో విన్నవించుకొనవలసినది నా కేమియు నుండదు. ఏలన, అప్పుడు

# శ్రీ మాతృవాక్కు

కొందరు భగవంతునకు తమయాత్మ నొసంగుదురు. కొందరు తమ జీవితమును, కొందరు తమ కర్మను, కొందరు తమ విత్తమును అర్పణము చేయుదురు. అల్పసంఖ్యాకులు తమకు గల సర్వస్వమును— ఆత్మను, జీవితమును, కర్మను, విత్తమును— దైవ సమర్పణము గావింతురు. వీరే భగవంతుని నిజమైన బిడ్డలు. కొందరు భగవంతుని కేమియు నర్పింపరు. వీరి కెంత పదవియున్నను, అధికారబలమున్నను, ఐశ్వర్యమున్నను, వీరు దైవ విషయమున నిరర్థకమైన నిండుసున్నలే యగుదురు.

ఈ పొత్తము, ఎవరు భగవంతునికై తమ సర్వస్వమును సమర్పణ మొనర్చి యాతని బొంద గాంక్షింతురో, అట్టి వారికై యుద్దేశింపబడినది.

సెప్టెంబరు 1941

# ప్రార్థనలు - ధ్యానములు

నవంబరు 2, 1912

ఓ పరమేశ్వరా, నీవు సకలవస్తువులయందును ప్రాణమై, జ్యోతివై, ప్రేమవై వెలయుచున్నావు. ఔపపత్తికముగా నా సత్త యంతయు నీకు సమర్పితమై యున్నను, సాకల్యముగ నన్ను నే నీకు సమర్పించుకొనుట ఇప్పటికిని కష్టతరము గనే తోచుచున్నది. ఈ ధ్యానములను వ్రాతరూపమునకు దెచ్చుటకు సమీచీన కారణము నన్ను నే ననుదినము సంబోధించుచుండవలె నన్నదే; ఇది నే నెరుంగుటకు నా కెన్నియో వారములు పట్టినది. నీతో ప్రతిదినము పలుమారు నేను ఈ విధముగ గావించు సంభాషణములో ఏ కించిదంశమునో ఈరీతిగా రూపొంద జేయుచున్నాను; సాధ్యమైనంతవట్టు నా మనోనివేదన మొనర్చుకొనుచున్నాను. ఇట్లు నేను నివేదించుట నీకు నా యంతరాత్మ తెలియదని కాదు. నీవు సర్వాంతర్యామివి. అంతయు నీవే. అయినను, లోతు చూరలేని, పైపయి చూచు మా కృత్రిమ దృష్టి, మా గ్రహణశక్తి నీ కస్వాభావికములు; నీ స్వభావమునకు విరుద్ధములు గూడ. అయినను, ఈ విషయవిచారణ సమయమున, నీవంత దిరిగి, నీ తేజస్సునందు మునిగి ఆ విషయముల గాంచినప్పుడు, వాని యథార్థ స్వరూపమును అనుదినమును అధికాధికముగ నేను తెలిసికొనజాలుదును. ఇట్లు కొంత కాలము గళితమగు నప్పటికి, నేను నీతో సంపూర్ణముగ నైక్యమ్ము కాగలుగుదును. అంత నీతో విన్నవించుకొనవలసినది నా కేమియు నుండదు. ఏలన, అప్పుడు

'నేను' 'నీవ' యగుదును. 'నేను' 'నీ' వగుటయే, 'నేను' 'నీ' తో ఐక్య మొందుటయే— నేను పొందగోరు పరమావధి. తత్ప్రాప్తియందు విజయము గాంచుకొఱకే నా ప్రయత్నము లన్నియు అధికాధికముగా హవణిల్లుచుండును. నేను 'నీ' కంటె వేరని నుడువరాని స్థితి నా కేనాటి కలవడునో అట్టి శుభదినము నకై నిరీక్షించుచున్నాను. ఏలన, అప్పుడు 'నేను' 'నీవ' యగుదును.

ఇప్పటికిని, దినమునం దెన్నిసారులు నేను నా కర్మలను నీ కర్పణము చేయక వ్యవహరించుచుంటినో! అట్టిది సంభవించునపుడెల్ల, వెంటనే నేను, ఇట్టిదని చెప్పరాని వ్యాకులపాటునకు లోనయి నా తప్పిదమును గుర్తింతును. ఈ వ్యాకులపాటు హృదయవేదన వలన కాయికముగా నింద్రియగ్రాహ్య మగును. అంత నేను నా యొనర్చిన కార్యమునుగూర్చి మననము చేయుదును. అప్పుడు నే నొనరించిన కార్యము హాస్యాస్పదముగనో, బాలచేష్టగనో, నిందార్హముగనో కన్ప ట్టును. అంత నే నందులకై ఖేదపడి, తత్కార్యమును నిరసించి, తుదకు నీలో మునిగి, శిశువువలె, పూర్ణ విశ్వాసముతో నన్ను నే మరచి, నాలోని తప్పును, నా పరిసరమందలి తప్పును గ్రహించి, దానిని సవరించుకొనుటకు వలసిన యంతః స్ఫూర్తిని, బలమును బొందుటకై ప్రతీక్షించుచుందును; నా తప్పున్నను, పరిసర మందలి తప్పున్నను నొకటియే కదా; ఏలన, సర్వకర్మలును ఒకానొక విశ్వైక్య నియతిచే అన్యోన్యాశ్రయమును బొందియుండును. ఎడతెగని ఇట్టి నిష్కృష్టాను భూతి యిప్పుడిప్పుడే నా కలవడినది.

* * *

నవంబరు 3, 1912

చైతన్యోద్దీపకమైన అగ్నివోలె నీ జ్యోతి నాలో విలసిల్లుచున్నది. నన్ను ఛేదించుకొనుచు నాలోనికి నీ దివ్యప్రేమ చొరబారుచున్నది. ఈ శరీరమున-నీవే సర్వంసహాధిపతివిగ పరిపాలన సేయవలెనని నా యావత్సత్తయు గాంక్షించు చున్నది. నీ చేతికి ఒదిగిన పనిముట్టుగను, నీకు నమ్మినబంటుగను మనుటయే ఈ శరీరమున మెదలుచున్న సంకల్పము.

* * *

నవంబరు 19, 1912

నిన్నటి దినమున శ్రద్ధోపేతుడై 'నిన్ను' అన్వేషించు నాంగ్లయువకునికి, 'నిన్ను' నేను ఖండితముగా గనుగొంటి ననియు, 'నీతోడి యైక్యము' అనవరతముగ నాకు గలిగినదనియు నుడివితిని. నా కెరుక యున్నంతవరకు, నే నట్టి స్థితిని బొందియున్నాను. నా తలపులన్నియు 'నీ' దిశకు జనుచున్నవి; నా కర్మలన్నియు 'నీ' కర్పింపబడుచున్నవి; 'నీ' తోడి సాన్నిధ్యము నాకు అస్ఖలితముగ, అచంచలముగ, నిశ్చయముగ నుండునదియని నే దలంచుచున్నాను; మరియు 'నీ' శాంతి నిరంతరము నా హృదయమునందు నివసించుచున్నది. అయినను, ఈ యైక్యముసైతము అల్పీయసమనియు, అస్థిరమనియు నే నెరుంగుదును. ఏలన, నిజముగా రేపు నా కుపలబ్ధమగు 'నీ' తోడి యైక్యముతో బోల్చిచూచిన, ఇయ్యది అట్టిదే యగును. ఇప్పు డింకను నన్ను నే దెల్పుకొనుచు 'నే' ననియే వాడుచున్నాను. 'నే' నను భావన సంపూర్ణముగా పోయి 'నీ' తోడి యైక్యమును బొందు స్థితికి నిజముగా నేను దూరమున,— బహుదూరమున నున్నాను. కాని, 'నే' నను పదము ప్రతిసారియు వాడుట నాకొక నిర్బంధమై, నే నావిష్కరించెడి భావమును వెల్లడించుట కర్హతలేని పదమువలె, ప్రతిబంధకమై యున్నది. ఆ పదము మానవు లుత్తరప్రత్యుత్తరముల జరుపుకొనుట కనివార్యముగా నావశ్యకమని తోచినను, ఈ 'నేను' అనునది దేనిని అభివ్యక్త మొనరించునో దాని మీఁదనే సమస్తమును ఆధారపడియుండును. నేనా పదమును ఎన్నిసారు లుచ్చరించినను 'నీవే' నాలో పలుకుచుందువు; ఏలన, 'నేను' వేరు, 'నీవు' వేరు అను ప్రత్యేకభావము నాలో తొలగిపోయినది.

కాని యిదంతయు గర్భస్థపిండమువలె ప్రారంభదశయం దుండి సంపూర్ణస్థితికి నెదుగసాగుచున్నది. ఈశ్వరా, నీ మహాశక్తియందు నాకున్న అచంచల విశ్వాసమునందు, ఎంతటి సంతృప్తికరమైన ధీరత ఇమిడియున్నది!

అన్నియును నీవే, అంతటను నీవే, అన్నిటియందును నీవే. కర్మచేయు నట్టి ఈ శరీరము, దృశ్యమాన సకలప్రపంచమువలెనే నీ శరీరమే యగును,

ఈ ఘటమునందుండి ఉచ్ఛ్వాసనిశ్వాసముల జరుపునది 'నీవే', ఆలోచించునది 'నీవే' ప్రేమించునది 'నీవే'. ఈ ఘటము 'నీవే' యగుటచేత, 'నీకు' విధేయ భృత్యుడుగ నుండుటకే ఇయ్యది కాంక్షించుచున్నది.

* * *

నవంబరు 26, 1912

ఈశ్వరా, కృతజ్ఞతాభావ ప్రపూర్ణముగా అనుక్షణమును నిన్ను నేను కీర్తింపక యెట్లుండగలను ? నా పరిసరములందు సర్వత్రగల సమస్తవస్తువులయందును 'నిన్ను' 'నీ' వావిష్కరించుకొనుచున్నావు. నాలో 'నీ' దివ్యేచ్ఛయు, దివ్యచేతనయు గడుంగడు స్ఫుటముగా,— 'నేను', 'నాది' యను స్థూలవిషయములందలి భ్రాంతి నాయందు పూర్తిగ నశించిపోవునంతటి స్ఫుటముగా,— ప్రకటిత మగుచున్నవి. కొన్ని తిమిరచ్ఛాయలు, కొన్ని దోషములు 'నిన్ను' వ్యక్తీకరించు మహత్తరదివ్యతేజమునందు గోచరించినను, జాజ్వల్యమానమును, ఆశ్చర్యకరమును నగు నీ ప్రేమజ్యోతిముందర నయ్యవి దీర్ఘకాల మెట్లుండగలవు ? 'నే' ననెడి యీ నా సత్తను నీ చేతుల తీర్చిదిద్దుచుంటివో ఈ యుదయమున నాకు అనుభూతి కలిగినది. నియతాకృతులలో పలకలుగ సానపెట్టబడి, సంశ్లిష్టత, కాఠిన్యము, సుస్వచ్ఛత, పారదర్శకత్వములతోపాటు, దినదినప్రవర్ధమానమగు జీవకళావైశిష్ట్యమున దేదీప్యమానమగు జ్యోతిఃకిరణప్రసారముతో నొప్పారు ఘనమైన వజ్రముతో అద్దానిని స్థూలముగా పోల్చవచ్చును. కాని, వాస్తవమున కది అద్దానికంటె అతీతము, ఘనతరము అని చెప్పనగును. ఏలన, బహుతరముగ నా చైతన్య మప్పుడు బాహ్యాభ్యంతరజ్ఞానమున కతీతమై యుండెను. మరల నాకు బాహ్యప్రపంచజ్ఞానము కలుగునప్పటికి నా మనోనేత్ర సమ్ముఖమున నిలిచినది ఆ చిత్తరువుమాత్రమే.

'నీవే' ఆ యనుభూతిని సారవంతమొనర్చువాడవు; 'నీవే' జీవితమును క్రమాభివృద్ధి నొందించువాడవు; 'నీవే' క్షణమాత్రములో తమస్సును 'నీ' యుజ్జ్వల తేజమున బారద్రోలువాడవు; 'నీవే' నా ప్రేమను సర్వశక్తిమంతము గావించు

వాడవు; 'నీవే' నిత్యత్వసిద్ధకైన ఈ పరమపిపాసను, ఈ ప్రబలాద్భుతకాంక్షను సర్వత్రా జడమునందు వర్ధిలజేసి అద్దానిని ఉచ్ఛస్థితికి దెచ్చువాడవు.

ఈశ్వరా, నీవు సర్వోపగతుడవు, చిరంతనుడవు; వస్తుస్థితియందును, అభివ్యక్తియందునుగూడ నీవుతప్ప ఇతర మెద్దియును లేదు.

ఓ అజ్ఞాన తిమిరమా, ఓ మాయావిభ్రమమా, మీరిక అదృశ్యము కండు; ఓ దుఃఖమా, నీవు క్షయించి తిరోధానము చెందుము; ఓ పరమేశ్వరా, 'నీవే' కాదా సర్వత్ర వసించుచున్నవాడవు !

* * *

నవంబరు 28, 1912

ఈ బాహ్యజీవనము,—ఈ అనుదిన, అనుక్షణ కార్యకలాపము,— ఇయ్యది ధ్యాననిదిధ్యాసనములకై మేము వినియోగించు ఘడియల సాఫల్యసిద్ధికి అవశ్యము సహయోగియై వెలయునట్టిదే కాదా ? వీనిలో ఒక్కొక్కదానికి విడి విడిగా వినియుక్తమగు కాలముల అన్యోన్యసంబంధము, సాధనసంపత్తి కొరకును, సాక్షాత్కారోపలబ్ధికొరకును చేయబడు ప్రయత్నముల అన్యోన్యసంబంధమును పోలినదే యగును. ఏలన, ధ్యాన నిదిధ్యాసనముల ఫలము 'నీతో' ఐక్యము చెందుట. అయ్యది పుష్పవికసనము వంటిది. ఇక, ఈ దైనందిన కార్యకలాపమో, దీనిని లోహకారుని కొలిమి యందలి దాగలిపట్టెడపై జరుగు పనితో బోల్పవచ్చును. మానవసత్త్వయందలి ఎల్లతత్వములును ధ్యాననిదిధ్యాసన ఫలమగు తేజోపలబ్ధిని బొందు యోగ్యత సంతరించుకోవలెననిన, అందుకు వలయు విశుద్ధిని, సంస్కారమును, మృదుత్వమును బడయుట కవి ఈ పట్టెడపై పెక్కు పర్యాయములు సాగగొట్టబడవలసి యుండును. ఈ యన్ని తత్వములును ఇట్లు ఒకదాని తరువాత నొకటిగా మూసలో కరగిన యనంతరమునగాని, మానవసత్త సమగ్రవికాసమునకు బాహ్యకర్మకలాపావశ్యకత తొలగిపోనేరదు. అటుపైన ఈ కార్యకలాపము 'నిన్ను' అభివ్యక్తముచేయు సాధనముగా మారి, తద్ద్వారమున

ఇతర చైతన్యకేంద్రములను గూడ ఇదే రీతిగా 'కొలిమి సంస్కారము, తేజోపలబ్ధి' అనెడి ద్వివిధకార్యార్థముగ మేలుకొల్పుటకై ఉపయుక్తమగును.

కావుననే, గర్వము, ఆత్మసంతృప్తి అనునవి అత్యంతవికృష్టములైన ప్రతిబంధకములని చెప్పనగును. ఈ మన సత్తయందలి అసంఖ్యాక తత్వరీతులలో కొన్నింటిని సాది మర్దనచేసి శుద్ధపరచుటకై ఒదవెడి సూక్ష్మాతిసూక్ష్మ సదవకాశములనెల్ల మనము వినమ్రతతో వినియోగించుకొని, అవ్వానికి నిర్వైయక్తికత, నిరహంకృతి, మృదుత్వము, త్యాగము, భక్తి, కారుణ్యము, సౌజన్యము అనునవి అలవరచవలసియున్నది. సత్తయందలి రీతివిశేషములెల్ల అట్టివిధమైన లక్షణములకు అలవాటు పడినప్పుడు, అయ్యవి నిదిధ్యాసనమున బాల్గొనగలిగి పరమైకాగ్ర్యమున నీతో ఏకత్వమును బొందుటకు సంసిద్ధములై యొప్పారును.

కావుననే, ఉత్తమోత్తములవిషయమున సైతము ఈ కార్యక్రమము కడు దీర్ఘముగా, నెమ్మదిగా కొనసాగవలసియున్నదని నాకు తోచుచున్నది. కొట్టవచ్చినట్లుగ చూపట్టే హఠాత్పరివర్తనములు సమగ్రములు, కానేరవు. ఇట్టి పరివర్తనములు సత్తయొక్క దృష్టియందు మార్పు తెచ్చి సునిశ్చయముగా సూటిమార్గమున ప్రవేశపెట్టునమమాట నిజమే. కాని, యథార్థముగా సర్వాంగీణ పరివర్తనము బొందవలెననిన, ఎవ్వరును ప్రతినిమేషమున అసంఖ్యేయముగ గలుగు నీ సర్వవిధానుభవములయావశ్యకతనుండి తప్పించుకొననేరరు.

మదీయ సత్తయందును, ప్రతివస్తువునందును ప్రకాశింపు నో పరమేశ్వరా, 'నీ తేజస్సు' ఎల్లరకును అభివ్యక్తమగునుగాక; 'నీ శాంతి' రాజ్యము సర్వులయందును ఏర్పడును గాక.

* * *

డిసెంబరు 2, 1912

సత్తయొక్క తత్వములలో ఏ యొకటియైనను, మానసికచింతనా ప్రవృత్తులలో ఏ యొకటియైనను, "నీ" మహిమకు గాక బాహ్యప్రభావమున కింకను లోబడియుండెనేని, నిజమైన ఐక్యోపలబ్ధి కలిగినదని చెప్పనలవికాదు; అయ్యది నియతి విహీనము, ప్రకాశరహితము నైన భయోత్పాదక సంకరస్థితి మాత్రమే యగును. ఏలన, ఆ తత్వముగాని, ఆ ప్రవృత్తిగాని,— భౌతిక ప్రపంచమున పృథ్వియు, సమస్త విశ్వములో భౌతిక ప్రపంచమును ఎట్లు ప్రత్యేక జగత్తులుగ నున్నవో అట్లే,— అనియతము, అంధకారబంధురము నైన ప్రత్యేక జగత్తే యనదగియుండును.

* * *

డిసెంబరు 3, 1912

ఓ ప్రభూ, నిన్న రాత్రి, "నీవే" మార్గదర్శివని నమ్మి నిన్ను శరణుపొంది యుండుటలోని క్రియాఫలానుభూతిని నేను పొందితిని. అట్టి స్థితియందు, ఏదైన నొకటి తెలియవలసిన అవసరమున్నచో అద్దానిని మానవుడు తెలిసికొనును. "నీ" వందించెడి వెలుగునకు మనస్సు తటస్థభావమున నెంతెంతగా ఉన్మీలనము చెందునో అంతంత విస్పష్టముగా, అంతంత యుక్తరీతిలో అద్దాని యావిష్కృతియు జరుగును.

నాలో నీవు భాషించుచుండినప్పుడు నేను చెవి యొగ్గి ఆలకించితిని. "నీ" పలికిన పలుకుబడి యెల్ల నించుకేనియు నష్టమైపోకుండగలందులకై అద్దానిని వ్రాసియుంచ నిచ్చపొడమెను. ఏలన, ఆ పలికినది నే నిపుడు తిరిగి వక్కాణింపలేక పోవచ్చును. కాని, అంతలో, ఈ రీతిగా దానిని పదిలపరచుకొనుటకై ఆతురపడుట నీయందు నా విశ్వాసములేమిని సూచించు నపచారమగునని భావించితిని, ఏలన, నే నేస్థితిని బొందుట యవసరమో అద్దాని కనుగుణముగ నన్ను "నీవే" మల్చుకొనగలుగుదువు; నన్ను తీర్చిదిద్ది నాలో నీ యిచ్ఛను నడపుటకు నాప్రవృత్తి

ఎంతెంతగా నీకు అవకాశమిచ్చిన నంతంతలో నీ సర్వశక్తతకు అవధులే లేవు. ఏది జరగవలసియున్నదో అది నిశ్చయముగ జరుగుచునే యుండును; ఎల్లవస్తువులలోను, ఎల్లచోటులలోను 'నిన్ను' దర్శించుటెట్లో తెలియువారెల్ల రిది కడు నిర్దుష్టముగ తెలిపికోగలుగుదురు. అట్టివారి కిక ఏ భయము, ఏ అశాంతి, ఏ వేదన యుండనేరదు. సంపూర్ణమైన ప్రసన్నత, సమగ్రమైన విశ్వాసము. అచంచలమైన పరమశాంతి,— ఇవి మాత్రమే వారిలో విలసిల్లుచుండును.

* * *

డిసెంబరు 5, 1912

శాంతియందు, నిశ్చలనీరవతయందు నెలకొన్న మనస్సునందే నిత్యుడైన పరమేశ్వరుని అభివ్యక్తి యగును. కావున, నీ కేదియు కలత కలిగించనీయకుము; పరమేశు డపుడు నీలో అభివ్యక్తము కాగలడు. ఎట్టి పరిస్థితులలోనైనను పూర్ణసమత్వమును బొందియుండుము; పరముని అభివ్యక్తి నిశ్చయము.

అవును ప్రభూ, 'నీ' కొరకై మాచేయు అన్వేషణమునందు మితిమీరిన తీవ్రత, మితిమీరిన ప్రయత్నము కూడదు. ఏలన, అట్టి తీవ్రత, అట్టి ప్రయత్నము నిన్ను మరుగువరచు తెరయగును. నిన్ను చూడవలెనన్న వాంఛయు మా కుండరాదు; ఏలన, అదియు 'నీ' నిత్యసన్నిధిని గాననీకుండజేయు మానసిక సంక్షోభమే యగును. సంపూర్ణమైన శాంతి సమతా ప్రసన్నతలయందు మాత్రమే, 'నీవే' సర్వమైనట్లుగ సర్వమును 'నీవే' యగుదువు. ఇట్టి పరిపూర్ణ వినిర్మల ప్రశాంత పరిసరావరణమున ఏ కించి దాందోళనాస్పందము పొడసూపినను అయ్యది 'నీ' యభివ్యక్తి కాటంకమే యగును. తొందరపాటు కూడదు, అస్థిరత కూడదు, ఉద్రిక్తత కూడదు; కేవలము నీవే,— అనన్యముగ నీవే, —మాలో భాసిల్లవలెను. విమర్శకు, విషయీకరణమునకు అచట తావుండరాదు. అట్టి సన్నివేశములోనే ఏవిధమైన సంశయలేశమునకును అవకాశములేకుండ నీవు అభివ్యక్త మగుచుందువు. ఏలన, అపు డంతయు ఒకానొక పరమపావనమైన శాంతి, పరమపవిత్రమగు నిశ్చలనీరవత తొణికిసలాడుచుండును.

ఇయ్యదియే, ప్రపంచమునగల ధ్యానవిధానము లన్నింటికంటెను భిన్న.

డిసెంబరు 7, 1912

నిశ్చల దీపకళిక వలె, సురభిళ గంధమువలె, మదీయప్రేమ అటునిటు గదలక ఊర్ధ్వముఖముగా నీ కడకు జనుచున్నది. ప్రభూ! ఏ వాదును లేక, ఎట్టి చింతయు లేక శిశు వెట్లు తన తల్లిని నమ్మియుండునో, అట్లే 'నీ' యిచ్ఛ నెరవేరుటకును, నీ దివ్యజ్యోతి యభివ్యక్త మగుటకును, నీ శాంతి సర్వత్ర వ్యాపించుటకును, నీ ప్రేమ ప్రపంచమం దెల్లెడల నావరించుటకును నన్ను నేను 'నీకే' సమర్పించుకొనుచున్నాను. దేవా! నీ వనుగ్రహించునెడ, నేను 'నీ' యందు 'నీవు' గానే యుందును. అంతట నెటువంటి భేదమును నీకును నాకును నుండదు. పారావారమునకు బ్రవహించు శాంత స్రవంతివలె, నన్ను నేను నీ వంకకు నిర్నిరోధముగ బ్రవహింపజేసి 'నీ' తోడి ఏకత్వమును బొందు శుభ కాలమునకై ఓర్మితో వేచియున్నాను.

నీ దివ్యశాంతి నాలో నెలకొనియున్నది. ఆ శాంతియందు, 'నీవే' ప్రతి వస్తువునందును నీ నిత్యస్వరూపనైశ్చల్యముతో సన్నిధిచేసియుండుటను పొడగాంచుచున్నాను.

* * *

డిసెంబరు 10, 1912

ఓ పరమపురుషా! సనాతనగురూ! నీ మార్గప్రదర్శకత్వమున బూర్ణ విశ్వాస ముంచుటవలన గలిగెడి యసదృశ ఫలితమును సంశోధించు నవకాశము మరియొకసారి నాకు బ్రాప్తిల్లజేసినాడవు. 'నీ తేజస్సు' నిన్న నా ముఖము ద్వారమున నభివ్యక్త మాయెను; అందుల కెట్టి నిరోధమును నాయందు బొడకట్ట లేదు. ఈ దేహోపకరణము సమ్మతితో వినమ్రత యొప్పార సూక్ష్మగ్రాహియై యుండెను.

ప్రతి వస్తువునందును, ప్రతి ప్రాణియందును వసించి కర్మ మొనర్చు వాడవు 'నీవే'. ఎవ్వడు 'నీకు' తగు సమీపముననుండి, జరుగు సర్వకార్యము

లందును దప్పక 'నిన్ను' గనుగొనుచుండునో యతడు ప్రతికార్యమును 'నీ' దీవనగ బరివర్తింపజేసికొనుట ఎరిగియుండును.

దేవా! ఇంద్రియముల వంచనకును, వాని భ్రాంతికిని లోనుగాక, కర్మాచరణముపట్ల వెనుదీయక, విముఖత్వముతో అద్దానిని త్రోసిపుచ్చక,— నిరర్థకము, హానికరము నగు నిట్టి పోరాటములోనికి దిగక,— ఆ కర్మ ఎట్టిదైనను అద్దానిద్వారమున 'నీ'యందు నిరంతరము, నివసించుటయే ప్రప్రధానమైన విషయము. అట్టిది చేకురినప్పుడు, భ్రాంతి తొలగును; ఇంద్రియముల వంచనము మాయమగును; కర్మపరిణామబంధము విచ్ఛిన్నమగును; అంతయు 'నీ' నిత్యసాన్నిధ్యవైభవమును ప్రకటించునదిగా మారిపోవును.

అట్లే యగునుగాక — తథాస్తు

* * *

డిసెంబరు 11, 1912

ఎట్టి యాత్రమును, వ్యాకులపాటును లేకయే మరియొక యవనిక విడిపోవుటకును, సమగ్రమైన యైక్యమొదవుటకును వేచియున్నాను. ఈ యవనిక అల్పమైన లోపములయు, అసంఖ్యాకమైన బంధనములయు బృహత్సమూహముచే నేర్పడినదని నే నెరుంగుదును.... ఇవన్నియు నెట్లు తిరోధానమగును? క్షణమైనను చాంచల్యములేని జాగృతిపూర్వకముగా లెక్కింపరాని యల్పప్రయత్నములతో, విధానముగనా? లేక, నీ విశ్వప్రేమయొక్క సర్వశక్తిమంతమగు ప్రకాశమువలన ఆకస్మికముగనా? ఏమో నాకు తెలియదు. ఈ విధముగా నన్ను నేను ప్రశ్నించుకొనుటయును లేదు; నీ యిచ్ఛవినా మఱేదియు లేదనియు, నీవే సర్వమునకు గర్తవనియు, నేను నీ యుపకరణముమాత్రమే యనియు రూఢిగ నమ్మినదాన నగుటచే, ఆ నిశ్చితత్వమున నా శక్తికొలది సర్వకార్యములపైనను దృష్టినుంచి నిరీక్షించుచుందును; ఈ యుపకరణము పూర్ణతరావిష్కారమునకు సంసిద్ధమైయుండునపుడు నీ దివ్యప్రకాశము సహజముగనే, ఆవిష్కృతమగును.

ఓ దేవా ! నీ యుదాత్తసన్నిధానమును వ్యక్తపరచునట్టి యానందపార వశ్యపు నీరవనిస్వనములు యవనిక అవ్వలివైపునుండి బయలుదేరుట మా కప్పుడే శ్రవణగోచర మగుచున్నది.

* * *

ఫిబ్రవరి 5, 1913

ఓ ప్రభూ, నా హృదంతరాళపు ప్రశాంతనిశ్చలతయందు, మధురసంకీర్తనమువోలె నీ వాణి వినిపించి, నిన్ను అభివ్యక్తముచేయ నసమర్ధములయ్యెను నీ మాహాత్మ్యముతో నిబిడీకృతములైన వాక్కుల రూపమున నా శిరస్సులోనికి అవతరించినది. ఈ వాక్కులు పృథ్విని సంబోధింపుచు ఆమెతో ఇట్లు పలుకుచుండెను : "దుఃఖార్తితో దీనవైయున్న ఓ పృథ్వీ ! నేను నీలో సన్నిధిచేసి యున్నాననెడి జ్ఞప్తి గలిగి ఆశను విడనాడక యుండుము. నీ ప్రతి ప్రయత్నము, ప్రతి విలాపము,— ప్రతి మోదము, వేదన, హృదయసంబోధన, ఆత్మాభినివేశము,— సకలము,— ఇంచుకేని మినహాయింపులేక,— నీకు సుఖదుఃఖహేతువులై కాన్పించునట్టియు, సుందరముగను అసుందరముగను దోచునట్టియు— సమస్తము నిన్ను నావైపునకే,— అనంతశాంతికి, ఛాయావిరహితప్రకాశమునకు, సంపూర్ణసామరస్యమునకు, సునిశ్చితత్వమునకు, విశ్రాంతికి, పరమమాంగళ్యమునకు నిధానమైయున్న నాదెసకే,— నడిపించుచున్నవి."

ఓ పృథ్వీ ! ఆ బయల్వెడలు దివ్యవాణి నాలకింపుము; ఆలకించి నవ్యధీరతను చేకొనుము.

* * *

ఫిబ్రవరి 8, 1913

ఓ ప్రభూ ! 'నీవే' నా యేడుగడ, నా దీవన, నా బలము, నా ప్రత్యాశ, నా ధైర్యము; 'నీవే' పరమశాంతిస్వరూపుడవు, నిష్కలుషానందధాముడవు, సంపూర్ణప్రసన్నతాభాసురుడవు. కొలదిపెట్టగరాని కృతజ్ఞతతో, నిత్యనిరంతర పూజలొనర్చుచు నా సత్తయెల్ల నీముందల సాష్టాంగప్రణామము లాచరింపుచున్నది. ఆ పూజలు భారతదేశపు సురభిళ సుపవిత్ర ధూపమువోలె నా మనోహృదయముల నుండి నీ దిక్కున కెగయుచున్నవి.

'నీ' యనంతకరుణచే 'నీవు' నాకు ప్రసాదించుచున్నట్టి నిశ్శ్రేయసానందపు జవిని రుచిచూడ సంసిద్ధు లగువారెల్లరు దానిని రుచి చూతురుగాక ! అట్టివారి కేను దూతనై పరగెదను గాక ! 'నీ' శాంతి పృథ్విపై రాజ్యమేలెడు గాక !

* * *

ఫిబ్రవరి 12, 1913

కృతజ్ఞతాభావమున 'నిన్ను' స్మరించుచు నా సత్త నీకడకు ఉద్గమించుచున్నది. అట్లది యుద్గమించుట, నా యీ యపరిణత దుర్బలదేహమును 'నిన్ను నీ, వావిష్కరించుకొనుటకై యుపయోగించుచున్నందులకు గాక, అసలు 'నిన్ను నీవు' ఆవిష్కరించుకొనుచున్నందులకే. ఇదియే వైభవములలోకెల్ల వైభవము; ఆనందములలోకెల్ల ఆనందము; ఆశ్చర్యములలోకెల్ల ఆశ్చర్యము. ఎచ్చటెచ్చట 'నీ' యక్కర యేర్పడునో అచ్చటచ్చట నెల్ల నీ వుందువని, 'నిన్ను' తీవ్రాభినివేశముతో నన్వేషించువారెల్ల రెరుగవలసియున్నది. నిన్ను అన్వేషణ చేయుట మాని దానికి బదులుగా నీకొరకై ప్రతీక్ష యొనర్చెడి పరమభక్తి వారి కేర్పడి, అనుక్షణమును 'నీ' సేవకై వారు తమ సర్వస్వమును ధారపోయుదురేని, నీ యక్కర యేర్పడినపుడెల్ల వారికడ 'నీవు' ఉండనేయుందువు. 'నీ' వావిష్కరించుకొనురూపము లెన్నివిధములుగ నున్నను, ఆ రూపములు తరచు అపేక్షింపబడనివేయైనను, 'నీ' యక్కర మాకెల్లప్పుడును ఉండనేయుండునుగదా ?

దేవా, నీ మహిమ ప్రకటితమగుగాక !
జీవిత మద్దానిచే పునీతమగుగాక !
జనహృదయము లద్దాన పరివర్తనము పొందుగాక !
పృథ్విపై నీ శాంతి రాజ్యమేలునుగాక !

* * *

ఫిబ్రవరి 12, 1913

ఏదేని యొక ఆవిష్కారమునకు పూర్వమున జేయు ప్రయత్నమెల్ల అదృశ్యమైపోవుటతోడనే, ఇక నటుపైన అంతయు కడు సరళమై యొప్పారును. ఎంత సరళమనిన, — ఎట్టి రభసయు, ఎట్టిఉద్ధతపటాటోపమును లేకయే పూవు తన యందమును వెలయింపజేసికొనుచు, తన పరిమళమును వ్యాపింపజేసికొనుచు విచ్చుకొనునంత సరళము. ఈ సారళ్యమునందే మహత్తరశక్తి ఇమిడియున్నది, — అయ్యది లవలేశమేని మిశ్రమము లేక, హానికరమైన ప్రతిస్పందనల కేమాత్రమును తావీయని శక్తి. ప్రాణసత్తయందలి శక్తి విశ్వసనీయము కాదు. అయ్యది ప్రలోభముల గల్పనసేయుచుండును — దాని మాయావాగురలో బడిపోగల ప్రమాదస్థితి ఎప్పుడును ఉండనే యుండును. ఏలన, సద్యఃఫలముల నయ్యది చవిచూపుచుండును. అంతట, కర్మమును పోడిమిగా జేయవలెనన్న తొలి యుత్కంఠకు లోనయి మనము ఈ శక్తిని వినియోగపరుపజూతుము. కాని, అచిర కాలముననే అయ్యది మన కర్మాచరణమును ఋజుమార్గమునుండి తప్పించి, మాయాబీజమును, మృత్యువును మనము చేయుదానియందు చొప్పించును.

ఓ సారళ్యమా ! నీ వినిర్మల సాన్నిధ్య మెంత మధురము !

* * *

మార్చి 13, 1913

నిన్నభివ్యక్తము చేయుకొరకు నీతోడి యైక్యమును ఆపించు పూర్ణపురుషుని సంతత ప్రార్థనవోలె, ఊర్ధ్వముగ సరళమార్గమున అధికాధికముగ నుద్గమించుటకు మా యాత్మనివేదనరూప విశుద్ధ పరిమళ ధూపము నిత్యము జ్వలించుచుండునుగాక.

* * *

మే 11, 1913

ఏ భౌతికబాధ్యతలును నాకు లేకుండ జేసికొన్న యుత్తరక్షణమున. ఈ పార్థివ విషయములను గురించిన తలంపులన్నియు నన్ను వీడి పలాయనముకాగా, ఇక నేను కేవలము నీయందే నిమగ్నురాలనై, నీ సేవయందే మునుంగుదును. అట్టియెడ లభ్యమగు పూర్ణశాంతిప్రసన్నతలయందు, నా సంకల్పమును నీయిచ్ఛతో నైక్యమొనర్చి, దానంగలుగు పూర్ణనీరవతయందు నిన్నుగురించిన సత్యమునకు చెవియొగ్గి తదావిష్కృతి నాకర్ణింతును. నీ యిచ్ఛను గుర్తించి అద్దానితో మా సంకల్పము నైక్యమొనరించుటచేతనే, నిక్కమైన స్వాతంత్ర్యముయొక్కయు, సర్వశక్తతయొక్కయు నిగూఢ రహస్యము మాకు తెలియనగును. అంతియకాక, మా శక్తులను పునరుజ్జీవింపజేయుచు మా సత్తను రూపాంతరమొందించు గుప్తవిధానము మాకు అలవడును.

నిరంతరము పూర్ణముగ నీతో గలిపియుండుటయన, బాహ్యాభ్యంతరముల నొదవు ప్రతి ప్రతిఘటనమును త్రోసిపుచ్చి, కష్టముల నన్నిటిని జయించగలననెడి దృఢ విశ్వాసముతో నుండుటే యగును.

* * *

ఓ ప్రభూ, ఓ పరాత్పరా, అనంతమగు నానందముతో నా హృదయము నిండియున్నది. అక్కజమగు తరంగములుగ ఉల్లాసగీతికా పరంపర నా తలంపున నుప్పొంగుచున్నది. దేవా, నీ విజయము నిశ్చయమను నిండు నమ్మిక వలననే పరమశాంతియు అజేయమగు బలమును నేను పొందుచున్నాను. నీవు నా సత్తను పూరించుచున్నావు; దాని నుత్తేజింపజేయుచున్నావు; దాని అంతస్స్ఫూర్తి

తస్సుల నుబికింప జేయుచున్నావు; దాని జ్ఞానశక్తికి దీప్తి యొసగుచున్నావు; దాని ప్రాణశక్తిని తీవ్రతమ మొనర్చుచున్నావు; దాని ప్రేమను దశగుణీకృతము గావించు చున్నావు. ఇపుడు నాకు, విశ్వమే నే నగుదునో లేక నేనే విశ్వము నగుదునో, 'నీవే' నాలో నున్నావో లేక నేనే 'నీలో' నున్నానో తెలియుట లేదు. ఉన్నది 'నీ' వొక్కడవే; అన్నియును 'నీవే', నీ యఖండ దివ్యానుగ్రహస్రవంతులు ప్రపంచ మంతటను నిండి పొంగి పొరలుచున్నవి.

ఓ దేశదేశములారా, ప్రజాసంఘములారా, మానవులారా, గానముచేయండి! అల్లదిగో వినవచ్చుచున్నది దివ్యస్వర సమ్మేళనము!

* * *

జూన్ 15, 1913

శరీరమునుండి విడివడి తనను దాను వేరుచేసికొనిననే తప్ప, ఎంతటివాని కైనను నిశ్చల నీరవతతో గూడిన ఏకాంతస్థితియందు నిర్దుష్టమగు నిదిధ్యాసననిష్ఠ గుదుర నేరదు. అద్దాని ఫలితముగా, ఈ శరీర మేపదార్థముతో నిర్మితమైనదో అయ్యది యథాపూర్వముగ శుద్ధము, సిద్ధము గానట్టి స్థితిలోనే యుండిపోవును. ఏలన, శరీరముగతి శరీరముదే యని యత డూరకొన్నవా డగుచున్నాడు; అప మార్గము పట్టించిన గూఢవిద్యాసాధనాభినివేశములో, అతీత భౌతిక విభవముల యాకర్షణకు లోగి, తన వ్యష్టి సంతృప్తికొరకు నీతో ఐక్యము గాంచవలెననెడి యాహంకారికమైన కామనతో, ఏ కారణమున భూమిపై తనకీ జన్మ వచ్చినదో విస్మరించినవా డగుచున్నాడు; భౌతికతత్వమునుగూడ విశుద్ధము, విముక్తము గావించవలసిన తన కర్తవ్యమును నెరవేర్చక పిరికిపందవలె వెనుకకు మరలినవా డగుచున్నాడు. పూర్ణస్వచ్ఛమైన ఒకానొక అంశము మనలో నున్నదని తెలిసి కొని, ఆ స్వచ్ఛతను అనుసంధానము చేయుటద్వారా అద్దానితో ఏకత్వము చెందుట అవసరమేగాని, అటుపిమ్మట మనమీ జ్ఞానమును భౌతికతత్వ రూపాంతరీకరణ సాధనకు వెన్వెంటనే వినియోగించి నీ దివ్యకార్యమును నెరవేర్చబూనినప్పుడే అద్దానికి సార్థకత ఘటిల్లును.

* * *

జూన్ 17, 1913

ఓ ప్రభూ, వెలుగును, వెచ్చదనమును ఒసంగెడి మంటవోలె, దప్పికను బోకార్చెడి చెలమవోలె, నీడ నిచ్చి కాపాడెడి తరువువోలె, నేను రూపొందున ట్లనుగ్రహింపుము. మానవు లెంతో వంతగూరికొనియున్నారు, ఎంతో అజ్ఞతలో మునిగియున్నారు, ఎంతో తోడ్పాటు వారి కిపుడు కావలసియున్నది.

నీయందు నా విశ్వాసము, ఆంతరిక దృఢాభిసంధి నానాటికి పెరుగుచున్నది; నానాటికి నీ ప్రేమ నా హృదయమున మరింత సజీవమై పెంపెసగుచున్నది; మరింత తేజోవంతము, మస్సృణము నగుచు నీ వెలుగు నాలో విలసిల్లుచున్నది. నీ కర్తవ్య మునకు నా జీవితమునకు భేదము నాలో నానాటికి మరింతగా సమసిపోవుచున్నది; అటులనే నా వ్యష్టిస్వరూపమునకు, ఈ సమస్త భూమండలమునకు గల భేదము కూడ.

ప్రభూ, ప్రభూ! నీ విభవ మనంతము, నీ సత్యస్ఫూర్తి అత్యద్భుతము, సర్వశక్తమై వరలు నీ ప్రేమ ఈ జగము నంతయు నోమగలదు.

* * *

జూన్ 18, 1913

నీ కభిముఖమై నీతోడి కలయిక పొంది నీ లోపల నీ నిమిత్తమై నివసించుట పరమానందమే యగును; దుఃఖరహిత ప్రమోదమే యగును; నిర్వికార శాంతియే యగును; అయ్యది యనంతమును లోగొనుటే యగును; విహంగము వలె వసంతకాలమున విహరించుటే యగును; హద్దులను మీరి దేశకాలములను దాటిపోవుటే యగును. ఈ వరదానములు పడయకుండ, వానికి భయపడిరో యన ప్రజలెల్ల వానినుండి ఏయేల పారిపోయెదరు? దుఃఖమునకు మూలమైన యీ యజ్ఞాన మెంత వింతయైనది! మనుజులకు సుఖసంతోషముల నిచ్చు ముఖ్య వస్తువునుండి వారిని దూరము చేసి, దుఃఖస్పర్ధల వలన బ్యార్తిగ నేర్పడినట్టియు, కడు సామాన్యమైనట్టియు, క్లేశకర మగునట్టియు, వ్యావహారిక, లౌకిక జీవితము

నకు లోబడజేయునట్టియు నీ యజ్ఞత ఎంతటి దౌర్భాగ్యస్థితి !

జూన్ 27, 1913

సహనము, కారుణ్యము వెలార్చుకొనుటలో భవదీయవాణి కడు వినమ్రము, నిష్పాక్షికము, పరమోదాత్తమునై యొప్పారు కారణమున నయ్యది ఎట్టి అధికారమును, ఇచ్ఛాప్రాబల్యమును ప్రకటించుకొనకయే నాకు శ్రుతమగుచున్నది. నిర్మలమైన చల్లని పిల్లవాయువువోలె నున్నది దాని ప్రసారము; వినంవాది స్వరయుతమైన మేళమునకు సంవాదిస్వరము సమకూర్చెడి స్ఫటికస్వచ్ఛమైన మృదురణనము వలె నున్నది. ఆ స్వరము నెటుల వినవలెనో, ఆ వాయువు నెటుల పీల్చవలెనో తెలిసినవానికి మాత్రమే అందెట్టి సౌందర్యనిధి నిక్షిప్తమై యున్నదో, ఎట్టి పరిమళము పరమప్రసన్నతా సమన్వితమైన ఉదాత్తవైభవస్ఫూర్తితో గుబాళించుచున్నదో ఎరుకపడును. అంతట, సకల విపరీతభ్రమలును అంతర్ధానమై భవద్వాణి పొడగట్టజేసిన అద్భుత సత్యమును పరమానందముతో శిరసావహింపగల శుభపరిణామస్థితి యాతనికి ఘటిల్లును.

* * *

జులై 21, 1913

అయినను ఎంతటి యోర్పు కావలసియుండునో ! సాధకుని పురోగతి క్రమపు దశావిశేషములు కానరానియంతగ కడు సూక్ష్మాతిసూక్ష్మములై యుండును గదా !

ఓ ప్రభూ, సత్యతేజోమయా, ఉదాత్తప్రేమస్వరూపా, మా జ్ఞానమునకు, మా జీవితమునకు మూలాధారమైన పరమేశ్వరా, మార్గప్రదర్శకా, రక్షకా, మా యాత్మల కాత్మరూపా, మా ప్రాణమునకు ప్రాణమా, మా సత్తకు మూల కారణమా, పరమ విజ్ఞానమూర్తీ, అక్షయశాంతి నిలయా, నా హృదయపు లోలోతుల నుండి నిన్నెంతగా పిలుచుచుంటినో ఎటుల వివరింపగలను !

* * *

జులై 23, 1913

ఓ పరమేశ్వరా, ఓ అచింత్యవిభవా ! నీ దివ్యసౌందర్యము భూతలమం దంతట వెల్లివిరియుగాక; నీ దివ్య ప్రేమ ఎల్లరి హృదయములలోను దీప్తమగును గాక; నీ దివ్యశాంతి సర్వులపైనను రాజ్యమేలునుగాక.

గంభీరము, ప్రగాఢము, ఉల్లాసభాసురము, సుసూక్ష్మము నైన కీర్తన మొండు నా హృత్సీమనుండి యుద్గమించుచున్నది. ఈ కీర్తనము ప్రయాణము చేయునది నానుండి నీ దెసకో, లేక నీనుండి నా దెసకో, లేక, నీవు, నేను, ఈ సమస్త విశ్వముగూడ ఈ పరమాద్భుత కీర్తనరూపమై యున్నారమో నాకు తెలియుటలేదు. నాలో ఈ కీర్తన యిపుడు స్పష్టముగ వినవచ్చుచున్నది........ నిశ్చయముగా ఇచట నిక, నీవనియు, నేననియు, ప్రత్యేకించి వేరుగా ఈ ప్రపంచమనియు ఏదియును లేదు. అంతయు పరమము, అనంతము నైన ఒకే అపార సామరస్యోద్భాసితమైన సమ్మేళనము. ప్రతి ఒక్కటియు నదియే; దానినే ప్రతి ఒక్కటియు ఒకనాటికి తెలిసికోవలసియున్నది. అయ్యది అఖండ ప్రేమవిలాస రూపమైన సామరస్యము. సర్వదుఃఖమును, సకలావిద్యను జయించి మించు దివ్యప్రేమ అది. అదియే నీ నియతి; ఈ నియతి ప్రకారమే నే నంతకంతకు సర్వసమగ్రముగ జీవింపగోరుచున్నాను; ఎట్టి మినహాయింపులును లేక దానికే నన్ను నేను సంపూర్ణముగా సమర్పణ మొనర్చుకొన గోరుచున్నాను.

వర్ణింప నలవికాని ఒకానొక పరమశాంతిలో నా ఎల్లసత్తయు నుల్లాసమున దేలియాడుచున్నది.

* * *

ఆగస్టు 2, 1913

ఆరంభమైన యీ నెలవైపునకు నే నీ ఉదయమున నా దృష్టిని నిగుడించి, 'నిన్ను' సేవించు ఉత్తమోపాయ మేమియని నాలో నేను వితర్కించితిని. అంత, నిశ్చలనీరవతలో మర్మరధ్వనివలె ఒకానొక అంతర్వాణి సన్నగా నాకు వినిపించి నది. అది నాతో ఇట్లనెను : "బాహ్యసన్నివేశముల ప్రాముఖ్య మెంత అత్య ల్పమో గురితింపుము. నీవు భావించు సత్యమును సాక్షాత్కరించుకొను ప్రయత్న మందు ఏల ఇట్లు బిర్రబిగుసుకొని శ్రమకు లోనయ్యెదవు ? మృదుత్వము వహించి ఘనతర విశ్వాసమున నిలువుము. దేనివలనగాని ఆందోళన చెందకుండు టొక్కటే నీవు చేయవలసినపని. దుష్టసంకల్ప మెటుల దుష్ఫలితముల నిచ్చునో అట్లే సత్కార్యాచరణమునకై సతమత మగుటయు దుష్ఫలితములనే యొసంగును. లోతునీటి ప్రశాంతస్థితియందు మాత్రమే నిక్కమైన సేవ సాధ్యమగును."

ఈ యుపదేశ మెంత దీప్తితో, ఎంత విశుద్ధముగా విననయ్యెననిన, దాని సత్యత్వప్రాబల్యముచే, అందు వర్ణితమైన స్థితి నాకు కడు అనాయాసముగ లభ్య మయ్యెను. లోతునీటి నిశ్చలప్రశాంతిలో నేను తేలియాడుచున్నట్లు నాకు తోచెను; తెలివొందితిని; ఏ దృష్టి నవలంబించుట యుత్తమోత్తమమో నాకు స్పష్టముగా బొడగట్టినది. ఓ పరమేశ్వరా, ఓ పరమగురూ ! నిన్నిక నేను కోరవలసిన దొక్కటే,—— ఈ స్థితియందు నేను నిలిచిపోవుటకు వలయు బలమును, యోగ దృష్టిని నాకు ప్రసాదింపుము.

"ఆందోళన చెందవలదు బిడ్డా, నీ వుపాసించవలసినది నిశ్చలనీరవత, శాంతి, శాంతి !"

* * *

ఆగస్టు 8, 1913

సకల వస్తుజాతమందును నెలకొనియున్న ఓ స్వరమాధుర్యమా, నా హృదయాంతరాళములో నిండారియున్న ఓ స్వరమాధుర్యమా, జీవితమందలి ప్రతిభావనలో, ప్రతి చింతనలో, ప్రతి కార్యములో, అత్యంత బాహ్యప్రవృత్తిలో సైతము నీ వభివ్యక్తి గాంచెదవు గాక.

వెలుపలి రొద ఏరీతి నున్నను అంతయు నాకు సుందరమై, ఏకరసమై, నీరవనిశ్చలమై కానవచ్చుచున్నది. ఈ నీరవనైశ్చల్యమందు, ఓ ప్రభూ, నీవే నాకు కానవచ్చుచున్నావు. నిన్ను బొడగాంచిన యీ అనుభూతిని నిరంతర మృదుస్మిత రూపమున మాత్రమే నేను వ్యక్తీకరింపగలుగుదును. నిజమునకు, అత్యంత మధురము, అత్యంత ప్రసన్నము, అత్యంత కరుణామయము నగు మృదుస్మితపు సన్నిధానముచే గలుగు అనుభవస్ఫూర్తి విశేషము పైరీతి నిన్ను నే బొడగాంచినప్పటి అనుభవస్ఫూర్తితో బోల్చిచూచిన కడు పేలవమనియే చెప్పనగును.

నీ దివ్యశాంతి ఎల్లరియందును ఆవిష్కృత మగునుగాక.

*　*　*

ఆగస్టు 15, 1913

ఈ సాయంసంధ్యవేళ, నా సత్తను పూరించియున్న నిశ్చల నీరవతలో, నీ శాంతి నాయందు మరింత ప్రగాఢము, ఆత్మీయము నై, మరింత స్పష్టముగా నీ వాణి శ్రుతమగుచున్నది.

ఓ పరమేశ్వరా, మా జీవితము, మా చింతన, మా అనురాగము, మా సకలసత్తయుగూడ నీ కొరకే. నీ సొత్తు నీవే మరల స్వాయత్త మొనర్చుకొమ్ము. ఏలన, మా వాస్తవిక సత్తాస్వరూపమున మే మెల్లరము నీవే కదా!

*　*　*

ఆగస్టు 16. 1913

ఓ ప్రేమస్వరూపా, దివ్యప్రేమమూర్తీ, నీవు నా సత్తనంతను పూరించి అన్నివైపులకు పొంగి ప్రవహిల్లుచున్నావు. నేను నీవుగా, నీవు నేనుగా, నా కనుభూత మగుచున్నది. ప్రతి ప్రాణిలో, ప్రతి వస్తువులో, అల్లన వీచు నీ పిల్ల వాయువు మొదలుకొని నీ ప్రతీకయై మమ్మెల్లర బ్రకాశింపజేయుచున్న తేజోరాశి యగు నాదిత్యుని వరకు, అంతటను నిన్నే నేను పొడగాంచుచున్నాను.

దురవగాహము నాకు నీ మహిమ. పరమవిశుద్ధమైన భక్తిభావపు నిశ్చల నీరవతతో నీకు ప్రణమిల్లుచున్నాను.

* * *

ఆగస్టు 17. 1913

మా జీవన ప్రభుడవైన ఓ పరమేశ్వరా, ఈ శరీర రక్షణార్థమైన చింతల నెల్ల నతిక్రమించుచు ఊర్ధ్వగతిని మే మంతకంతకు పైకి ఎగయనేర్తుము గాక. నిరంతరము శరీర రక్షణను గురించియే,— ఆరోగ్యము, జీవనోపాధి, జీవన విధానము, వీనిని గురించియే,— తలపోయు నీ యాలోచనల కన్న తలవంపు గూర్చునవియు, క్రుంగదీయునదియు విషయాంతరములు మరి యుండనేరవు. ఎంత అలతులీ యాలోచనలు ! నీ దెసకు మరలిన ఒక్క భావనమాత్రముననే ఇవన్నియు, ఒక్క సామాన్యపు టూర్పుతో చెదరిపోవు పలుచని ధూమరేఖవలెను, ఎండమావుల రీతిగను మాయమైపోవును.

ఈ దాస్యజీవనులను, ఇదేరీతిగా వివిధ భావోద్వేగములకు దాసులై యున్న వారిని విముక్తుల గావింపుము. నిన్ను చేరెడి మార్గమున గల యీ యవరోధ ములు ఏకకాలముననే భయానకములు, బాలచేష్టితప్రాయములు నగును. వీని కింకను దాసులై మెలగుచున్నవారి కవి భయానకములు; వీనిని అతిక్రమింప నేర్చినవారి కవి బాలచేష్టిత ప్రాయములు.

మా కొరకు, మా జీవనముకొరకు, మా ఆరోగ్యము కొరకు, మా నానావిధ సంతృప్తులకొరకు, మా పురోభివృద్ధి కొరకు గూడ మేము చెందు నీ యాందోళన మంతటినుండియు బయటపడినప్పుడు మాకు కలుగు మధురోల్లాసము, హాయి వర్ణనాతీతముగదా !

ఈ హాయినే, ఈ విముక్తినే, నీవు నాకు అనుగ్రహించినావు. నా ప్రాణమునకు ప్రాణముగా, వెలుగునకు వెలుగుగా విలసిల్లు నో దివ్యప్రభూ, ప్రేమ పాఠమును సదా నీవు నాకు బోధించుచు, నా ఉనికి కేమి హేతువో విశదమొనర్చి యున్నావు.

నాలో నివసించుచున్నది నీవే,— కేవలము నీవే. అట్టియెడ, నన్ను గురించియు, నా కేమగునో యనియు చింతన నా కెందులకు ? నీ తోడు లేనిచో, నీ యభివ్యక్తికై పాటుపడెడి యీ మృణ్మయ శరీరము విచ్ఛిన్నమై రూపరి పోవును; నీ తోడు లేనిచో, సృష్టియందలి ఇతర జీవకేంద్రములతో మాకు సంబంధము గూర్చుచున్న యీ ఇంద్రియపాటవమెల్ల తెలివిమాలిన జడస్థితిని బొందును; నీ తోడులేనిచో, చైతన్యదీప్తితో సమన్వయదృష్టికి వెలుగు నిచ్చెడి యీ భావన అవిస్ఫుటమై ఉపలబ్ధిశూన్యమగును; నీ తోడు లేనిచో, జీవనదాయియై సమస్థితిని బొందింపజేయుచు నెల్లరకు సుఖస్పర్శ నొసగు నుదాత్తప్రేమ అప్రాప్తప్రాప్యముగనే నిలిచిపోవును; నీ తోడు లేనిచో సర్వము జడము, పశుప్రాయము, నిశ్చేతనమే. జ్ఞానదీప్తి నొసగి మమ్ము ముగ్ధుల గావించు సమస్తమును నీవే. కేవలము నీ వలననే మా ఉనికి; నీవే మా పరమలక్ష్యము. మా వైయక్తిక భావన లన్నింటినుండియు విడుమర గాంచి భౌతికజీవనపు ఘటనలకెల్ల అతీతముగా మేము రెక్కలు విప్పుకొని పైకెగసి, నీ దివ్యపరిధిలోనికి చేరి, పిమ్మట నీ దూతలముగా భూమికి తిరిగి రాగల శక్తిసంపన్నులమై, సమీపించుచున్న నీ దివ్యావతరణపు ఘనవార్తను చాటుటకు ఇది చాలదా ?

ఓ పరమేశ్వరా, పరమోదాత్తసఖా, మహాద్భుత గురూ, దివ్యఫలోత్పాదక శక్తిగర్భితమైన యీ నిశ్చలనీరవతలో నీకు ప్రణమిల్లుచున్నాను.

* * *

అక్టోబరు 7, 1913

ఓ ప్రభూ, నీకు అంకితమైన యీ గృహమునకు మూడు నెలల తరువాత నేనిట్లు తిరిగివచ్చిన సందర్భములో, నాకు రెండు రకముల అనుభూతులు కలిగినవి. ఒకటి, నా బాహ్యసత్త యందు, నా ఉపరితల చేతనయందు, నా సొంత యింటిలో నే నున్నాననిగాని, దేనికైనను నేను యజమానురాల ననిగాని,—— ఇట్టి భావన యేమియు కానరాలేదు. ఒక క్రొత్త దేశములోనికి క్రొత్తగా వచ్చినట్లున్నది; చెట్ల నడుమ నొక బయలు ప్రదేశములో నుండునప్పటికంటె ఏదియో ఒక క్రొత్త దనము నాకు స్ఫురించినది. ఇదివర కెన్నడును నేర్చియుండని ఒక క్రొత్త పాఠము నేర్చుకొన్నందుకు నాకు నవ్వు వచ్చుచున్నది. ఇక్కడినుండి వెళ్ళుటకు పూర్వము నాకుండిన 'ఈ యింటికి యజమానురాలను నేను' అనెడి భావనను తలంచుకొని నవ్వుకొనుచున్నాను. వస్తుస్థితిని యథాతథముగా అర్థముచేసికొని, దర్శించి, అనుభవించు శక్తి పర్యవసానమున నాలో నెలకొనగలందులకై స్వాతి శయవృత్తి యనునది నాలో పూర్తిగ విచ్ఛిన్నమై పోవలసియున్నది. అనగా, నే నొకదానికి యజమానురాలను, దానిని నీకు అంకితము చేయనేర్తును' అనెడి భ్రమకు లోనై నేనీ గృహమును నీకు సమర్పణము గావించితిని. అంతయును నీయదియే కదా, ప్రభూ! నీవే సమస్తమును మే ముపయోగించుకొనుట కిచ్చు చున్నావు. దేనికైనను మేము యజమానులమని భావించుకొనుట ఎంత గ్రుడ్డి తనము! ఇతర స్థలములందువలె ఇచటగూడ నేనిప్డొక ఆగంతుకురాలను మాత్రమే; ఈ పృథ్విపై నీ సేవకురాలను. మానవుల నడుమ నొక యాగంతుకు రాలను: అయినను, వారి జీవనమునకు ఆత్మభూతురాలను, వారి హృదయ ములలోని ప్రేమను.

ఇక, రెండవ అనుభూతి యేమన, ఈ గృహవాతావరణమెల్ల నొకానొక గంభీరమైన ధార్మిక భావమున తొణికిస లాడుచున్నది. అంతరంగపు లోలోతు లకు చొరబారుట యిచట నే తడవు లేకయే అలవడుచున్నది; ధ్యానము మరింత సమాహితత్వమును, గాంభీర్యమును సంతరించుకొనుచున్నది; విక్షేప మంతరించి యేకాగ్రత నెలకొనుచున్నది; ఈ యేకాగ్రత శిరస్సునుండి దిగివచ్చి హృదయములోనికి చొరుట నా కిపుడు సుస్పష్టముగా అనుభూత మగుచున్నది. నా శిరస్సు కంటె

హృదయము ఎక్కువ లోతులకు చొరగల్గుచున్నట్లు తోచుచున్నది. మూడు నెలలుగా నేను నా శిరస్సుతో ప్రేమించుచు, ఇప్పుడే హృదయముతో ప్రేమింప మొదలిడితినా యన్నట్లున్నది. అందువలన, మధురగంభీరమైన ఒకానొక అనుభవస్ఫూర్తిని నేను పొందుచున్నాను.

నా సత్తయం దొక నూతనద్వారము తెరచుకొన్నది; ఒకానొక అనంత్యము నాయెదుట విస్తరిల్లి కానవచ్చుచున్నది. దృష్టికి తెరమరుగై, అంతరమున అదృశ్యముగ తేజోవంతమై యున్నట్లున్న యీ గుప్తపథములోనికి ప్రవేశించు యోగ్యత నాకు ఏమంతగా లేదని ఒక ప్రక్క తోచుచుండగనే, ఆ ద్వారమును దాటి అవ్వలి కడుగిడుచున్నాను.

అంతయు మారి క్రొత్తగా కనిపించుచున్నది; ప్రాత ముసుగులు జారి పోయినవి; క్రొత్తగ జన్మించిన శిశువు అర్ధోన్మీలిత నేత్రములతో ఉషఃకాంతిని తిలకించుచున్నది.

* * *

నవంబరు 23, 1913

నీ ప్రోల నిశ్చలనీరవతలో గడపిన అల్పక్షణములు అనేక శతాబ్దుల ఆనందమునకు సమానము.

ఓ ప్రభూ, నీడలన్నియు పటాపంచలై, ప్రశాంతస్థితియందు నిరంతరముగా నీ సేవలో నేను నిమగ్నురాల నగునట్లనుగ్రహింపుము. నా హృదయము నీ ముందర నిర్మల స్ఫటికమువలెనై, అంతటను నిన్నే ప్రతిబింబించునుగాక.

నీ ప్రోల నిశ్చలనీరవతలో నుండనేర్చు టెంత మధురాతిమధురము!

* * *

నవంబరు 25, 1913

నీ దెసకు ఉన్ముఖమైన నిశ్చల నీరవ నిదిధ్యాసనమునకు ప్రబలవిరోధి నిశ్చయముగా, మాలోని అవచేతనయందు సంగృహీతములగు నానావిధ విషయ సముదాయ సంపర్కము మాకు ఏర్పడుచుండుటే. మెదడు చేయు ఆలోచనా వ్యాపారమున మేము నిమగ్నులమై యున్నంతకాలము, తెలిసి చేసెడి ఈ యాలోచన అవచేతనలోని యీ విషయసంగ్రహణ వ్యాపారాతిరేకమును తెరవేసినరీతి మరుగుపరచుచుంటును. అయినను, మా జ్ఞానేంద్రియ వ్యాపార సరళిలోని ఒకానొక భాగము మాత్రము (దానిని అత్యల్పభాగముగ పరిగణింప వలనుపడదు) మాకు తెలియకుండగనే, మాకు హానికర మగునట్లుకూడ, సినిమా బొమ్మలను తీయు యంత్రము మాదిరిగా పనిచేయుచుండును. ఎరుకతో కూడిన ఆలోచనా సరళిని కట్టిపెట్టి నిశ్చల నీరవతను మేము సాధింపబూనినప్పుడే (ఇట్లు చేయుట ఒక విధముగ సులభమే యనవచ్చును) అవచేతనలోని యీ అలతి విశేషముల సముదాయము అన్ని వైపులనుండియు వెల్లువవలె పొంగి మమ్ములను ముంచెత్తు చుండును. గాఢధ్యాన పూర్వకమగు నిశ్చల నీరవతలోనికి మేము ప్రవేశించు టయే తడవుగ ఇది ఇట్లు జరుగుచుండు హేతువుచేతనే, మాకు బొత్తుగా ఆసక్తి లేనట్టియు, సక్తిపూర్వకమగు మా కామ సంకల్పవృత్తి ప్రతిబింబించనట్టియు, తమ్ము నిగ్రహించు విషయమున మాకున్న యశక్తతను మాత్రము నిరూపించు నట్టియు, కేవల యాంత్రికవ్యాపార ప్రాయమైనట్టియు అవచేతనాంతర్గములగు నీ యాలోచనల దాడికి మేము గురియగుట సంభవించుచుండును. (వీనిని ఆలోచన లని పిలుచుట యథార్థమునకు సరికాదు.) నిరర్థకములైన యీ అలజడుల నన్నింటిని శమింపజేయుటకు, ఆయాసకరమైన యీ చలనచిత్రప్రవాహము నెల్ల అరికట్టుటకు, ఆటంకముల గల్పించు నీ వేలకొలది చిన్నచిన్న అనర్థసంతతి బారి నుండి మనస్సును తప్పించి విశుద్ధమొనర్చుటకు, ఎంతయో పరిశ్రమము కావలసి యుండును. అనగా, కాలమెంతగనో ఈ పనియందు ఘోరముగ వ్యర్థమై, నష్టమైపోవుట సంభవించును.

మరి దీనిని చక్కజేయు నుపాయ మేమి? సన్యాసమార్గపు నియమ నిష్ఠావిధానములు కొన్ని, తమదే అతిసూక్ష్మోపాయమన్న రీతిలో, అవచేతనయం

దెట్టి సంస్కారముద్రలను పడకుండుటకుగాను, ఏకాంతవాసమును, నిష్క్రియత్వమును విధించుచున్నవి. కాని, ఇది వట్టి అమాయికుల పద్ధతియని నాకు తోచుచున్నది. ఏలన, ఈ పద్ధతి నవలంబించిన సన్న్యాసి సదా ఏదేని నూతన సన్నివేశమున చకితుడై సంచలించు స్థితిలోనే యుండును. పూర్ణసంయమము తనకు కుదిరినట్లతడు భావించుకొన్న తరుణములో, ఎప్పుడైన నతడు తోటి మానవులకు తోడ్పడు తలంపుతో తిరిగి మానవసమాజములోనికి రాదలచెనేని, విషయసంగ్రహణ రూపమగు తన సహజవ్యాపారమున కింతకాలము వెలియై యుండిన ఆతని యవచేతన, అట్టి యవకాశ మణుమాత్రము తనకు లభించినను వెంటనే, మునుపటికంటె మరింతగా విజృంభించి, యథేచ్ఛగ నా వ్యాపారమున నిమగ్నమగుట నిశ్చయము.

దీనికంటె మంచిపద్ధతియే వేరొకటి కలదనుట నిస్సంశయము. ఎరుకతో కూడిన ఆలోచనను మనము నిగ్రహించురీతిగనే, అవచేతనను నిగ్రహించుటెట్లో కూడ మనము నేర్వవలసియున్నది. ఇందుకు సాధన లనేకమున్నవి. బౌద్ధుల పద్ధతిలో, సక్రమమైన అంతఃపరిశీలన మొనర్చుకొనుటయును, స్వప్నములను సముచిత విధానమున విమర్శించుకొనుటయును ఈ కనుగొనదగు నూతనపద్ధతియందు అంతర్భాగము కాదగియున్నవి. (అవచేతనావ్యాపార ఫలితముగనే సర్వసాధారణముగా స్వప్నములు రూపొందుచుండును గదా.) కాని, ఇంతకంటె త్వరితముగ ఫలితమిచ్చు పద్ధతియే వేరొకటి కలదనుట నిశ్చయము.

ఓ ప్రభూ, పరమగురూ, నీవే మాకు బోధకుడవు, అంతఃప్రేరకుడవును; నేనేమి చేయవలెనో నీవే బోధింతువు. అపుడు నేను, ఆ బోధించినదానిని అవశ్యము స్వయముగ అనుష్ఠించిన మీదట, ఇతరులు సైతము నీవు బోధించిన దాని ప్రయోజనమును పొందునట్లు చేయగలుగుదును.

ప్రేమ విశ్వాసములు పెనగొన్న భక్తితో, నీ కిదే నా ప్రణామము.

నవంబరు 28. 1913

మా ఉనికికి మనికికి ఏలికవైన ఓ పరమేశ్వరా, దినములోని ఇతర వేళల కంటె ముఖ్యముగా, అరుణోదయాత్పూర్వము కొనసాగెడి సునిశ్చల, సుసమాహితధ్యాన నిష్ఠయందు, నా భావన యెల్ల నీ దెసగా హృదయపూర్వక ప్రార్థనా రూపమున నుద్గమించుచున్నది.

ప్రారంభము కానున్న యీ దినము పృథ్వికిని, మానవజాతికిని మరింత నిర్మలమైన వెలుగును, నిక్కమైన శాంతిని గొనితెచ్చునుగాక. నీ యభివ్యక్తి మరింతగ సంపూర్ణమై, మరింత చక్కగా నీ మధుర నియతి లోకమున గుర్తించబడునుగాక; ఇనుమిక్కిలిగా ఉన్నతము, ఉదాత్తము, యథార్థమునై విలసిల్లు ఉపలబ్ధివిశేషమును మానవజాతి పొందనేర్చును గాక; గాయములు మాని, బాధ లుపశమించి, విశాలతర, గాఢతర ప్రేమ ఎల్లెడల వ్యాపించునుగాక; ప్రసారితము కానున్న భానుని తొలికిరణము జీవితగర్భగుప్తమైన మహావైభవమునకు ప్రతీక ప్రాయముగా సంతోషసామరస్యముల గూర్చునది యగునుగాక.

ఓ పరమగురూ, ఈ దినము నీ నియతికి మరింత సమగ్రముగా మమ్ము మేము అంకిత మొనర్చుకొనుటకును, మరింత సంపూర్ణముగా నీ కార్యమునకై, ఆత్మసమర్పణము గావించుకొనుటకును, అహంతను మరింత పూర్తిగ విస్మరించి, అధికతర జ్ఞానదీప్తిని, విశుద్ధప్రేమను పొందనేర్చుకొనుటకును మమ్ము ఉన్మీలన మొనర్చునది యగునుగాక; నిరంతర మధికతరముగ ప్రగాఢమైవెలయు నీ తోడి యనుసంధానమున సదా నీతో ఐక్యము పొందనేర్చి నీకు తగిన సేవకులమై వర్తింపగలుగుదుము గాక. నీ దివ్యప్రేమతో మా సకలము ఉజ్జ్వలించుటకు, ప్రపంచమున నీ దివిటీలము మేముగ వెలుంగుటకు, మాలోని సకలాహంకారమును, క్షుద్రమైన స్వాతిశయ ప్రవృత్తిని, సమస్తమైన లోభమును తమమును తొలగించి వేయుము.

సుశ్వేత స్వచ్ఛమైన ప్రాగ్దేశీయ పరిమళధూపమువోలె నా హృదయాంత రాళమునుండి నీరవ సంకీర్తనము బయల్వెడలుచున్నది.

సంపూర్ణ సమర్పణపు నిర్మలప్రశాంతితో గూడిన యీ అరుణోదయ కాంతిలో నీకు ప్రణమిల్లుచున్నాను.

* * *

నవంబరు 29, 1913

ఈ రణగొణ ధ్వని అంతయు, ఈ సంచలన మంతయు, ఈ నిరర్థక, శుష్క, విపరీతాందోళన మంతయు నెందుకొరకు ? తుపానుగాలిలో చిక్కుకొన్న యీగల గుంపును బోలె మానవులను కల్లోలపరచుచున్న యీ సుడిగాలి ఎందుకొరకు ? ఎల్లశక్తులు, ఎల్ల ప్రయత్నములు ఇట్లు వ్యర్థములై, వినష్టములై పోవుచున్న యీ దృశ్యమెంత విషాదకరము ! వెనుకనుండి త్రాళ్ళతో, ఎవరిచేత, లేక దేనిచేత, తాము లాగబడుచున్నదియు తెలియని స్థితిలో బొమ్మలవలె నాడుట వీ రెప్పటికి విరమించుకొందురు ? సావకాశముగ గూర్చుండి. అంతర్ముఖులై, సమాహితచిత్తులై, నీ అమూల్యనిధులను, అంతులేని వరదానములను మరుగుపరచుచున్న అంతఃకవాటముల నెప్పటికి తెరచిచూడ నేర్తురు ?

తమోమయము, అజ్ఞానయుతము నగు వీరి జీవితము,— అవివేకపూర్వకమైన ఆందోళనతో వ్యర్థముగా దుర్వినియోగమగుచున్న జీవితము,— ఎంతో బాధాకరము, దుఃఖమయమునై కన్పట్టుచున్నది. నీ దివ్యతేజోజనితమగు నొక చిన్న విస్ఫులింగము, నీ దివ్యప్రేమలోనిదైన ఒక చిన్న బిందువు ఈ బాధ నంతయు ఆనందసాగరముగ మార్చివేయును గదా.

ఓ ప్రభూ, ఇదే నీ దిశగా నానుండి యుద్గమించుచున్న సంప్రార్థనము: వీ రెల్లరును నీ శాంతిని, అక్షరప్రశాంతినుండి ఆవిర్భూతమగు తిరుగులేని సుస్థిర శక్తిసంపదను తెలియనేర్తురుగాక, ఉన్మీలితనేత్రులై, దీప్తమైన తమ యంతస్సత్తయందు నిన్ను ధ్యానింప నేర్చువారి కీ స్థితి యలవడును.

నీ వభివ్యక్తమయ్యెడి సమయ మేతెంచినది. అన్నివైపులనుండియు త్వరలో ఆనందసంకీర్తనము లుప్పతిల్లగలవు.

ఈ శుభసమయపు పరమపావనత మ్రోల నా భక్తిపూర్వక ప్రణామము.

* * *

డిసెంబరు 13, 1913

ఓ ప్రభూ, నేను భ్రమకు లోనుగాకుండునట్లు నాకు జ్ఞానదీప్తిని ప్రసాదించుము. నీ దరిజేరుటకు నాలో తీంవ్రించు అపారవినమ్రత, ఆత్యంతికభక్తి, అగాధప్రేమ,— ఇవి యెల్ల వెలుగులు విరజిమ్ముకొనుచు, విశ్వాసోద్దీపకములై ఇతరులలోనికి సైతము వ్యాపించి ఎల్లరి హృదయములలో అవబుద్ధము లగునట్లు అనుగ్రహింపుము.

ఓ ప్రభూ, ఓ సనాతన సద్గురూ, నాకు దివ్యజ్ఞానదీప్తిని, దివ్యశాంతిని ప్రసాదించువాడవు నీవే; మార్గప్రదర్శకుడవై నాచేత అడుగులు వేయించుచు, నాకు నయనోన్మీలన మొనర్చి నా హృదయము నుద్దీప్తము గావింపుము. సరాసరిగ నిన్ను జేరు దారులలో నన్ను నడిపించుకొని పొమ్ము.

ఓ ప్రభూ, ప్రభూ, నీ యిచ్ఛగాక వేరొక యిచ్ఛ నాకు లేకుండునట్లు, నా సకలచేష్టలు నీ దివ్యనియతినే అభివ్యక్త మొనర్చునట్లు అనుగ్రహింపుము.

ఒక మహాతేజస్సున నే నిపుడు మునిగి తేలుచున్నాను. నీవుదక్క మరేదియు నా కిపుడు తెలియవచ్చుట లేదు.

శాంతి, శాంతి, శాంతియే జగమెల్ల నిండారుగాక.

* * *

డిసెంబరు 16, 1913

విశుద్ధము, నిస్స్వార్థము నగు ప్రేమను, నీ ప్రేమను, మా చేతనైనంతగా దర్శించి వ్యక్తీకరించవలసియున్నది. ఈ ప్రేమ యొక్కటియే నిన్ను అన్వేషించువారి హృదయోన్మీలన మొనర్పజాలునది. బుద్ధిమార్గము ననుసరించువారి భావన కడు ఉన్నతమైనది, కడు యథార్థమైనదే కావచ్చును. నీతోడి తాదాత్మ్యమున జీవించు యథార్థజీవన మిట్టిదని వారు భావింపనేర్తురేగాని తెలియనేరరు, ఆ జీవనమును గురించిన ఆంతరికానుభూతి వారి కుండదు. నీతోడి సంస్పర్శ జ్ఞానము వారికి కలుగనేరదు. బుద్ధిజ్ఞాన సమన్వితులై, దానిలోనే గిరిగీసికొని తమకు ఉత్తమమని తోచిన చట్రమునందు ప్రవృత్తులగు వారిలో మార్పుతెచ్చుట కడుంగడు కష్టము. భగవద్బోధ వీరిలో కలిగించుట, సద్భావసమన్వితులగు తదితరులలో కలిగించుటకంటె కష్టతరము. ఈ మహాకార్యమును సాధింప జాలునది ప్రేమ మాత్రమే. ఏలన, ప్రేమ ఎల్ల కవాటములను వివృత మొనర్చును; ఎల్లకుడ్యములను భేదించును; ఎల్ల ప్రతిరోధములను అవఘళించును. ఉత్తమోత్తమ ప్రసంగముల కసాధ్యమైనది అల్పమాత్రమగు యథార్థప్రేమచే సాధ్యమగును.

ఓ ప్రభూ, ఈ విశుద్ధప్రేమ కుసుమము నాలో వికసించి, మా దరిజేరు వారినెల్ల తన పరిమళముచే వాసింపజేయుచు పునీతుల నొనర్చుగాక.

ఈ ప్రేమయే శాంత్యానందములకు తావలము; బలసంపత్తికి, జ్ఞానోపలబ్ధికి మూలము: ఆధివ్యాధుల నెల్ల నమోఘముగ నివారించునది, చింతలనెల్ల బాపి యోదార్చునది అదియే; దానిదే జయము, దానిదే పరమగురుస్థానము.

ఓ ప్రభూ, మదీయ ప్రియగురూ, నిశ్చల నీరవతలో నిలిచి సభక్తికముగ నిన్నే ధ్యానించుచున్నాను; నీకే సంపూర్ణముగ నే నంకితమగుచున్నాను. నీవే నా జీవితమునకు ఏడుగడవు. నీ విశుద్ధప్రేమతో నా హృదయమును ఉజ్జ్వలాగ్ని శిఖవోలె జ్వలింపజేయుము. ఆ జ్వాలలో నా మాలిన్యములెల్ల దగ్ధముగావలెను. అహంకారమనెడి యీ యెండుకలప, అజ్ఞానమనెడి యీ నేలబొగ్గు ఇందు దహిం

చబడి, సుఖదాయకమైన వెచ్చదనమును, కాంతి విరజిమ్మెడి వెలుగును ఇచ్చునవిగ రూపాంతరము చెందవలసియున్నది.

ప్రభూ, సంతోషాతిశయము, గభీరత పెనగొన్న భక్తిభావముతో నీవైపు తిరిగి నిన్నిట్లు వేడుకొనుచున్నాను:

నీ ప్రేమ అభివ్యక్తమగునుగాక,
నీ పరిపాలన నెలకొనునుగాక,
నీ శాంతి ప్రపంచమున రాజ్య మేలునుగాక.

* * *

డిసెంబరు 29, 1913

ఓ ప్రభూ, సంవత్సరాంతమున జరుగుచున్న యీ సంయుక్త సమావేశము, మా జీవితమున నిక నిలువగూడని భ్రమలయు, దౌర్బల్యములయు, బంధనలయు, సంగములయు రాశినంతను ఒక్కుమ్మడిగ వదలించుకొనుటకు మాకు అవకాశ మిచ్చునదగునుగాక. అనుక్షణమును గతమునెల్ల మేము, మీదపడుచున్న ధూళిని వోలె దులిపివేసికొనగలుగుచు, మా యెదుట వివృతమై కానవచ్చుచున్న క్రొంగ్రొత్త మార్గము నది అదేరీతిగా అనుక్షణమును మలినపరచకుండునట్లుగ చేసికోవలసి యున్నది.

మేము చేయు తప్పులు మాలో వెన్వెంటనే గుర్తించబడి సవరణపొందుచు, ఎట్టి దుష్పరిణామములను గల్పింపజాలని వట్టి యెండమావుల వంటివై పోవునుగాక. మాలో ఇక తలయెత్తరాని నానావిధములైన అజ్ఞానప్రవృత్తులను, తమఃప్రవృత్తులను, అహంకార ప్రవృత్తులను,— అన్నింటిని మేము అణగద్రొక్కివేయ గలుగుచు, సువిశాల సీమాంతరేఖాప్రదేశముల వైపుగా, ఘనిష్ఠ తేజోమండలముల వైపుగా, మహత్తర నిష్కలంక కారుణ్యము వైపుగా, నిస్స్వార్థ ప్రేమ వైపుగా,— ఒక్కమాటలో చెప్పినచో నీ వైపుగా,— మేము ఎగురనేర్తుముగాక.

ఓ ప్రభూ, ఓ సర్వభూతపతీ, నీకు మోకరిల్లుచు, పృథ్విపై నీ రాజ్య ప్రకటనమున కుత్సహించుచున్నాను.

* * *

జనవరి 1, 1914

ఈ నూతన సంవత్సరపు తొలి నిమేషము కేవలముగా నీకు,— సకలవర ప్రసాదివైన నీకు,— జీవితమును శుద్ధము, శివము, సుందరము గావించి చరితార్థ మొనర్చు నీకు,— మా విధినిర్ణేతవు, మా యాకాంక్షలకు లక్ష్యభూతుడవు నైన నీకు,— నివేదితమై పావనత ఘటియించుకొన్నది.

ఈ నివేదనచే నది సంపూర్ణ మహత్వమును సంతరించుకొనును గాక; నిన్ను పొంద నభిలషించు వా రెల్లరు సరియైన మార్గమున నిన్నన్వేషింపనేర్తురు గాక; సరియగు నుపాయము తెలియనేరక బాధపడువారు, నీ జీవనసరళిచే తమ తమోమయచేతనపు కఠినోపరిభాగమెల్ల నెమ్మదినెమ్మదిగా భేదింపబడుచున్న అనుభూతిని పొందనేర్తురుగాక.

మంగళప్రదమైన నీ వైభవముమ్రోల, నిండు భక్తితో, అంతులేని కృతజ్ఞతాభావముతో ప్రణమిల్లుచున్నాను. నిన్ను నీవు అభివ్యక్త మొనర్చుకొనుచున్నందుకు పృథ్విపక్షమున కృతజ్ఞత నీకు తెలుపుకొనుచున్నాను. నీ దివ్యజ్ఞాన జ్యోతి, నీ ప్రేమ మరింతగా పెంపొందురీతిని నీవు అభివ్యక్తము కాగలందులకై ఆమె పేరటనే నిన్ను మరిమరి యర్థించుచున్నాను.

మా యాలోచనలకు, భావావేశములకు, కర్మకలాపములకు— అన్నింటికి నీవే ఏడుగడవు కమ్ము.

మా ఉనికికి మూలసత్యము, కేవల మూలసత్యము నీవే.

నీకు వెలియైన దంతయు అసత్యము, భ్రమ, దుఃఖభూయిష్ఠమైన తమస్సు.

బ్రతుకు, వెలుగు, ఆనందము,— నీయందే కలదు. పరమమైన శాంతియు నీయందే కలదు.

* * *

జనవరి 2, 1914

మానవుల వైక్లబ్యదోష మేరీతి నున్నను, ఈ యద్భుతమైన నిశ్చల నీరవత నిన్ను అభివ్యక్తము గావించుచునే యుండును. ఉపరితలమున గానవచ్చెడి శుష్క-వైక్లబ్య, వ్యర్థనినాద, నిరర్థక శక్తి విక్షేపములకెల్ల అతీతముగా, అక్షరము, అవిరతము నైన యీ నీరవత సమస్త వస్తుజాతమందును గలదు. అద్దానిని చెవియొగ్గి విననేర్చుటయే కావలసినది. జ్ఞానదీప్తిని, శాంతిని జనింపజేయు యంత్రరూపమై అయ్యది మా సత్త్వయందు వికసించునుగాక. దాని శక్తి ప్రవాహములు శుభంకర తరంగములుగ ఎల్లరిని ముంచెత్తును గాక.

సర్వజీవ రక్షకుడవు నీవు, సకల ప్రవృత్తులకు మూలకారణ మైనవాడవు, మా బుద్ధుల పరమలక్ష్య స్వరూపుడవు.

* * *

జనవరి 3, 1914

మాటిమాటికిని మేము అంతర్వీక్షణము గావించుకొనుచు, వట్టి శూన్యప్రాయుల మనియును, ఏమియు చేయజాలని అశక్తుల మనియు, తెలిసికొనుట సర్వదా శుభదాయకము; అంతేగాక, అటుపైన, నీవే సర్వము ననియు. నీవే సర్వశక్తుడ వనియు తెలియనేర్చి, నీవైపు దృష్టి మరల్చుటయు నత్యంతావశ్యకము.

నీవే మా ప్రాణమునకు ప్రాణము;
మా సత్తకు తేజస్సువు;
మా విధికి అధినేతవు.

* * *

జనవరి 4, 1914

భౌతిక విషయచింతనల ప్రవాహము, ఏమాత్రపు దౌర్బల్యము మాలో పొడసూపినను వచ్చి మీదపడుటకు సదా కనుపెట్టుకొనియుండును. జాగరూకత మాయందే ఒక్క క్షణము సడలినను, ఏ కొంచెముగా మేము ప్రాలుమాలుట సంభవించినను, అయ్యది ముందుకు ఉరవడించి, అన్నివైపులనుండియు మమ్ము పైకొని, మా చేసిన ఎన్నెన్నో ప్రయత్నముల ఫలితములను తమ వెల్లువ పృథు భారముక్రింద నణగార్చి వేయును. అట్టితరి, ఒక విధమైన జడత్వస్థితికి జీవుడు లోనగును. భౌతికావసరములైన ఆహార నిద్రలు పెరుగును; బుద్ధి మందగించును; అంతర్దృష్టి మరుగుపడును. ఈ బాహ్యప్రవృత్తులయందు నిక్కమైన యాసక్తి లేకున్నను, అవియే కేవలముగ నతనిని కైవసమొనర్చుకొనును. ఎంతేనియు శ్రమను గల్పించెడి పరిస్థితి ! ఏలన, భౌతికవిషయ చింతనలకంటె శ్రమను గల్పించునవి మరి యుండజాలవు. వీని మూలమున, బడలిక చెందిన మనస్సు, పంజరమున జిక్కుటచే యథేచ్ఛగ నెగురు శక్తికొరకై ఉత్కటపడుచుండియు రెక్కలు విప్పజాలని పక్షివోలె బాధపడును.

కాని, నాకు అగోచరమగు ప్రయోజనమేదైన ఈ స్థితికి కలదేమో. ఏమైనను, నే నెంతమాత్ర మారాటము చెందుటలేదు. తల్లియొడిలోని శిశువువలె, ప్రగాఢభక్తితో గురుపాద సన్నిధినున్న శిష్యునివలె, నీయందే నమ్మికతో, జయము నీవే యను నిశ్చయమున, దారి చూపి నన్ను నీవే నడిపించుటకై నీకు ఆత్మార్పణ మొనర్చుకొనుచున్నాను.

* * *

జనవరి 5, 1914

ఏమి వ్రాయవలెనో మనస్సున నిశ్చయించుకోలేని స్థితిలో, ఈ ఖాళీపుట ముందర, ఎంతసేపటినుండియో కూర్చుండియున్నాను. ఇపుడు నాలో అంతయు వట్టి సామాన్యస్థితి; ఎట్టివిలువయు, ఎట్టి రసస్ఫూర్తియు లేని అమిత సాధారణావస్థ: మెదడులో ఏ ఒక్క ఆలోచనయు లేదు; హృదయమున ఏ ఒక్కభావస్ఫూర్తియు కానరాదు; ప్రతిదానియెడ వట్టి యౌదాసీన్యము. తొలగద్రోయరాని మాంద్యము నన్నావహించియున్నది.

ఇట్టి స్థితివలన నేమి ప్రయోజనము ?

జగత్తున నేను కేవలమొక శూన్యప్రాయురాలనై యున్నాను.

తక్కినదానికెల్ల నిక ఎట్టి ప్రాముఖ్యమును లేదు. నీ కార్యము నెరవేరి, నీ యభివ్యక్తి సంఘటిల్లి, పుడమి అంతకంత కెక్కుడుగ సమరసభావ సమన్వితము, మంగళప్రదము నగు నీ రాజ్యముగ నొప్పారుచే గావలెనుగాని, ఆ పని నావలన నెరవేరుటకు, నెరవేరకపోవుటకు, ఎట్టి ప్రాధాన్యమును లేదు.

అంతేగాక, అది నెరవేరుట నిశ్చయమే కావున, దాని విషయమై నే నొక వేళ శ్రమపడ దలంపుగొన్నను, అట్లు శ్రమపడ నగత్యమేమియు లేదు. ఈ నా సత్తయందలి అంతరాంతర తలములు మొదలుకొని అత్యంత బాహ్యతలముల పర్యంతము—— అంతయు అల్పమాత్రమగు వట్టి పరాగము మాత్రమే. ఏ జాడయు మిగులకుండ చెల్లాచెదరుగ నది విరజిమ్మివేయబడుట కడు సముచిత కార్యమే యగును.

* * *

జనవరి 6, 1914

ఓ ప్రభూ, నా జీవిత పరమలక్ష్యము, నా యాకాంక్ష ముఖ్యకేంద్రము, నా యాలోచనల ఆధారస్థానము; నా సమన్వయభావ కీలకము నీవే. ఎల్ల జ్ఞానేంద్రియ వృత్తులకు, ఎల్ల హృదయభావనలకు, ఎల్ల బుద్ధియోచనలకు, నీ వతీతుడ వగుటచే, నీది వాగతీత చైతన్యానుభవ స్వరూపము, నా సత్తలో అంతరాంతముల నివసించు సత్యవస్తు స్వరూపము, మానవబుద్ధి నిన్నొక సూత్రమున కుదింప నసమర్థ మగుటచేతనే కొందరు, ఇంచుక తిరస్కారభావ మూని, నిన్ను గురించి తెలియవీలైన జ్ఞానమును 'సెంటిమెంటు' (రసభావన) గా పరిగణించుచున్నారు. కాని, ఆ జ్ఞానము బుద్ధిభావన కెంతదూరమో ఈ రసభావనకును అంతియే. ఈ పరమజ్ఞానోపలబ్ధిని మేము పొందనంత కాలము, బుద్ధికిని, హృదయమునకును సుస్థిర, ఘనిష్ఠ, సమన్వయ కేంద్రస్థానము మాకు అందనేరదు. ఇక, తక్కిన బుద్ధికల్పన లన్నియు నిర్హేతుకములు, కృతకములు, విరర్థకములు నని చెప్పక తప్పదు.

అక్షరనీరవత, పరమశాంతి,— ఇదియే మే మెరుగనేర్చినంతలో నీ స్వరూపము.

మే మందుకోవలసియున్న యెల్ల సంసిద్ధియు, మాకు సాక్షాత్కృతములు కావలసియున్న యెల్ల అద్భుతములును, మాయెదుట అభివ్యక్తమై తనరారవలసి యున్న యెల్ల వైభవమును నీవే.

నీ గురించి మేము పలుక సాహసించినప్పుడు, మా పలుకు లన్నియు వట్టి బాలప్రలాపములు మాత్రమే.

నిశ్చల నీరవతలో నుండుటే నీయెడ మేము చూపగల పరమ గౌరవము.

జనవరి 7, 1914

ఓ ప్రభూ, వీరి కందరకు శాంతిని, వెలుగును ప్రసాదింపుము; అంధత్వ మావహించిన వీరి నేత్రములను, మసకవారిన వీరి అవగాహనశక్తిని ఉన్మీలన మొనర్పుము; కొరమాలిన వీరి వేదనలను, వ్యర్థములైన వీరి యారాటములను శమింపజేయుము; వీరికి తమమీదనున్న దృష్టిని పూర్తిగా మళ్ళించి, మనసున నెట్టి అంచనాలు, మినహాయింపులు లేక నీ కార్యమునకు తమ్ము అంకిత మొనర్చు కొనగల ఆనందము ననుగ్రహింపుము. నీ సౌందర్యము ఎల్లెడల వికసించి, ఎల్లరి హృదయము లందును నీ ప్రేమ నుద్బుద్ధ మొనర్చునుగాక. నిత్య వికాసము చెందు నీ సువ్యవస్థ పుడమిపై పరిఢవిల్లి, నీ సమరసభావమే అంతటను వ్యాప్తమై. పరిపూర్ణవిశుద్ధిలో, శాంతిలో, అంతయు నీవుగనే ప్రత్యక్షము కావలసి యున్నది.

ఎల్లరి కన్నీళ్ళు తుడువబడునుగాక, ఎల్లరి బాధలు తీరిపోవునుగాక, ఎల్లరి ఆవేదన అంతర్ధాన మగునుగాక. సుస్థిర ప్రశాంతి మానవ హృదయములలో నెలకొనునుగాక; సంపూర్ణ దృఢనిశ్చయము వారి మానసమును బలపరచునుగాక. నవచైతన్య వికాసము ఘటింపజేయు ప్రవాహమై నీ జీవన విధాన మెల్లెడ పరివ్యాప్తమగునుగాక. విజయపరంపరాప్రాప్తికై శక్తిని పూరించుకొనుట కెల్లరును ఈ ధ్యాననిష్ఠనూని నీకు అభిముఖు లయ్యెదరుగాక.

* * *

జనవరి 8, 1914

శ్రమతో పనిలేక అతిసుగమములై కన్పట్టు పథములను,—— చేరవలసిన గమ్యమును చేరుకొంటిమను దుర్భ్రమను మాలో కలిగించు పథములను మేము పరిహరింతుముగాక; పతనపరంపరలోనికి మమ్ములను ప్రవేశపెట్టు ప్రాలుమాలికను పరిహరింతుముగాక; అథఃస్థితుల లోనికి మమ్ము గొనిపోగల ఆత్మసంతృప్తి పూర్వక ఆత్మప్రశంసాధోరణిని పరిహరింతుముగాక. మేము ఏ ప్రయత్నము లొనర్చినను, ఏ శ్రమలుపడినను, ఏ విజయములను సైతము సాధించినను, మే

మింకను అధిగమించవలసియున్న మార్గములతో బోల్చిచూచినచో, ఇంతదనుక మే మధిగమించినది శూన్యప్రాయమే యనియు, ఆ పరముని సమక్షమున, సూక్ష్మాతి సూక్ష్మ పరాగరేణుప్రాయులుగనో లేక దివ్యనక్షత్రగణప్రాయులుగనో, ఎల్లరును సమానులే యనియు మేము తెలియనేర్చుకొనుట యవసరము.

కాని, సకల ప్రతిరోధములను జయించువాడవు నీవు; సమస్తమైన అజ్ఞానమును బోకార్చు దివ్యజ్యోతివి; స్వాతిశయ ప్రవృత్తినెల్ల కరగించివేయు ప్రేమమూర్తివి. నీ సాన్నిధ్యమున ఏ అపప్రవృత్తియు నిలువద్రొక్కుకోనేరదు.

* * *

జనవరి 9, 1914

అందుకోరాని సత్యస్వరూపుడవైన ఓ ప్రభూ, మా పురోగతి ఎంత విజయవంతముగ కొనసాగుచున్నను, మాకు అందరాకుండ నిరంతరము నీవు తప్పించుకొనుచునే యుందువు; నిన్ను గురించి మే మెంతగా తెలియనేర్చినను, నీ నిత్య నిగూఢ రహస్యమును మే మెంతగా కొల్లగొట్టనేర్చినను, అజ్ఞేయ స్వరూపుడవుగనే సదా నీవు విలపిల్లుచుందువు. నిరంతర సమగ్రప్రయత్నములతో నిన్ను జేరుటకు గల బహువిధ పంథలన్నింటిని ఏకమొనర్చి, అవరోధములనెల్ల ఛేదించుచు, ఎల్ల హద్దులను అతిక్రమించుచు, ఎల్ల తెరలను తొలగించివేయుచు, ఎల్ల మబ్బులను చెల్లాచెదరొనర్చుచు, ఎల్ల చీకటులను చీల్చివేయుచు, నీ వైపుగా మేము, ఈ సముదాయమంతయును ఊడ్చివేయబడునట్లుగ, శక్తిమంతము, అప్రతిహతము నైన గమనవేగమున పురోగమింపగోరుచున్నాము,— నిరంతరము పురోగమింప గోరుచున్నాము. నీ నిత్యనూతన సన్నిధానమును పుడమి గుర్తింపనేర్చి, తాను సాధింపవలసియున్న పరమలక్ష్యము లెవ్వియో అవగాహన మొనర్చుకొని, నీ యఖండోపలబ్ధిలోని శాంతి సామరస్యములందు మనుగడ సాగించవలసియున్నది.

నిరంతర మధికాధికముగ మాకు బోధ యొనర్పుము;—
అధికాధికముగా మాలో జ్ఞానదీప్తి కలిగించుము;
అజ్ఞానమును బోకార్చుము;
మా బుద్ధులకు వెలుగునిమ్ము;
మా హృదయముల రూపాంతర మొందింపుము.

మరియు, ఎన్నడును వాడిపోని నీ దివ్యప్రేమను మాకు ప్రసాదింపుము; ప్రతి జీవసత్తయందును నీ మధురనియతిని వికసింపజేయుము.

నిత్యముగా, నిరవధికముగా, మేము నీవారము.

* * *

జనవరి 10, 1914

నా యాకాంక్ష సదా, ఒకేరీతిని, శిశుప్రాయముగ, కడు సామాన్యమైన తన సహజ సారళ్యముతో నీదెస కుద్గమించుచున్నను, నా సంప్రార్థనము మాత్ర మంత కంతకు ప్రగాఢమై వెల్వడుచున్నది; దుస్సాహసోపేతమైన వాక్కుల వెనుక, నా ఏకాగ్రసంకల్పపు ఔత్సుక్యమంతయు తీండ్రించుచున్నది. బుద్ధిపటిమ యెంతయు లోపించిన యీ సహజసరళ వాగ్వైఖరి ఏరీతి నున్నను, అధికతరముగ జ్ఞానదీప్తిని, విశుద్ధిని, నిక్కమైన శ్రద్ధాభక్తులను అనుగ్రహించవలసినదిగ నిన్ను వేడుకొను చున్నాను. ఇవి యెల్ల, నా సత్తగా నేను పేర్కొనుచున్న సంఘాతమునకు, విశ్వసత్తగా పేర్కొనబడుచున్న సంఘాతమునకు గూడ అలవడ వలసియున్నది. వేడుకొనుట కేవలము నిష్ప్రయోజనమని తెలిసియు నిన్ను వేడుకొనుచున్నాను; ఏలన, నీ మహనీయ సంపూర్ణాభివ్యక్తికి అవరోధ మగునది అజ్ఞాన, అసద్భావ కలితులమైన మేమే; ఐనను, నాలోని బాల్యచాపల్య మేదియో, ఈ మానసిక ప్రవృత్తియందు నాకు ఊత యగుచున్నది; పృథ్విపై నీ శాంతి రాజ్య మేల గలం దులకై నిన్ను వేడుకొనుచున్నాను.

ఓ ప్రభూ, నిన్నెప్పటికిని చేరుకోజాలకయే నిరంతరముగ మేము పైకెగ బ్రాకుచున్న చేరరాని శిఖరస్థానము నీవు; మా సత్తకు మూలస్వరూపమైనవాడవును నీవే; నిన్ను మేము కనుగొంటిమని విశ్వసించి యున్నంతలోనే ఆకస్మికముగ నీవు మా కన్నుమరుగై పోవుదువు. అద్భుతమైన యీ నీ స్వరూపస్థితి మాకు అందుబాటైనట్లు తోచుచునే, మమ్ము ఇంకను ముందుకు, నిరంతరముగ ముందుకు, లోలోతులకు, ఎన్నడును తరచిచూచియుండని అనంత తలములకు తీసికొనిపోవు చుండును. 'నిన్ను నేను తెలిసికొన్నాను',— అని యెవ్వరును చెప్పజాలరు; అయినను, ఎల్లరిలోను నీ వున్నావు; తమ ఆత్మ చైతన్యపు నిశ్చల నీరవతయందు నీ వాణి ప్రతిధ్వనిని వారు వినవచ్చును. కాని, యీ నీరవత సైతము వికసన స్వభావము కలది. నీతో మాకు ఒనగూడిన యైక్యభావసమగ్రత ఎట్టిదైనను, సాపేక్షిక మగు ద్వైతప్రపంచమునకు మా శరీరమింకను చెందియున్నంతకాలము, నీతోడి యీ ఐక్యము సదా మరింత పూర్ణత్వసంపాదనకు అవకాశము కలదిగనే యుండును.

కాని, నిన్నుగురించి మేము పలికెడి పలుకు లన్నియు వృథాలాపనము మాత్రమే. నిండు విశ్వాసము నీయెడ గల సేవకురాలను నే నగునట్లుగా అనుగ్రహింపుము.

* * *

జనవరి 11, 1914

ప్రతి క్షణమునను మా యెదుట నిపుడు అనిరీక్షితము, అనపేక్షితము, అజ్ఞాతపూర్వము నైనదెల్ల ప్రత్యక్షమగుచున్నది. ప్రతి క్షణమునను ఈ విశ్వము సమష్టిగను, వ్యష్టివిభాగముల రూపమునను తిరోధానము చెందుచున్నది. నిక్కమైన— సచేతనమైన— విశ్వాసము మాలో నెలకొనియుండెనేని, నీ సర్వశక్తతను గురించియు, అద్వయసత్యస్వరూపమును గురించియు అఖండ సునిశ్చయ బుద్ధి మాలో దీప్తమై యుండెనేని, సకల విశ్వము రూపాంతరము చెందునట్లుగ నీ అభివ్యక్తి ప్రతిక్షణమునను సుప్రత్యక్షమే యగును. కాని, మే మింకను, మా పరిసరములం దిపుడు ప్రవర్తించుచున్నట్టియు, మాకు పూర్వమున ప్రవర్తిల్లి నట్టియు సర్వమునకును దాసులమై, లోగడ ఘటిల్లిన అభివ్యక్తి విశేషముచే

మాత్రమే నియతుల మగుచు, అత్యల్ప విశ్వాసులమై యుండిన హేతువుచే, రూపాంతరీకరణ మనెడి మహనీయాద్భుత కార్యసాధనకు ఉపకరణముగ నింకను మేము ఉపయోగపడజాలకున్నాము. కాని, ప్రభూ, ఆ స్థితి ఒకనాటికి వచ్చునని నాకు తెలియును. మా దరిజేరువారినెల్ల నీవు రూపాంతరము చెందింపగల రోజు రాగలదని నే నెరుగుదును. అది యెంతటి మౌలికరూపాంతరీకరణమై భాసిల్లు ననిన, గతకాల బంధములనుండి వారు సంపూర్ణముగ విముక్తులై, నీయందే నివ సింప మొదలిడి, కేవలము నీతోడిదేయగు జీవితమును, నీవే యేలికవై సర్వమును నియమించుచుండగా నడపనేర్తురు. ఆ సన్నివేశమునందు కష్టములెల్ల సుప్రస న్నతలోనికి, సకలాందోళనలు శాంతిలోనికి, సర్వసంశయములు సునిశ్చయ భావము లోనికి, సమస్త విరూపతయు సుందర సామరస్యములోనికి, అహంకారమెల్ల ఆత్మార్పణములోనికి, చీకటి యంతయు వెలుగులోనికి, బాధలన్నియు సుస్థిర సుఖస్థితిలోనికి శుభపరివర్తనము చెందును.

కాని, ఈ మహనీయాద్భుత కార్యమును నీ విదివరకే నెరవేర్ప మొదలిడి తివి కాదా? మా చుట్టును సర్వత్ర దాని వికాసమును నేను తిలకించుచున్నాను.

ప్రేమ సౌందర్యముల దివ్యనియతి స్వరూపుడవైన ఓ ప్రభూ, పరమముక్తి ప్రదాయకా, నీ శక్తికి అడ్డేమియును లేదు. మాకు సర్వతోభద్రత కల్పించు నీ యనవరత విజయదృశ్యమును మేము కానకుండజేయుచున్నది మా యంధత్వమే.

నా హృదయము ఆనంద సంకీర్తనము నాలాపించుచున్నది; నా బుద్ధిభావన సమ్మోదదీప్తితో ప్రకాశించుచున్నది.

పరమము, అద్భుతావహము నైన నీ ప్రేమ జగదీశ్వరత్వ ప్రాభవమున విరాజిల్లుచున్నది.

* * *

జనవరి 12, 1914

ఏ బోధయైనను సంపూర్ణముగ త్రికరణశుద్ధితో కూడినదైనప్పుడే, అనగా, బోధింపబడు కాలముననే అనుష్ఠించబడినప్పుడే ఫలదాయక మగును. తరచుగ పలుకబడుచుండు మాటలు, తరచుగ వెల్లడించబడుచుండు నాలోచనలు త్రికరణ శుద్ధి పూర్వకమైనవి గానేరవు.

• • •

జనవరి 13, 1914

ఓ ప్రభూ, మహోన్నతమైన ప్రేమ కెరటము వలె నా జీవితముమీదుగా నీవు ప్రవహించినావు. దానిలో నేను మునిగినప్పుడు, ఒక విధమున గాఢము గను, సమగ్రముగను నీకు నా బుద్ధిభావనలను, నా హృదయమును, నా శరీరమును చేతనాత్మకమైన పూర్ణాహుతి రూపముగ సమర్పణ మొనర్చుకొంటినని తెలిసి కొంటివి. ఎప్పుడు? కచ్చితముగా ఏ క్షణముననో నాకు తెలియదు. అది నిరంతరముగ సాగిన సమర్పణ మనుట నిస్సంశయము

నన్ను ముంచివేసిన ఆ మహనీయ ప్రేమయందు, ఆ యొనర్పబడిన పరి పూర్ణత్యాగస్ఫూర్తియందు, విశ్వముకంటె విస్తృతమైన అపార సుప్రసన్నత విలసిల్లినది. ప్రగాఢమైన ఒకానొక మాధుర్యము, అపారమైన ఒకానొక కారు ణ్యము నిండుకొనగా, అల్లన నా కనులలోనికి అశ్రువులు స్రవించినవి. ఒక్క మ్మడిగ సుఖదుఃఖముల కతీతస్థాయిలో వెలసిన ఆ స్థితి అసదృశము. అందు వర్ణనాతీతమైన శాంతి తొణికిసలాడినది.

ఓ పరమప్రేమ స్వరూపా, మా జీవితమున కంతకు కేంద్రస్థానము నీవే. అద్భుతములలోకెల్ల అద్భుతము నీ నిజతత్వము. ఎట్టకేలకు మరల నిన్ను కనుగొని, పూర్వముకంటె మరింత ఎరుకతో, మరింత శక్తిమంతముగ నీలో నివసించుచున్నాను. పూర్వముకంటె మరింత మిన్నగా నిన్నిపుడు తెలిసికొను చున్నాను, అవగాహన మొనర్చుకొనుచున్నాను. ఈ రీతిగా నిన్నెప్పుడు మరల

నేను కనుగొనుట సంభవించినను, నీతో నా సాంగత్యము మరింత సమగ్రము, మరింత సంపూర్ణము, మరింత సునిశ్చితమునై విలసిల్లుచు వచ్చినది.

అనిర్వచనీయ సౌందర్యశోభితము నీ సన్నిధానము. పరమమైన ముక్తి భావనయు, ముక్తి ప్రదమైన అఖండశక్తియు నీవే. స్వస్వరూపమున నివసించుచున్న నా సత్త యిప్పుడు, నీవే తన జీవనమునకును, సకలప్రాణిజీవనమునకును మూలమైన ఏక సూత్రముగ గుర్తించి, ఆనందపారవశ్యము నొందుచున్నది. సకల భావనలయు, సకల సంకల్పములయు, సకల చైతన్య విశేషములయు అద్భుత నిర్మాతవు నీవే. భ్రమ రూపము, దుస్స్వప్నప్రాయము నైన యీ ప్రపంచమునకు నీవు నీ దివ్యవాస్తవికత్వమును ప్రసాదించినావు. జడద్రవ్యపు ప్రతి అణువు నీ అక్షర స్వరూపాంశను ధరించియున్నది.

ఉన్నది నీవు, జీవించునది నీవు, ప్రకాశించునది నీవు, పాలించునదియును నీవు.

* * *

జనవరి 19, 1914

దివ్యప్రేమాధిదైవస్వరూపుడవైన ఓ ప్రభూ, నిత్యవిజయివి నీవు; జీవితమున నీతో శ్రుతి గూర్చుకొని, కేవలము నీ కొరకు, నీవలన జీవింపనేర్చువారికే సకల విజయములును చేకూరును; ఏలన, పరమమైన శక్తిసంపన్నుడవు నీవు; సంపూర్ణమైన అనాసక్తిని, సంపూర్ణమైన యోగదృష్టిని, ప్రాభవోపేతమైన కారుణ్యమును వెలార్చుకొను శక్తిసంపద అది.

సకలమును నీయందే, నీ వలననే రూపాంతరము చెంది మహనీయతను సంతరించుకొనుచున్నది; సకల రహస్యభేదనమునకు, సకల శక్తి సముపార్జనమునకు కీలకము నీయందే కలదు. కాని, నీయందే నివసించుచు, నిన్నే సేవించుచు, అధిక సంఖ్యాకుల విముక్తికొరకు నీ దివ్యకార్యమే సత్వర విజయము గాంచ

కృషిసల్పుట దక్క ఇతర మేమియు కోరకుండు వారలు మాత్రమే నిన్ను పొందనేర్తురు.

ఓ యీశ్వరా, నీ వొక్కడవే సత్యము; తక్కినదెల్ల భ్రమ. ఏలన, నీలో మేము నివసించినపుడు, సకలమును మేము దర్శించి అవగాహనమొనర్చు కొందుము. నీ పూర్ణజ్ఞాన దృష్టికి అందనిదేమియు నుండజాలదు. ప్రతిది వేరొక క్రొత్తరూపున గానవచ్చును. ఏలన, సమస్తము నీ యుదాత్త సంస్పర్శ గల నీ కార్యమే కావున, వస్తుతః సర్వమును నీవే; కటికచీకటిలో సైతము తార నొకటి వెలిగించియున్నావు.

నిరంతరము భక్తిభావము మాలో అతిశయిల్లుచుండునుగాక.

మా సమర్పణభావము మాలో అంతకంతకు సదా పరిపూర్ణతను సంతరించు కొనునుగాక.

మరియు, వస్తుతః ఇదివరకే ప్రభువువై విలసిల్లుచున్న నీవు, ప్రత్యక్షముగ కూడ మా జీవనప్రభువువై విరాజిల్లుదువు గాక.

* * *

జనవరి 24, 1914

ఓ దేవా, నీవు మా సత్తయొక్క యథార్థమైన మూలకారణమవు. ఓ పరమేశ్వరా, ప్రేమైకమూర్తీ, ముక్తిప్రదాయకా! నా యునికియం దనుక్షణమును సర్వవిషయములయందు నీ జ్ఞానతేజస్సు దక్క వేరొండేదియు గలుగకుండుగాక! కేవలము నీ యిచ్ఛ కనుగుణముగా నేను జీవింపకపోదునేని, తీవ్రవ్యథకులోనయి మెల్లమెల్లగ వినాశముం బొందుదును. ఏలన, నీవే నా ఉనికికి ఏడుగడవు; నేను చేరవలసిన ఒకేఒక గమ్యము, నాకు గల ఒకేఒక ఆలంబనము నీవే. తన రెక్కలయం దింకను క్షమ్మకము లేక, ఎగుర సంకోచించు పిరికిపక్షి చందముగ

నున్నది నా స్థితి. ఓ పరమేశ్వరా, నీతోడి సుస్థిరైక్యముం బొంద గలుగుటకై ఉవ్వెత్తుగ పైపైకి ఎగయనేర్తునుగాక.

* * *

జనవరి 29, 1914

ఓ ప్రేమరసైక దివ్యస్వరూపా, ప్రతి ప్రాణియందును నీవు సన్నిధిచేసి యుండుటంజేసి, ప్రతి మానవుని యందును, అత్యంత క్రూరచిత్తునియందు సైతము, దయాగుణము పొడసూపుటకు వీలున్నది. పరమ దుష్టుడు సైతము అనిచ్ఛా పూర్వకముగనే ఆత్మగౌరవమును, న్యాయమును గౌరవించును. సకల పక్షపాతప్రవృత్తులకు, పూర్వాచార పద్ధతులకు అతీతముగ నీవే, దివ్యము, సుస్వచ్ఛమునైన ప్రత్యేక దీపకాంతితో మమ్ములను, మా సకల కార్యములను ప్రకాశింపజేయుచు, మేము సాధించియున్నదానికి, సాధింపవలసియున్నదానికి భేదమును పొడగట్ట జేయుదువు. పాపప్రకోపము, అంధతమము, అసద్బుద్ధి,— వీనిని దాటరాని యవధిరూపమున నీవు ప్రతిఘటించుచుందువు. సాధింపదగు భావిసంసిద్ధుల గురించి ప్రతి హృదయమునందును ఆశాజ్యోతి నుజ్జ్వలింప జేయునది నీవే.

నాలోని భక్తిభావతీవ్రత యెల్లను నీ కొరకే.

మా భావనలకు అందుబాటులో నున్న కవాటము నీవు; దాని ద్వారా మేము ఊహించనట్టియు, ఊహించలేనట్టియు మహావైభవస్థానములను, క్రమాధికముగ వెల్లడి కాగల వైభవస్థానములను, చేరుకోగలుగుదుము.

* * *

జనవరి 30, 1914

నాలో, నా యెరుకయందుగల సమస్తము నీదే,—— ఇందెట్టి మినహాయింపులును లేవు. ఎరుకలో లేక అట్టడుగు రాతినేల వంటిదైన అవచేతనను కొంచెము కొంచెముగా, నిత్య మంతకంత కధికతరముగా, వశీభూత మొనర్చుకొనుటకు యత్నించెదను.

ప్రేమ రసామృతమూర్తీ, పరమగురూ, మార్గప్రదర్శకుడవై మా జీవితములను నడపువాడవు నీవే. నీలోనే, నీ కొరకే మా మనుగడ; మా చేతనను ఉద్దీపింపజేయుము; దారిచూపి మమ్ములను నడిపించుము; నీ సేవయందే మా శక్తులనెల్ల వినియోగించుచు మేము చేయగలుగునదెల్ల పూర్తిగా చేయున ట్లనుగ్రహింపుము.

* * *

జనవరి 31, 1914

ప్రతి ఉదయమునను మా భావన, ప్రగాఢభక్తితో, నిన్ను అభివ్యక్త మొనర్చి సేవించుటకు మేము చేయగలిగిన ఉత్తమోత్తమ కార్యమేదియో తెలియగోరుచు నీ దెసగా నుద్గమించునుగాక. ప్రతి క్షణమునను మా యెన్నికకొరకై తారసిల్లు నానావిధ కార్యసముదాయమునందు, నీ దివ్యేచ్ఛచే నిర్ణీతమగు కార్యమునే మేము ఎన్నుకొనునట్లును, తద్వారా మా మనుగడకెల్ల నీవే ఏడుగడవుగ నుండునట్లును అనుగ్రహింపుము. ఏలన, స్థూలదృష్టి కీ కార్యములు కేవలము అప్రధానములుగ గన్పట్టినను,—— మా నిర్ణయము ప్రకారము ఏదోఒక విధినిర్ణయమునకే మేము తలయొగ్గవలసియుండును గావున,—— అవి సదా కడు ప్రధానమైనవే యగును. మే మొక నిర్ణయము గైకొను క్షణమున మా చేతనావృత్తి ఏరీతి నుండునో దాని ననుసరించి, మా యెరుకలోనుండు వాస్తవికస్థితుల క్రమప్రకారముగ జరుగు నిర్ణయమునకు మేము విధేయుల మగుట సంభవించుచుండును. దాని పర్యవసానముగనే, మున్నెన్నడు అనుకోనట్టియు, అమంగళమైనట్టియు, జీవితపు సామాన్య ప్రవృత్తికి విరుద్ధమైనట్టియు, ఒక్కొక్కప్పుడు కడు భయంకరములు

గూడ నగు ప్రతిరోధములను గల్పించునట్టియు సందర్భములు తరచుగా నేర్పడి, తరువాత వీటిని చక్కదిద్దుకోవలసిన స్థితి కలుగుచుండును. కావున నో ప్రభూ, ఓ ప్రేమైకమూర్తీ, మేము సదా నిన్నే గుర్తులోనుంచుకొని, ఎప్పుడు ఏ కార్య నిర్ణయము మేము చేయవలసివచ్చినను, నీ పరమ నియతితోనే తాదాత్మ్యము చెందుచు, తద్ద్వారమున నీ యిచ్ఛయే మమ్ము నియమించునట్లుగా ప్రవర్తిల్లుదుము గాక; ఇట్లు మా జీవితము పటిష్ఠముగా, సమగ్రముగా, నీకే సమర్పితమై పోవునుగాక.

నీ వెలుగులోనే మేము చూడనేర్చి, నీ విజ్ఞానముచేతనే విజ్ఞానవంతులమై, నీ యిచ్ఛయందే పరమోపలబ్ధిని పొంద గలుగుదుముగాక.

* * *

ఫిబ్రవరి 1, 1914

ప్రతివస్తువు లోపలను, బయటను, అంతటను నుండునట్టియు, సర్వము నకు సారమయ్యును ఆ సర్వమునకు దూరమందుండునట్టియు, సర్వవస్తువులు కేంద్రీభూతము లయ్యెడి స్థానమైనట్టియు, చేతనాత్మక వ్యక్తులను సృజించు జగత్ స్రష్ట వైనట్టియు నో దేవా! నీ దిశకు నే నభిముఖినై యున్నాను. ఓ సర్వ లోక విమోచకా! నీ దిశ కభిముఖినై నేను నమస్కరించుచున్నాను; నీ దివ్య ప్రేమయం దైక్యముంగొని నే నీ లోకమును గూర్చియు, దానిలోని ప్రాణిజాత మును గూర్చియు మననము చేయుచున్నాను; నీవు పాంచభౌతికద్రవ్యరాశిని గొని నానావిధరూపములుగా సృజించుచు నశింపజేయుచు మరల పునస్సృష్టి యొనర్చు చుండుటను మననము చేయుచున్నాను; గుంపులు గుంపులగు సమవాయములకు ఆకారమిచ్చుచు తదుత్తరక్షణముననే వానిని లయింపజేయుచుండుటను మననము చేయుచున్నాను; బుద్బుదములవలె క్షణికములగుచు, వైవిధ్యమునందు సంతత రూపసాదృశ్యములను బడసి, సమాన వాంఛలను, సమానప్రవణతలను, సమాన తృష్ణలను, పరంపరాగతములగు నజ్ఞానజనిత దోషముల బొందియు చేతనాత్మక మైన శాశ్వత వ్యక్తిత్వము తమకుగలదని తలపోయు జీవకోటిని గూర్చి మననము చేయుచున్నాను.

కాని, అప్పుడప్పుడు, నీ బృహత్తర తేజస్సేదో, ఒక వ్యక్తియందు ప్రకటితమై, యాతనిగుండ ప్రపంచమం దంతటను బ్రసరించుచున్నది. అట్టితరి, కొంత విజ్ఞానము, కొంత జ్ఞానము, కొంత అనాసక్తిపూర్వకమైన భక్తి, శ్రద్ధ, దయాదాక్షిణ్యములు, ధీరోదాత్తత,— ఇవి మానవ హృదయములందు ప్రవేశించి, వారి మనస్సులను రూపాంతర మొందించి, అజ్ఞానాంధతమముచే దుఃఖభాజనము, అప్రశామ్యము నైన విశ్వచక్రమునకు బద్ధమైయుండు మానవసత్తయందలి కొన్ని యంశములను మాత్రము ముక్తము గావించుచున్నవి.

మిథ్యారూపమైన నాగరికతలకు బ్రమసి, నగరవాస నిరతులై మతిభ్రమణ మందు లీనమైయుండు జనుల లేవనెత్తుటకు, ఇంతకుబూర్వ ముపలబ్ధమైన ప్రకాశముకంటె అధికతర ప్రకాశము, అధికతర, అద్భుత జ్ఞానవైభవము ఎంతగా కావలపియుండునో! ఈ జనులు స్వార్థపూర్వకములు, క్షుద్రములు, వివేక శూన్యములు నగు తమ విషయ భోగసంతృప్తుల నిమిత్తముగా తీవ్రసంఘర్షణాసక్తచిత్తులగుచున్నారు. వీరి జీవితము వెనుక మృత్యుదేవత తాండవ మాడుచున్నది. వీరిని ఈ సుడిలోనుండి బయటికి లాగి, నీ శాంతి కున్ముఖుల నొనర్చి జయశీలుర గావించుటకు ఎంతటి దివ్యదయాపూర్వక మధుర మహనీయశౌర్యము గావలపియుండునో!

ఓ ప్రభూ, సనాతనా, మాకు జ్ఞానతేజము ప్రసాదింపుము; మా ప్రవర్తనము సన్మార్గమున నడుపుము; నీ ధర్మోపలబ్ధిని పొందుటకును, నీ కార్యమును నెరవేర్చుటకును మాకు మార్గమును చూపుము.

ఓ యీశ్వరా, నిశ్చల నీరవతతో నిన్నుపాసించుచున్నాను; భక్తిపూర్వక ఏకాగ్రతతో నీ రహస్యబోధల నాలకించుచున్నాను.

ఫిబ్రవరి 2, 1914

ఓ ప్రభూ, ప్రతి యేకాంతస్థితిని పూరణమొనర్చుచు, ప్రతి దుఃఖార్తిని ఉపశమింపజేయగల ఉజ్జ్వలప్రేమ స్వరూపమును నేను పొందగోరుచున్నాను.

ఓ ప్రభూ, ఎల్లరి దుఃఖమును దహించివేయుచు, అద్దానిని ప్రమోదజ్యోతిగా మార్చివైచి, ఎల్లరి హృదయములలోనికి తన కిరణజాలమును గ్రుమ్మరించగల ప్రదీప్తజ్వాలగా నన్ను రూపొందించుము : ఇదియే నా సంప్రార్థనము.

నా ప్రార్థన చెల్లింపుము; విశుద్ధప్రేమను, నిరవధిక కారుణ్యమును పూరించుకొన్న జ్వాలారూపిణిగ నన్ను రూపాంతర మొందింపుము.

* * *

ఫిబ్రవరి 5, 1914

ఒకే రూపముతో నున్న అదే యాకాంక్ష,— ఇంతకన్న చెప్పెడిదేమున్నది ?

నిన్నుగురించిన మా పరిష్ఠభావనకు విశుద్ధాభివ్యక్తి రూపమై వరలు దివ్యప్రేమనియతి ఈ జగత్తున అధికాధికముగా తనను ఆవిష్కరించుకొనుచు, అజ్ఞానభూయిష్ఠమగు నహంకార ప్రవృత్తియంతటి పైనను విజయము సాధింపవలసియున్నది. మే మందరము గూడ అధికాధికముగ ఆ ప్రేమజ్యోతి రూపమగు శక్తికే భక్తివిశ్వాసములుగల సేవకులమై రూపొంది, దానియందే, దాని కొరకే మనుగడ సాగింపవలసియున్నది. మాలో దీపించవలసినది, క్రియాత్మకముగ ప్రవర్తిల్లవలసినది అదియే.

ఓ ప్రభూ, మా జీవితములకెల్ల అధినాథుడవై, నిన్ను పొడగని నిత్యము అనుసంధానము చేయనీకుండ ఇప్పటికిని మాకు అడ్డురాగల అజ్ఞానాంధకారమునెల్ల పారద్రోలుము.

అజ్ఞానమునుండి మమ్ముల విముక్తుల గావింపుము; నీ దివ్యాభివ్యక్తి ద్వారములను మేము పూర్తిగా తెరచివేయగలుగునట్లుగ, మాలోని వేరువృత్తు లన్నిటి నుండియు మాకు విముక్తి కలిగించుము.

*　　　*　　　*

ఫిబ్రవరి 7, 1914

నీతో సమగ్రముగ ఏకత్వము పొంది, ఆ కారణముగ ఆయా నిర్దిష్టసందర్భములందు ఏది కార్యరూపమున నిన్ను నిర్దుష్టముగ అభివ్యక్త మొనర్చునో అనవరతము తెలిసికొనియుండువానికి, ఏ బాహ్యనియతితోను పనిలేదు. (బాహ్యమైన) జీవితనియతు లన్నియు మొత్తముమీద, నిన్నింకను తెలియవేరనివారి అజ్ఞానమును వీలయినంతలో తగ్గింప నుద్దిష్టమైన తాత్కాలికోపాయములు మాత్రమే. నీతో సంస్పర్శను ఎడనెడమాత్రమే పొందగలుగుచు, ఇతర వేళల అజ్ఞానముతో వ్యవహరించువారికి గూడ కొంతవర కవి ఉపయోగపడుచుండును.

ఏవో నియతులను తా నేర్పరచుకొని, వీలైనంతలో వాటిని సామాన్య నియతులుగ విస్తరింపజేయుట మంచిదే కాని, దానికొక ముఖ్య నిబంధన పాటించవలసియున్నది : నీతోడి ఏకత్వానుసంధానపు సంపూర్ణ సహజజ్ఞానదీప్తి లోపించినపుడు మాత్రమే ఉపయోగించవలసిన కృత్రకదీపము లివియని గుర్తించుట అత్యంతావశ్యకము. అంతియగాక, ఈ నియతులను నిరంతరము పునఃపర్యవేక్షణ చేయుచుండుటయు నవసరమే. ఏలన, వానిని రూపొందించిన జ్ఞానము వర్తమాన కాలీనము; ఈ జ్ఞానము వర్ధిల్లి వికాసము పొందునపుడెల్ల, దాని ననుసరించి యీ నియతులును పునస్సంస్కారము పొందవలసియుండును.

అందుచేతనే, మా దరిజేరువారి కెల్లరకును, ఎట్టి హానియు కలిగించకుండుటేగాక, వీలయినంతలో ఉత్తమోత్తమశ్రేయస్సు వారి కొనగూర్ప యత్నించుటకు,— అనగా నిన్ను తమలో కనుగొనుటయందు పరమోపస్థితి వారికి కలుగుటలో ఎంతేనియు తోడ్పడుటకు,— వారియెడ ఎట్టి దృష్టియుంచుటుచితమో ధ్యానమున భావించి చూచినప్పుడు, ఏ నియతికిని నీ నియతితో పొందుపడ జాలి

నంత విరివిగాని మెత్తందనముగాని లేదని నాకు తోచినది. అనంతమైన సన్నివేశ వైవిధ్యమునకు ఏ పరిష్కారమైనను చక్కగా పొందుపడవలెననిన, నీతో ఏకత్వానుసంధానమున నుండుటొక్కటే అందులకు సరియైన మార్గము.

* * *

ఫిబ్రవరి 8, 1914

ప్రేమరసైకమూర్తివైన ఓ ప్రభూ, మాకు దుఃఖవిమోచనము కల్పించి, నీ శాంతియందు మమ్ము నిమగ్నుల జేయగల జ్ఞానోదయము మాలో కలుగు నిమిత్తమై, అజ్ఞానాంధకారములోనుండి మమ్ములను నీవు బయటపడ జేయుచుందువు. ప్రతి ఉదయమున, భక్తిపురస్సరముగా నా యాకాంక్ష నీదెస కుద్గమింపగా, నా సత్తయెల్ల సమగ్రముగ నీ జ్ఞానప్రబోధము పొంది, నీలోనే, నీ వలననే, నీ కొరకే జీవించుగాక యని ప్రార్థించుచున్నాను; అధికాధికముగ నీతోనే పూర్ణైక్యము చెందుచు, వాక్కునందును, కర్మయందును నేను కేవలము నీ యభివ్యక్తిరూపమే కాగలందులకై ప్రార్థించుచున్నాను; మా దరిజేరువారెల్ల, మాతో సంబంధముగల వారెల్ల నీ దివ్యసాన్నిధ్యమును, నీ నియతి ప్రాభవమును సంపూర్ణముగ గుర్తెరుగ నేర్చి, తన్మూలమున, ఎట్టి ఆత్మప్రతిరోధమును లేని అసందిగ్ధమైన రూపాంతర ప్రాప్తి చెందగలందులకై ప్రార్థించుచున్నాను; పుడమియందలి మానవులెల్లరు, తామెంతటి విపరీతదుఃఖములోనున్నను, నీ దివ్యజ్ఞాన, దివ్యప్రేమలవలన పరమోపశమనము గాంచి నీ పరమశాంతియందఖండ విశ్రాంతి పొందగలందులకై ప్రార్థించుచున్నాను; సకల పదార్థము ప్రాభవోపేతములైన నీ శక్తివిశేషములచే అంతకంతకు హెచ్చుగా భేదింపబడుచున్నదై, అంతకంతకు తగ్గుగా నీకు తన తమఃప్రతిరోధమును కల్పింపకుండుటను నేర్చికొని, సకల తమస్సుపైనను విజయము సాధింపగలందులకై ప్రార్థించుచున్నాను. దుఃఖభాజనము, బాధాసంకులమునైన యీ ప్రపంచమును నీవు అసందిగ్ధముగను, సమగ్రముగను శాంతి సామరస్యములకు నెలవైన ప్రపంచముగా రూపాంతరము చెందింతువుగాక.

ప్రపంచమున నీ నియతియే నెరవేరి విజయవంత మగునుగాక.

* * *

ఫిబ్రవరి 9, 1914

ఓ ప్రభూ, ఏ పేరులు నీకు పెట్టినను, మానవులలో శ్రేష్ఠులగువారు పరమోపలబ్ధి కొరకే తృష్ణగొని నిన్నే నిండుభక్తితో అన్వేషించుచుందురు. నీకు కడు దూరమైపోవుచున్నట్లు కనుపడువారుగూడ, కేవలము స్వార్థమునందే నిమగ్నులైయున్నట్లు కనిపించువారుగూడ, అన్వేషించునది విషయభోగమందు, విషయభోగ సంతృప్తియందు పరమోపలబ్ధినే గాదా ? ఈ విషయభోగ సంతృప్తి ఎంత వ్యర్థమైనదైనను, దాని యన్వేషణముగూడ ఒకనాటికి నీ సమీపమునకే చేర్చగలదు గదా. ప్రతి వస్తుహృదయములో,— నట్టనడి కేంద్రములో నుండునది నీవే. నీవలన తీవ్రాకాంక్షారూపముగ పరివర్తన మొందగోరని పరమాహంకార స్వభావముల నట్టనడి కేంద్రమందు సైతము, ప్రతి వస్తుహృదయమునందును నెలకొని యున్నవాడవు నీవే. భయపడవలసినది, త్రోసిపుచ్చవలసినది ఒకటి మాత్రమే,— అంధతమముతో కూడిన అజ్ఞానపు నిశ్చేతనపు జడస్థితి. ఈ స్థితి నిన్ను చేరుట కేర్పడియున్న అంతులేని నిచ్చెనకు అట్టడుగున నున్నది. ఈ ప్రప్రథమ తమోమయస్థితినుండి పదార్థము నుద్ధరించి చైతన్యరూపమున వికసింపజేయుటే నీ చేయు ప్రయత్నమంతయును. నిశ్చేతనస్థితికంటె భావోద్వేగస్థితి ఎంతేని అపేక్షింపదగినది. కావున, నిశ్చేతన రూపమై పరివ్యాప్తమైయున్న యీ అట్టడుగు స్థితి నతిక్రమింప నిరంతరప్రయత్న మొనర్చుటే మేము చేయవలసిన పని. ఇందులకు మా సత్తాస్థితి నెల్ల ఉపకరణముగా జేకొని, నెమ్మది నెమ్మదిగా అద్దానిని ప్రకాశవంతమైన చైతన్యస్థితిలోనికి పరివర్తింప జేసికోవలసియున్నది.

ఓ ప్రభూ, ప్రేమరసామృతమూర్తీ, సకల వస్తువులందును సచేతనుడవై నీవే కావవచ్చుచున్నావు. నిరవధిక భక్తిభావమున నీకిదే ప్రణమిల్లుచున్నాను.

* * *

ఫిబ్రవరి 10, 1914

ఓ ప్రభూ, హృదయమున శాంతి, బుద్ధియందు వెలుగు మాలో దీపించు చుండ. నీ సాన్నిధ్యమునే మాయందు పొడగాంచుచు, నీవు ఘటింపజేయగల ఘటనలకొరకు నిశ్చలభావమున నిరీక్షించుచున్నాము. మా సత్తయందు వెలు గొందుచున్నది నీ పథమే. సకల సన్నివేశములందును నీ యాదేశమునే లోక మున చాటుచు, నీ కార్యమును నెరవేర్చు సేవకులమై వర్తింపగలుగుదుముగాక యని ఆశించుచున్నాము.

ఇదే నీకు మా సుదృఢ, సునిర్మల భక్తిపూర్వక ప్రణామము. మా సకల సత్తకును మూలస్వరూప మైనవాడవు నీవే.

* * *

ఫిబ్రవరి 11, 1914

జీవితమున నెప్పుడేమి జరుగునో యనెడి ఆలోచనల విరమించి, నీ దివ్య చేతనతో మా చేతనకు ఏకత్వము ఘటింపజేసి పరమజ్ఞానముగా వర్ణింపదగిన అట్టి అనుభూతిలోనికి మేము ప్రవేశించుటతోడనే, మే మేమిచేయవలెను, ఏమి చేయ రాదనిగాని, ఎట్టి నిర్ణయములు గైకొనవలెననిగాని,— ఈ సమస్యలన్నియు ఎంతేని సుగమములుగా, కొంతవరకు పసితనపు అజ్ఞానమునకు సంబంధించినవిగా, కన్పట్టునుగదా!

నెరవేరవలసియున్న సత్యధర్మ కార్యదృష్టితో చూచినచో, నిన్ను గురిం చిన యెరుక గలిగి, నీతో ఏకత్వము భజించి, నిరంతర మా ఏకత్వభావనయం దుండుటొక్కటే అత్యంత ముఖ్యమైన విషయము. కాని, ఈ భౌతిక శరీరము నెట్లు వినియోగించుట ఉత్తమము, ఎట్టీ పుడమియందు నీవు అభివ్యక్త మగుదువు, అను విషయప్రసక్తియందు, నీవే మాయందు జాగరితుడ వగుదువేని, ఈ శరీర మే పనిని కడు పటిష్ఠముగా చేయగలదు, ఏ కార్యముచే దీని శక్తులు అత్యంత

సమగ్రముగా వినియోగమగును, అని విచారించుకొని అసందిగ్ధముగ తెలియనేర్చి నచో చాలును.

అట్టి సన్నివేశమందు, ఈ కార్యమెట్టిదైనను, ఈ శారీరికశక్తుల వినియోగ మెట్టిదైనను, దీనికి ఎట్టి విశేషప్రాధాన్యమును ఇవ్వకయే, బాహ్యచేతనకు కడు సాహసోపేతములు, ప్రమాదభరితములుగ గూడ దోచు నా నిర్ణయములను, ఏ కష్టమును లేకయే, ఏ అంతర్మథనముతోను పనిలేకయే, చేపట్టి మేము నిర్వహింపనేర్తుము.

నీ సత్యధర్మస్వరూపపు మహోన్నతస్థాయినుండి విషయములను తిలకింప నేర్చువానికి అంతయును ఎంతేని సులభముగదా !

సంతోషము, విశ్వాసము పెనగొన్న భక్తితో, ఓ ప్రభూ, నీకు ప్రణమిల్లు చున్నాను. నీ దివ్యప్రేమ వర్షించెడి శాంతిని సకల జీవులును అనుభవింతురుగాక.

* * *

ఫిబ్రవరి 12, 1914

ఓ ప్రభూ, నీ పరమచేతనానుభూతియందు మేము నెలకొన్నప్పుడు, ఐహిక విషయముల సంగతి సందర్భములను గురించి మేమిట్లు తలంతుము : "ప్రత్యే కించి ఏపనికిని విశేషప్రాధాన్యము లేదు; అయినను, ఆయా కర్మాచరణ పద్ధతి ఆయా ప్రవృత్తి విశేషమునకు ఉత్తమోత్తమ వినియోగరూపమై యొప్పారు చుండును. సకల కర్మలు, అవి ఎట్టివైనను, ఎంత పరస్పర విరుద్ధములుగ గన్పట్టునవైనను, నీ సత్యధర్మనియతిచే పూరింపబడియున్నంత మేరకు, ఆ నియ తిని అభివ్యక్త మొనర్చునదియే కానేర్చును. ఆ నియతి, సామాన్యమానవ చేతనకు సంబంధించిన సూత్రములలోనికిని, నిబంధనలలోనికిని మార్పుచేయ వీలిచ్చునది కాదు. అది యొకానొక నిరంతర సామాన్యచేతనాదృష్టికి నిసర్గమై యొప్పారెడు నియతి; అది ఆచరించబడునదియే గాని సూత్రముల రూపమున వ్యక్తీకరించబడునది గాదు."

కాని, ఆ పరమచేతనానుభూతినుండి మేము మామూలు చేతనలోనికి మరల చ్యుతులమగుట సంభవించినపుడు, దేనినిగాని అలతిగా, ఉదాసీన భావముతో చూచుటకు వీలులేదు. అత్యల్పసందర్భములు, అత్యల్ప కార్యములు సైతము విశేషప్రాధాన్యము కలవియై, విశేషశ్రద్ధతో పరిగణింపబడవలసినవే యగును. ఏలన, అప్పుడు మేము ప్రతిక్షణమునను, సత్యచేతనతో మా చేతనా తాదాత్మ్యమునకు తోడ్పడగలుగు కార్యమునే చేయుటకు ప్రయత్నించుచు, ఇట్టి తాదాత్మ్యమునకు ప్రతిబంధకమగుదానినెల్ల కడు జాగరూకతతో పరిహరించుచుండవలెను. అట్టి సందర్భములో, వైయక్తికముగా సంపూర్ణ అనాసక్తి మూలకమై విలసిల్లు కర్మాచరణ నిబంధలకు ఎంతేనియు విలువనీయవలసి యుండును.

హృదయమున శాంతి, బుద్ధియందు దీప్తి, నా సత్తయందెల్ల సునిశ్చయపూర్వకమైన ఆశాభావము నిండారగా, దివ్యప్రేమామృతమూర్తి వగు నో ప్రభూ, నీ కిదే ప్రణమిల్లుచున్నాను.

మా ఉనికికి మూలకారణము, మా పరమగమ్యము నీవే.

* * *

ఫిబ్రవరి 13, 1914

ఓ జీవితేశ్వరా, దివ్యప్రేమాధిదైవమా. నీ సత్యధర్మమునే సుస్పష్టముగ దర్శింపనేర్చి, దానియందే, దానికొరకే మేము జీవింపగలుగుటకై, ప్రగాఢమైన ఏకాగ్రతయందలి నిశ్చల నీరవతలో, నీ పరాచేతనతో నా చేతనను ఏకమొనర్చి నీతోడి సంపూర్ణతాదాత్మ్యమున నుండుటకే నా ప్రయత్నము.

నా మనోభావన నీ వైపుగా నుద్గమించి నీతో ఏకత్వము భజింపనేర్చినప్పుడు, ఆ శుభఘడియల అనుభూతి, ఆహా, ఎంత సుందరము, ఎంత సరళము, ఎంత ఉదాత్తము, ఎంత ప్రశాంత నిశ్చలము! పరమమైన యీ యోగదృష్టియందు నిరంతరముగా ఏనాడు మేము నిలువనేర్తుమో, నాటినుండి, ఎట్టి యవరోధములు, ఎట్టి సంకోచములు లేకుండ, ఆకాశగమన మొనర్చుచుండియు తడబాటు లేని

యడుగులతో ముందుకు సాగిపోగల్గుదుము గదా. నీ సత్యధర్మమును గుర్తెరుగ నేర్చిన ఉత్తరక్షణమునుండియు సకల సంశయములు, సకల సంకోచములు తొలగి పోవునని అనుభవపూర్వకముగ నే నెరుంగుదును. మా శరీర ప్రవృత్తి అంతయు కేవలము సాపేక్షికమని మేము గుర్తింపనేర్తుమేని, మా కర్మ ప్రవృత్తికి సాధన మైన యీ శరీరమునకు బొత్తుగా సంబంధించని కర్మ యేదియో మేము సుస్పష్ట ముగా, నిష్కృష్టముగా, తెలియనేర్తుము. సకలావరోధములును అంతట ఇంద్ర జాలముచే అంతర్ధానమైనట్లుగ, పనను యథార్థముగ, అంతర్ధానమైపోవును. అటు పైన నో ప్రభూ, మా ప్రయత్నము లన్నియు, నిరంతర మధికాధికముగా, ఈ యద్భుతానుభవస్థితిని భుక్తమొనర్చుకొనుటకే ప్రవర్తమానము లగును.

నీ సత్తాస్ఫూర్తిలోని శాంతి ఎల్లరి హృదయములలో ప్రబుద్ధమగునుగాక.

* * *

ఫిబ్రవరి 14, 1914

సర్వప్రపంచమునకును శాంతి గలుగుగాక !

సామాన్యమగు దైహికదృష్టినుండి ఎల్లరును బయటపడి, ఐహికవిషయ వాంఛాసంగమునుండి విముక్తు లయ్యెదరుగాక; ఎల్లరును నీ దివ్యసాన్నిధ్యమును గుర్తించిన విజ్ఞానమున ప్రబుద్ధులై, నీ పరాచేతనతో నైక్యముంగాంచి దాన నుద్భ విల్లు శాంతిసమృద్ధిని చవిగొందురుగాక.

ప్రభూ, మా యెల్లసత్తకును అధినాథుడవు నీవు. నీ నియమమే మా నియమము. ప్రతి వస్తువునందును, ప్రతి క్షణమునను, నీ మహత్తర కార్య మును మేము నిర్వహించగలుగుటకై నీ నిత్యచేతనతో మా చేతనకు తాదాత్మ్యము ఘటింపజేయుటలో మా యావచ్ఛక్తిని వినియోగింప నుత్సహించుచున్నాము.

ప్రభూ, జీవితమున సంభవించు ఆకస్మిక సంఘటనల గూరించిన చింతన

నుండియు, సామాన్య వ్యావహారిక దృష్టినుండియు మమ్ముల గాపాడుము. ఇకపై మేము నీ దృష్టితోనే చూచునటులను, నీ యిచ్ఛవలననే ప్రవర్తించునటులను అనుగ్రహింపుము. నీ దివ్యప్రేమజ్యోతిని వెలిగించు దీపశిఖలనుగా మమ్ము మార్చివేయుము.

ఓ ప్రభూ, నీ నియమమును నిర్వహించుటకై పూజ్యభావముతో, భక్తిభావముతో, నా సత్తనంతయు సంతోషమున నీకు నివేదించుచు, నీకే ఆత్మార్పణ మొనర్చుకొనుచున్నాను.

అఖిల ప్రపంచమునకును శాంతి కలుగుగాక. శాంతి కలుగుగాక.

*　　*　　*

ఫిబ్రవరి 15, 1914

ఓ అద్వయ సత్యస్వరూపమా, నీవు మాలోని వెలుగుకు వెలుగు, ప్రాణమునకు ప్రాణము నైనవాడవు; పరమ కారుణ్యనిధివి; జగద్రక్షకుడవు. నీ సంతత సాన్నిధ్యమునకు అధికాధికముగా ప్రబుద్ధురాల నగునట్లు నన్ననుగ్రహింపుము. నా కార్యము లన్నియు నీ నియతిని అనువర్తించుగాక; నీ యిచ్ఛకును, నా యిచ్ఛకును భేద మొకింతయు లేకుండునుగాక. నా చిత్తము నావరించియుండు భ్రమాత్మక జ్ఞానమునుండియు, ఊహాకల్పనా ప్రపంచమునుండియు నన్నుద్ధరింపుము. పరబ్రహ్మ చైతన్యముతో నా చేతన కైక్యము ఘటింపనేర్తునుగాక. ఏలన, ఆ చైతన్యము కేవలము నీవే.

గమ్యమును బొందుటకు నాకు దృఢసంకల్ప మొసంగుము; నా యందలి మాంద్యమును, ఆలస్యమును విదల్చుటకు గావలసిన దృఢచిత్తమును, శక్తిని, ధైర్యమును నాకు ప్రసాదింపుము.

నీ నిత్య సన్నిధిని నాలో స్ఫురింపజేయునట్టియు, నన్నుద్ధరించుటలో నీ చేయు ప్రయత్నము పటిష్ఠమై కొనసాగజేయునట్టియు, సకల దుస్సంకల్పములను,

అజ్ఞానప్రవృత్తులను సదా జయింపజాలినట్టియు పూర్ణమైన అనాసక్తిపూర్వక శాంతిని నాకు ప్రసాదింపుము.

నా ఉనికి యంతయు నీతోడి తాదాత్మ్యమును బొందునట్లనుగ్రహింపుము. నీతోడి యనన్యత్వముచే బూర్తిగ వెలిగించబడిన ప్రేమజ్యోతిగా నన్నొనర్పుము. నే నపేక్షించునదంతయు నింతే, ఇంతకు మించి నే నేమియు గోరను. ఇది నా కనుగ్రహింప వేడుకొనుచున్నాను.

* * *

ఫిబ్రవరి 16, 1914

ఓ ప్రభూ, నీవు అద్వయ సత్యస్వరూపుడవు, పరమజ్ఞాన స్వరూపుడవు, నిత్యము ఏకమై యుండువాడవు, విశుద్ధ దివ్యతేజోనిధానమవు. కేవలము నీ యెరుకయే నాలో దీపించవలెను, నేను కేవలము నీవే అయిపోవలెను. ఈ యాకాంక్షయే నాలో తీవ్రతమమై యుప్పొంగుచున్నది. అవాస్తవిక వ్యక్తిత్వముల ఎడతెగని సుడిగుండముం బోలిన యీ నానాత్వము, ఈ సంకీర్ణస్థితి, విరుద్ధ భావ సంఘర్షణలతోడను, సంస్కార ప్రకోపములతోడను, కామ సంక్షోభములతోడను కూడిన యీ విపరీతమైన గజిబిజి, గందరగోళము,—— ఇదియెల్ల నాకు అంత కంతకు కడు శోచనీయమై కన్పట్టుచున్నది. ఈ కల్లోల కడలినుండి మేము బయటపడి, నీ మహనీయ ప్రశాంతి తీరమును చేరుకోవలసియున్నది. అలుపులేని యాతగాని శక్తిని నాకు ప్రసాదింపుము. నిన్ను నేను గెలుచుకొనియెదను,—— అందుల కెట్టి యత్నములు నేను చేయవలసివచ్చినను సరే.... ఓ ప్రభూ, అజ్ఞానము పటాపంచలు గావలెను; భ్రమలు చెల్లాచెదరై పోవలెను; దుఃఖావిలమైన యీ లోకము భయంకరమైన యీ పీడకలనుండి బయటపడి, నీవు దక్క వేరొం డేదియు లేదనెడి యెరుకలోనికి మెలకువ గాంచుగాక.

ఓ అక్షరశాంతి స్వరూపమా, అజ్ఞానమునుండి విముక్తిని మానవులకు

ప్రసాదింపుము; విశుద్ధమైన నీ సంపూర్ణ దివ్యతేజః ప్రాభవమే సర్వత్ర రాజ్యమేలునుగాక.

*    *    *

ఫిబ్రివరి 17, 1914

ఓ పరమేశ్వరా, అత్యంత తీవ్రతతో నా యాకాంక్ష నీ దెసగా ఉద్గమించుచున్నది: నీ నిర్ణయమే మా నిర్ణయమై, నీ సేవకే మా జీవితము పూర్తిగా అంకితమగుచు, నీ యంతఃప్రేరణానుసారముగనే యకలంకముగ మేము ప్రవర్తిల్ల గలుగుటకై, నీ సత్యధర్మనియతిని గురించిన సంపూర్ణజ్ఞానమును మాకు ప్రసాదింపుము.

ఓ ప్రభూ, మా యంధ తమము నెల్ల పటాపంచలు గావింపుము; నీ దివ్య జ్ఞానముచే గలుగు ప్రశాంత సునిశ్చయస్థితి ఎల్లరకు గలుగున ట్లనుగ్రహింపుము.

*    *    *

ఫిబ్రివరి 19, 1914

ఓ ప్రభూ, నా భావనయందు సదా నీవు సన్నిధి చేయుము. నేను కోరితి నని గాక, నీ సన్నిధి నిరంతరముగా, అమోఘముగా, ఉండనే యున్నదని నాకు తెలియును. మేము ఏది చూచినను, ఏది చూడకున్నను, అంతయు నీ దివ్యప్రేమ విధానపు అద్భుతచర్యా ఫలితమే యని నే నెరుంగుదును. అయినను, మరపు, ప్రాలుమాలిక నాలో పొడసూపకుండుటకై, నా భావమున సన్నిధి చేయుమని నిన్ను మరిమరి వేడుకొనుచున్నాను.

సమస్తమును రూపాంతరము చెందించి దీప్తిమంత మొనర్చుటకై, ఎల్లరియందును శాంతి సమాశ్వాస సంతృప్తుల నుత్పాదింపజేయుటకై, సాక్షాత్తుగ నేను నీ ప్రేమస్వరూపమే యగుదును గాక.

దివ్యదృష్టిగల నీ విశుద్ధ దివ్యప్రేమ స్వరూపమే నే నగుదునుగాక. సర్వత్ర, సర్వదా, అదియే నా స్వరూప మగునుగాక.

* * *

ఫిబ్రవరి 20, 1914

నీతో అధికాధికముగా తాదాత్మ్యము చెందుటకును, నీ పరమచైతన్యముతో మా చైతన్యము నేక మొనర్చుటకును, నీ ప్రేమ సంకల్పరూపమగు సర్వస్వతంత్ర నియతిని ప్రశాంతముగా, అనాసక్తముగా, స్థిరతతో, దృఢత్వముతో అనువర్తించు సేవకులమై నిలపిల్లుటకును దీక్ష బూనుట,— ఇది యొక్కటే గణుతింప దగిన ముఖ్య విషయము.

ఓ ప్రభూ, నీ సన్నిధిని పటిష్ఠమొనర్చునట్టియు, నీవు కల్పించుకొను జోక్యమును సఫల మొనర్పగలట్టియు, సకల దుస్సంకల్పములపైనను, తమః ప్రవృత్తులపైనను విజయము సాధించునట్టియు, సంపూర్ణమైన అనాసక్తికి తావలమైనట్టియు శాంతిని నాకు అనుగ్రహింపుము.

ఓ ప్రభూ, నేను నిర్వహించవలసిన మహనీయ కార్యమునకు వలయు యోగ్యత నా కలవడునట్లు అనుగ్రహింపవలసినదిగ ప్రార్థించుచున్నాను. తెలిసిగాని, తెలియకగాని, నాలో ఏ అంశమూ, ఈ నీ పవిత్రకార్య నిర్వాహణమున ప్రాలుమాలిక వహించి నిన్ను వంచింపరాదు.

నిశ్చల, నీరవ, భక్తిపురస్సరముగ నీ కిదే నా ప్రణామము.

* * *

ఫిబ్రివరి 21, 1914

ప్రతి దినము, ప్రతి క్షణము కూడ, క్రొంగ్రొత్తగా, మరింత సమగ్రభావముతో నీకు మేము ఆత్మనివేదన మొనర్చుకొనెడి సదవకాశమే యగునుగాక. ఆ నివేదనము, మితిమీరిన సంరంభముతోడను, కార్యవిభ్రమాటోపముతోడను, ఉత్సాహ భయోద్వేగములతోడను చేయునది కారాదు. ప్రగాఢము, ప్రశాంతము, నిరాడంబరము నగుచు అయ్యది ప్రతి కార్యములోనికిని చొచ్చి అద్దానిని రూపాంతరము చెందింపగలిగి యుండవలెను. శాంతిని పూరించుకొన్న యేకాంతస్థితిలో మా మనస్సు సదా నీయందే విశ్రాంతి నొందవలెను. విశుద్ధమైన యీ మహోన్నతస్థాయినుండి అది తిలకించునపుడు, అస్థిరములై పట్టునకు చిక్కకుండు దృశ్యముల వెనుక దాగియున్న వస్తుస్థితులతోపాటు అద్వయమైన సత్యవస్తువును సైతము అయ్యది దర్శింపగలిగి యుండవలెను.

ఓ ప్రభూ, నా హృదయ మిప్పుడు, ఏ ఆవేదనలు, ఆందోళనలు లేక నిర్మలమై, దృఢమై, ప్రశాంతమై యున్నది. అంతటను నిన్నే దర్శించుచున్నది. బాహ్యసందర్భము లెట్టివైనను, భవిష్యత్సన్నివేశము లెట్టివి మాకు సంప్రాప్తములు కానున్నను, ఉన్నది నీవే యనియు, నీవే నీ అక్షర సత్యస్వరూపమున నిలిచియున్నావనియు, నీయందే మేము నివసించుచున్నామనియు నే నెరుంగుదును.

పుడమియందంతటను శాంతి విలసిల్లునుగాక.

* * *

ఫిబ్రవరి 22, 1914

నా బాల్యమున,— సుమారు పదమూడేండ్ల వయస్సులో,— దాదాపొక సంవత్సరకాలముపాటు,— ప్రతి రాత్రి ప్రక్కపైన శయనించగనే, నేను నా శరీరమునుండి వెలికి వచ్చి, సరాసరిగ ఇంటిపైకిని, పిమ్మట పట్టణమంతటిపైకిని, చాల ఎత్తునకు లేచినట్లును, అప్పుడు నేను నాకంటె పొడవైన ఒక అద్భుతమైన యంగీని ధరించియున్నట్లును నాకు దోచుచుండెడిది. నేను పైకి లేచినకొలది, ఆ యంగీకూడ పొడవగుచు, నా చుట్టును వలయాకారముగ విస్తరిల్లి, పట్టణముపై అతి విస్తారమైన కప్పువలె నేర్పడుచుండెను. అంతట, అన్నివైపులనుండియు నెందరో పురుషులు, స్త్రీలు, పిల్లలు,— వృద్ధులు, రోగార్తులు, దుఃఖితులు,— నా చెంతకు వచ్చి, విస్తరిల్లిన యా అంగీచుట్టును గుమిగూడి, తమ కష్టములు, దుఃఖములు, బాధలు చెప్పుకొనుచు నన్ను సహాయ మర్థించుచుండిరి. వారి ప్రార్థన నాలకించినట్లుగ ఆ యంగీ సచేతనముగ కదలాడి, ప్రతియొక్కరి వద్దకు విస్తరిల్లుచుండెను. దానిని వారు స్పృశించినతోడనే, వారికి దుఃఖోపశమనమై, వ్యాధులు నయమై, తిరిగి వారు తమ తమ శరీరములలోనికి ప్రవేశించుచుండిరి. శరీరములనుండి బయటకి వచ్చుటకు ముందుకంటె ఎక్కువగ వారు సంతోషమును, బలమును పొందుచుండిరి. ఈ దృశ్యమంతయు కడు సుందరమై తోచి నా కెంతయో సంతోషము గూర్చుచుండెను. దీని ముందర, దినము నందలి ఇతర కార్యము లన్నియు వట్టి జడములుగా, నిస్సారములుగా, అవాస్తవికములుగా దోచి, ఈ రాత్రివేళ నడచు కార్యక్రమమే నిక్కమైన జీవితముగ నాకు గన్పట్టుచుండెను. తరచుగా నేనిట్లు శరీరమునుండి పైకి లేచినప్పుడు, నా యెడమ ప్రక్కన నొక వృద్ధుడు, మౌనముగా, నిశ్చలముగా, కృపాదృష్టితో నన్ను తిలకించుచు తన సాన్నిధ్యముచే నాకు ప్రోత్సాహము కల్పించుచుండెను. మెరపులేని ఊదారంగు అంగీ ధరించిన యీ వృద్ధుడు 'కరుణరసావతారుడు'గ ప్రఖ్యాతిగన్న మహనీయుని మూర్తివిశేషమే యని నేను తరువాత తెలిసికొంటిని.

పగటివేళ పెక్కుసమయములలోను, రాత్రియందును, నేను,— అనగా నా చేతన,— నా హృదయస్థానమున సంపూర్ణముగా ఏకాగ్రతను చెందియున్న ట్లొక విశిష్టానుభూతి నాకు కలుగుచున్నది. ఈ హృదయ మీ స్థితియం దొక

అవయవ విశేషము గాదు; భావనా విశేషమును గాదు; వైయక్తికస్థితి నధిగమించి నిత్యమై విలసిల్లు కేవల దివ్యప్రేమయే. ఇట్టి ప్రేమ స్వరూపము నేనైన కారణమున, జగత్తులోని ప్రతి వస్తుగర్భమందును నే నున్నట్లు అనుభవము పొందు చున్నాను. అంతేగాక, అనంతముగా నా చేతులు సాచి, నిరవధిక వాత్సల్యముతో సకల జీవులను కౌగిలించుకొని, జగత్తుకంటె విశాలతరమైన నా వక్షఃస్థలమునకు హత్తుకొనుచున్నట్లు సైతము నా కనుభూత మగుచున్నది. ఓ పరమేశ్వరా, వాక్కులు బొత్తుగా శక్తి చాలనివి, మనస్సు చేయు అనువాదము లెప్పుడును బాలచేష్టలే..... కాని, నీ కొరకై నా యాకాంక్ష మాత్రము ఎడతెరపి లేక అర్రులు సాచుచునే యున్నది. నిజమున కది నీ రూపమే, నీవే,— నీవే యీ శరీరమున, నీ యభివ్యక్తి కుపచరించవలసియున్న యీ అసమగ్రోపకరణమున నివసించు చున్నావు.

సకల జీవులు నీ జ్ఞానదీప్తిచే నగు శాంతిసుఖము ననుభవించెదరుగాక.

* * *

ఫిబ్రవరి 23, 1914

ఓ ప్రభూ, నీ సత్యధర్మనియతిని గురించిన యెరుక మాలో నిత్యము వృద్ధిచెందుచుండునుగాక; అనగా, ప్రతి చేష్టయందును అద్దానినే అభివ్యక్త మొనర్పగలుగునట్లుగ దానితో మేము "ఏకమై" పోవుదుముగాక; ఇది మా కనుగ్రహింప వేడుకొనుచున్నాను.

ఓ ప్రభూ, ఇటునటు పర్వులెత్తు తలంపుల నేను అదుపులో పెట్టగలుగునట్లును; నీయందే నివసించుచు నీ చూపుతోనే జీవితమును నేను చూడనేర్చునట్లును, భౌతిక పదార్థమందు సత్యత్వభ్రమ అంతరించి, నీ నిత్య సత్యత్వము దర్శింపగల దృష్టియే నాలో వృద్ధి చెందునట్లును అనుగ్రహింపుము.

నీ దివ్యప్రేమయే నాలో నెలకొని నాచే ప్రకటితమగునట్లుగ, దానియందే సదా నేను మసలనేర్తునుగాక.

నీ కార్యమున కుపయోగించు యోగదృష్టిగల ఉపకరణము నే నగునట్లును, నాలోని సకలము నీ యభివ్యక్తి మహదైశ్వర్యమునే చాటనేర్చునట్లును అనుగ్రహింపుము.

ఎట్టి దోషములు, దౌర్బల్యములు నాలో గలవో, ఎట్టి చిక్కులు నాకు ఏర్పడియున్నవో, ఎట్టి అజ్ఞతలు నన్ను ఆవరించియున్నవో, అంతయు నే నెరుగుదును. అయినను, నీయందే నిండు విశ్వాసము పూరించుకొన్నదాననై, నిశ్చల, నీరవ, భక్తిభావముతో నీ మ్రోల మోకరిల్లుచున్నాను.

* * *

ఫిబ్రవరి 25-26, 1914

నిన్ను సమంచితముగ సేవింపగోరువాడు, ఏ విషయము నెడను,— మరింత యెరుకతో నీతోడి యనుసంధానమున కుపయోగించు ప్రవృత్తి విశేషముల యెడకూడ,— రాగబద్ధుడు కారాదు.... కాని, అనేక పరిస్థితుల కారణమున, భౌతిక విషయములకే జీవితమున అధికతర ప్రాధాన్య మేర్పడుట సంభవించెనేని, వానియందు నిమగ్నులమైపోక, హృదయాంతరాళమున నీ సన్నిధినే సుస్పష్టముగ దర్శించుచు, ఎట్టి విక్షేపములును భంగింపజాలని యా విశుద్ధశాంతియందు సదా ఏ రీతిని జీవించవలెనో మేము నేర్చుకోవలసియున్నది.

ఏపని చేసినను సర్వత్ర నిన్నే దర్శించుచు చేయగలుగుదుము గాక. ఇట్లు చేయుటవలన, కర్తృత్వబుద్ధి పూర్తిగా విడనాడి మేము, ఆ చేసిన పనికి ఎంతమాత్రము బద్ధులము గాక అతీతులమై విహరింపనేర్తుము. కర్తృత్వబుద్ధి మమ్ములను పృథ్వికి బందీలగావించి పైకెగురనీకుండ జేయును.

ఓ ప్రభూ, నీకే నా సకలసత్తను అర్పించుచున్నాను. ఈ యర్పణము సర్వసమగ్రము, పటిష్ఠము నగునట్లనుగ్రహింపుము.

సకలమునకును సారభూతమైన వర్ణనాతీతస్వరూపుడవు నీవు, ఏ నామమూ

లేని అచింత్యసత్యస్వరూపుడవు. ప్రేమ గౌరవములు పురిగొన్న భక్తితో నీ కిదే ప్రణమిల్లుచున్నాను.

* * *

ఫిబ్రవరి 27, 1914

జీవితమును నీకు సంపూర్ణముగ అర్పణ మొనర్చుకొన్నవారికి ఏ యఖండ సుఖము కలుగునో దాని రుచి యిప్పుడు నాకు తెలియవచ్చినది. ఇయ్యది అంతరంగిక సంస్థితి; అద్దాని తేజోవిశేషముల ననుసరించి కలుగునట్టిదిగాని బాహ్యపరిస్థితుల వలన సంప్రాప్తమయ్యెడిది గాదు.

నీ నియతికి సంపూర్ణముగా ఆత్మసమర్పణము గావించుకొనుటవలన పరిస్థితులలో సైతము మొత్తముమీద మార్పు రాకతప్పదు, కాని, కేవలము పరిస్థితుల వలననే యీ సంపూర్ణమైన ఆత్మసమర్పణము కుదురనేరదు. అనగా, నీ నియతి ఆవిష్కార మగుట ఏవేవో కొన్ని పరిస్థితులను బట్టి కాదు; ఇది యెల్లరకు సమానమే, ఒక్కొక్కరికి వారివారి స్వభావము ననుసరించి ఈ యావిష్కృతి భిన్నముగా నుండును. అనగా, భౌతిక జీవితమున ఎవరికి ఏపని అప్పటికి ఏర్పాటగునో దాని ననుసరించి యీ యావిష్కృతి జరుగుచుండును.

కాని, ఎట్టి చీకటి, అజ్ఞానము, అహంకారసంగము, దుస్సంకల్పము తమయందు లేనివారై యెవరు సంపూర్ణముగ నీకు ఆత్మసమర్పణము గావించుకొందురో అట్టివా రెల్లరును దీప్తిమంతము, ఆనందదాయకము, అక్షరము నైన శాంతిని, నిశ్చలత్వమును తప్పనిసరిగా, సర్వసాధారణముగా, అనుభవించుట మాత్రము నిశ్చయము.

ఈ దివ్యశాంతి నెల్లరును అందుకోనేర్తురు గాక.

* * *

మార్చి 1, 1914

సకల ప్రతిరోధములు, సకల సంకటములు, సకల తమస్సు, అజ్ఞానము మనలోనే యున్నవి. ప్రపంచమం దెచ్చటి కేగినను, ఏ యేకాంత ప్రదేశమున పొదుకొనిపోయి కూర్చున్నను, అలవాట్ల నన్నింటిని వదలి ఎట్టి సన్యాస నిష్ఠతో జీవితము గడుపబూనినను, మాలో నింకను ఏదేని భ్రమాత్మకమైన బంధము అడ్డు నిలిచి మా చేతనకు, నీ యఖండ చేతనకు ఎంతేనియు వేర్పాటు కల్పించుట సంభవించెనేని, ఏదేని అహంకారికమైన సంగదోషము నీ దివ్యప్రేమతోడి పూర్ణైక్యానుసంధానమును ఫలింపజేయకుండుట సంభవించెనేని, బాహ్యపరిస్థితు లెట్టివైనను నీకు మేము చేరువలో లేనివారమే యగుదుము. ఇంచుమించుగా అనుకూలములని చెప్పుకోదగిన సమపరిస్థితు లెప్పుడైన నేర్పడునా? సంశయాస్పదమే. ఆ పరిస్థితుల గురించి మన మేర్పరచుకొను భావన ననుసరించి అవి మనకు నేర్పు పాఠముల వలన మనము ప్రయోజనము పొందుటో పొందకపోవుటో సంభవించుచుండును.

ఓ ప్రభూ, నిన్నిదే వేడుకొనుచున్నాను: ఈ నా వ్యక్తిత్వరూపమున నున్న సంఘాతము నెల్ల నేను బాగుగ గుర్తించుచు సంపూర్ణముగ వశీకరించుకోగలుగునట్లు అనుగ్రహింపుము. అహంతనుండి నేను పూర్తిగా విముక్తిగాంచుటయు, నీవే యీ సంఘాతమును నీ వాసస్థానముగా జేకొని నడపుటయు అవశ్యము జరగవలసియున్నది.

నీ పరమాభివ్యక్తితోడి అవిచ్ఛేద్యైక్యమున, నీ ప్రేమయందే, ప్రేమవలననే, ప్రేమకొరకే నేను సదా జీవింపనేర్తునుగాక.

జ్ఞానదీప్తి, సత్యము, సౌందర్యము నిరంతరముగ నతిశయిల్లుచుండునుగాక.

* * *

మార్చి 3, 1914

ప్రభూ, ప్రయాణదినము సమీపించుచున్నకొలది, ఒక విధమైన సుస్థిర సమాహితస్థితి నాలో ఏర్పడుచున్నది. పెక్కు సంవత్సరములుగ మమ్ము పరివేష్టించియుండి, మూగగా మాతో నమ్మికమీర చెలికారము నెరపుచు వచ్చిన వేల కొలది చిన్నచిన్న వస్తువిశేషము లన్నిటిని అనురాగ పూర్వకమైన గంభీరవృత్తితో తిలకించుచు, మా జీవితమును మనోజ్ఞ మొనర్చుటకై ఇన్నినాళ్ళుగా అవి చేయుచు వచ్చిన కృషికి వానియెడ నా కృతజ్ఞత వెల్లడించుకొనుచున్నాను. అల్పకాలము గాని దీర్ఘకాలముగాని అవి మా చేతులనుండి ఇతరుల చేతులలోనికి మారుట విధివిధానమగునేని, ఆ చేతులు వానియెడ మృదుస్పర్శ గలిగియుండవలెననియు, ఏ నీ దివ్యప్రేమ అచేతనగర్భపు పెంజీకటిలోనుండి వానిని ఆవిర్భవింపజేసినదో, అద్దానిదృష్ట్యా వానియెడ చూపవలసిన నిండుగౌరవమున మెలగవలెననియు కోరుచున్నాను.

పిమ్మట నా దృష్టి భవిష్యత్తువైపునకు మరలగా, నా భావము మరింత గంభీరముద్ర వహించుచున్నది. భవిష్యత్తున మా కేమి ప్రాపింపనున్నదో నాకు తెలియదు, తెలియవలెనని నే నారాటపడుటయును లేదు. బాహ్యపరిస్థితులకు ప్రాధాన్యము కేవలము శూన్యము. ఒక వినూత్నమైన ఆంతరంగిక సంస్థితికి ఈ భవిష్యత్తు మొదలగుగాక యని మాత్రమే నేను కోరుచున్నాను. ఈ సంస్థితి యందు మేము, భౌతిక వస్తువులయెడ మరింత నిర్లిప్తతతో మెలగుచు, నీ దివ్య నియతిని గురించిన యెరుక మాలో మరింత దీప్తము కాగా, అద్దాని అభివ్యక్తికై మరింతగా అనన్యదీక్షతో ఆత్మసమర్పణ మొనర్చుకొనుటయే జరగవలసియున్నది. మరింత వెలుగు, మరింత ప్రేమ మాలో నిండారగా, నీ దివ్య కార్యమునెడ మరింత విశుద్ధభక్తి మాయందు ఈ రానున్న కాలమున తీంద్రించుగాకయని కోరుచున్నాను.

నీరవ భక్తిభావముతో నీ ధ్యానమున నిమగ్నమగుచున్నాను.

* * *

మార్చి 4, 1914

నీ సాన్నిధ్యముతో నిండిన యీ ప్రశాంతమైన గదియందు, ఈ మేజా వద్ద నేను కూర్చుండి వ్రాయుట, బహుశః చాలకాలము వరకు, ఇదే కడపటిసారి యగును. రానున్న మూడు రోజులలోను బహుశః నేనేమియు వ్రాయజాలను.... ఒకానొక ఆంతరికమైన ఏకాగ్రభావనతో ఈ పుటను నేను భావించుచున్నాను. వెనుకకు త్రిప్పుటతోడనే ఇయ్యది గతకాలపు స్వప్నముగ అంతర్ధాన మగుచున్నది. ప్రక్కనున్న యీ తరువాతి పుట ఖాళీగా కానవచ్చుచున్నను, భావికాలపు స్వప్నముతో అయ్యది నిగూఢముగ నిండారియే యున్నది..... అయినను, నీ ఆనంత్యపు వెలుగులో దీనిని తిలకించినప్పుడు, బాలవిచేష్టితము రీతి ఎట్టి ప్రాధాన్యమూలేని అత్యల్పవిషయముగనే ఇయ్యది చూపట్టునుగదా, ప్రాధాన్యముగల విషయ మిది యొక్కటి మాత్రమే,— భక్తితో, ఆనందముతో, నీ నియతికి విధేయులమై వర్తించుట.

ఓ ప్రభూ, మాలో నున్న సమస్తము నిన్నే భక్తితో భావింపుచు నిన్నే సేవించునట్లనుగ్రహింపుము.

ఎల్లరకును శాంతి ఘటిల్లునుగాక.

* * *

జినీవా, మార్చి 6, 1914

వారు పడుచుండిన దుఃఖము వలన నేను మిక్కుటముగా దుఃఖపడిన యనంతరము, సకల శాంతిసౌఖ్యములకును మూలమగు దివ్యప్రేమను ఆ దుఃఖము నందు పూరించి అద్దాని నుపశమింపజేయుటకై నిన్నాశ్రయించితిని. దుఃఖమునకు భయపడి మేము పారిపోరాదు; అనురక్తితో దానిని ఉపాసించనూ గూడదు. తగినంత లోతుగా దాని లోలోపలకు చొరబార నేర్చి, దివ్యచైతన్య కవాటపాటన మొనర్పగలుగునట్టియు, చ్యుతిలేని నీ యేకత్వప్రశాంతిలోనికి ప్రవేశము కలిగించ

గలట్టియు శక్తివిశేషముతో నొప్పారు మీటగా అద్దాని నెట్లు రూపొందించుకో వలెనో తెలియవలసియున్నది.

బాహ్యరూపముల అస్థిరత్వమును, నీ పరమైక్యస్వరూపపు సత్యత్వమును మేము భావించి చూచునపుడు, శరీరములకు వియోగము వాటిల్లిన సందర్భమున విపరీత దుఃఖమునకు కారణమగుచున్న రాగబంధము ఒక విధముగా బాల విచేష్టితమే యగును. కాని, మరొక రీతిగ చూచినచో, ఈ రాగబంధము, వైయక్తికమైన యీ అనురక్తి, ఏ మౌలికమైన ఏకత్వము వైపుగా మానవులెల్లరును తమకు తెలియకనేకూడ ప్రయాణించుచున్నారో, అద్దాని ఉపలబ్ధిని బాహ్యమున సైతము సాధ్యమైనంతలో పొందుటకు అజ్ఞాతముగ వారు చేయుచున్న ప్రయత్న లక్షణమే యగును కాదా? మరియును, ఈ హేతువును బట్టియే, వియోగముచే కలుగు చున్న యీ దుఃఖము బాహ్యచేతన నధిగమించుటకును, బాహ్యానురాగ బంధమునకు మారుగా నీ నిత్యైకత్వ సమగ్రోపలబ్ధిని పాదుకొల్పుటకును అత్యంత ప్రబల సాధ నముగనే ఉపచరించును గాదా?

ఆ దుఃఖితు లెల్లరును దీనిని పొందవలెననియే నేను కోరితిని; దీనినే వారి కొరకై హృదయపూర్వకముగ సంకల్పించితిని; నీ విజయము తథ్యమనెడి విశ్వా సముతో, నిశ్చయముతో, ఇందుకొరకే వారి దుఃఖమును నీకు నివేదించి, దివ్య బోధచే నీవు దాని నుపశమింపజేయ నర్థించితిని.

ఓ ప్రభూ, సులలితమైన యీ అనురాగసౌందర్యమెల్ల మహనీయజ్ఞానముగ రూపాంతరము చెందున ట్లనుగ్రహింపుము.

ఏది సంభవించినను ఉత్తమశ్రేయస్సునకే యగునట్లును, సుఖప్రదమైన నీ శాంతియే ప్రపంచమంతటను రాజ్యమేలునట్లును అనుగ్రహింపుము.

* * *

'కాగామారూ' ఓడపైన, మార్చి 7, 1914

అత్యద్భుతమైన రక్షణ యొసగుచు నిన్నటి దినము నీవు మా కడనే యుంటివి; అత్యంత బాహ్యస్వరూపమున సైతము నీ నియతి విజయవంతమగున ట్లొనర్చితివి. దౌర్జన్యము సుస్థిరప్రశాంతితోడను, పశుత్వము సాధుత్వశక్తితోడను ప్రతిఘటింపబడినవి. సంప్రాప్తము కానున్న ఘోరదుస్సంఘటనము నివారితమై, నీ ప్రభావవిశేషము విజయవంతమై విలసిల్లినది. ప్రభూ, ఎంతటి విండుకృతజ్ఞతతో నీ దివ్యసాన్నిధ్యమునకు మోకరిల్లితినో! నీ పేరుతో, నీ కొరకై మేము జీవించుటకు, ఆలోచనలు సల్పుటకు, కార్యప్రవృత్తుల మగుటకు వలయు శక్తి మాకు అనుగృహీత మగుననుట కిదియొక సుస్పష్టమైన గుర్తుగా నేను గ్రహించితిని. కేవలము భావనయందు, సంకల్పమందు మాత్రమేకాక, కార్యక్షేత్రమునగూడ పటిష్ఠముగా, సర్వసమగ్రమైన యుపలబ్ధితో మేమిట్లు నీకొరకై చరింపనేర్తుముగాక.

ఈ ప్రాతఃకాలమున నా యొనర్చు ప్రార్థన, నిరంతరముగ నిదే యుత్కాంక్షతో నీ వైపున కుద్గమించుచున్నది. నీ ప్రేమయందే మేము జీవింపవలెను; మా సంసర్గముచే నెల్లరును ధైర్యముపొంది పునరుజ్జీవితులై దీప్తిమంతులు కాగలందులకు నీ ప్రేమనే పటిష్ఠముగ మేము నల్దెసల ప్రసరింపజేయ సమర్థులము గావలెను; జీవితక్షతములను మాన్పుటకును, దుఃఖము నపనయింపజేయుటకును, శాంతిస్వాస్థ్యముల సర్వత్రి గూర్చుటకును, వ్యాకులపాటును తుడిచివైచి దాని స్థానమున నీలో ప్రతిష్ఠితమైయున్న చెరగని సుఖమును నింపుటకును తగిన శక్తి మా కొనగూడవలెను. ఇట్టి యుత్కాంక్షతో నిండారియున్నదే నా ప్రార్థన.

ఓ ప్రభూ, ఓ పరమాద్భుతసఖా, ఓ సర్వశక్తిసంపన్నా, పరమేశ్వరా, నీవు మాత్రమే మాలో నివసించుచు మాద్వారా వ్యవహరించు స్థితి యేర్పడునట్లుగ, మా సత్తయంతటిలోనికిని చొచ్చి యద్దానిని పూర్ణముగ రూపాంతర మొందింపుము.

*  *  *

మార్చి 8, 1914

నాలో నున్న సమస్తమును నిశ్చల, నీరవ, శాంతిలోనికి మార్చివైచిన యీ ప్రశాంత భానూదయము వ్రోల, నీ యెరుకయే నాలో దీపించుచు, నీవు మాత్రమే నాయందు మసలుచుండిన సమయమున, ఓ పరమేశ్వరా, ఈ యోడ లోని వారి నెల్లరిని నా వారినిగా స్వీకరించి సమానప్రేమతో వారి నాలింగన మొనర్చుకొనినట్లుగా నాకు తోచినది. వారిలో ప్రతియొక్కరియందును నిన్ను గుర్తించిన యెరుక కొంత మేల్కొనగలదని సైతము పొడగట్టినది. నీ దివ్య శక్తిని, నీ అప్రతిహతదీప్తిని ఇంత బలవత్తరముగ నేను సకృత్తుగ గాని అనుభ వించి యుండలేదు. ఇందుచే నా దృఢవిశ్వాసము మరల నింకొకసారి సర్వసమ గ్రమై దీపించినది—— సంతోషభరితమగు నా యాత్మసమర్పణముసైతము మళ్లీ నిర్దుష్టమై ప్రకాశించినది.

సర్వ దుఃఖమును, అజ్ఞానమును పోగొట్టు నో దేవా, దివ్యచింతామణీ, ఈ నౌకయందలి జనుల హృదయములలో నీవు నివసించి నీ మహిమను వారి యందు బిసాళింపజేయుము.

* * *

మార్చి 9, 1914

ఎవరు నీకొరకై, నీయందే జీవించుచుందురో, వారు తమ భౌతిక పరిసర ములను, అభ్యాసములను, శీతోష్ణస్థితిగతులను, భోజన పద్ధతులను మార్చుకొనుట సంభవింపవచ్చును. కాని, ఎచ్చట నున్నను వారి నిసర్గవాతావరణము మాత్రము మారదు; నీయందే సదా లగ్నమైయుండు భావనతో అది వారి వెంటనే వచ్చు చుండును. ఎచ్చట నున్నను వారికి స్వస్థలమున నున్నట్లే యుండును. ఏలన, ఎచ్చటనైనను వా రుండునది నీ గృహమున. ఆయా దేశములయు, వస్తు విశే షములయు వినూత్నతకుగాని, రమ్యతకుగాని, తా మూహించి యుండని వైచి త్రికిగాని వా రెంతమాత్రము అబ్బురపాటు చెందరు. వారి దృష్టిలో, అంతటను అభివ్యక్త మగునది నీ సన్నిధియే, మారని నీ వైభవమే. అది వారి నెన్నడును

విడనాడదు; అత్యల్పమైన యిసుకరేణువునందు సైతము అది వారికి గోచరించుచునే యుండును. సకల భూతలము నీ మహిమనే గానము చేయుచుండును. తమస్సు, దుఃఖము, అజ్ఞానము ఎంతగా లోకమున వ్యాపించియున్నను, మాకు కానవచ్చునది నీ ప్రేమ వైభవమే; దాని కారణముననే మేము సర్వత్ర ఎడతెగక నిన్నే దర్శించి అనుసంధానించుచుందుము.

నా క్రియాధినేతవైన ఓ ప్రభూ, దీని నంతనూ నిరంతరముగ నీయోడపై నేను అనుభవింపగలుగుచున్నాను. అద్భుతమైన శాంతినిలయమై ఈ యోడ నాకు గన్పట్టుచున్నది; తటస్థభావ సమన్వితమగు అవచేతపు సముద్రతరంగములపై నిన్ను కీర్తించుచు ప్రయాణించుచున్న పావనతరణివోలె చూపట్టుచున్నది. ఈ యవచేతననే మేము తరించి, నీ దివ్యసాన్నిధ్య జ్ఞానావబోధను పొందవలసి యున్నది.

అనిర్వచనీయ సత్యస్వరూపా, ఏ దినమున నిన్ను నేను తెలియనేర్చితినో అది పరమ ధన్యమైన దినము.

ఏనాడీ పృథ్వి కట్టకడకు నిన్ను తెలియనేర్చి, నీయందే నివసింపగలుగునో, అదియే ఎల్లదినములలోను పరమధన్యమైన దినమై విరాజిల్లును.

* * *

మార్చి 10, 1914

విశాసమయపు నీరవతలో, సకల వస్తువులందును నీ శాంతియే విలసిల్లుచుండెను; నా హృదయకుహరపు నీరవతలో సదా విలసిల్లుచుండినదియు నీ శాంతియే; ఈ యుభయ నీరవతలు ఏకమైన సన్నివేశమున, ఎట్టి యలజడిచేగాని ఏ మాత్రము ప్రతిహతము గానిదగుచు నీ శాంతి మరింత శక్తిమంతమై విలసిల్లెను. అంతట నేను, మా మార్గరక్షణ నిమిత్తమ మీ నౌక నెవరు కనుపెట్టి చూచుచుండిరో వారిని గురించి తలపోసి, కృతజ్ఞత నిండిన హృదయముతో, నీ శాంతియే వారి హృదయమునందు ఉద్భవమొంది విలసిల్లవలెనని సంకల్పించి

తిని. పిమ్మట, ఏ ఆతురతయు లేక, విశ్వాసముతో, ఆదమరచి నిద్రించుచుండిన వారిని గురించి తలపోసి, వారి దుఃఖముల గురించిన అనుతాపముతో, నిద్రలో దాగియుండి మేల్కొనుటతోడనే వారిని చుట్టుముట్టుకొననున్న కష్టముల గురించిన అనుకంపతో, వారి హృదయములలోకూడ నీ శాంతి కొంత నెలకొనవలెననియు, అజ్ఞానమును పటాపంచలొనర్చు వెలుగు, ఆత్మజీవనము వారిలో పొటమరింపవలె ననియు సంకల్పించితిని. అటుపిమ్మట, ఈ విశాల సముద్రనివాసులైన దృశ్యాదృశ్య జీవు లందరిగురించియు తలపోసి, వారిలోకూడ నీ శాంతి విస్తరిల్లుగాకయని సంకల్పించితిని, అనంతరము కడుదూరమున మేము విడిచివచ్చినట్టియు, మా యందు ప్రేమగలిగినట్టియు వ్యక్తుల గురించి తలపోసి, ఎంతేని యార్ద్రభావమున, వారికిగూడ, వారి గ్రహణశక్తిననుసరించి, చైతన్యవంతము సుస్థిరమునైన నీ శాంతి సమృద్ధిగ చేకూరవలెనని సంకల్పించితిని. ఆమీదట, మే మెవరికడ కేగుచుంటిమో వారిని గురించి,— బాలప్రవృత్తులచే అస్థిరులగుచు, అజ్ఞానమున అహంకారముతో క్షుద్ర ప్రయోజనముల కొరకు స్పర్ధాళువులై పోరాడుచుండువారిని గురించి తలపోసి, నిండుమనమున, ఉదాత్తమైన యాకాంక్షతో, వారికి సైతము నీ శాంతి యందలి తేజస్సమృద్ధి అనుగ్రహింపబడవలెనని కోరితిని. అటు తరువాత, మాకు తెలిసిన వారిని గురించియు, తెలియనివారిని గురించియు, సమస్త జీవరాశిని గురించియు, రూపపరివర్తనము చెందినవాటి గురించియు, రూపమే ఇంకనూ గైకొనని వాటి గురించియు తలపోసి, ఈ సమస్తము కొరకు,— ఇంకనూ నే నూహింపలేనివి, నాకు జ్ఞాపకమున్నవి, లేనివి,— అన్నిటి కొరకు కూడ, నీ శాంతిని నేను గాఢమైన అంతర్ముఖవృత్తితో, నీరవమైన భక్తిభావముతో అర్థించితిని.

* * *

మార్చి 12, 1914

ప్రభూ, నా హృదయాకాంక్ష ఇది యొక్కటే,— అనుదినము నిన్ను నేను మరింత బాగుగ తెలియగలుగుచు, మరింత బాగుగ సేవింపగలుగుచుండ వలెను. బాహ్య పరిస్థితు లెట్లున్ననేమి? అనుదినము అవి నాకు మరింత కొరమాలినవిగ, మరింత మిథ్యాభూతముగ గనుపట్టుచున్నవి. బాహ్యజీవితమున ఏమి ఘటిల్లనున్నదో యనుదాని విషయమున నా యాసక్తి నానాటికి క్షీణించు చున్నది. నిన్ను మరింత బాగుగ సేవింపగలుగుటకై, మరింత బాగుగ తెలిసి కొనుట ఎట్లనుదానియెడ మాత్రమే నా యాసక్తి అంతకంతకు గాఢతరమగు చున్నది; అదియే నాకు అత్యంతముఖ్యమై చూపట్టుచున్నది. బాహ్యఘటన లన్నియు ఈ గమ్యము దెసకే;— కేవలము దాని వైపునకే,— అభిసరించవలెను. అట్లు జరుగుటకు, బాహ్యసంఘటనలయెడ మా వైఖరిపైన అది యెల్ల నాధార పడి యున్నది. ప్రతి వస్తువునందును నిన్నే సదా అన్వేషించుట, ప్రతి సన్ని వేశమునను నిన్నే మరింతగ అభివ్యక్త మొనర్పగోరుట,— ఇట్టి వైఖరియందే పరమశాంతి, పరమనైశ్చల్యము, యథార్థమైన సంతృప్తి కాననగును. దీని ద్వారముననే జీవనము, ఎట్టి తుపాను వచ్చినను ఏ మాత్రము కలగుండువడక, మహత్తరముగ పొంగులువారుచు, అద్భుతావహముగ వికసించి, విస్తరిల్లి, సర్వతో ముఖముగ వ్యాప్తినొందనేర్చును.

ఓ ప్రభూ, మాకు రక్షణస్థానము, ఆనందస్థానము నీవే. నీవే మాయందు దేదీప్యమానమైన తేజస్సును, విశుద్ధమైన ప్రేమను నిండించువాడవు. నీవే మా శక్తివి, మా ఆశాజ్యోతివి. నీవే మా జీవనము, మా వాస్తవిక స్వరూపము.

అత్యంత వినమ్రము, ఆనందతుందిలము నైన భక్తిభావమున నీ కిదే ప్రణమిల్లుచున్నాను.

* * *

మార్చి 13, 1914

'చేతన' అనుదానియందు తరతమ ప్రభేదము లెన్నియో కలవుగదా! ఏ జీవునియందైనను, నీ దివ్యసాన్నిధ్యముచే దీప్తమై, నీతో తాదాత్మ్యమును బొంది, నీ పరమచేతనయందు పాల్గొననేర్చు ఎరుకకే ఈ పదము ప్రత్యేకించి వాడదగి యున్నది. బుద్ధుడు చెప్పినటుల, 'పూర్ణప్రబుద్ధమైన' జ్ఞానస్థితికే దీనిని వాడ దగును.

ఈ స్థితికి వెలుపల, అధోముఖముగా, అచ్ఛమైన అచేతనము వరకు వ్యాపించియున్న చేతనావిభాగము లనంతము. నీ దివ్యప్రేమప్రకాశస్పర్శ నింకను పొందకయున్న స్థాన మీ అచేతనము. (కాని, భౌతికపదార్థమున అట్టి స్పర్శ అసంభావ్యముగ చూపట్టును.) ఒకానొక అజ్ఞానకారణముచే ఈ అచేతనస్థాయి మన వైయక్తిక దృష్టికి అందరానిదై యున్నది.

కాని, యిది మాటవరుసకు కడు అసమగ్రముగా చెప్పిన సంగతి. ఏలన, జీవుడు నీ సాన్నిధ్యమును గుర్తెరిగి, నీ చేతనతో ఏకత్వము పొందనేర్చు సన్నివేశమందు, అంతయు అంతటను తెలియబడుచునే యుండును. కాని, యీ పరమచేతన కడు నల్పకాలము మాత్రమే యుండుటకు గారణమేమి? జీవుని యందలి వివిధ విభాగముల స్వరూపము కడు సంక్లిష్టమై యుండుటే. వాటి వెలుగులో సమానత్వము లేదు, వైషమ్యమున్నది. ఒకదాని తరువాత నొకటిగా వాటియందు ప్రవృత్తి యేర్పడుచుండును. అంతేకాక, ఇట్టి క్రమప్రవృత్తి కారణముననే, అవి కొంచెము కొంచెముగా, తమ బాహ్యాభ్యంతరానుభవముల ఫలితముగ, తమను తాము తెలిసికొన గ్గలుగుచు, తద్ద్వారమున తమ యగాధ స్వరూపమందు నిన్ను సైతము కనుగొన నేర్చును.

సమ్యగ్దర్శనమునకు, సంపూర్ణమైన తమస్సునకు నడిమిమండలము అవచేతన. జీవులలో అధికసంఖ్యాకులు, మానవులు సైతము, బహుశః ఈ అవచేతనమునందే నిరంతరము నివసించుచుందురు. దానినుండి బయటపడువా రరుదు. దీనిని జయించుటే జరగవలసియున్నది. ఏలన, యథార్థమైన యెరుక

గలిగియుండుటన, మేము సంపూర్ణముగ నీవై యుండుటే యగును. అదేకదా మేము సాధించవలసియున్న కార్యస్వరూపము, ఈ భువిపై నెరవేరవలసియున్న మహాకార్యము ?

ఓ ప్రభూ, తమస్సునుండి మాకు ముక్తిని ప్రసాదింపుము. సంపూర్ణముగ మాకు ప్రబోధ కలుగునట్లనుగ్రహింపుము.

ఓ ప్రేమరసస్వరూపా, నీ ప్రేమయందు, నీ ప్రకాశమునందు మాత్రమే నేను నివసించులాగునను, ఆ ప్రేమప్రకాశములే నా ద్వారమున నలుగడల ప్రసరించి, మా మార్గమున గలవారికెల్ల ప్రబోధ కలిగించులాగునను అనుగ్రహింపుము. ఈ భౌతికయాత్ర మేము చేయవలసిన కార్యమునకు ప్రతీకయగునుగాక. ఈ యాత్రాపథమునం దంతటను ప్రేమప్రకాశముల జాడనువోలె నీ జాడనే వదలి వెళ్ళగలుగుదుము గాక.

ఓ దివ్యప్రభూ, సనాతన గురూ, ప్రతివస్తువులో, ప్రతి జీవిలో నీవు నివసించుచున్నావు. అత్యంతాజ్ఞానుల దృష్టికి సైతము నీప్రేమ సువిశదమై గోచరించును. తమ యగాధతలములం దెల్లరు నీ ప్రేమను గురుతింప నేర్చున ట్లనుగ్రహింపుము. ద్వేష మనునది వారి హృదయములనుండి శాశ్వతముగ అదృశ్యమైపోవునుగాక.

వేసటలేని గీతము రీతి, హృదయపూర్వకమగు నా కృతజ్ఞత నీదెసకు సదా ఉద్గమించునుగాక.

* * *

మార్చి 14, 1914

ఎడారి యందలి మార్పులేని ఏకాంతస్థితియందు, ప్రాభవోపేతమగు నీ సాన్నిధ్య మే కొంతయో కాననగుచుండును. అపారముగ విస్తరించియుండు నీ యిసుక ప్రదేశములలోనికి తరలిపోవుట యనునది నిన్ను కనుగొను ఉత్తమో పాయములలో నొకటిగా ఏల సదా పరిగణింపబడుచున్నదో నేను తెలియగలుగు చున్నాను.

కాని, నిన్ను తెలియనేర్చువారికి, అంతటను, అన్ని వస్తువులలోను నీ వున్నావు. నిన్ను అభివ్యక్త మొనర్చుటకు ఏ వస్తువు ఇతరవస్తువుకంటె అను కూలమైనదని భావింప వీలులేదు. ఏలన, ఉన్న వస్తువులన్నియు— ఇంకను రూపొందకయున్న వస్తుజాతముగూడ— నిన్ను అభివ్యక్త మొనర్చుటకు ఆవశ్య కములే. నీ దివ్యప్రేమ పనిచేయుచున్న హేతువుచే, ప్రతివస్తువు నీ దెసకు ప్రయాణించు ప్రయత్న విశేషమే. మా కనులు విచ్చుకొనినప్పుడు, ఈ ప్రయ త్నమును మేము నిరంతరము చూడగలుగుదుము.

ఓ ప్రభూ, నా హృదయము నీ కొరకై దప్పిగొనియున్నది. నా బుద్ధి భావన నిరంతరము నిన్నే అన్వేషించుచున్నది. మూగయైన భక్తిభావముతో నీకిదే ప్రణమిల్లుచున్నాను.

* * *

మార్చి 15, 1914

ఓ ప్రభూ, నీవు నా బుద్ధియందు నిండియున్నావు, నా హృదయమునందు నిండియున్నావు. నా సకలసత్తయు నీ సాన్నిధ్యముతో నిండియున్నది. సుఖోత్పాదనము గావించుచు శాంతి అంతకంతకు అభివృద్ధి చెందుచున్నది. అయ్యది ఒకానొక స్థిరనైశ్చల్యమునకు నిసర్గమై, నిష్కలుషమై యొప్పారుచున్న సుఖవిశేషము. దాని స్వరూప మీ విశ్వమంత విశాలమై, నీ దివ్యసాక్షాత్కారమునకు దారితీయు అగాధతలములకు ఆకరమై యున్నది.

ఆహా, స్వచ్ఛములైన యీ నీరవరాత్రులందు, నా హృదయము పొంగులు వారుచు నీ దివ్యప్రేమతోడి మేళనమున సమస్త వస్తుజాతములోనికిని చొరబారుచున్నది; సకల జీవనమును సమాశ్లేష మొనర్చుచున్నది; సకల బుద్ధివృత్తులను దీప్తమొనర్చి పునరుజ్జీవింపజేయుచు, హృదయానుభూతుల నెల్ల విశుద్ధము గావించుచు, అద్భుతమైన నీ దివ్యసాన్నిధ్యము యొక్కయు, దానిలోనుండి యుప్పొంగు వర్ణనాతీతమైన దివ్యశాంతి యొక్కయు జ్ఞానప్రబోధను నా సత్తయం దంతటను కలిగించుచున్నది.

ఓ ప్రభూ, మాలో ఈ జ్ఞానము, ఈ శాంతి నానాటికి వృద్ధిచెందునట్లనుగ్రహింపుము. వీని మూలమున మేము, దివ్యమై, ఏకమై తనరారు నీ నియతిని భక్తిశ్రద్ధలతో ప్రవర్తింపజేయు సేవకులముగ నెగడెదముగాక.

* * *

మార్చి 17, 1914

శారీరిక స్థితిగతులు కొంత అస్తవ్యస్తమై, ఏదైన అస్వస్థత యేర్పడి నప్పుడు, జీవన మరణములను, ఆరోగ్య అనారోగ్యములను తృణప్రాయముగ నెంచుచు, నీ యిచ్ఛకు సంపూర్ణముగ ఆత్మసమర్పణము గావించుకొనుటెట్లో నేర్చు కొందుమేని, మా సకలసత్తయు వెన్వెంటనే నీ ప్రేమనియతితో, నీ జీవన నియతితో సామరస్యమును గూర్చుకొని, తత్పర్యవసానముగ సకల శారీరికా స్వస్థతయు తొలగిపోయి, సుస్థిరము, ప్రగాఢము, ప్రశాంతమునైన స్వస్థజీవనము పరిఢవిల్లుట తథ్యము.

శారీరికమైన కష్టసహన మెంతయో కావలసివచ్చెడి కార్యాచరణకు బూను కొను పరిస్థితులందు, మాకు తారసిల్లనున్న కష్టములనెల్ల ముందుగానే ఊహించు కొని వాటికై ఎదురుచూచుటే కడు హెచ్చయిన అలసటకు కారణమగు చుండునని నేను గమనించితిని. అట్లుగాక, ప్రతిక్షణమునను ఎప్పటికప్పుడు, వర్తమాన క్షణమునం దెదురయ్యెడి కష్టమును గురించి మాత్రమే పర్యాలోచించుట ఎంతయు వివేకముగల పని యగును. ఇందుమూలమున, ఆ కష్టము నెదుర్కొనుటలో మనము వినియోగింపవలసివచ్చు శక్తిసముదాయ మెప్పుడును తగుమాత్రముగనే యుండునుగాన, కార్యసాధన సులభతరమగును. ఈ శరీర మొక అద్భుతమైన ఉపకరణము. దాని నెటుల వినియోగించవలెనో మన మనస్సునకు తెలియదు. దాని మృదుత్వమును, పేశలత్వమును వృద్ధిచేయుటకు మారుగా, తాను ముందుగ నేర్పరచుకొనియున్న ఊహాపోహల ననుసరించి, అననుకూలమైన సూచనలేవియో అందించుచు, ఒకవిధమైన కర్కశత్వమును దానికి ఘటింపజేయుట సంభవించు చుండును.

కాని,— ఓ ప్రభూ,— నీతో ఏకత్వమును పొంది, నిన్నే నమ్ముకొని యుండి, నీయందే నివసించుచు, మేము నీ వగుటయే పరమమైన విజ్ఞానము. ఆ స్థితియందు, నీ సర్వశక్తతను అభివ్యక్త మొనరించు మానవునకు అసాధ్య మైన దేదియు నుండదు.

ప్రభూ, నీరవమైన సంకీర్తనము వోలె, మూగయైన ఆరాధనము రీతి, నా యాకాంక్ష నీ దెస కుద్గమించుచున్నది; నీ దివ్యప్రేమ నా హృదయము నుద్దీప్త మొనర్చుచున్నది.

ఓ దివ్యసనాతనగురూ, నీ కిదే నా ప్రణామము.

* * *

మార్చి 18, 1914

ప్రభూ, నీవు పూర్ణజ్ఞాన స్వరూపుడవు, పరమ చైతన్యస్వరూపుడవు. నీతో ఏకత్వమును బొందినవాడు—— అట్లు ఏకత్వమును బొందిన కాలమున.... సర్వజ్ఞు డగును. కాని, ఈ స్థితిని అందుకొనక పూర్వముగూడ, ఎవడు పూర్ణమైన అంతశ్శుద్ధితో, ఎరుకతో కూడిన యిచ్ఛతో తనను నీకు అర్పణము చేసికొనునో, ఎవడు దివ్యమైన నీ ప్రేమనియతిని తనయందును, తనచే ప్రభావిత మైన పరిధియం దంతటను అభివ్యక్తము గావించి విజయవంత మొనర్చుటకు సర్వశః ప్రయత్నింప నిశ్చయించుకొనునో, అట్టివానికి తన జీవితమే పూర్తిగ మారిపోయినట్లు కానుపించును. సకల సన్నివేశములు నీ నియతినే అభివ్యక్త మొనర్చుచు తన యాత్మనివేదనమునకు దోహదముచేయ మొదలిడినట్లు కాననగును. ఏది సంభవించినను అది సదా తన ఉత్తమశ్రేయమునకే నని యతడు గుర్తించు చుండును. తన బుద్ధియం దింకను ఏదైన కొంత అజ్ఞానపు తెరయున్నచో, ఏదైన నొక అజ్ఞానపు కోరికయుండి ఒక్కొక్కప్పు డతనికి వెంటనే తెలియబడక యుండుచో, తనయెడ కారుణ్యముగల శక్తియేదియో తన నుండియే తనను కాపాడుచు, తన వికాసమునకు, రూపాంతరీకరణమునకు మిక్కిలి అనుకూల పరిస్థితులను కల్పించి తన సంపూర్ణ పరివర్తన వినియోగములకు తోడ్పడ కృషి చేయుచున్నదని క్రమముగా గుర్తింపనేర్చును.

ఇది మేము చక్కగా గుర్తించి, దీనియందు నిశ్చయబుద్ధిని అలవరచు కొన్నప్పుడు, భావి పరిస్థితులు ఎట్లుండునో యనియు, ఎట్టి పరిణామములు ఘటి ల్లునో యనియు మేము ఆతురత చెందవలసిన పనిలేదు. పరిపూర్ణమైన నిశ్చల

భావముతో మేము ప్రతిక్షణమునను ఏది మాకు ఉత్తమమని తోచునో దానినే చేయుచుందుము. అట్టి కార్యాచరణమునకు ఫలితము, మా పరిమితబుద్ధి ననుసరించి మేము అనుకొన్న రీతిగనే యుండకపోయినను, పర్యవసానమున అది మా ఉత్తమశ్రేయమునకే యగునన్న విశ్వాసము కలిగియుందుము.

కావుననే, ఓ ప్రభూ, నా హృదయ మిప్పుడు, ఎట్టి భారము లేనిదై కడు తేలికగా నున్నది; నా బుద్ధియు నెంతేని విశ్రాంతి ననుభవించుచున్నది. కావుననే మేము పరిపూర్ణవిశ్వాసముతో నీ వైపుగా తిరిగి, ప్రశాంతముగ నిన్ను కీర్తించుచున్నాము.

నీ యిచ్ఛయే నెరవేరునుగాక; నిక్కమైన సామరస్యమును అదియే ఘటింపజేయగలదు.

* * *

మార్చి 19, 1914

ఓ ప్రభూ, సనాతనగురూ, వాక్కులతో నిన్ను మేము పేర్కొనలేము; బుద్ధితో అవగాహన చేసికొనలేము; కాని, అనుక్షణము అంతకంత కధికముగ నీవు మాకు అనుభూత మగుచునే యుండగలవు. మా బుద్ధికి దీప్తి నిమ్ము; మా హృదయమును ప్రకాశవంత మొనర్పుము; మా చేతనను రూపాంతరము చెందింపుము; ప్రతి యొక్కరును సత్యజీవనమునకు మేల్కొందురుగాక; అహంకారము నుండియు, తజ్జనితమైన దుఃఖసంక్షోభములనుండియు విముక్తిగాంచి, సమస్త శాంత్యానందములకు మూలమైన నీ దివ్యవిశుద్ధ ప్రేమయం దాశ్రయము గైకొందురుగాక. నీ స్వరూపముతో నిండారిన నా హృదయము అనంతములోనికి విస్తరిల్లుచున్నట్లున్నది. నీ దివ్యసాన్నిధ్యముచే సంపూర్ణముగ దీప్తమైన నా బుద్ధి పరమ స్వచ్ఛమైన వజ్రమణివలె ప్రకాశించుచున్నది. సమస్తమును రూపాంతరము చెందించు మహాద్భుత ఐంద్రజాలికుడవు నీవు. కురూపములో నుండి సురూపము, చీకటిలోనుండి వెలుగు, బురదలోనుండి నిర్మల జలము,

అజ్ఞానములోనుండి జ్ఞానము, అహంకారములోనుండి కారుణ్యము ఉదయింప జేయ నేర్తువు.

నీయందే, నీ వలననే, నీ కొరకే మేము జీవించుచున్నాము. నీ నియతియే మా జీవనమునకు పరమమైన యేడుగడ.

సర్వత్ర నీ యిచ్ఛయే నెరవేరునుగాక; సకల ప్రపంచమున నీ శాంతియే రాజ్యమేలుగాక !

*　　*　　*

మార్చి 20, 1914

నీవు చిత్స్వరూపుడవు, జ్యోతిస్స్వరూపుడవు; ఎల్లర హృదంతరాళములోని శాంతివి; సమస్తమును రూపాంతరము చెందించు దివ్యప్రేమవు; అజ్ఞానాంధకారమును పటాపంచలు చేయు జ్ఞానతేజస్సువు. నిన్ను అనుభవమునకు దెచ్చుకోవలెనన్నను, నీ కొరకై యాకాంక్షించవలెనన్నను, అవచేతనపు అపారసముద్రములోనుండి మేము బయటపడ నేర్చియుండవలెను. మణివోలె ఘనీభవించి, నిర్వచన పూర్వకముగా నిన్ను తెలియుట కుపక్రమించియుండవలెను. పిమ్మట నీకు ఆత్మార్పణము గావించుకొన నేర్చియుండవలెను. ఏలన, ఈ ఆత్మార్పణము ద్వారముననే స్వస్వరూపసిద్ధి ఘటిల్లును. మణిసదృశమైన యీ ఘనీభూతస్థితిని సాధించుటకు, స్పష్టమైన రూపుకట్టని నడుమంత్రపు స్థితిలోనుండి బయటపడుటకు, ఎన్నో ప్రయత్నములు, ఎన్నో సంఘర్షణలు అవశ్యకము అగుచుండును. అటులనే వ్యక్తిత్వ మనునది ఏర్పడిన పిమ్మట, నీకు సంపూర్ణముగ ఆత్మార్పణము గావించుకొనుటకును ఎన్నో ప్రయత్నములు, సంఘర్షణలు అవసరములగును.

ఐచ్ఛికముగా ఈ ప్రయత్నములు చేయుట కంగీకరించువారరుదుగ నుందురు. అందుచే, అనుకోని ఘోరసంఘటనలు ఘటింపజేయుటద్వారా జీవితము మానవులచే, వారి కిష్టము లేకపోయినను బలాత్కారముగా ఈపని చేయిం

చును. ఇట్లు కొంచెము కొంచెముగా, అవరోధము లెన్నియున్నను నీ కార్యము సాధింపబడుచుండును.

*　*　*

మార్చి 21, 1914

ప్రతి ప్రాతఃకాలమున, నాలోని యాకాంక్ష నీ దెసకు ఉద్గమించుచుండగా, నా సంతృప్తహృదయపు నిశ్చల నీరవతలో, నీ ప్రేమనియతియే అభివ్యక్తమగునుగాక యనియు, నీ యిచ్ఛయే ఆవిష్కృత మగునుగాక యనియు కోరుచున్నాను. ఏ సన్నివేశములు ఈ నియతికి, ఈ యిచ్ఛకు కార్యరూపమొసగ వలసియున్నదో, వానికి నేను సంతోషపూర్వకముగా, నిశ్చలభావమున విధేయురాల నగుటకు సంసిద్ధముగ నున్నాను.

వ్యక్తిగతమైన విషయములలో, పరిస్థితులు ఫలానిరీతిలోనే యుండవలె ననియు, వేరొక రీతిలో నుండరాదనియు ఆందోళనపడి కాంక్షసేయు టెందులకు? ఫలాని ఫలాని పరిస్థితులే అభివ్యక్తికి ఉత్తమసాధనములని ముందుగనే నిర్ణయించుకొని, ఆ సాధింపదలచినవాని కొరకై తీవ్రసంఘర్షణలో పడుటెందులకు? ఎల్ల చిక్కులను, చీకటిని, అహంతను నీ నియతియే సర్వత్ర, సదా, జయించునుగాక యన్నెడి సంకల్పమును, హృదయాంతర్గతమైన సుస్థిర విశ్వాసముతో మాయందు కేవలముగ ప్రోదిచేసికొనుటకు మా సర్వశక్తిని ఏల కేంద్రీకరించి వినియోగించుకొనరాదు? ఈ దృష్టిని మేము అవలంబించ నేర్చుకొనినతోడనే, మా దృష్టిపథపు సీమాంతరేఖావలయము విస్తరిల్లును; మా యాందోళన లన్నియు సమసిపోయి, మార్పులేని వెలుగు మాకు ద్యోతకము కాగా, అనాసక్తిపూర్వకమైన అఖండశక్తి మాలో పూరింపబడుట సంభవించును. ప్రభూ, నీవు సంకల్పించినదే మేముకూడ సంకల్పించుట యన, నీతోడి నిత్యానుసంధానమున మననేర్చుటే యగును. ఆగంతుకముగా ఏ పరిస్థితులు ఎప్పుడేర్పడినను సమత్వవిహీనాడక, సకల సంకుచితత్వమునుండియు విముక్తిగాంచి, విశుద్ధము, ఆరోగ్యప్రదమునైన గాలినే మా శ్వాసకోశములందు నింపుకొనుచు, కొరమాలిన అలసట యనున దేమాత్రము లేక, విపరీతమైన సమస్తభారమును వదలించుకొని తేలికపడుటయే

యగును. ఇదంతయు, వేగవంతమైన అడుగులతో, మేము చేరుకోవలసియున్న ఏకైక గమ్యము దెసకు పరుగుతీయుటకే. అదియే నీ దివ్యనియతి లక్షించెడి విజయము.

ఓ ప్రభూ, నాలో నిండారిన ఉల్లాసభరితమైన విశ్వాసముతో ఈ ప్రాతర్వేళ నీ కిదే ప్రణమిల్లుచున్నాను.

* * *

మార్చి 22, 1914

ఓ ప్రభూ, ప్రేమరస స్వరూపా, వీరి చేతనను, వీరి హృదయమును దీప్త మొనరింపుము. నీ కడకు జేరు ప్రయత్నమునే వీరు గావించిరి. కాని, అజ్ఞానము వలన బహుశః వీరి ప్రార్థనలు నీ దెసకు ఉద్గమించుట జరుగలేదు. వీరి అసద్భావనలు వీరి యాకాంక్షామార్గమును అవరోధించినవి. అయినను, కరుణ స్వరూపుడవగు నీవు, సత్సంకల్పము నెల్ల ఆదరింతువు. అంతశ్శుద్ధి ఏమాత్రము తళుక్కుమన్నను నీ దివ్యజ్యోతి దాని నవకాశముగ గైకొని బుద్ధిని దీప్తము గావించును; నీ పరమప్రేమ మానవ హృదయములలో చొరబారునట్లొనర్చి, నీ దివ్యనియతిని వెల్లడించు ఉత్తమసాధనలలో నొకటియగు ఘనతర విశుద్ధ దయాగుణముతో వాటిని నింపివేయును. నీతోడి నిక్కమైన యైక్యానుసంధాన స్థితిలో నే నుండగలుగు క్షణములందు, నీ సంకల్పము ననుసరించి వీరికొరకు నే నేమి సంకల్పించితినో, అది యెల్లను వీరు బాహ్యపరిస్థితుల ప్రాధాన్యము విస్మరింప యత్నించుచు, తమ యందలి అత్యుదాత్త యోచనల వైపుగా, అత్యుత్తమ భావగతుల వైపుగా పురలిన శుభతరుణముల నందుకొను నట్లుగా అనుగ్రహింపుము.

నీ దివ్యసాన్నిధ్యపు పరమనైశ్చల్యము వీరిలో ఉద్బుద్ధమగునుగాక.

* * *

మార్చి 23, 1914

నీ దివ్యచైతన్యమును గురించిన యెరుకతో అనుక్షణమును ఉండనేర్చి, ప్రతిక్షణములోను, అప్రయత్నముగా, ఎట్టి యాలోచనతోనూ పనిలేకుండగనే, నీ దివ్యనియతిని ఉత్తమరీతిలో ప్రకటమొనర్చుటకు మేము కచ్చితముగ ఏమి చేయవలెనో తెలియనేర్చు స్థితియే లక్షింపదగిన ఉత్తమస్థితియని నా యభిప్రాయము. ఈ స్థితి యెట్టిదో, కొన్ని సమయములలో నే నుండియుంటినిగాన నాకు తెలియును. కాని, ఈ స్థితి యేరీతిగా అలవడునన్న జ్ఞానము తరచుగా అజ్ఞానపు పొగమంచుచే కప్పువడిపోయి, ఆలోచనా రీతిని ఆశ్రయించవలసి వచ్చుచుండును. ఈ రీతి ఎల్లవేళలా సదుపదేష్టగా ఉపచరించనేరదు; ఆలోచనకు అవకాశమేమియు లేక, ఆయా క్షణములలో పొటమరించు ప్రేరణకు లోనగుచు అనుక్షణము మేము చేయు పనుల సంగతి అటుండనిమ్ము. దీనిలో, నీ నియతికి అనుకూలమైన దెంతవరకు, ప్రతికూలమైన దెంతవరకు ? అది అంతయు అవచేతనాస్థితిపై; ఆ క్షణమున దానిలో బయలుదేరు వృత్తిపై నాధారపడియుండును. పని జరిగి పోయిన పిమ్మట, దాని కేమైన ప్రాముఖ్యమున్నచో, మేము వెనుదిరిగి దానిని తిలకించి, విమర్శించి, అవగాహన మొనర్చుకొందుమేని, అదియొక గుణపాఠమై యుపకరించి, ఏ ప్రేరణాబలము మాచే ఆ పని చేయించినదో మేము తెలిసికొన గలుగుదుము. ఆ రీతిగా, మాపై నింకనూ ఆధిపత్యము వహించుచున్న అవ చేతనా స్వరూపమును కొంత గ్రహించగలుగుదుము. ఈ యవచేతననే మేము జయింపవలసియున్నది.

ప్రతి ఐహికకార్యమందును, గుణము, దోషముగూడ నుండకుండుట యసంభవము. దివ్యప్రేమ నియతి నుత్తమోత్తమముగ ప్రకటించు కార్యము లందు సైతము,— ప్రపంచ మిప్పుడున్న పరిస్థితిలో,— కొంత తమస్సు, అవ్యవస్థితి చేరియేయుండును.

నిరాశావాదులుగ పిలువబడు మానవులు కొందరు, ప్రతిదానిలోను కేవలము దోషమునే ప్రాయికముగా చూచుచుందురు. ఆశావాదు లట్లుగాక, అంతటను కేవలము సౌందర్య సామరస్యములనే పొడగనుచుందురు. అనిచ్ఛాపూర్వకముగ

ఆశావాది యగుట పరిహాసాస్పదము, అజ్ఞానలక్షణము నైనచో, ఇచ్ఛాపూర్వకము గనే ఆశావాదియగుట సుఖదాయకమైన విజయమగునుగాదా ? నిరాశావాదుల దృష్టిలో, మే మేది చేసినను వారి కది దోషజుష్టము, అజ్ఞానపూర్వకము, అహంకారికముగనే కనుపట్టును. అట్టివారిని తృప్తిపరచుట యెట్లు ? అది అసాధ్యమైన కార్యము.

మేము చేయదగిన దొక్కటే. మా భావనకు అందినంతలో ఉన్నతోన్నతము, అత్యంత విశుద్ధమునైన జ్యోతితోడి ఏకత్వమును మాకు సాధ్యపడినంతలో సంపూర్ణముగ సాధింపవలెను. అనగా, ఆ పరమచేతనతోడి తాదాత్మ్యము మన చేతనకు వీలైనంత సమగ్రముగా ఘటింపజేసికొనవలెను; దానినుండి మాత్రమే సకల అంతఃప్రేరణలనూ గ్రహించుటకు కృషిసల్పవలెను. ఇట్లు చేయుట వలన, అద్దాని అభివ్యక్తిని ఈ పృథ్విపై మాకు సాధ్యమైనంతలో సుగమ మొనర్చుటతోపాటు, అద్దాని శక్తియందు దృఢవిశ్వాసముతో, ఎల్ల సంఘటనలను విశ్వలభావమున పరామర్శింప నేర్తుము. ఇప్పటి అభివ్యక్త ప్రపంచమందు, సర్వము మిశ్రితముగనే యున్నదిగాన, అంతకంతకు ఉన్నతోన్నతమగు వెలుగుకొరకై ప్రయత్నము సల్పుచు, పరమ సంసిద్ధి ప్రస్తుతమునకు సాధ్యపడదనుచు గుర్తింపుతో, దైవమునకు సర్వము వదలి, మేము చేయగలిగినదంతయు చేయుచుండుటే అత్యంత వివేకవంతమైన పద్ధతి.

ఈ సంసిద్ధి ఎంత అందుకోరానిదైనను, పరమోత్సాహముతో దానికొరకై మేము సదా ఆకాంక్షించుచునే యుండవలెనుగాదా ?

* * *

మార్చి 24, 1914

నిన్నటి నా తలపోత లన్నింటి పర్యవసానముగా ఒక నిశ్చితార్థము తేలినది. నీ నియతితో నే నింకనూ సంపూర్ణముగా తాదాత్మ్యము చెందలేదేమో నన్న భయముచే నే నిపుడొక సంకటమునకు గురియగుచున్నాను. తాదాత్మ్యము సమగ్రము కాని హేతువుచేతనే నాకీ సంకట మేర్పడుచున్నది. అది సమగ్రమై యుండినచో, సమగ్రమా, కాదా యను సంశయమే నాలో పుట్టియుండెడిది కాదు. పై పెచ్చు, ఏ సంకటమూ నాకు కలుగుట కవకాశము లేదని స్వానుభవము ద్వారమున నే తెలిసికొనియుందును.

ఏదైన నొక పొరపాటు, లేక తప్పిదము చేసినప్పుడు, మాలో కలుగు భావనారీతి ఎటులుండవలెను ? 'నే నింతకంటె మెరుగుగా చేసియుండవలసినది, అట్లుగాక ఇట్లు చేసియుండిన బాగుండెడిది.' అని యనుకొనుట సరియైన భావన కానేరదు. 'ఆ పరమచేతనతో నేను తగినంతగా తాదాత్మ్యము పొందియుండ లేదు, సునిశ్చితమగు పూర్ణతాదాత్మ్యమును పొందుటకు నేను ప్రయత్నించవలెను.' అని యనుకొనుట సరియైన భావన.

నిన్నటి యపరాహ్ణమున, సుదీర్ఘమగు నిశ్చల నీరవ ధ్యాన సమయములో, మేము లక్షించుదానితోడి నిక్కమైన తాదాత్మ్య మన నెట్టిదో నాకు తుదకు అవగాహన మైనది. ఈ యుపలబ్ధి ఒకానొక నైతికస్థాయి నందుకొనుటచే కలిగినది కాదు. చిత్తవృత్తిని నిలుపుటచే, వశీకృత మొనర్చుకొనుటచే కలిగినది. ఈ యుపలబ్ధి నిర్దుష్ట మగుటకు, ఎన్నియో గంటల కొలదిగ నిదిధ్యాసన మావశ్యకమగునని గ్రహించితిని. నా భారతదేశ ప్రయాణము వలన నే నాశించుచున్న ఫలితములలో నిదియొక ముఖ్యఫలితము. కాని, ప్రభూ, ఇది నీ సేవాకార్యమునకావశ్యకమని నీవు భావించినప్పుడే ఈ రీతిగా జరుగనేర్చును.

నెమ్మదిగా, కడు నెమ్మదిగా నా పురోగతి సాగుచున్నది. అయినను, ఈ సాధింపబడు పురోగతి, ఏ యొడుదొడుకులును లేక, సుస్థిరము, సుభద్రమునై

విలసిల్లగలదనియే ఆశించుచున్నాను.

* * *

మార్చి 25, 1914

ఎప్పటివలెనే దృష్టి కగోచరముగను, శ్రవణమున కగోచరముగను ఉండియు, సతతము సర్వప్రాబల్యముతో నీ వొనర్చు కార్యములు జనుల కనుభవ వేద్యము లగుచున్నవి; మరియు, కడుంగడు ముకుళీభూతములై యున్నట్లుండిన వారి యాత్మలందు నీ దివ్యతేజఃస్ఫూర్తి ప్రబుద్ధ మగుచున్నది. ఎవరును నీ సాన్నిధ్యము బడయుటకై నిరర్థకముగా నిన్ను ప్రార్థించుటలేదనియు, హృదయములందు అంతశ్శుద్ధితో, ఏ వ్యవస్థద్వారా నిన్ను మేము అనుసంధానము చేసినను,—— అది వ్యష్టి శరీరము గావచ్చును, సమష్టి మానవ సముదాయము గావచ్చును,—— అయ్యది ఎంత అజ్ఞానయుతమైయున్నను దాని యచేతనత్వము సంపూర్ణముగా రూపాంతరము చెందుననియు నేను బాగుగా గ్రహించితిని. కాని, ఏ యొక్క యంశమునందైనను, లేక కొన్ని యంశములందైనను చేతనా సహితమగు రూపాంతరమును చెందితిమేని, నివురుగప్పిన నిప్పుచందమున నున్న యా శక్తిరాజము ధగద్ధగ మండి, ఉన్నట్లుండి సత్తనంతను ఉత్తేజితమొనర్చునేని, అప్పుడు మేము నీ గురుతరకార్యమునకు ప్రణతులొనర్చి, నీ యజేయమగు ప్రభావమునకు సాక్షీభూతుల మగుదుము. అంత మేము, మానవు డనుభవింపగల యథార్థసుఖమున కింకొక క్రొత్త యవకాశ మొనగూర్పబడినదని యాశాతరంగిత హృదయుల మగుదుము.

ఓ ప్రభూ, నీవు దుఃఖకలితమగు మానవజాతి నుత్తేజిత మొనర్చి, రూపాంతర మొందించి, స్తుతిపాత్రముగ జేసి, దివ్యజ్ఞాన పూరితమగు శాంతిని సంతరించుచున్నందులకు, దుఃఖితమగు మానవజాతియొక్క కృతజ్ఞతను వ్యక్త పరచుచు నా హృదయపూర్వక సంస్తుతి యూర్ధ్వముఖముగా నీవంకకు బరుగిడుచున్నది.

* * *

మార్చి 28, 1914

మేము పయనమై బయలుదేరినప్పటినుండియు, నీ దివ్యసన్నివేశమును ప్రతిదానియందును మేము చూడగలుగుచున్నాము; నీ దివ్యనియతి ప్రతిచోటను అభివ్యక్త మగుచున్నది. ఇది యంతయు కడుంగడు స్వాభావికమే యని గుర్తించుటకు నా కెంతయో ఆంతరిక విశ్వాసము కావలసియున్నది. అంతకంతకు ఆశ్చర్యపడవలసిన పని యేమియు లేదు.

ఏ క్షణమునందును నేను నీకు వెలిగా జీవించుట లేదు. నా చుట్టును గల సీమాంతరేఖలు ఇప్పటియంత విస్తృతముగా మున్నెన్నడు నాకు కానరాలేదు. ఈ లోతులు సైతము, ఇప్పటియంత తేజోవంతముగను, అగాధముగను ఇదివర కెన్నడును కనబడలేదు. ఓ సనాతన దివ్యగురూ, అంతకంతకు అధికాధికముగ నిన్ను మేము తెలిసికొనుచు, పృథ్విపై మాకు విధించబడియున్న కార్యమును నెరవేర్చునటులను, మాలోనున్న సకలశక్తులను అందుకొరకై మేము పూర్తిగా వినియోగించ గలుగునట్లును, మా యాత్మయొక్క నిశ్చలనీరతాగాధ తలముల లోను, మా యాలోచనలు, అనుభవములు, క్రియాకలాపములందును ప్రాభవోపేతమగు నీ దివ్యసాన్నిధ్య మంతకంతకు సంపూర్ణముగా నభివ్యక్త మగునట్లును అనుగ్రహింపుము.

నాలో జీవించుచున్నది, ఆలోచించుచున్నది, ప్రేమించుచున్నది,— అంతయును నీవే. ఈ స్థితిలో నిన్ను నేనిట్లు సంబోధించుచుండుట కడు వింతగనే నాకు కనుపట్టుచున్నది.

* * *

పుదుచ్చేరి, మార్చి 29, 1914

పరమచైతన్య స్వరూపుడవు, సనాతనధర్మ స్వరూపుడవు నైన ఓ పరమేశ్వరా, నిన్నే మేము తెలిసికొని, అవగాహన మొనర్చుకొని సాక్షాత్కరించుకో వలసియున్నది. నీవే మాకు ఏడుగడవు, మాకు దీప్తి నొసగువాడవు, మా విధిని నిర్ణయించి ప్రేరేపించువాడవు. దుర్బలముగా నున్న యాత్మలకు బలముగలుగునట్లును, భయకలితులకు ధైర్యము కలుగునట్లును అనుగ్రహింపుము. మా యందరి విధివిధానములను నీవే తీర్చి దిద్దునటుల వీరిని సైతము తీర్చి దిద్దుము.

* * *

మార్చి 30 1914

సర్వాత్మనా నీ సేవకులై, నీ దివ్యసాన్నిధ్యజ్ఞానము సంపూర్ణముగా పొంది యున్నవారి సన్నిధిలో, నేను పొందవలసియున్నదాని కింకను కడుంగడు దూరముగ నున్నట్లే నాకు తెలియనగుచున్నది. ఏది అత్యున్నతము, అత్యుదాత్తము, అతి విశుద్ధము అని నేను భావించుచున్నానో అయ్యది, ఇటుపైన నేను భావించవలసియున్నదానితో పోల్చి చూచినచో, అజ్ఞాన కలితమగు అంధకార ప్రాయమనియే చెప్పనగును. కాని, ఇట్లు నేను తెలిసికొనుట, నన్ను క్రుంగదీయుటకు బదులు, నా యాకాంక్షకు, నా శక్తిసంపదకు, సకలావరోధములను జయించి పర్యవసానమున నీ దివ్యనియతితోడను, దివ్యకార్యముతోడను సంపూర్ణైక్యమున మనవలెనన్న నా సంకల్పమునకు, మరింత యుత్తేజనమును, బలమును కల్పించుచున్నది.

నా చుట్టును గల సీమాంతరేఖ కొంచెము కొంచెముగా అంతకంతకు విస్తరిల్లి విస్పష్టమగుచు, మార్గము విశదమగుచున్నది. అంతకంత కధికతరమై విస్తరిల్లు సునిశ్చిత గమ్యమువైపుగా పురోగమించుచున్నాము.

వందలకొలది జీవులు ఘనిష్ఠమైన అజ్ఞానములో కూలద్రోయబడియున్నను ఆందోళన చెందవలసిన పనిలేదు. నిన్న మేము పొడగాంచిన మహనీయుడు

భూమిపై నున్నాడు. అంధకారము ప్రకాశముగా పరివర్తనముచెంది, పృథ్విపై నీ రాజ్యము ప్రతిష్ఠింపబడు దినము రాగలదని నిరూపించుటకు ఆయన సన్నిధియే చాలును.

ప్రభూ, ఈ అద్భుతమును నిర్మించుచున్న దివ్యస్థపతివి నీవు. దీనిని గురించి తలపోసినపుడు, మహదానందభరితమై కృతజ్ఞతా భావమున నా హృదయము పొంగి పొరలుచున్నది.

మాటల కందని భక్తిభావము నాలో పెల్లుబుకుచున్నది. నిశ్చల నీరవ మౌనస్థితిలో వినయవినమ్రురాల నగుచున్నాను.

* * *

ఏప్రిల్ 1, 1914

పరమ పవిత్రమైన నీ యాలయగర్భములోనికి ప్రవేశించి యచట మేము నీ యిచ్ఛనే సాక్షాత్తుగా తెలిసికొన్నట్లుగా నాకు దోచుచున్నది. నాలో ఒకానొక మహదానందము, ఒకానొక గభీరశాంతి రాజ్యమేలుచున్నది. అర్థరహితమైన స్వప్నమువోలె, నా అంతరమున నేను చేసికొన్న కల్పనలన్నియు అంతర్ధానమై పోయినవి. వ్యక్తిత్వమింకను పొందని జీవివోలె, ఏ చట్రముగాని వ్యవస్థగాని లేక, నీ యనంతత్వ సమ్ముఖమున నే నిపుడు నిలువబడియున్నాను. గతించి పోయిన దంతయు, ముఖ్యముగ దాని బాహ్య స్వరూపము, పరిహాసాస్పదమై, నిరుపపత్తికమై కనుపట్టుచున్నది అయినను, ఆ కాలమున అప్పటికది ఉపయోగకరమే యైనదని నాకు తెలియును.

కాని, ఇప్పుడు మాత్ర మంతయును మారిపోయినది : ఒక వినూత్నమైన దశ యారంభమైనది.

* * *

ఏప్రిల్ 2, 1914

ప్రతిదినము, నేను వ్రాయుటకు దలపెట్టిన నిముసమున, మా యెదుట విచ్చుకొను నవయుగము విస్తరణయుగముగాని కేంద్రీకరణయుగము కాదన్నట్లు ఒక రకమగు అంతరాయ మేర్పడుచున్నది. ప్రగాఢమైన నీరవ నిదిధ్యాసనముగాని, లిఖితమో అలిఖితమో యైన ధ్యానరూపమునగాని గాక, అనుక్షణ కార్యాచరణమున నిన్ను సేవించుచు, నీతోడి యైక్యమును మేము సాధించవలసియున్నది.

కాని, నా హృదయ మెన్నడును నిన్ను కీర్తించుటయందు విసువుచెందదు. నా చిత్తవృత్తియందు సంతతము నిండియున్నది నీవే.

* * *

ఏప్రిల్ 3, 1914

ఇపుడు నే నొక నూతనజన్మ యెత్తుచున్నట్లుగా నున్నది. గతకాలపు పద్ధతులు, అలవాట్లు ఇప్పు డెంతమాత్రము పనికిరావు. ఒకప్పుడు ఫలప్రాయముగా చూపట్టిన దంతయు ఇప్పుడు నాకు సన్నాహమాత్రముగా గోచరించుచున్నది. ఇంతవరకు నేను సాధించినదేమియు లేనట్లుగా, ఆధ్యాత్మిక జీవనమే నాకు తెలియనియట్లుగా, ఆ మార్గములోనికి ఇపుడే క్రొత్తగా ప్రవేశించుచున్నట్లుగా నాకు తోచుచున్నది. నా కేమియు తెలియదనియు, దేనిని రూపొందించుటకును నాకు సమర్థత లేదనియు, అనుభవమనునది యికమీద క్రొత్తగా ప్రారంభము కావలసియున్నదనియు అనిపించుచున్నది. నా గతజీవితమంతయు—— నేను చేసిన పొరపాటులు, సాధించిన విజయములు, అన్నియు—— నానుండి గళితమైపోగా, అది యెల్ల అంతర్ధానమై క్రొత్త దేదియో జన్మించి నట్లుగానున్నది. దాని రూపురేఖ లింకనూ ఏర్పడలేదు. గతకర్మ యనునది దానికి మృగ్యము. ఉపయోగపడదగిన అనుభవములేదు, దిద్దుకోవలసిన తప్పులును లేవు. ఏ విధమైన జ్ఞానము, ఏ విధమైన నిశ్చయము లేక నా మెదడు ఖాళీగానున్నది. వ్యర్థభావనలు సైతము అచట లేవు. ప్రతిఘటన మేమియు చూపక ఈ స్థితికి నేను

అర్పణ మొనర్చుకొందునేని, తెలుసుకోవలెననెడి ప్రయత్నము సైతము చేయక కేవలము శిశువువలె అజ్ఞముగా, అమాయికముగా నుండ నిచ్చగింతునేని, ఒకానొక నూతనావిర్భూతి ఏదియో నా యెదుట విచ్చుకొన గలదని తోచుచున్నది. ఇప్పుడు నేను సునిశ్చితముగ ఆత్మార్పణము గావించుకొని, వట్టి ఖాళీపుటవలె నుండవలసిన తరుణము వచ్చినది. ఈ ఖాళీపుటపై, ఓ పరమేశ్వరా, నీ సంకల్పము, నీ భావనయే, ఎట్టి వికృతులను బొందక యథేచ్ఛగా తమ్ము దాము ఉల్లేఖించుకోవలసి యున్నది.

అపారమైన కృతజ్ఞతాభావము నానుండి పెల్లుబుకు చున్నది. నే నింత కాలముగా అన్వేషించుచు ప్రయాణించిన ద్వారదేశము నెట్టకేలకు చేరుకొన్న ట్లనిపించుచున్నది.

ఈ ద్వారదేశమును అసందిగ్ధముగ దాటగలుగుటకై వలయు విశుద్ధిని, నిర్వ్యక్తిక స్థితిని, నీ దివ్యప్రేమచే నుద్దీప్తమగు యోగ్యతా సంపత్తిని, ఓ ఆత్మేశ్వరా, నా కనుగ్రహింపుము.

ఏ విధమైన తమస్సు, పరిమితి లేకుండ, నీ దాసనై మెలగు టే నేను కాంక్షించునది.

* * *

ఏప్రిల్ 4, 1914

ఓ పరమేశ్వరా, అత్యంత భక్తిభావముతో నీ పూజనము నాలోనుండి ఊర్ధ్వముఖమై యుద్గమించుచున్నది. నా యావత్సత్తయు నీకు నివేదితమైన యొక దీపజ్వాలగా, ఎడతెగని యాకాంక్షగా, రూపు గైకొనియున్నది.

ఓ ప్రభూ, ప్రభూ, నా ప్రియగురూ, నాలో నివసించుచున్నది, సంకల్పించుచున్నది నీవే.

ఈ శరీరము నీ చేతి సాధనము; ఈ సంకల్పము నీకు దాసభూతము; ఈ బుద్ధి నీ యుపకరణము; ఈ సమస్తమూ కేవలము నీవే.

* * *

ఏప్రిల్ 7, 1914

పోరాటమునుండి తప్పించుకొనుటకే నేను సదా ప్రయత్నింతునేని, ఇక నా ధైర్య మేపాటిది? చేయవలసియున్న నూతన ప్రయత్నమునకు సహజముగ వెనుకాడుచు, పూర్వముచేసిన ప్రయత్నఫలితములపై ననే ఆధారపడి తటస్థభావమున నాకు తెలియకుండగనే నిద్దురకు దొరకొందునేని, నా శక్తిసామర్థ్యములును గణుతింపదగినవి కానేరవు. బలాత్కారమునగాని కార్యాచరణకు నేను పూనుకొనలేకున్నాను. నేను చేయు మౌనధ్యానము కొంతవరకు బద్ధకముతో గూడినదే.... ఇదంతయు నా కంతకంతకు స్పష్టముగా గనిపించుచున్నది. ఇప్పటివరకు నేను చేసినదంతయు వట్టి శూన్యప్రాయముగనే నాకు దోచుచున్నది. ప్రభూ, నీ సేవకై నేను వినియోగించెడి యీ యుపకరణ మెంత దుర్బలమో, లోపభూయిష్ఠమో నేను గుర్తించుచునే యున్నాను. నన్ను గురించియు, నేను చేయు ప్రయత్నముల గురించియు, వాని ఫలితముల గురించియు తలపోసికొని అప్పుడప్పుడు నన్ను నేను ప్రశంసించుకొనుటకు సిద్ధపడుటను జూచి నాలో నాకే విచారముతో గూడిన నవ్వు వచ్చుచున్నది. సత్యజీవనపు ద్వారదేశమును నేను చేరుకోగలిగితినన్నట్లుగా నిత్యము నాకు కలుగుచున్న భావన ఆశామాత్ర జనితమేగాని, సుస్పష్టాను

భవజన్యము కాదు. అది పిల్లవాని కాశపెట్టిన ఆటబొమ్మవంటిది; దుర్బలులకు ఇవ్వజూపిన పారితోషికము.

మరి నేను సంపూర్ణముగా ధైర్య, బల, శౌర్య గుణములతో కూడిన, ప్రశాంతనిశ్చలమైన పట్టుదలగల నిక్కమైన సత్వసంపత్తిని చేకూర్చుకో గలుగు టెప్పటికి ? ఎప్పటికి నేను పూర్తిగా నా వ్యక్తిత్వమును విస్మరించి, కేవల మొక ఉపకరణముగా మారి, అది అభివ్యక్తము గావింపవలసియున్న శక్తులకు నిధానము కాగలుగుట ? నీతోడి నా ఏకత్వజ్ఞానములో జడత్వ మిశ్రణము లేకుండబోవు టెన్నడు ? ఎన్నడు నా దివ్యప్రేమానుభూతిలో దౌర్బల్య మను నది ఏమాత్రమును కలగాపులగము గాకుండుట ?

ప్రభూ, ఈ ప్రశ్నలు నేను వేయుటతో, చిత్తవృత్తి యెల్ల నాలో సమసి పోయినట్లున్నది. ఎరుకగల మనస్సుకొరకు నే నన్వేషించినను అది కాన వచ్చుటలేదు. నా వ్యక్తిత్వముకొర కన్వేషించినను దాని జాడ ఎచ్చటను లేదు. నా వైయక్తిక సంకల్పముకొర కన్వేషించగా అదియు అదృశ్యమే యైనది. నీకొర కన్వేషించుచుంటిని గాని, ఏ వాక్కు నీనుండి వినవచ్చుట లేదు. నిశ్చల నీరవత మాత్రమే యున్నది, కేవలము నిశ్చల నీరవత.

ఇదిగో, ఇప్పుడు నీ వాణి యిట్లు వినవచ్చుచున్నట్లున్నది : "సర్వసమగ్ర ముగా ఇంతవర కెన్నడును నీవు సమసిపోవుట జరిగియుండలేదు. సర్వదా నీలో ఏదియో, తెలియవలెనని, చూడవలెనని, అవగాహన మొనర్చుకోవలెనని, కోరుచునే వచ్చినది. సంపూర్ణముగా ఆత్మసమర్పణము గావించుకొనుము; నీ వనునది లేకుండజేసికొను టెట్లో నేర్చుకొనుము; నిన్ను నానుండి వేరుచేయు చున్న అడ్డుకట్టను భేదించుము; ఎట్టి మినహాయింపులు లేక నీ సర్వసమర్పణ కార్యమును సాధింపుము."

ప్రభూ, ఏమి చెప్పుదును ? ఇది సాధించవలెననియే ఎంతకాలమునుండియో కోరి ప్రయత్నించుచుంటిని. కాని, నా చేతగాలేదు. ఇపుడైనను నీవు నాకీ శక్తి ననుగ్రహింతువా ?

ఓ పరమేశ్వరా, ప్రియతమ సనాతనగురుదేవా, నన్ను వేదనపాలు గావించు చున్న నాలోని యీ యవరోధమును విచ్ఛిన్నమొనర్పుము.... నా యహంతనుండి నాకు ముక్తి ననుగ్రహింపుము.

* * *

ఏప్రిల్ 8, 1914

ఓ పరమేశ్వరా, నా బుద్ధి ప్రశాంతమై, హృదయము విశ్రాంతిని గొన్నది. ప్రగాఢ భక్తిభావముతో, అపార విశ్వాసముతో నీ దెసకు మళ్ళినాను. నీ ప్రేమ సర్వశక్తిప్రపూర్ణమనియు, నీ న్యాయరీతి పుడమిపై రాజ్యమేల గలదనియు నాకు తెలియును. కట్టకడపటి తెర తొలగిపోయి, సమస్తమైన అకృత్యము అదృశ్యమై శాంతిసామరస్యయుత ప్రయత్నమునకు ఆలవాలమైన యుగము ఆవిర్భవించ గలదనియు నే నెరుంగుదును.

ప్రభూ, నా బుద్ధి యంతర్ముఖమై, హృదయమున శాంతి విరాజిల్లుచున్నది. నీ కడకే నా యభిసరణము; నీ దివ్యసన్నిధియే నా సత్త్వయం దంతటను నిండి యున్నది. ప్రతి వస్తువులో నిన్నే నేను దర్శించునటులను, నీ దివ్య జ్యోతి తోనే సమస్తమూ ప్రకాశించునటులను అనుగ్రహింపుము. ద్వేషములు శమించు గాక; వైరము లదృశ్యమగునుగాక; భయములు పటాపంచలగుగాక; సంశయ ములు తీరిపోవుగాక; అసూయా మాత్సర్యములు జయింపబడుగాక. ఈ పట్టణ ములో, ఈ దేశములో, ఈ పుడమియం దంతటను, సకల రూపాంతరీకరణము నకును మూలమైన యీ దివ్యప్రేమ సర్వహృదయములలోనూ స్పందించి అను భూతమగునుగాక.

ప్రభూ, నీ దివ్యప్రేమానుగ్రహము పొందుటకై ప్రగాఢ భక్తిభావమున నిన్ను వేడుకొనుచున్నాను. నా యాకాంక్ష యథోచితమైన గాఢత్వము నలవ రించుకొని, ఎల్లెడల గూడ అట్టి యాకాంక్షనే ప్రబుద్ధ మొనర్పగలుగునట్లుగా అనుగ్రహింపుము. దయ, శాంతి, న్యాయము ప్రాభవోపేతముగ సర్వత్ర విల సిల్లునుగాక; అజ్ఞానపూర్వకమైన అహంత విజితమై, అంధకారమెల్ల నాకస్మికముగ

నీ విశుద్ధతేజముచే దీప్తమగునుగాక; అంధులు చూడనేర్తురుగాక, బధిరులు విన నేర్తురుగాక, సర్వత్ర ధర్మనియతియే ప్రకటీకృతమగునుగాక, నానాటికి వృద్ధి చెందు నైక్యభావముతో, అంతకంతకు నిర్దుష్టమై విరాజిల్లు సామరస్యముతో, ఎల్లరును నీతో ఐక్యము చెంది పుడమిపై నిన్ను అభివ్యక్త మొనర్పగలుగుటకై, ఒకే వ్యక్తివోలె నీ వైపుగా చేతులు సాచి నిన్ను అభిసరింతురుగాక.

ఓ ప్రభూ, నా బుద్ధి యంతర్ముఖమైనది; నా హృదయము సవితృ తేజమును నింపుకొనియున్నది. ఏ మినహాయింపులును లేక నన్ను నీకు సమర్పణ మొనర్చుకొనుచున్నాను. "నేను" అనునది నాలో అదృశ్యమైపోవుచున్నది.

* * *

ఏప్రిల్ 10, 1914

ఉన్నట్లుండి యవనిక చీలిపోయినది; నింగియు నేలయు గలియుచోటు దృగ్గోచరమైనది. ఆ నిర్మల దృశ్యము ముందర నా సత్త అంతయు అధిక కృతజ్ఞతాపూర్వక విజృంభణమున భవదీయ పాదాక్రాంతమైనది. ఈ యానందము గాఢము, పూర్ణము నైయుండినను, శాశ్వతికమైన శాంతితో సకలము శాంతిమయమై విరాజిల్లినది.

పరిమితు లన్నియు తొలగిపోయినట్లయినది; ఇంద్రియ సంవేదనము, రసభావానుభవములు, దేహస్ఫూర్తి,— ఇవన్నియు దూరములైనవి. అనిర్వచనీయమగు దివ్యానందముతో నిండి, ప్రేమతోడను, తేజస్సుతోడను సంవిద్ధమై, స్పష్టము, శుద్ధము, ప్రసన్నమునైన ఒకానొక అనంతత్వము నాయందు భాసించుచున్నట్లయినది. అదియే ఇప్పుడు 'నేను' గా నాకు దోచుచున్నది. ఈ 'నేను', స్వార్థపరత గలిగి యావరణపరీతమైన మునుపటి 'నేను' కంటె కడు విలక్షణమైనది. ప్రభూ, మా సౌభాగ్యముల కెల్ల ఏడుగడనైన ఓ దేవా, ఇప్పుడా 'నేను' నేనో నీవో నుడువజాలను. అంతయు నొకానొక శక్తివలె, ధీరతవలె, సత్య సంకల్పమువలె, అఖండ మాధుర్యమువలె, నిరుపమాన కారుణ్యమువలె గనుపట్టుచున్నది.

ఈ కడపటి దినములకంటె కడు బలవత్తరముగా, గతమంతయు నవ్య జీవితపు కిరణజాలము క్రింద పూడుకొనిపోయి ప్రగ్గినట్లుగా గోచరించుచున్నది. ఈ పుస్తకములోని వెనుకటి పుటల గొన్నిటిని జదువుచు నా దృష్టిని నేను వెనుకకు బారనిచ్చినప్పుడు, తన్నాశము నిశ్చయముగా జరిగినట్లు రుజువగుచున్నది. అంత నేను, నా తలమీది భారము దిగిపోయినట్లు కాగా, నగ్న శిశువువోలె నిష్కాపట్యముతో నన్ను నేను నీకు సమర్పణము గావించుకొనుచున్నాను.... ఇప్పటికిని నేను కనుగొనుచున్నది ఆ శాంతియుతమగు శుద్ధ ఆనంత్యమునే. ఓ పరమేశ్వరా, నా ప్రార్థనమును నీవు మన్నించినావు; నే నేమి నిన్ను వేడితినో దానిని ప్రసాదించినావు. 'నే' ననెడి యహంత తిరోధానమైనది; నీ కైంకర్యము కొరకై, అనంతము, నిత్యము నగు విజ్ఞానదీధితుల గేంద్రీకరించి యావిష్కరించునట్టి యీ వినయవినమ్ర పరికరముమాత్రము నిలిచియున్నది. దేవా, నా జీవితమును నీ జీవితముగా మార్చినావు; నా సంకల్పమును స్వీకరించి, దానికి నీ యిచ్ఛతో పొత్తు గూర్చినావు; నా ప్రేమను గైకొని నీ ప్రేమతో సమీకరణ మొనర్చినావు; నా తలపుల నందుకొని, వాని స్థానమున నీ యవిచ్ఛిన్నచేతనను నెలకొల్పినావు.

ఇందుల కెంతేని అచ్చెరువొందుచు ఓ దేవా, ఈ శరీరము, తన శీర్షమును నేలకు వంచి, మౌనమున సవినయముగా నిన్ను పూజించుచున్నది.

వికార రహితమైన నీ సముజ్జ్వల శాంతి వైభవమున విలసిల్లుచు ఉనికి గలిగియున్నది నీ వొకడవే; నీకు దక్క మరి దేనికిని ఉనికి లేదు.

* * *

కరైకాల్, ఏప్రిల్ 13, 1904

నేను కేవలము అలవాటులతోనే జీవించే జీవిని కాకుండజేయుటకు సకల పరిస్థితులు పన్నాగము పన్నినట్లున్నది. ఈ వినూత్నదశలో, అస్థిరమైన యీ సంకీర్ణ పరిస్థితుల నడుమ, నీ అవ్యయశాంతిని ఇంత సమగ్రముగా ఎన్నడును అనుభవించి యుండలేదు; నీ దివ్యశాంతిని నిరాటంకముగ కొనసాగింపజేయుచు, 'నేను' అనునదికూడ ఇంత సమగ్రముగా ఎన్నడును అదృశ్యమై యుండలేదు. సమస్తము ఇపుడు సుందరము, సామరస్యోపేతము, సుస్థిరశాంతి సమన్వితము నై యున్నది. అంతటను నీవే నిండియున్నావు. ధగద్ధగాయమానమై వెలుగు సూర్యునిలో ప్రకాశించుచున్నది నీవే; కమ్మనై వీచు పిల్లగాలిలో అనుభవించబడు చున్నదియు నీవే; ఎల్లరి హృదయములలో నీవే అభివ్యక్త మగుచున్నావు; ఎల్ల జీవులలో నీవే జీవించుచున్నావు. నిన్ను గురించి నాతో మాట్లాడని జంతువు లేదు, మొక్క లేదు. నాచే చూడబడు సమస్తముపైనను నీ నామమే లిఖించ బడి యున్నది.

ఓ నా ప్రియతమ ప్రభూ, నన్ను పూర్తిగా నీ దానిని జేసికొనుటకు తుద కనుగ్రహించినావు; నా చేతనను సునిశ్చితముగ నీతో ఏకము గావించుకొన్నావు; ఇట్టి మహదానందమును బొందు యోగ్యతకు నే నేమి యొనర్చితిని? అనవరతము దానిని కోరుటయు, దానికై సంకల్పించుటయు దక్క ఇంకేమియు చేయలేదు; అది చాల కొద్దిపాటిదే.

కాని, ప్రభూ, ఇపుడు నాలో నివసించుచున్నది నీ యిచ్ఛయేగాని నాయిచ్ఛ కాదు గావున, ఈ యానందమును నీవు ఎల్లరకును ప్రయోజనకారి యగునట్లు చేయగలవు. అత్యధిక సంఖ్యాకులకు నిన్ను చూడనేర్చు భాగ్య మలవరించు టే ఈ యానంద ప్రయోజనము.

ఎల్లరును నిన్నెరిగి, నిన్నే ప్రేమించి, నిన్నే సేవింతురుగాక; పరమమైన ఆత్మనివేదనము ఎల్లరకును అలవడునుగాక.

దివ్యమైన ఓ ప్రేమరసమా, జగత్తునందంతటను వెల్లివిరిసి వ్యాపించుము; సకల ప్రాణులను పునరుజ్జీవింపజేయుము; సకల బుద్ధులకు దీప్తిని ప్రసాదించుము; అహంకారపు అడ్డుకట్టలనెల్ల భేదించి, అజ్ఞానావరోధమును పటాపంచలొనర్చి, సకల ప్రపంచమునకు దివ్యాధినేతవై దీపింపుము.

* * *

పాండిచెరీ, ఏప్రిల్, 17, 1914

ఓ ప్రభూ, సర్వశక్తిమయా, పరమసత్యస్వరూపా, ఏ దోషముగాని, యెట్టి యవిస్పష్టతగాని, విపత్కరమైన యెట్టి యజ్ఞానముగాని, నా బుద్ధిలోనికిని, హృదయములోనికిని చొరనీయకుము.

కర్మాచరణమునందు నీ యిచ్ఛకును, శక్తివిశేషములకును అప్రతిహతముగ సాధనభూతమై యుండునది వ్యక్తిత్వము. ఈ వ్యక్తితత్వ మెంత ప్రబలముగను సంకీర్ణముగను, చైతన్య విశిష్టముగను ఉండునో, అంతగా నది యుపయోగకరమై పటిష్ఠముగ సేవచేయగలిగియుండును. కాని, యీ వ్యక్తితత్వముయొక్క సహజ లక్షణమును బట్టి చూడ, వయ్యది తాను భగవంతునికంటె వేరనెడి భ్రాంతిలోనికి సులభముగా నీడ్వబడునట్టి లక్షణము గలిగి, కడకా భ్రాంతి క్రమక్రమముగ నీకును నీవు దేనికై కృషి చేయగోరుదువో దానికిని మధ్య నొక యవనికగా నేర్పడును. ఇట్లు జరుగుట యది ప్రారంభమున విన్ను నీవు నాయందు అభివ్యక్త మొనరించు కొనునపుడుగాక, తదనంతర మా అనుభవమును పొంది ఆ సత్యానుభవమును నేను వ్యక్తపరచునపుడు జరుగును. అనగా, నా వ్యక్తితత్వము నీకు విధేయ సేవకురాలివలెను, నీకు చెల్లించవలసినదానినెల్ల చెల్లించు మధ్యవర్తిగను ఉండక, నీ వొసంగిన శక్తులను పరిశుద్ధముగ నీ కొరకే మరల నుపయోగించక, నీవు దానికి ప్రసాదించిన శక్తులలో కొంతభాగమును తన నిమిత్తమై యుంచుకొనుట కాశించుచుండును. అప్పుడది నుడువు సమాధానమిది :— "దీనినిగాని దానిని గాని నేనే సాధించినాను, ధన్యవాదములు నాకే చెల్లవలసియున్నవి...." ఈ అజ్ఞాన జన్యమైన అసత్యము ఉపద్రవకరమైన భ్రాంతి. ఇది యెపుడును బయటపడి విస్ప

ష్టమైనది. ఇదియే కర్మఫలమును దినివేయు వ్రణము; ఇదియే ఫలపరిణామము లను విద్ధము గావించు వేరుపురుగు.

ఓ ప్రభూ, ప్రియతమగురూ, పరమసత్యస్వరూపా, నాలోనున్న 'నే' నను అహంతను పారద్రోలుము. వ్యక్తమగు ప్రపంచ మెంతవరకుండునో అంతవరకును 'నే' ననునది నీ యావిష్కారము కొరకై యుండుట అవశ్యకము. ఈ 'నేను'ను లయమొనర్చుటయు, తక్కువ పరచుటయు, దుర్బల పరచుటయు, నీ వావిష్కరించు సాధనమును కొంచెముగనో గొప్పగనో నీకు లేకుండజేయుచే యగును. కాని, ఖండితముగ మొదలంట అణగద్రొక్కబడవలసినది మిథ్యా భావన, మిథ్యాసంవేదన, మిథ్యాదృశ్యము నైన 'నే' ననెడి పృథగ్భావము, ఏ కాలమందుగాని, ఏ పరిసరమందుగాని, 'నే' నని మే మనుకొనుదానికి నిన్ను వినాయించి వేరు వస్తుత్వము లేదను సంగతి మేము మరువరాదు.

ఓ ప్రియతమగురూ, ఓ పరమేశ్వరా, నా హృదయమునుండి యీ మిథ్యను 'నేను' అనెడి పృథగ్భావమును, పెకలించివేయుము. అందుమూలమున నీ సేవకురాలనై, నీకు నేను చెల్లించవలసినదాని నంతను, భక్తిపూర్వకముగను, పరిపూర్తిగను జెల్లించి పరిశుద్ధురాలను, భక్తితత్పరురాలను అగుదునుగాక. ఏకాంతమున నా యజ్ఞానమును గురించి విచారణచేసి తెలిసికొని, సదా దానిని పారద్రోలుదునుగాక. ఓ దేవా, నా హృదయములోని యజ్ఞానపు నీడను పూర్తిగా తరిమివేయుము. నీ దివ్యజ్యోతియే అచట నెలకొని అప్రతిహతముగ రాజ్యమేలుగాక!

* * *

ఏప్రిల్ 18, 1914

నిన్న సాయంతనము, కడపటి తెర దాదాపు ప్రీలిపోయినది; అంధప్రాయము, అజ్ఞానయుతమునైన వ్యక్తిత్వపు మూలదుర్గము వశముకాగల చిన్నెలు గోచరించినవి; నిక్కమైన నిర్వ్యక్తికసేవ యన నెట్టిదో మొట్టమొదటి సారిగ నాకు తెలిసినట్లయినది; పూర్ణోపలబ్ధికి అడ్డుగా నిలిచిన అవరోధము అల్పాల్పమై, నిశ్చయముగ అంతర్ధానమై పోనున్నట్లు తోచినది. కాని, వెలికర్తవ్యముల యావశ్యకత శుభంకరము, సుఖదాయకము నైన యీ ధ్యానస్థితినుండి నన్ను వెనుకకు లాగివైచినది. తిరిగి నేను బాహ్యచేతనలోనికి మరలవలసి వచ్చుసరికి, ప్రీలిన తెర మరల మూసుకొనిపోయి, చీకటి వెనుకటికంటె ఎక్కువగా ముసురుకొన్నట్లయినది. అంత మహనీయమైన వెలుగు సాక్షాత్కరించిన పిమ్మట తిరిగి యీ అజ్ఞానాంధకారములోనికిట్లు పతనము చెందుట కేమి హేతువు?

ప్రభూ, ప్రభూ, ఇకనైనను నేనీ యజ్ఞానములోనుండి బయటపడి, నీతో ఏకమైపోవునట్లు అనుగ్రహింపవా? ఈ పృథ్విపై కొనసాగవలసియున్న కార్యస్వరూప మెట్టిదో నాకిపుడు చక్కగా తెలిసినది కావున, ఇకనైనను దానిని నెరవేర్చు సామర్థ్యము నాకు అలవడవలదా? ఈ అజ్ఞానమునకు, ఈ మాయతెరకు నేనిట్లు కట్టువడిపోవలసినదేనా?

అంత మహనీయమైన, స్వచ్ఛమైన వెలుగు సాక్షాత్కరించిన పిమ్మట తిరిగి యీ చీకటి యేమి? బాధాసంకులమైన యభ్యర్థనమున నా యావత్సత్తయు అర్రులు సాచుచున్నది.

ప్రభూ, నా పైన దయచూపుము.

* * *

ఏప్రిల్ 19, 1914

మా బుద్ధిని అనవరతము నీపై నిలిపియుంచియే వెలికార్యాచరణము మేము గావించుటకును, నీతో పూర్ణముగ ఏకత్వమును బొంది, "పరమచైతన్య" మనియు, "యథార్థమైన సర్వజ్ఞత" యనియు నేను పేర్కొనెడి స్థితికి చేరుకొనుటకును ఎంతయో భేదమున్నది. బుద్ధిని నీయందు స్థిరముగా నిలిపి మేము కార్యాచరణ మొనర్చుట పైతము, ఎటు పోవలెనో మాత్రము తెలిసిన గ్రుడ్డివాడు వీధిలో నడచుటవంటిదే యగును. తాను నడచు మార్గస్వరూప మెట్టిదో వానికి తెలియదు. దేనిని గాని మరచిపోకుండ సరిగా నడచుటెట్లో వా డెరుగడు. అట్లుగాక, రెండవ పద్ధతిలోని కార్యాచరణమునందు, నిండు వెలుగులో దృష్టి చక్కగ గనుపించుచుండును. ఎంతటి చిన్న యవకాశమునైనను జారవిడువక వినియోగించుకొనగల స్థితి యేర్పడును. కార్యాచరణము సమగ్రము, అత్యధిక ఫలప్రదము నగును. ఒకవేళ, రెండవపద్ధతి అలవడుటకు ముందు మొదటి విధానమే తప్పనిసరి యగు నేని, రెండవదియైన పరిపూర్ణానుసంధానసంసిద్ధికై ప్రయత్నమును క్షణమాత్ర మేనియు మేము విడిచిపుచ్చరాదు.

కాని, నా హృదయమున శాంతి నెలకొనియున్నది. బుద్ధియందు తొందరపాటేమియు లేదు. శిశువున కుండు ప్రసన్న విశ్వాసముతో నీ యిచ్ఛకు నన్ను నేను సమర్పించుకొనుచున్నాను.

సర్వత్ర నీ శాంతియే విలసిల్లుచుండును గాక.

* * *

ఏప్రిల్ 20, 1914

ఎంతెంతగనో ఆశించి, నా బాహ్యసత్త అంతయు నీ కార్యాచరణ కుపకరణము కావలసియున్నదనెడి విశ్వాసమును పూరించుకొని, జటిలము, అజ్ఞానయుతమునైన అహంకారమునుండి విడుమరగాంచగలనన్న ధైర్య మలవరచుకొన్న యనంతరమునగూడ, ఎప్పటివలెనే నే నింకను గమ్యమునకు చాల దూరముగనే యున్నట్లు, ఎప్పటివలెనే అజ్ఞానము, అహంకారము నాలో ఇంకను ప్రోదిచేసికొని యున్నట్లు నా కనిపించుచున్నది. నిశ్చేతన క్షేత్రములగుండ మార్గ మింకనూ అంతులేనిదిగనే మరల కనుపట్టుచున్నది. పరమమైన యా దివ్యద్వారము తిరిగి మూసుకొనిపోయినది. పరమపవిత్రమైన ఆ యాలయములోనికి ప్రవేశించుశక్తి ఏమాత్రమూ లేక గుమ్మము ముందరనే నే నింకనూ చదికిలబడి పోయినట్లున్నాను. కాని, ఏమి సంభవించినను ప్రశాంత నిశ్చల హృదయముతో ప్రసన్నముగ నుండగలుగుటను నేను నేర్చుకొన్నాను. ఓ పరమగురూ, నిన్ను నే నర్థించునది ఒక్కటే: కొంత కాలమువరకీ యుపకరణము నిశ్చేతనమున ప్రమగ్గవలసి వచ్చినను, ఏ పొరపాటులూ నేను చేయకుందునుగాక; నీ దివ్యనియతికే అత్యధిక శ్రద్ధాభక్తులతో కట్టువడి విధేయమై నడుచుకొనునట్లనుగ్రహింపుము.

ప్రభూ, ప్రగాఢమైన విశుద్ధభక్తితో నీ కిదే ప్రణమిల్లుచున్నాను; ఎల్లరి హృదయములలో నీవే రాజ్యమేలుదువుగాక.

* * *

ఏప్రిల్ 23, 1914

సకల నిబంధనలు మాయమైపోయినవి; శిక్షణక్రమమంతయు అంతర్ధాన మైనది; ప్రయత్న మనునదెల్ల నిలిచిపోయినది; ఇది నా సంకల్పమువలన కాదు, కాదనియే నా తలంపు; ప్రాలుమాలిక వలన సైతము గాదు; పరిస్థితుల వన్నాగము వలననే అది యట్లు జరిగినది. చుక్కాని పట్టువానివలె సదా జాగరూకమైయుండు ఈ నా యంతఃసంకల్పము (ఆరతి కర్పూరమువలె) హరించిపోవుటో. లేక నిద్దురపోవుటో జరిగినట్లు తోచుచున్నది. నా యావత్సత్తయు ప్రశాంతముగ ఆత్మార్పణ మొనర్చుకొన్నదానివలె నున్నది. ప్రవాహ మెటు గొంపోయిన నటు పోవుటేగాని వేరేమియు లేదు. ఇప్పటివరకు నడకయంతయు సూటిగనే యున్నట్లు తోచుచున్నది. ప్రవాహమును నడపించుచున్నవాడవు, ఓ ప్రభూ, నీవేయన్న విశ్వాసమును నిలుపుకొనియున్నాను. కాని, పూర్వము నేను నిశ్చయముగా, స్వచ్ఛందతగాని పేశలత్వముగాని లేక, మితిమీరిన నియమకాఠిన్య మవలంబించుటయను తప్పిద మొనరించి యున్నచో, ఇప్పుడు నేను కేవలము దానికి వ్యతిరేకమైన రీతిలో వ్యవహరించుచున్నట్లున్నాను. నా ఉన్న ఉనికినే ప్రశాంతముగ నే నామోదించి, పరమమైన సత్యచేతనను నీవే నాకు, అవసరమని నీకు తోచినప్పుడు, ప్రసాదించగలవనెడి నమ్మకముతో నున్నాను.

నిరంతర గమనమున నున్న యీ జగమంతయు, క్రమక్రమముగ తనంత తాను విప్పారుచు ప్రదర్శితమగుచున్న నాటకముగా భావించుచున్నాను. దీనియందు నేను, ఇది సత్యమని, కడు ముఖ్యమైనదని విశ్వసించుచున్నట్లుగనే, తదనుగుణమైన శ్రద్ధతో, శక్తివిశేషముతో పాల్గొనుచున్నాను. ఇది యంతయు కేవలము నూతనానుభవము. కాని, విశేష మేమనిన, నా బుద్ధి, హృదయము ఇప్పుడు పొందినంతగా మున్నెన్నడును పూర్ణవిశ్రాంతిని పొందియుండలేదు. దీని ఫలిత మెట్లుండగలదో నే నెరుగను. కాని, ఓ ప్రభూ, నిన్నే నేను నమ్ముకొని యున్నాను. ఈ యుపకరణము నెట్లు ఉపయోగించి తీర్చిదిద్దవలెనో నీవే యెరుగుదువు.

* * *

ఏప్రిల్ 28, 1914

సమస్త జగమునకు నీవే ప్రభువవు; నీ నియతియే కచ్చితముగ మా యెదుట విచ్చుకొని ప్రవర్తిల్లుచున్నది. ప్యారిసునుండి బయలుదేరుటకు ముందు నేను భావించినట్లు (అట్లు భావించునట్లు ప్రేరణ కలిగించినవాడవు నీవే), ప్రపంచమున నీ కార్యమునకు చక్కగా ఉపయోగపడుటకు ఏది ముఖ్యముగ కావలెనో అటులనే జరిగినది.

చీకటులను, పొరపాటులను తొలగద్రోయుచు, స్థూలదృష్టికి విజయవంత మగుచున్నట్లు దోచు కపటశక్తుల విజృంభణ మనెడి చిత్తడి భూమిపై అత్యద్భుతము, శాశ్వతమునైన ఉషోదయమువలెతి ప్రకాశించుచున్న నీ దివ్యశక్తితోడి యనుసంధానమున పరమానందముతో నేను నిమగ్నురాలనైతిని. అంతయును వెలుగులోనికి వచ్చినది. అంతశ్శుద్ధి రూపమైన నిండువెలుగువైపుగా మేమొక అడుగు ముందుకు వేయగలిగినాము. ఈ నిండువెలుగే పృథ్విపై నీ రాజ్యస్థాపనమున తొలిఘట్టము కాగలదు.

భావింపనలవికాని ఓ దివ్యజ్యోతి స్వరూపా, సకలమైన అజ్ఞానమును, అహంకారమును పటాపంచలొనర్చు విజయుడవు నీవు; మా బుద్ధులకును, హృదయములకును వెలుగు ప్రసాదించువాడవు; దివ్యజ్ఞాన, దివ్యప్రేమ, దివ్యసత్తా స్వరూపుడవైన ఓ దేవా, నీతోడి సాయుజ్యజ్ఞానమునందే నేను నిత్యము నివసించుచుందునుగాక. నీ దివ్యసంకల్పానుసారముగనే నేను సదా ప్రవర్తించుచుందునుగాక.

వినయ వినమిత, నిశ్చలనీరవ, భక్తిభావముతో నీకిదే ప్రణమిల్లుచున్నాను. సమస్త జగమునకు నీవే ఏలికవు.

* * *

మే 2, 1914

ఎంతటి అద్భుతములైనను సమస్త మానసబుద్ధి యోచనల కన్నింటికిని అతీతముగ,—ఎంతటి ఉదాత్తములైనను సమస్త మానవహృదయభావనల కన్నింటికిని అతీతముగ,— అత్యాశ్చర్యకరమైన ఆకాంక్షలకంటెను, అత్యంత విశుద్ధమైన కార్యోత్సాహరీతులకంటెను అతీతముగ,— ప్రేమ, జ్ఞానము, ఏకత్వము అనువానికంటె అతీతముగ,— ఓ ప్రభూ, నేను నీతోడి నిత్యానుసంధానమున నుండగోరుచున్నాను. సకల బంధములనుండియు విడివడి నేను నీవే యయ్యెదను. ఈ శరీరము ద్వారా జగత్తు నవలోకించువాడవు నీవే; ఈ యుపకరణము నుపయోగించుకొని జగత్తున వ్యవహరించువాడవును నీవే.

పరమమైన సునిశ్చయభావము సుస్థిర నైశ్చల్యస్థితి ఇపుడు నాలో నెలకొని యున్నది.

* * *

మే 3, 1914

దివ్యప్రేమస్వరూపుడవు, పరమజ్ఞాన స్వరూపుడవు, పరిపూర్ణైక్యస్వరూపుడవు నైన ఓ దేవా, నేను నీవు తప్ప మరేదియు కానట్టి స్థితిని అందుకొనగోరి, దినములో ప్రతిక్షణమునగూడ నిన్ను నే నర్థించుచున్నాను.

ఉపకరణము ననెడి జ్ఞానముతో, ఈ యుపకరణము నిన్నే సేవించును గాక. నా చైతన్య మంతయు నీయందే నిమగ్నమైపోయి, నీ దివ్యదృష్టితోనే సకలవస్తుజాతమును అనుసంధాన మొనర్చుగాక.

ఓ ప్రభూ, ప్రభూ, ప్రాభవోపేతమగు నీ దివ్యశక్తియే అభివ్యక్త మగునట్లును, ఈ సేవకురాలు సంపూర్ణముగా నీ సేవకే అంకితమైపోయి, నీ కార్యమే జగత్తున నెరవేరునట్లును అనుగ్రహింపుము.

'నేను' అనునది శాశ్వతముగ అంతరించిపోయి, కేవలము ఈ యుపకరణ మొక్కటియే మిగులునుగాక.

* * *

మే 4, 1914

నీలోనే, నీ కార్యమందే, సదా నిమగ్నమై యుండుటకొరకు.... ఒక పరిచ్ఛిన్నవ్యక్తిగా ఇక నేమాత్రము మనకుండుటకొరకు.... ఒక కేంద్రముద్వారా అభివ్యక్తమగు నీ శక్తుల అనంత్యమునకు ఆకరమై యుండుటకొరకు.... సకల బంధములనుండియు పరిమితులనుండియు విముక్తి గాంచుటకొరకు.... పరిచ్ఛిన్నతను గల్పించు సమస్త బుద్ధిభావనలను అతిక్రమించి పోగలుగుట కొరకు.... కర్మ చేయుచునే కర్మ కతీతముగ మనుటకొరకు.... వ్యక్తులద్వారా వ్యక్తులకొరకు పనిచేయుచునే ఏకత్వదర్శనము చేయగలుగుట కొరకు,— నీ దివ్యసత్తా జ్ఞాన ప్రేమల ఏకత్వదర్శనము చేయగలుగుటకొరకు,— ఓ పరమేశ్వరా, సనాతనగురూ, అద్వయసత్యస్వరూపా,— నీ సేవ నిమిత్తముగా, జగత్తున నీ అభివ్యక్తి నిమిత్తముగా, నీవు రూపొందించుకొన్న ఈ శరీరేంద్రియ మనఃప్రాణ సంఘాతములోని యజ్ఞానమునెల్ల నశింపజేయుము. పరమమైన జ్ఞానోపలబ్ధిని ఈ సంఘాతము తాను పొందనేర్చి, అట్టి జ్ఞానోపలబ్ధియే సర్వత్రగూడ పొడమజేయగలుగునట్లు అనుగ్రహింపుము.

క్షణక్షణము మారిపోవుచుండు రూపములను జూచుట మాని, అంతటను, అన్నిటియందును అక్షరమైన నీ ఏకస్వరూపమునే అనుసంధానించి దర్శించునట్లు అనుగ్రహింపుము.

ప్రభూ, తీవ్రాతితీవ్రమైన అభ్యర్థన పూర్వకముగా నా సకలసత్తయు నీకు మొరపెట్టుకొనుచున్నది. వస్తుతః నేను నీవు, నీవు నేనే కావున, పరిపూర్ణ చైతన్యానుభవమునందు నేను నీవే అయిపోగలుగునట్లు అనుగ్రహింపవా ?

* * *

మే 9, 1914

దాడిచేసినట్లున్న యీ మనోమాంద్యమునుండి బయటపడుటకై క్రమముగా మరల నీ 'ప్రార్థన' లను వ్రాయవలసిన ప్రబలావశ్యకత నాకు గోచరమైన యుత్తరక్షణముననే, ఈ నా భౌతికశరీరము పెక్కు సంవత్సరములుగ ఇంతకు ముందు తనకు అనుభూతమైయుండని ఒకానొక శైథిల్యస్థితికి లోనై, కొలది దినములపాటు నా శారీరికశక్తులేమియు పనిచేయలేదు. నేనేదో తప్పు చేసి యుంటిననియు, నాలోని యాధ్యాత్మికశక్తి సడలిపోయినదనియు, సర్వశక్తి సంపన్నమైన ఏకత్వమును బొడగాంచు దర్శనశక్తి నాయందు మసకవారినదనియు, దుష్టప్రేరణ ఏదియో నన్ను ఏదోరీతిగ చిక్కులబెట్టుటలో కృతార్థమయ్యె ననియు, దీని కంతకును సూచనయే ఈ శైథిల్యస్థితి యనియు నాకు విశదమైనది. అంతట నేను, నీతో పూర్ణసాయుజ్యస్థితికి వలయు పరిపక్వత నాలో ఇంకను కలుగలేదని తెలిసి, ఓ పరమేశ్వరా, నా ప్రియతమ ప్రభూ, వినమ్రురాలనై నీ యెదుట మోక రిల్లితిని. నీ సేవోపకరణముగా నే వినియోగింపనెంచు నీ సంఘాతమం దేదియో ముసుగువడి అవగాహనము కోల్పోయి యున్నది. తగిన విధముగా అది నీ శక్తులకు ప్రతిస్పందించక, వాని అభివ్యక్తిని వికృతపరచి ముసుగువడ జేయుటయే జరుగుచున్నది.

నేనొక సమస్య నెదుర్కొనవలసిరాగా, నా రుగ్మత దానికి ముసుగువైచి నన్ను దానిని పరిష్కరించనీకుండ జేసినది. కాని, ఇపుడు నేను మరల నీ యేకత్వభావనలో మనగలుగుచుండుటచే, ఈ సమస్యకు అర్థము లేనట్లే నాకు దోచుచున్నది. ఇది నాకు సరిగా అవగాహన కాలేదు.

ప్రాత జీవనపరిధుల నెంతగనో అతిక్రమించి, ఒకానొక నూతన జీవనము లోనికి నెమ్మదిగా నేను మేల్కొనుచున్నట్లున్నాను. ఇది వట్టి భ్రమ కాకుండ వలెననియు, ప్రగాఢము, ప్రసన్నము నైన శాంతి శాశ్వతముగ నాలో మరల నెల కొనవలెననియు నా కోరిక.

ఓ నా పరదైవమా, ఎప్పటికన్నను తీవ్రతరముగ నా ప్రేమ నీకొరకే

అర్రులుసాచుచున్నది. జగత్తున కేవలము నీ ప్రేమమూర్తినై నేను జీవింతును గాక. ఎల్ల అహంతయు, ఎల్ల పరిమితులును, ఎల్ల అజ్ఞానమును అదృశ్యమై పోవునుగాక, అల్పీయసము, అస్థిరమునైన యీ యుపకరణముద్వారా నీ యిచ్ఛయే ప్రవర్తిల్లులాగున నా చైతన్యము నీ చైతన్యముతో ఏకత్వమును బొందుగాక.

ఓ నా ప్రియతమ ప్రభూ, ఎంతయో తీవ్రాతి తీవ్రముగ నా ప్రేమ నిన్నా కాంక్షించుచు ఉరవడించుచున్నది.

నేను కేవలము నీ దివ్యప్రేమ స్వరూపమే యగునట్లనుగ్రహింపుము. అద్దాని ఫలితముగా ఎల్లరిలోను ఈ ప్రేమయే ఉద్బుద్ధమై శక్తిమంతముగను, విజయవంతముగను అతిశయిల్లునుగాక.

సమస్త పృథ్విని గట్టివేయగల విస్తారమైన ప్రేమోత్తరీయమును బోలు దాననై, ఎల్లరి హృదయములలోనికి జొచ్చి, ఆశా శాంతుల నందించు నీ దివ్య సందేశము నెల్లరి చెవులలో రణింపజేయుదునుగాక.

ఓ నా పరదైవమా, కడుంగడు తీవ్రాభినివేశముతో నా యాకాంక్ష నిన్నభిసరించుచున్నది. భ్రమప్రమాదముల రూపమైన యీ సంకెళ్ళను విచ్ఛిన్నము గావింపుము. అజ్ఞానమును పటాపంచలొనర్చి, ముక్తిని ప్రసాదించి, నీ దివ్య జ్యోతిని సాక్షాత్కరింప జేయుము.

విచ్ఛిన్నము గావింపు మీ సంకెళ్ళను,— జ్ఞానస్వరూపము, సత్తాస్వరూపము నే నయ్యెదను. అనగా, ఈ నా 'నేను' నీ 'నేను' గావలెను; ఈ జగత్తున నుండవలసినది నీవైన ఒకే 'నేను'.

ప్రభూ, నా ప్రార్థన ననుగ్రహింపుము; భక్తిభావ పురస్సరముగ నిన్నా నే నిదే వేడుకొనుచున్నాను.

* * *

మే 10, 1914

ఓ ప్రభూ, నీ మధురానందమే నా హృదయములో నిండారియున్నది; నీ నీరవశాంతియే నా బుద్ధియందు రాజ్యమేలుచున్నది. ఇపు డున్నదంతయు కేవలము విశ్రాంతి, ఏకాగ్రత, శక్తి, తేజస్సు, నైశ్చల్యము, అంతయు నిరవధికము, అపరిచ్ఛిన్నమునై విలసిల్లుచున్నది. ఇపుడు నాలో నున్నది కేవలమీ పృథ్వియేనా, లేక సమస్త విశ్వమూనా ? ఏమో నాకు తెలియదు. కాని, ఈ నా చేతనయందు నివసించుచు దాని నుద్దీపింపజేయుచున్నవాడవు నీవే. ఇందు నెలకొని చూచుచున్నవాడవు, తెలిసికొనుచున్నవాడవు, కర్మల నాచరించుచున్నవాడవు నీవే. అంతటను నిన్నే నేను చూచుచున్నాను. 'నే' ననునది ఇక ఎచ్చటను లేదు; ఉన్నదెల్ల ఒకే ఒకటి,— అది నీవే.

ప్రభూ, జగదీశ్వరా, అంతటను నీవే ప్రకాశించుచున్నావు. నీకు జయమగునుగాక.

* * *

మే 12. 1914

గత కాలమున జేయబడిన ప్రయత్నముల ఫలితాంశము స్పష్టముగ గోచరమగునట్టి కాలమధ్యమున మే మున్నామని నా హృదయమునకు గడుంగడు దోచుచున్నది. ఈ కాలమున నెప్పుడును, నీ నియమము మమ్ములను అధీనముచేసికొనియుండునంతమేరకు, దానికి బద్ధులమై మేము నడచుకొనుచున్నాము. కాని, యట్టి నియమమొకటి యున్నదనికూడ నెరుంగుటకు మా కవకాశము లేదు.

నేటి యుదయమున, నా హృదయపు లోలోతుల జొరబారు నొకానొక యనుభూతికి నేను పూర్వమురీతిగా మరియొకసారి లోనై, నీ చైతన్యముతో నా చైతన్యమును దాదాత్మ్య మొందించి, వేరొండేదియు నెరుంగక నీలోపలనే నివసించుచుంటిని; నిజముగా నీవే నాలోపల నివసించుచుండినది; ఉత్తరక్షణముననే నీ సంకల్పము, నేను చేయవలసిన బాహ్యకార్యములదెసకు నా మనమును లాగెను.

దేవా, నీ వప్పుడిట్లు నుడివితివి :—— "నా కక్కరపడిన యుపకరణముగా నీ వుండుము"—— అని. ఆ పలుకు నా స్వార్థపరిత్యాగమునకు గల పరిమితినిగురించి వచించు కడపటి మాటయైయున్నది. అయ్యది, నీతోడి యైక్యానందమునుగూడ బరిత్యజించుమనియు, నీవు నేనను భేదమెరుంగని స్వాదుశుద్ధానందానుభవమును సయితము పరిత్యజింపుమనియు, నీవే యా శుద్ధబ్రహ్మము, తక్కిన దంతయు భ్రమాత్మకము, ప్రాతిభాసికము ననెడి యనుభవమును బుద్ధితో మాత్రమేగాక కృత్స్నానుభవముతో బ్రతిక్షణమునను దెలిసికొను నానందము సైతము పరిత్యాజ్యమనియు వచించు కడపటి మాటయైయున్నది. ఈ నా బాహ్యాసక్త సాధువిధేయమైన భగవదుపకరణముగా నుండవలయు ననుటయు, ఆ యుపకరణము దన్ను నడపు భగవదిచ్ఛను గూడ గుర్తెరుగవలసిన యవసరము లేదనుటయు నిస్సంశయము. కాని, నేనేల యుపకరణముగా మాత్రమే నిన్నుగూడి యుండవలెను? 'నే' ననునది నీతో బూర్తిగా నైక్యమొంది, భవదీయ పరమచైతన్యమునందు గూడ నేల వసింపరాదు ?

ఓ దేవా, నేనీ ప్రశ్న యడుగుచున్నానుగాని దాని విషయమై నాకు గుతూహలము లేదు. సర్వము నీ సంకల్పము ననుసరించి యుండునని నేనెరింగి సంతోషపూర్వకముగను, నీ యెడల గేవలము పూజ్యభావముననను, నీ సంకల్పమునకు లోబడుచున్నాను. ఓ పరమేశ్వరా, నన్ను నీ వేమిగా నుండ నిచ్ఛగింతువో నేను దానినై యుండగలను. స్థూలశరీరమువలె నిశ్చేతనమగు సామాన్య పరికరముగా నన్నుండగోరినను సరే, నీవలె చైతన్యయుక్తమగు జ్ఞానమయునిగా నన్నుండ గోరినను సరే, నే నట్లుందును. ఓ దేవా, విశ్వశ్రేయఃప్రాప్తికై యఖిలభూతముల ద్వారమున నీవు పనిచేయుచుందువని తెలిసికొనుటయు, "సర్వము కళ్యాణాత్మక" మని చెప్పుటయు నెంత మనోహరము, ఎంత స్వాస్థ్యోపేతము, ఎంత యానందము !

నీ వప్రతిహత సార్వభౌముడవు; దుర్లభుడవు; అజ్ఞేయుడవు; నిత్యసత్య స్వరూపుడవు.

ఓ అత్యద్భుత అద్వయతత్వమా, నీలో నేను లీనమగుచున్నాను.

మే 13, 1914

ఓ పరమేశ్వరా, నేను జ్ఞానము పొంది నీ వనుగ్రహించిన అనుభూతి నవగాహన మొనర్చుకోగలందులకై, స్వప్నసంచారమును బోలిన యీ నా యాలోచనా ప్రవృత్తి నంతనూ నీవు విదళించివైతువు. నే నేదైన విన్ను బ్రశ్నించుచో, సమాధాన మొసగుటకు సదా సిద్ధముగనే యుందువు. నా కేదైన నొకటి తెలియవలసిన అవసరము కలిగినప్పుడెల్ల, పరోక్షముగనో అపరోక్షముగనో నీవు దానిని నాకు బోధ యొనర్తువు.

అసహనముతో తిరుగుబాటొనర్చి తొందరపడుట యెల్ల నిష్ప్రయోజనమని నా కంతకంతకు సుస్పష్టమగుచున్నది. నిన్ను నేను సేవించవలసిన రీతిగా సేవించగలందులకై అంతయును నెమ్మదిగా వ్యవస్థీకరింపబడుచున్నది. ఈ సేవా కార్యములో నా స్థానమేమి? చాల కాలమునుండియు ఇది నేను అడుగుట లేదు. స్థాన మేదైన నేమి? కేంద్రములోనా, పరిధిలోనా, ఎక్కడ అని తెలుసుకోవలసిన అవసర మేమున్నది? నీకే పూర్తిగా అంకితమైపోయి, నీ కొరకే, నీ వలననే మనగలుగుచు, నీ విచ్చిన పనిని నానాటికి మరింత చక్కగా చేయగలుగుచుందునేని, ఇక తక్కినదానికి ఎట్టి ప్రాముఖ్యమును లేదు. మరియు, నీ కార్యము జగత్తులో కడుచక్కగా, సమగ్రముగా, నెరవేరుచే కావలెనుగాని, ఏ వ్యక్తి, లేక ఏ వ్యక్తుల సముదాయము దానిని నెరవేర్చిన నేమి?

ఓ నా ప్రియతమ ప్రభూ, శాంతి, సమత, నైశ్చల్యము నాలో ముప్పిరిగొనగా, బుద్ధి సుప్రసన్నమై హృదయము సంతోషమున తొణికిసలాడగా, నన్ను నీకు సమర్పణ మొనర్చుకొని నీలో లీనమైపోవుచున్నాను. నీ కార్యము నెరవేరునని నే నెరుంగుదును; నీకు విజయము నిశ్చయము.

ఓ నా ప్రియతమ ప్రభూ, నీ దివ్యజ్ఞాన దీప్తిరూపమైన మహావరప్రసాదము నా కనుగ్రహింపుము.

* * *

మే 15, 1914

ఓ పరమేశ్వరా, శిఖరస్థానమును జేరుకొన్నప్పుడు చుట్టును సీమాంతరేఖ కడు విస్తృతమై గన్పట్టునట్లు, నీ యేకత్వస్థితికిని, వ్యక్తజగత్తునకును, నడిమిదైన మండలముతో ఏకత్వజ్ఞానమును మా చైతన్యము పొందియున్న సమయమందు, నీ స్వరూపానంత్యముతోపాటు ఈ జగత్సాక్షాత్కారమును సైతము ఏకకాలముననే మేము బడయగలుగుదుము. నీ క్రియాశక్తియందు పూర్తిగా నిమగ్నమైయున్న చైతన్యము, తోటి సోదరోపకరణములకు కేంద్రముగా, వాటి నడుమ సంచరించుచు, అత్యంత నిమ్నోపకరణముపై సైతము నీ శక్తికిరణప్రసారము గావింపనేర్చు కేంద్రస్థానములో మాకు నిలుకడ కుదిరినట్లయ్యెడి సన్నివేశమది. ఈ సర్వాతీత మండలపు ఉన్నతస్థాయినుండి చూచినప్పుడు, భౌతిక పదార్థమంతయు ఒక్కటి గనే స్పష్టముగ కానవచ్చినను, భౌతిక జగత్తున నొక ప్రత్యేకోపకరణముగ నుపచరించు శరీరము అందొక ప్రత్యేకమైన నిష్కృష్ట వైశద్యముతో, పూర్ణత్వ మధ్యమున అధికతర శక్తియుక్తమగు నొక బిందువువోలె గోచరమగును. ఏక కాలముననే ఏకము అనేకమునై, తన శక్తులను సమానముగా అంతటను ప్రసరింప జేయుచుండు పూర్ణమిది.

ఈ దర్శనము నాలో నిన్నటినుండియు ఏర్పడి ఇప్పటికిని వీడకయున్నది. సునిశ్చితార్థమురీతి నయ్యది నాలో దృఢముగా పాదుకొనియున్నది; బాహ్యవ్యవహారమంతయు నెప్పటివలెనే కొనసాగుచు, ఉన్నతస్థాయినుండి నా చైతన్యముచే ద్రిప్పబడు అద్భుత చైతన్యయుక్తమగు యంత్రప్రాయమైన ఆటబొమ్మరీతి గానవచ్చుచున్నది. ఈ నా చైతన్యము వ్యష్టి చైతన్యము గాదు; కాని, ఇంకను విశ్వచైతన్య లక్షణముతో నొప్పారుచున్నది. అనగా, నీ యేకత్వములో అది యింకను బూర్తిగ నిమగ్నము కాలేదన్నమాట. వ్యష్టిసృష్టికి సంబంధించిన నియతులన్నియు నాకు సుస్పష్టముగా, అదే సమయములో ఒకానొక సుసమన్విత సమష్టి స్వరూపమున గోచరమైనవి. ఆ యనుభూతి ఇట్టిదని సామాన్యభాషలో వర్ణించుటకు వలనుపడదు.

* * *

మే 16, 1914

నాకు కలిగిన యనుభూతి కొక రూపమిచ్చి వ్యక్తము చేయుటకు నిన్నటి దినము నేను ప్రయత్నించుచుండిన తరుణములో నాకు అంతరాయము ఘటిల్లెను. ఇపు డంతయు బూర్తిగ మారిపోయినట్లుగా నున్నది. నిష్కృష్టమైన ఆ జ్ఞానము నకు, ఆ దర్శనమునకు మారుగా, నీయెడ అపారప్రేమ నా యావత్సత్తనూ, బాహ్యమునుండి అంతరాంతరమువరకూ ఆవహించినది. నీతో సునిశ్చితముగ ఏకత్వము పొంది నీలో లీనమైపోవుటకై తీవ్రమైన యాకాంక్షతో సమస్తమూ నీ పాదసన్నిధిని మోకరిల్లినది. నా యావచ్ఛక్తితోడను నిన్ను నే ప్రార్థించితిని. అంతట, మరల నింకొకసారి, నా చైతన్య మెల్ల నీలో లీనమైపోనున్నట్లు తోచిన తరుణమున,— నా యావత్సత్తయు కేవలము నీ సాన్నిధ్యమును ప్రతిబింబించు శుద్ధ స్ఫటికమువలెనై యుండిన సమయమున,— ఎవరో వచ్చి నా యేకాగ్రతకు అంతరాయము కల్పించిరి.

నేను నడపవలసియున్న జీవనవిధానముగా నీవు నిర్ణయించియున్నదాని ప్రతీక యిది. ఈ జీవనవిధానమందు ఆంతరిక పరమసాక్షాత్కారోపలబ్ధి కంటె లోకసంగ్రహ రూపమగు బాహ్యకర్మకలాపమునకు విశేషప్రాముఖ్య మున్నది. నా జీవన పరిస్థితు లన్నియు నీ తరపున సదా నన్నీరీతిని హెచ్చరించుచున్నట్లుగా నున్నవి,— "పరమమైన ఏకాగ్రత మూలమునగాక, లోకమున విస్తృతి చెందుట ద్వారా నీవు ఏకత్వసాక్షాత్కారోపలబ్ధిని బొందగలవు".— అని, ప్రభూ, నీ యిచ్ఛ ప్రకారమే జరుగుగాక.

ఇప్పటి నా వ్యక్తిత్వస్థితిలో, నీతో ఐక్యము చెందుటే నేను సాధించవల సిన లక్ష్యము గాదని నా కిపుడు స్పష్టముగా తెలియుచున్నది. అది యేనాడో సాధించబడియే యున్నది. అందుచేతనే నీవు నాకిట్లు సదా హెచ్చరించుచున్న ట్లున్నావు.— "ఈ ఏకత్వామ సంధానపు ఆనందపారవశ్యమున నోలలాడుచు కూర్చుండబోకు; పుడమిపై నేను నీకు ఏర్పాటుచేసియున్న కార్యమును నెర వేర్చు."— అని.

సమష్టి కార్యకలాపముతో పాటుగా అదే కాలమున కొనసాగించవలసి యున్న వ్యష్టికార్యకలాప మేమనిన,— సత్తయందలి సకల భూమికలను, సకల ప్రవృత్తి విశేషములను బాగుగ గుర్తెరిగి వశీకరించుకొనగలుగుచు, ఏక కాలముననే విహితకార్యాచరణముతోపాటు నీతోడి నిరంతరైక్యానుసంధానమును గూడ సాధ్యమొనర్పగల అత్యున్నత స్థాయిలో సునిశ్చితముగా చైతన్యమును ప్రతిష్ఠించుకొని యుండుట. చేయవలసియున్న కార్యమును చేసినప్పుడే పరిపూర్ణైక్యానందము ఘటిల్లు నవకాశ మేర్పడును.

నీతోడి యైక్యమును ఎల్లరకు మేము మొదట బోధించవలెను; పిమ్మట నీ కార్యాచరణము. నీతోడి యైక్యోపలబ్ధిని బడసినవారికి మాత్రము, వారి జీవితములోని ప్రతిక్షణము వారిద్వారా సమగ్రముగ నీ యిచ్ఛ నభివ్యక్తము సేయునదే యగును.

*　　*　　*

మే 17, 1914

ఓ పరమేశ్వరా, నన్ను దిగలాగుచున్న మనోవృత్తి ప్రభావములనుండి నాకు విమోచనము కల్పించుము. వీనినుండి పూర్తిగా విడివడి నేను నీదెసకు దూసుకొని రాగోరుచున్నాను.

నీవు విశ్వపురుషుడవు; ప్రత్యక్ష పరమైక్యస్వరూపుడవు. అణపరాని యాకాంక్షతో నేను నీ హృదయమున బొదుగుకొని, పిమ్మట నీ హృదయమే యైపోతిని. జగత్తులను సృష్టించి యాటలాడుకొను శిశువు నీ హృదయ మను సంగతి నే నెరుగుదును. నాతో నీ విట్లంటివి : "ఒకనాటికి నీవు నా శిరస్సే కాగలవు; ఇప్పుడు మాత్రము పృథ్వివైపు నీ దృష్టిని మరల్చుము",— అని. ఆ కారణమున ఇపుడు నేను పృథ్విపై ఆనందమున ఆటలాడుకొను శిశువుగనే యున్నాను.

ఒక విధముగా తప్పనిసరియై నిన్నటి దినము ఆ రెండు వాక్యములను వ్రాసితిని. కాగితముపై వ్రాసిన యెడలనే ప్రార్థనకు నిండుబలము చేకూరగల దన్నటుల మొదటి వాక్యము వ్రాసితిని; లిఖితముగ వ్రాసియుంచి నా మెదడుకు అనుభూతిభారమును తప్పించినగాని ఆ యనుభూతి స్థిరత్వము గాంచనేరదన్నటుల రెండవ వాక్యము వ్రాసితిని.

* * *

మే 18, 1914

ప్రభూ, ఉన్నది నీ వొక్కడవే; నిత్యుడవు, సర్వశక్తియుతుడవు. ఎవడు తన సత్తయందలి లోలోతులలో నీతో ఐక్యమును బొందునో అట్టివాడు నిత్యత్వ సర్వశక్తిమత్వములతో నీవే యగును. ఇతరులకు మాత్రము నీ యాదేశ మేమనిన, వారు నీతో అనుబంధ మేర్పరచుకొనియే పృథ్వివైపుగా తమ దృష్టిని, కర్మాచరణను మరలించవలెనని; ఇదే వారికి నీవు అప్పగించిన కార్యము. కష్ట మిచటనే మొదలగుచున్నది. ఏలనన, వారి సత్తయందలి అంతస్తు లన్నియు నిర్దుష్టముగ రూపొందవలసియున్నది, నీతో పరమైక్యస్థితిని బొందిన పిమ్మట గూడ వారు నీ యిచ్ఛాభివ్యక్తిసాధనమైన యుపకరణమును నిర్దుష్టము గావింప కృషిచేయవలసియున్నది. అదియే కడుంగడు కష్టమైన కార్యము. 'నే' నని నాచేత నీవు పిలిపించుచున్న యిప్పటి యీ యుపకరణమున గల సమస్తము కడు సామాన్యమైనదిగా, అసమర్థమైనదిగా, తటస్థలక్షణోపేత మైనదిగా గనుపట్టు చున్నది. నీతో నేను ఐక్యానుభూతి పొందుచున్నకొలది, ఈ యుపకరణశక్తి విశేషముల యసమగ్రత నాకు మరింతగా విస్పష్ట మగుచున్నది. అందలి ప్రత్యంశము దాదాపు సరిదిద్దరానిదిగనే చూపట్టుచున్నది. అయినను అది నన్ను కలవర పెట్టలేకున్నదనిన, నాలోని నిజమైన 'నేను' నీ పాదాక్రాంతమై యుండుటచే, నీ హృదయమున బొదుగుకొని యుండుటచే, అక్షరమైన నీ సత్యచేతనను గురించిన యెరుక గలిగియుండి, సమస్తసృష్టిని సహనపూర్వకమైన సదవగాహనతో, అనుకంపాకలితమైన మందహాసముతో అవలోకింపనేర్చుటచే దానికి గారణము.

* * *

మే 19, 1914

ఈ మనోమయసత్త, తన వైయక్తిక జీవనమందంతటను, ఎన్నియో శక్తులను ప్రకటించు సామర్థ్యము గలిగియుండెడిది. నీ యెడ ప్రగాఢభక్తిభావము, మానవలోకమునెడ అపారదయాగుణము, జ్ఞానసముపార్జనము కొరకు తీవ్రాభినివేశము,— ఇవన్నియు దాని శక్తివిశేషములే. కాని, ఇప్పుడది ఆ శక్తిప్రకటన మేమియు జేయక గాఢనిద్రచెందుచున్న ట్లగపడుచున్నది. వైయక్తిక శక్తులన్నియు నిదురించుచున్నవి. సర్వాతీత స్థితులయందు చైతన్య మింకను మేల్కాంచ లేదు; అనగా, ఆ స్థితులయందు ఎడనెడ మాత్రమే అయ్యది మేల్కొ_నగలుగుచున్నది. నడుమనున్న యవస్థ నిద్ర. అసంతృప్తికరమైన యీ నడిమియవస్థలోనుంచి బయటపడుటకై, ఈ సత్తయం దేదియో కొంతకాలముపాటు ఏకాంతస్థితిని, పరిపూర్ణ నిశ్చల నీరవతను గాంక్షించుచున్నది. అయినను, ఈ సందర్భములోనే, ఈ యుపకరణము సర్వలోక సేవకై యంకిత మగుట నీ యిచ్ఛయనియు, అట్లు అంకిత మగుట దాని పూర్ణత్వసిద్ధికి భంగకరముగా పైకి గనుపట్టినను అది యట్లు జరగవలసియే యున్నదనియు ఒకానొక జ్ఞానముకూడ నాలో దీపించుచునే యున్నది.

ప్రభూ, ఈ సత్తయం దేదియో నీతో ఇట్లనుచున్నది :

"నా కేమియు తెలియదు.
నే నేదియు కాను.
నే నేమియు చేయజాలను,
నిశ్చేతనాంధకారమున నే నున్నాను."

అయినను, అయ్యది నీవే యనియు, అట్లగుటంజేసి పరమపూర్ణస్వరూపమే యనియు నొకవిధమైన యెరుకగూడ నాలో లేకపోలేదు.

దీని పర్యవసాన మేమిగా రూపొందనున్నది ? ఇట్టి పరిస్థితి తుద కెటుల పరిణమించును ? ఇది జడిమయా, లేక నిజమైన సహనమా,— ఏమో నాకు

తెలియదు. అయినను, ఏ తొందరపాటుగాని కోరికగాని లేక నీ పాదములకడ సాగిలపడియుండి కానున్నదానికై నిరీక్షించుచున్నాను.

* * *

మే 20, 1914

నీ యఖండ దివ్యప్రేమతో తాదాత్మ్యమనెడి ఉన్నతశిఖరస్థానమునుండి నా దృష్టిని నీవు, నీకు ఉపకరణముగా ఉపయోగపడవలసియున్న ఈ శరీరేంద్రియ మనఃప్రాణ సంఘాతము వైపునకు మళ్ళించితివి. మళ్ళించి నాతో నిట్లంటివి: "ఈ సంఘాతము నేనే. నా వెలుగు దీనిలో ప్రకాశించుచుండుట నీకు గాన వచ్చుటలేదా ?"—— అని. యథార్థముగనే నేను, ఈ శరీరమందలి ప్రత్యణువు నను నీ దివ్యప్రేమయే వివేకమును, శక్తిని పూరించుకొనుచు ప్రకాశించుచుండుటను గాంచితిని. అంతట ఆ యణువు లన్నియు కోట్లకొలది దీప్తవిస్ఫులింగముల రాశివోలె గన్పట్టి, అంతయు నీవేయైనట్లు అనుభూతమయ్యెను.

చీకటి అంతయు నిపుడు పటాపంచలైనది. వివిధ లోకములలో, వివిధ రూపములలో, అయినను ఒకే అక్షర సత్యస్వరూపమున, ప్రకాశించుచున్నవాడవు నీవే.

అక్షరమైన నీ విశుద్ధప్రేమను, అవిభాజ్యమైన ఏకత్వమును వెలార్చుకొనెడి యీ దివ్యప్రపంచమునకును, అత్యంత భౌతికస్థాయి పర్యంతమూ ఏర్పడియున్న ఇతర భూమికల దివ్యప్రపంచమునకును అనుసంధానము గూర్పవలసిన యవసర మున్నది. భౌతికస్థాయిలోని ప్రతి అణుగర్భముననేగాక ఆ యణురూపమున నున్నదియు నీవే. సోపానక్రమముగ నేర్పడియున్న యీ దివ్యప్రపంచముల నడుమ విశుద్ధజ్ఞానరూపమగు అనుబంధమును నెలకొల్ప నేర్చినప్పుడే, నీయందు మేము నిరంతరముగ నివసించుచున్నవార మయ్యెదము. అప్పుడే మేము, మా సత్తయందలి సకల చేతనాభూమికలు, సకల కార్యప్రవృత్తుల ద్వారమున నెరవేర్చు టకై నీవు మాకు అప్పగించిన కార్యమును సమగ్రముగ నెరవేర్పగలుగుదుము.

* * *

ఓ నా ప్రియదైవమా, నా యజ్ఞానము కల్పించిన యొక క్రొత్త తెరను నీవు చీల్చివైచినావు. నిత్యమైన నీ హృన్మందిరములోని నా సుఖస్థితికి భంగము లేకుండగనే నే నిపుడు ఈ శరీరములోని ప్రతి అణుహృదయములో సైతము నివసించుచున్నాను. ఈ అణుహృదయములు అత్యంత సూక్ష్మములయ్యును అపారములు.

పూర్ణమైన యీ విశుద్ధజ్ఞానావస్థితిని నాలో సుస్థిరము గావింపుము. దీని లోలోతుల నన్నింటిని నేను దరియనేర్తునుగాక. ఏ క్షణములోనూ నిన్ను విడవాడకయే, నీవు నాకు నిర్దేశించియున్న కార్యక్రమపు అవసరమునుబట్టి, అంతులేని యీ విచ్చెన పైకి, క్రిందికి, నిరంతరముగ సంచరింపగలుగుదునుగాక.

అఖండానందపు పూర్ణత్వస్థితిలో నేను నీ దాసనై, నీలోనే నివసించుచు, సాక్షాత్తుగ నీవే అయియున్నాను.

* * *

మే 21, 1914

ఈ దృశ్యమాన ప్రపంచమునకు ఆవల, ఆనంత్యముయొక్క నిర్వికల్ప నిశ్శబ్దములోపల, నీయందే,— ఓ ప్రభూ,— నిశ్చల పరమానందమున నే మన్నాను. నీ మహత్తర శక్తివలనను, నీ యత్యద్భుత ప్రకాశము వలనను రూపొందిన భౌతికపదార్థపు అణుగణమధ్యమునందును, వాని నిజతత్త్వమునందును నిన్నే నేను పొడగనుచున్నాను. ఇట్లు, నీ సన్నిధానమునుండి దాటిపోకుండగనే నీ పరమ చైతన్యములోనికి తిరోధానము చెందగలను; లేదా, నా సత్తయందలి జాజ్వల్యమాన అణుసముదాయములోను నిన్ను దిలకింపగలను. ఇప్పటికి అయ్యదే నీ దివ్యజీవన, దివ్యప్రకాశముల పూర్ణత్వమని చెప్పనగును.

నేను నిన్ను దర్శించుచున్నాను; నీవే అయిఉంటున్నానుగూడ. ఈ రెండు ధ్రువముల నడుమ నా యఖండప్రేమ నీ దిక్కున కెగయుచున్నది.

* * *

మే 22, 1914

ఈ సత్తయందలి సకలస్థితులయు, సకల జీవలోకములయు సత్యాసత్యములను క్రమముగా మేము వివేచింపనేర్చి, కేవల పరమసత్యపు సర్వతోముఖ పూర్ణనిశ్చితార్థస్వరూపమును ఆకళింపజేసుకో గలిగినమీదట, మా యేకాగ్రదృష్టిని ఆ పరమచైతన్యపు మహోన్నత స్థానములనుండి, నిన్ని ప్రపంచమున నభివ్యక్తపరచుటకు సద్యస్సాధనమై యొప్పారు వ్యష్టితత్వసముదాయమువైపు మరల్చి, అచ్చోట మేము మా పరమసత్యస్వరూపుడ వగు నిన్ను మాత్రమే చూడగలిగి యుండవలెను. ఇట్లు చేయుటవలన, ఈ సముదాయమందలి ప్రతి అణువు నీ యుదాత్తమహిమను స్వీకరించుటకు ప్రబుద్ధమగును. అంతట అజ్ఞానము, అంధతమము సత్తయొక్క కేంద్రచేతన నుండియేగాక, దాని నభివ్యక్తపరచు అత్యంత బహిర్ముఖ ప్రవృత్తినుండి సైతము తిరోధాన మగును, ఇట్లు చేతనను రూపాంతరము చెందించు పురుషప్రయత్నము పూర్ణమై ఫలసిద్ధి నందినప్పుడే, నీ సాన్నిధ్యము, నీ ప్రకాశము, నీ ప్రేమ పుష్కలముగా నిచట అభివ్యక్తమగుట కవకాశ మేర్పడును.

ఓ పరమేశ్వరా, సత్యమును అధికాధిక స్పష్టముగా గ్రహించునట్లు నన్ను అనుగ్రహించుచున్నావు. ఆ సోపానశ్రేణిని నన్ను మెట్టుమెట్టుగా నెక్కించుము. నా సత్త అంతయు,— అందలి ప్రతి రేణువు,— నీ సాక్షాత్కారజ్ఞానమును, నీతోడి పూర్ణసంయోగమును గాంక్షించుచున్నది. సకల ప్రతిబంధకములు తొలగుగాక. నీ జ్ఞాన ప్రకాశము అజ్ఞానాంధకారమును ఎల్లతావులనుండి పారద్రోలుగాక. చేతనయొక్క కేంద్రస్థానమును. సత్తయొక్క సంకల్పశక్తిని నీ వెట్లు ప్రకాశవంతముగ జేసితివో అట్లే యీ స్థూలశరీరమునుగూడ దేదీప్యమానముగ జేయుము. వ్యష్టి స్వరూపము సకలము,— దాని మూలస్థితి, మూలతత్వము మొదలుకొని, దాని కట్టకడపటి ఆవిష్కృతియగు స్థూలశరీర పర్యంతము,— నీ కేవల సత్యస్వరూపపు సమగ్ర సాక్షాత్కారోప లబ్ధియందు సంయోగమును బొందుగాక.

ఓ పరమ పురుషా, ఈ ప్రపంచమందు నీ ఉనికి, నీ ప్రకాశము, నీ ప్రేమ తప్ప వేరొండు లేదు.

నీ స్వత జ్ఞానమువలన సకలము దేదీప్యమానమై రూపాంతరము చెందుగాక.

నీ దివ్యప్రేమ నా సత్తయం దంతటను బ్రసరించుచున్నది. నీ దివ్య జ్యోతి నా ప్రతి జీవకణమునందును వెలుగుచున్నది. సకలమూ నిన్ను దెలిసి కొని, నీతో నైక్యమొంది పరమానంద పరవశమగుచున్నది.

* * *

మే 23, 1914

ఓ పరమేశ్వరా, నిన్నుగురించిన యెరుకయే నాలో నిత్యమూ దీపించు చుండవలెను; నా సత్తయందలి సూక్ష్మాతిసూక్ష్మ జీవకణములలో సైతము నీ సాక్షాత్కారమునే నేను పొందుచుండవలెను; నిన్నే నా మూలస్వరూపముగా తెలిసి కొని, సకలవస్తువులలో అభివ్యక్తమగుచున్నదియు నీవేయని దర్శింపగలుగు చుండవలెను. నీవే పరమసత్య స్వరూపుడవు; నీవే సృష్టికి మూలకారణము, పరమలక్ష్యముగూడ. నీయెడ నా ప్రేమ నిరంతరము వృద్ధిగాంచు నట్లనుగ్ర హింపుము. నేను కేవలము ప్రేమ స్వరూపమే,— నీ ప్రేమ స్వరూపమే యగుదునుగాక. అట్లు నీ ప్రేమస్వరూపమై నీతో పూర్ణైక్యమును బొందుదునుగాక. ఈ ప్రేమ నానాటి కత్యంత ప్రగాఢము, సమగ్రము, ప్రకాశవంతము, శక్తిమంత మునై విరాజిల్లుగాక. నిన్ను జేరుటకు అడపరాని తొందరపాటు గలదై, నిన్ను అభివ్యక్త పరచు అప్రతిహత సాధనముగ విరాజిల్లుగాక. ఈ సత్తయందలి సమస్తము,— అంతరాంతర అగాధతలములనుండి అత్యంత బాహ్యస్వరూప పర్యంతము,— ప్రగాఢము, అనాసక్తము, దివ్యమునగు విశుద్ధప్రేమగనే రూపొందునుగాక. ఈ శరీరేంద్రియమనఃప్రాణ సంఘాతమున రూపొందుచున్న దైవము నీ పరిపూర్ణ దివ్యప్రేమ స్వరూపముననే రూపించబడునుగాక. సకల జ్ఞానమునకు పరమసాధనము, సిద్ధిస్వరూపముగూడ ఈ ప్రేమయే. ఈ నీ ప్రేమచేతనే బుద్ధివృత్తు లన్నియు నిర్మలములై, క్రమవిభక్తములై, ప్రకాశవంత

ములై రూపాంతరము చెందునుగాక; నా ప్రాణకోశ ప్రవృత్తులన్నియు గూడ పూర్తిగా నీ ప్రేమచేతనే పరిష్కృతములై, విశిష్ట ప్రభావ సమన్వితమగు విశుద్ధిని, ఎడతెగని శక్తిసామర్థ్యములను, నిర్వక్రగతిని సంతరించుకొనునుగాక. దుర్బలముగ రూపొందించబడియున్న యీ నా మాధ్యమిక సత్త, తన దౌర్బల్యమే తనకు సదవకాశము కల్పించునది కాగా, కేవలము నీ ప్రేమతో రూపొందించబడిన తత్వవిశేషములచే తనను దాను పునర్నిర్మాణము గావించుకొనునుగాక. జాజ్వల్యమానమగు అగ్నికుండికవోలె ఈ శరీరము నీ యపౌరుషేయ పరమదివ్యప్రేమను తన రోమకూపము లన్నిటిగుండ ప్రసరింపజేయునుగాక. పర్యవసానమున, నీ ప్రేమయే తనకు సహజమై యొప్పారు శక్తి, విభవ, మాధుర్యాది గుణవిశేషములచే సమస్తమును వెల్లిగొలిపి, రూపాంతరము చెందించి చైతన్యవంతముగ పునరుజ్జీవింపజేయునుగాక. నీ ప్రేమయందే శాంతి యున్నది, ఆనందమున్నది, నీ సేవాకార్యమును అవలీలగా నెరవేర్చుటకు ఉపయోగపడు 'మీట' వంటిదైన శక్తి విశేషము సైతమున్నది.

నీ ప్రేమ విశ్వముకంటె విస్తృతమైనది; యుగములకంటె శాశ్వతమైనది; అనంతము, నిత్యమునై విరాజిల్లునది; అది కేవలము నీవే. నీవుగానే నే నుండెదను, ఉన్నానుకూడ. కారణమేమన, అది నీ నియతి, అది నీ యిచ్ఛ.

* * *

మే 24, 1914

ఓ నా ప్రియతమ ప్రభూ, నేను బహిర్విషయములందు నిమగ్నుడను కాకుందునుగాక. వీనియందు నాకు రుచిలేదు, ఆసక్తి లేదు. అయినను వీనితో నేను వ్యవహరించుచున్నాననిన, అది నీ యిచ్ఛయనియు, ఎంతటి చిన్నవిషయమునుగాని, చిన్న పనినిగాని నిర్లక్ష్యము చేయక సర్వసమగ్రమైన రీతిలో కార్యాచరణ మొనర్పవలసియున్నదనియు నాకు దోచుట వలననే. కాని, ఇట్లు చేయునప్పుడు, ఆ పనులపట్ల మా దృష్టిని మరల్చి, వీలయినంతలో నీ శక్తిని వానియందు పూరించిన జాలును. మా చేతన మూలతత్వమున నవి ప్రాధాన్యము వహించుటకు అవకాశమీయరాదు.

ఓ నా ప్రియతమ ప్రభూ, నిన్ను జేరి, నీ స్వరూపమేమియో తెలిసికొని, నీతో ఏకత్వమును బొందవలెననియే నా యాకాంక్ష. నిరంతరము మరింత విశుద్ధము, విస్తృతము, ప్రగాఢమునై వృద్ధిచెందు ప్రేమోపలబ్ధికై నే నర్థించగా, జడమున కూరుకొని పోయినట్లుగా నున్నది యిప్పటి నా పరిస్థితి. ఇదియేనా నీవు నా కొసగు సమాధానము ?

జడమును నెమ్మది నెమ్మదిగ చేతనలోనికి మేలుకొల్పుటకే నీవుకూడ ఆ జడమున కూరుకొనిపోవ నిచ్ఛగించియుంటివి కావున, నీతో పూర్ణైక్యానుభూతి పొందుటవలన ఫలిత మిదే యగునా ? ఇందుకు నీవు నా కొసగెడి సమాధాన మీ రీతిగ నున్నది,— "నిజమైన ప్రేమ నీ వలపరచుకోవలె ననిన, ఈ విధముగనే, చీకటియందు, జడమునందు నీవు ప్రేమ నభ్యసింపవలసియున్నది,"— అని. అవునా ?

ఓ నా ప్రభూ, ప్రియతమదైవమా, నేను నీదాననని, నీ యిచ్ఛయే నా యిచ్ఛయని నీ వెరుంగుదువు. కాని, ఏది నీ యిచ్ఛ, అనుదాని విషయమున నాలో నెప్పుడును సందియము పొడసూపకుండునుగాక. హృదయమున నెలకొను అక్షరప్రశాంతియందు, ఏ రీతిగనైనను నీవు నాకది బోధసేయుచుండుము. అవసర

మైనచో అంధకారమునందే నేను కూరుకొనిపోవుదునుగాక. కాని, అది నీయిచ్ఛ యని నాకు తెలియునట్లయినను అనుగ్రహింపుము.

ఓ ప్రభూ, నా ప్రార్థనకు సమాధానముగ, నా హృదయములో నిప్పుడు, నిత్యమైన నీ దివ్యసన్నిధిచే ఆవిర్భూతమైన ఆనందగేయాలాపనము వినవచ్చుచున్నది.

* * *

మే 25, 1914

ఓ విశుద్ధ దివ్యప్రేమస్వరూపా, నిన్ను సముచితముగ సేవింపగోరెడి ఈ యుపకరణమునందు, దాని అత్యంతస్వల్ప ప్రవృత్తులలో సైతము, ఎట్టి అహంకారము, ఎట్టి అజ్ఞానము, ఎట్టి అసత్ప్రివృత్తి పొడసూపకుండునట్లుగ అనుగ్రహింపుము. అందలి ఏ ప్రివృత్తి విశేషమువలనను నీ చర్యకు వక్రత, విఘాతము ఏర్పడరాదు. నీ వెలుగు సంపూర్ణముగ బ్రసరించకుండ, ఎన్నిగూడులింకను చీకటిలో నున్నవో! వానిలో గూడ వెలుగు నిండారుటచే గలుగు పరమానందమును ఘటింపజేయుము.

ఓ ప్రభూ, నేనొక సుస్వచ్ఛమైన స్ఫటికమణివలె నుండగోరుచున్నాను. దీనిలోనుండి ప్రసరించు నీ దివ్యకిరణము ఏ విధమైన వికృతియు బొందరాదు; ఎట్టిరంగు దానిపైనబడుటయు జరుగరాదు. ఇది నేను పూర్ణత్వసిద్ధికోసమై కోరుచున్న కోర్కెకాదు. నీ కార్యము కడు నిర్దుష్టముగ నెరవేరవలె నన్నదే నా యాకాంక్ష.

నే నీ రీతిగా నిన్ను బ్రార్థించు సందర్భములో నాలోనుండి మాట్లాడుచున్న 'నేను' ఈ సమస్త పృథ్వియు. నీ దివ్యప్రకాశము స్వచ్ఛముగా ప్రతిబింబింపజేయు నిర్మల వజ్రమణివలె నుండగోరుచున్నది ఈ పృథ్వియే. సకల మానవ హృదయములు నా హృదయములో స్పందించుచున్నవి. వారి ఆలోచనలన్నియు నా యాలోచనలలో నినదించుచున్నవి. మహనీయమైన యీ యాకాంక్షలో, అతిసామాన్యమైన జంతువుల, వృక్షముల అత్యల్పాకాంక్ష సైతము పాలుపంచు

కొనుచున్నది. ఇదంతయును తన్ను దా నుద్ధరించుకొని ఊర్ధ్వగామియగుచు, నిన్ను జేరుటకొరకే,— సత్తాశిఖరముల నధిరోహింపుచు నిన్నుబొంది నీ ప్రేమను నీ తేజస్సును జూరగొనుటకొరకే,— నీ నిశ్చలానందమును కొల్లగొట్టి దుఃఖతిమిరము నెల్ల నీచే భేదింపజేయుచు అద్దానిని దివ్యానందములోనికి, అఖండశాంతి లోనికి బరివర్తింపజేయుటకొరకే. నీపైకి ఎత్తివచ్చి బలాత్కారముగ జేయు నీ యాక్రమణ మంతయు ఆత్మార్పణ పూర్వకమైన ఒకానొక యఖండప్రేమతో జేయునదే కాని వేరుకాదు; నీతో సంపూర్ణైక్యము నిశ్చయమనెడి సుప్రసన్న భావము తొణికిసలాడగా ఆత్మవిశ్వాసపూర్వకమైన ఒకానొక సుప్రశాంతితో జేయునదియును.

ఓ నా ప్రియతమ ప్రభూ, విజయసాధనకై విక్రమించువాడవు, ఆ విక్రమము,— విజయమును జూరగొనువాడవు, ఆ విజయము,— అంతయు నీవే.

* * *

మే 26, 1914

సముద్రోపరిభాగమున తుపానున్నది; సముద్రము కల్లోలితమై యున్నది; తరంగము లొండొంటిని ఢీకొనుచు, ఒకదానిపై నొకటి పడి చెంగలించుచు నత్యధిక ఘోషముతో బటాపంచలగుచున్నవి. కాని, ప్రకోపించిన ఉపరితల జలరాశిక్రింద శాంతియుతము, సంచలన రహితము నగు సుప్రసన్న సువిశాల జలాశయ విస్తృతులు వ్యాపించియే యుండును. ఆ జలాశయ విస్తృతు లీ యుపరిగత సంక్షోభ మనివార్యావశ్యకమగు కార్యమని భావించును. ఏలన, అఖండ దివ్యజ్యోతి నభివ్యక్త మొనరింపగలుగుటకు జడద్రవ్యము తీవ్రముగా మథింపబడవలయును. ఈ సంక్షోభ దృశ్యమున కావల,— ఈ దొమ్మిపోరితముయొక్క క్లేశప్రదమగు విజృంభణము వెనుక,— చిత్పురుషుడు తన స్థానమున నచలితుడై, బహిర్ముఖసత్తయొక్క ఆందోళనమును సాక్షిభూతముగ దిలకించుచుండును. కాని యా యాట కేవల తుచ్ఛమైన నాటకదృశ్యముగ బరిణమింపకుండ జూచుకొనుచు నయ్యది, దానిని సక్రమమార్గమునకును, సమ్యగ్దిశకును ద్రిప్పజాలినంత జోక్యమును మాత్రము గొనుచుండును. ఈ జోక్యమొకసమయమున దృఢముగను,

తీక్ష్ణముగను ఉండినను, ఒకపరి నిందాస్తుతిగను, వెక్కిరింతగను ఉండినను, వేరొక తరి అనుశాసకముగనో అపహాస్యముగనో ఉండినను, నిరంతరము బలవత్తరము, సాధుసౌమ్యము, శాంత్యుపేతము, స్మితరుచిరమునై, హితాపాదక శక్తితో నొప్పారుచుండును.

ఏకాంతమున నేను నీ యనంత నిత్యానందమునే యనుభవించితిని.

అంతట, అంధకారమున నింకను సతమతమగు నా యంతరంగమునుండి తిన్నగా ఈ ప్రార్థనము వెలువడెను : "ఓ మధురస్వరూపా, ఓ శుద్ధవిజ్ఞానదాయకా, పరమేశ్వరా, నా దేహమందలి ప్రత్యణువు, నే జేయు నఖిలకార్యములు దివ్యప్రేమమును, నీ మహత్తర సుప్రసన్నభావమును నిరంతర మావిష్కరించుటకై వినియోగపడునట్లు చేయుము.

నా హృదయమున అత్యద్భుతానంద ధురీణతా మధురగానము నినదించుచున్నది.

*  *  *

మే 27, 1914

ప్రభూ, మా సత్తయందలి ప్రతి భూమికయందును మా చేతనను సచ్చిదానందానుభూతిలోనికి మేల్కొలుపవలసి యున్నది. ఈ మూడు లోకములు, మూడు రీతులు దివ్యతేజశ్శక్తిమయము లైనట్టియు, అమూర్త అనంత అఖండ లక్షణోపేతము లైనట్టియు సీమలయందేకాక, ఈ భౌతికతత్వమునందు సైతము కాననగును. ఊర్ధ్వభూమికలలోనికి సచేతనులమై మేము ఆరోహించినపుడు ఈ సచ్చిదానందానుభూతులను బొందుట సులభమే, ఇంచుమించు అనివార్యముకూడ. కాని, అత్యంత భౌతికస్థాయిలయం దీలక్షణముల మేల్కొలుపుచే కడుంగడు కష్టమైన కార్యము ; ముఖ్యముగా సాధించవలసిన దదియే. గుర్తించవలసిన మొదటి యంశమిది. పిమ్మట మేము సమస్త దివ్యలోకములయు కేంద్రస్థానమును గనుగొనవలసియున్నది. బహుశః అయ్యది నడిమిలోక మగును. దానిలో

నెలకొనియే మేము ఈ దివ్యధామముల చేతనతో ఏకత్వము పొందనేర్చి, సమన్వయ పూర్వకముగా సమస్త భూమికలయు పరిపూర్ణజ్ఞానముతో ఏకకాలముననే మేము వ్యవహరింపగలుగుదుము.

అసమగ్రములు, అసంపూర్ణములు నైన యీ వివరణలు నిన్ను అభివ్యక్త మొనర్పజాలు పరమసత్యము నెంతమాత్రము నిరూపింపజాలవని నే నెరుగుదును. నీ వైభవము, నీ శక్తి, నీ ఘనత, నీ యఖండ ప్రేమస్వరూపము,— ఇవియెల్ల సకల వివరణములకును అతీతములు. కాని, విషయస్వరూపమును దిఙ్మాత్రముగ నైనను నా బుద్ధి యవగాహన మొనర్చుకోవలసిన యవసరమున్నది. తన్మూలముననే నేను నా సత్తయందలి అత్యంత భౌతికవిభాగములకుగూడ సాధ్యమైనంతలో సమముగ నీ యిచ్ఛతో శ్రుతిగూర్ప యత్నించుటకు నా కవకాశ మేర్పడును.

అయినను, నిన్ను నే నెక్కుడుగ అవగాహన మొనర్చుకోగలుగునది, సర్వసమగ్ర ఏకాంతభక్తిపూర్వకారాధనపు నిశ్చల నీరవతా స్థితియందు మాత్రమే. ఏలన, ఆ స్థితియందు ప్రేమించున దెవరో. ప్రేమించబడువా రెవరో, అసలా ప్రేమించుట యేమిటో,— ఈ విభాగ మచట ఏమియు నుండనేరదు. ఒకే అఖండానందమున ఈ త్రిపుటి అంతయు ఏకమైపోవు సన్నివేశమది.

ప్రభూ, అసదృశమైన అట్టి దివ్యానందమును వరముగా ఎల్లరకును అనుగ్రహింపుము.

* * *

మే 28, 1914

ప్రభూ, ప్రపంచమందలి యీ అసంఖ్యేయ తత్వములు తమ మూలాజ్ఞాన తమమునుండియు అవ్యవస్థితినుండియు మేల్కొని చైతన్యవంతములై జ్ఞాన ప్రదీప్తములగుట కొరకై వాని నన్నింటిని నీవు కదిపి కుదిపి మథించుచున్నావు. ఈ మథనమునకై నీవు ఉపయోగించునది పరమమైన నీ దివ్యప్రేమ. అంతులేని యీ ప్రేమ ప్రవాహములు అఖండమైన నీ యగాధ హృదయములోనుండియే పెల్లుబుకుచున్నవి. నా వాసస్థానము నీ హృదయమే. అదియే నా వాస్తవిక స్వరూపము. దానిలోనే పొదుగుకొనియుండి, అదే నేనుగ దానితో ఏకమై యున్నాను.

శాంతి, శాంతి,— ఎల్లరకును శాంతి ఘటిల్లుగాక!

* * *

మే 29, 1914

ఓ నా ప్రియతమ దైవతమా, నీ శిరస్సున నధివసించియుండువారలు,— అనగా నెక్కువగ బుద్ధితో మాత్రమే ఆలోచించి మాట్లాడుచు, నీ పరమచేతనతో తాదాత్మ్యమును బొంది నీ పరమజ్ఞానోపలబ్ధిని గాంచియుండువారలు నీవేయై విల సిల్లుచుందురు గావున, నీయెడ ప్రేమ యనునది వారికి ఉండనేరదు. నీ పరమ స్వరూపమందు ప్రవేశించుటచే గలుగు నఖండానందానుభూతిని వా రనుభవింతురు. కాని, భక్తుడు పారవశ్యముతో తన కతీతమైనదాని కభిముఖు డగుటలో తొణికిస లాడు భక్తిమాత్రము అట్టి వారిలో మృగ్యమే యగును. కావున, వృథ్విపై నీ దివ్యప్రేమ నభివ్యక్తము చేయవలసియున్న పురుషునికి నీవు సకలభూతసృష్టిని విశుద్ధమైన యఖండ ప్రేమతో ప్రేమించు పెట్టులో నేర్పుదువు. తొలుత నీయెడ పూజాభావ ప్రేరితమై తత్స్వరూపముగ బయలుదేరిన యీ ప్రేమ దయా గుణ విశిష్ట భక్తిశ్రద్ధలుగల ప్రేమగా పరివర్తనము చెందును.

నిత్యైకత్వమున తేజరిల్లు నో దివ్యతేజస్స్వరూపమా!

దివ్యానందనిధానమై విలసిల్లు నో యఖండ మాధుర్యస్వరూపమా!

దివ్యజ్ఞాన సుశోభితమై తనరారు నో యమేయ ప్రాభవస్వరూపమా!

అవాఙ్మానసగోచర అత్యద్భుతస్వరూపము నీయది!

* * *

మే 31, 1914

ప్రశాంత సంధ్యాసమయపు అంతర్ముఖ నిశ్చలతలో, సూర్యు డస్తమించిన వేళ,— ఓ ప్రభూ,— నా యావత్సత్తయు నీ మ్రోల, మూకారాధన పూర్వకమగు పరిపూర్ణసమర్పణ భావమున సాగిలబడినది. అపు డీ పృథ్వి యంతయు నేనైతిని. పృథ్వియే నీ యెదుట మోకరిల్లి, నీ దివ్యతేజః ప్రసాదమును, నీ దివ్యప్రేమానందోపలబ్ధిని యాచించుచుండెను. పరమ వినమ్రతతో పుడమి యట్లు ప్రణమిల్లి, ఓరిమితోపాటు ఆతురతయు నిండి తొణికిసలాడుచున్న స్థితితో నిరీక్షించుచుండ, కాంక్షించిన దివ్యతేజ మా రాత్రి యందలి నిశ్చలనీరవతలో, ఆ ప్రణామభావమున సంభృత మయ్యెను. ప్రపంచమున బ్రకటితము కాగోరు నీ దివ్యప్రేమగా రూపొందుట యెంత మధురమో, ఆ యఖండ ప్రేమ నందుకొన నుద్గమించు నవరిచ్ఛిన్నాకాంక్షగ రూపొందుటయు నంత మధురమే. వెంట వెంటనే, ఇంచుమించు ఒకేసారిగ, ఇట్లు నేను ఇచ్చునదిగను పుచ్చుకొనునదిగను రూపొందుట, రూపాంతరము చెందించునదిగను చెందునదిగను రూపొందుట, దుఃఖభాజనమైన తమముతోపాటుగ సర్వశక్తమగు తేజస్సుతో తాదాత్మ్యము చెందగలుగుచు, అట్టి ద్విముఖ తాదాత్మ్యమున మహనీయమగు నీ యేకత్వరహస్యమును గనుగొన నేర్చుట,— ఇదంతయు నీ పరమసంకల్పమును అభివ్యక్త మొనర్చి నెరవేర్చు విధానమే యగునుగాదా?

ఓ నా ప్రియతమప్రభూ, నా హృదయమొక సముజ్జ్వల మందిరము కాగా, అందు నిత్యముగ సన్నిధిచేసియున్న పరమసుందర విగ్రహము నీవు. నీ స్వరూప మీ రీతిగా, అద్భుతావహమగు పరిధాన కల్పనతో, నా జ్వలితహృదయ

జ్వాలల నడుమ నాకు సుప్రత్యక్షమగుచున్నది. అదే సమయమున, నా బుద్ధి యందు నిన్ను నేను భావాతీతునిగా, దుర్జ్ఞేయునిగా, రూపరహితునిగా దర్శించి తెలిసికోగలుగుచున్నాను. ఇట్టి ద్వివిధ దర్శనమునందును, ద్వివిధజ్ఞానము నందును పరిపూర్ణ సంతృప్తి తొణికిసలాడుచు కానవచ్చుచున్నది.

* * *

జూన్ 1, 1914

అప్రతిహత శక్తిసంపన్నమై విరాజిల్లు నో యఖండ దివ్యప్రేమ స్వరూపమా, నీవే యీ జగత్తున కధినాథుడవు, స్రష్టవు, రక్షకుడవును; అవ్యవస్థలో నుండి దాని నుద్ధరించి, ఒకానొక పరమగమ్యము వైపుగా నడిపించుకొని పోవు చున్నావు.

ఎంతటి అల్పవస్తువునందైనను నీవే నాకు దేదీప్యమానముగ గోచరించు చున్నావు. నీ యిచ్ఛకు ప్రతికూలురుగ గానవచ్చు నహితులయందు సైతము నీవే ఉనికి గైకొని పనిచేయుచు వారిలో నీ తేజఃకిరణ ప్రసారము గావించుచున్నట్లు కానవచ్చుచున్నావు.

ఓ నా ప్రియతమదైవమా, సాక్షాత్తుగ నీవీ ప్రేమసార స్వరూపుడవే. కేవలము నీ హృదయమునే నేను. నా యావత్సత్తలోనూ నీ ప్రేమప్రవాహ ములే, ఎల్లెడల నీ ప్రేమను మేల్కొలుపుటకై, సకలమును ఉజ్జీవింపజేయు నీ ప్రేమ చైతన్యము నెల్లెడల మేల్కొలుపుటకై ప్రవహిల్లుచున్నవి.

నిన్ను గుర్తించనివారిని, నీ వెవరవో తెలియనివారిని, మధురమైన నీ దివ్యనియతికి పెడమొగమై పోవనుంకించువారిని నా ప్రేమకరముల నెత్తికొందును; నా ప్రేమహృదయపు టూయెలలో నూగింతును; నీ ప్రేమ ప్రకాశమును వారి కందించి, అద్భుతమైన నీ దివ్యవిభూతులు వారిలో చొరబారునట్లుచేసి, నీ దివ్యా నంద స్వరూపులనుగ వారిని పరివర్తింప జేయుదును.

ఓ దివ్యప్రేమస్వరూపమా, సకలములోనికిని జొచ్చి సకలమును రూపాంతరము చెందించునది నీవే.

* * *

జూన్ 2, 1914

అంతర్ముఖమైన నిశ్చలనీరవ ప్రశాంతిలో, వాక్ప్రసారములేని భక్తిభావమున, దుఃఖభాజనమగు నీ తమోమయ పదార్థమంతటితోను ఏకమై నేను,— రక్షకుడవైన ఓ దేవా,— నీ కిదే ప్రణమిల్లుచున్నాను. నీ ప్రేమ పరమముక్తిప్రదాయిని. లెక్కిడరాని వరముల గ్రుమ్మరించిన యా ప్రేమకు నే నెంతేని కృతజ్ఞురాలను. పూర్ణత్వము సిద్ధింపజేయుటకై నీవు తలపెట్టిన కార్యమును నీవు పూర్తిచేయ గలందులకై నీకు నే నాత్మార్పణ మొనర్చుకొనుచున్నాను. అనంతరము నీ ప్రేమతో ఏకత్వము పొందియుండిపోవుటే నా పని. అంతులేని నీ ప్రేమదక్క వేరొండేదియు నేను కాను. ప్రేమరూపమున సమస్తములోనికిని నేను చొరబారెదను; ప్రతి అణుగర్భమునందును నివసించుచు అచట విశుద్ధికరమై రూపాంతరీకరణమును సాధింపగల యగ్నిని రగుల్కొల్పెదను. ఎన్నటికిని చల్లారబోని అగ్నియది; సర్వసిద్ధిప్రదమగు నీ దివ్యానంద సందేశము నందించెడి యగ్ని.

పిమ్మట ఈ ప్రేమ ప్రశాంతముగ అంతర్ముఖ మగుచు, తెలియరాని దివ్య ప్రకాశస్వరూపుడవగు నీ దిశకు మరలి, ఆనందపారవశ్యమున నీ నవావిష్కారమునకై ఎదురుచూడగలదు.

* * *

జూన్ 3, 1914

నా యావత్సత్తయు నిపుడు అధికతరముగా శారీరిక కర్మకలాపమున నిమగ్నమగుచు, విస్తారబహుళమైన భౌతికోపలబ్ధుల సాధింపబూనుచున్నది గావున, చక్కగ వాలోచించి సమస్తమును నేను క్రమబద్ధ మొనర్పవలసియున్నది. బాహ్య విషయజాతమువైపు మరలియున్న యీ నా చేతన సమస్తశాంతికి, శక్తికి, ఆనందమునకు మూలస్థానమైన నీతోడి యైక్యానుసంధానమున నిత్యమూ మననేర్చునట్లుగా, ఓ ప్రభూ, అనుగ్రహింపుము.

ఓ నా ప్రియతమదైవమా, ఈ నా యావత్సత్తద్వారా నెరవేరవలసియున్న కార్యము లన్నింటిని నీవే నిర్వహింపుము. లేక, ఈ సత్తయందలి ఏయొక విభాగము కూడ తానొక ఉపకరణ మాత్రమను సంగతి ఏ క్షణమునను మరువకుండునట్లు అనుగ్రహింపుము. నీవు జోక్యము కల్పించుకో గలందులకే, భ్రమాత్మకమైన యీ ఉపకరణము సత్యమువోలె రూపొందినది. అంతటను ఉన్నదియు, అన్నిపనులు చేయుచున్నదియు నీవే యన్నది ఈ యుపకరణ మెన్నడును విస్మరింపరాదు.

ఆహా, నీ యక్షర సాన్నిధ్యపు అనుగ్రహ విశేషమును ఏమని వర్ణింతును!

* * *

జూన్ 4, 1914

ఓ సర్వప్రతిబంధ విజేతా, నీ దివ్యనియతి నెరవేరుటకు మాలో ఆటంకముల గల్పించు సమస్తమును పరాస్తము చేయగల విజయస్వరూపుడవు నీవే. నీవే మా యజ్ఞానాంధకారమును, అహంకారిక దుస్సంకల్ప రూపమైన కారుపొగ మబ్బును పటాపంచలు చేయువాడవు; నీవే మాలోని అసత్ప్రవృత్తుల నన్నింటిని లయింపజేసి, సుస్పష్టమైన విశుద్ధ దర్శనము మాలో పాదుకొనునట్లొనర్చి, ఎట్టి విచ్ఛేదక భావములకును, ఎట్టి అవ్యవస్థాధోరణులకును మేము వంచితులమై పోకుండునట్లు చేయగలవాడవు.

ఓ నా ప్రియతమప్రభూ, నీ యఖండప్రేమయే మా జీవన సత్యము. సర్వశక్తియుతమగు దాని కార్యమును ప్రతిఘటింప గలవారెవ్వరు ? సకలావరోధములను చీల్చివైచి వానిలోనుండి దూసుకొనిపోగల శక్తి నీ ప్రేమకున్నది. ఆ యవరోధములు పృథులమైన యజ్ఞానజడిమరూపమైనవి గావచ్చును. లేక, సదవగాహనములేని అసత్సంకల్ప ప్రతిఘటన రూపమైనవియు గావచ్చును. ఓ నా ప్రియతమ దైవమా, ఈ ప్రేమరూపముగా అన్నింటను ప్రకాశించుచున్నవాడవు నీవే. ఈ నీ ప్రకాశమే అంతకంతకు ప్రబలమగుచు, పృథ్వియందంతటను అలముకొని ప్రతి జీవచైతన్యమునకును దృశ్యమానము కాగలదు.

ఎవ్వరు నీ శక్తిని ప్రతిఘటించగలవారు ? నీవే ఏకైక పరమసత్య స్వరూపుడవు.

నా యావత్సత్తయు నొక్కటిగ కూడుకొని మౌనముగ భవదీయారాధన తత్పర మగుచున్నది. నీవు కానిది మరేదియును కానవచ్చుట లేదు.

* * *

జూన్ 9, 1914

ఓ పరమేశ్వరా, నీతోడి దివ్యైక్యరూపమైన యగ్నిజ్వాలగా నీ మ్రోల నిలిచి నీ కిపుడు సమర్పితమై యున్నాను....

ఈ రీతిగా నీ మ్రోల నీకు సమర్పితమై నిలిచియున్నది కేవల మీ శరీర గృహపు స్థూలరూపమేకాదు, అందుచేరియున్న సమస్తము, అందు ప్రవేశమొనర్చువారెల్లరు, దానిని పొడగనువారు, దానితో ఏదోరీతిగ సంబంధము కలిగియున్నవారు, అందరును, పర్యవసానమున ఈ సమస్త పృథ్వియు నీ యెదుట నిలిచి యున్నది.

జాజ్వల్యమానమగు అణుగర్భమును బోలిన కేంద్రస్థానమిది. దీని ద్వారముననే నీ తేజస్సు, నీ ప్రేమ అధికాధికముగ ప్రసారితమై, నీ శక్తి విశేషములే

ప్రత్యక్షముగగాని అప్రత్యక్షముగగాని పృథ్వియందెల్లెడల సమస్తమానవ హృదయములలోనూ బుద్ధులలోనూ తొణికిసలాడగలవు.

నీ కొరకై నాలోనుండి వెల్వడిన యాకాంక్షకు సమాధానముగా నీవు నాకనుగ్రహించిన సునిశ్చియభావ సంస్థితి యిది.

అతి విస్తారమైన ప్రేమకెరట మొకటి సమస్తములోనికిని దిగివచ్చి అంతటను చొరబారుచున్నది.

శాంతి, విజయము, పూర్ణత్వము, అద్భుత్యము ఎల్లెడల వెల్లివిరియు గాక.

అజ్ఞానమున దుఃఖితులై యున్న ఓ నా ప్రియమైన బిడ్డలారా, తిరుగుబాటు ప్రవృత్తితో తీవ్ర సంచలనములకు లోనగుచున్న ఓ మానవస్వభావమా, మీ హృదయములను విస్ఫారజేసికొని, మీ శక్తినంతను కూడగట్టుకొనుడు. అఖండశక్తియుతమగు దివ్యప్రేమ మీలోనికి దిగివచ్చుచున్నది. సుస్వచ్ఛమైన దివ్యతేజః ప్రసారము మీలోనికి చొరబారుచున్నది. పృథ్విపై మానవ చరిత్రలోని యీ ముహూర్తము ముహూర్తములోకెల్ల పరమసుందరము. ప్రతివారును ఇది గుర్తెరిగి ఈ సర్వసమృద్ధిని చూరగొనెదరుగాక.

ఓ దుఃఖితహృదయులారా, ఆందోళిత మనస్కులారా, అజ్ఞానజనిత, అవివేకపూర్వక, అసత్సంకల్పులారా, మీ యాందోళనలెల్ల శమించి మటుమాయమై పోవునుగాక.

'ఇచట నే నున్నా' నని అభయ మొసగుచు వినూత్న దివ్యవాణి వినవచ్చుచున్నది వినండి.

* * *

జూన్ 11, 1914

ఓ పరమేశ్వరా, నా సత్తలోని స్థితివిశేషము లన్నియును, అవ్వాని తత్వ సముదాయ మంతయును, అసంఖ్యేయ నమోవాక పురస్సరముగ ప్రతి ప్రాతః కాలమున నీ మ్రోల మోకరిల్లుచున్నవి. ఇయ్యది అనుదినము సర్వాడవైన నీకు ఈః సర్వమూ ఆత్మార్పణము గావించుకొనెడు శుభసన్నివేశము. నీ వెలుగును, ప్రేమను అందుకొనుటకై అజ్ఞానములో నుండియు అహంతలోనుండియు ఉబికి వచ్చు సంప్రార్థన మిది. ఇందులకు నీ సమాధానము నిరంతరముగా, సర్వ సమగ్రముగా అందుచునేయున్నది. నీ వెలుగు, నీ ప్రేమ అంతటనూ నిండారి కానవచ్చుచున్నవి. అజ్ఞానము, అహంకారము అనెడి భూతముల నిక అంతరింప జేయుట సులభము.

ప్రాభవోపేతము, బహుళఫలప్రదమునైన నీ దివ్యశాంతి ఎల్లెడలను వ్యాపించి యున్నది.

* * *

జూన్ 12, 1914

పరమేశ్వరా, మేము తొలుత జ్ఞానసముపార్జనము గావింపవలెను. అనగా, నిన్నెరుగుట యెట్లో, నీతో ఐక్యము గాంచుట యెట్లో నేర్చుకొనవలెను. ఆ లక్ష్యసాధనకు అన్ని ఉపాయములు మంచివే, అవలంబింపదగినవే. కాని, ఈ లక్ష్యమును సాధించుటతో సమస్తము పూర్తియైనదని తలంచుట గొప్ప పొరపాటే యగును. సిద్ధాంతరీత్యా అంతయు పూర్తియై, విజయసిద్ధి చేకూరినదనుట నిజమే. తమ మోక్షసిద్ధిమాత్రమే యపేక్షించువా రిందుమూలమున సంతృప్తి చెంది, అటుపైన నీ యభివ్యక్తిని గురించి ఏమియు పట్టించుకొనకయే, నీతోడి యనుసంధానమున తదేక నిష్ఠతో మనుటమాత్రము తమ కర్తవ్యముగ భావించు కొనవచ్చును.

కాని, పుడమిపై నీ ప్రతినిధులుగ చరించుటకు నీవు ఎన్నుకొనినవారు మాత్రము అట్టి ఫలప్రాప్తితో నెంతమాత్రము సంతృప్తిచెంది యుండజాలరు. నిన్ను తెలిసికొనుట తక్కిన పను లన్నిటికంటె ప్రథమ కర్తవ్య మనుమాట నిజమే, కాని, అట్లు తెలిసికొనిన పిమ్మట, నిన్ను అభివ్యక్తము చేయవలసిన ముఖ్య కార్యమంతయు మిగిలియేయుండును. అత్యంత విశుద్ధము, గుణవిశిష్టము, శక్తిమంతము, సంశ్లిష్టము నైనరీతిలో ఆ యభివ్యక్తి కొనసాగవలసియున్నది. నిన్ను తెలిసికొన్నవారు తరచుగా తమ జ్ఞాన సాక్షాత్కార జనితమైన యానంద పారవశ్యమున దిగ్భ్రాంతులైపోయి, తాము మాత్రమే నిన్ను దర్శించుచు, తమ బాహ్యసత్తయందే కొంచెముగనో నిన్ను అభివ్యక్త మొనర్చుటతో సంతృప్తి పడుచుందురు. కాని, నిన్ను పరిపూర్ణముగ నభివ్యక్త మొనర్పగోరువాడు మాత్రము అంతటితో సంతృప్తిచెంది యుండజాలడు. అన్ని భూమికలలోను, అన్ని యవస్థలలోను అతడు నిన్ను అభివ్యక్తము చేయుచు, తన జ్ఞానోపలబ్ధివలని పూర్ణప్రయోజనమును సాధ్యమైనంతలో లోకమంతయును పొందవలెనని యపేక్షించును.

అతి విస్తృతమై కన్పట్టు నీ మహాకార్యక్రమము మ్రోల, నా యావత్సత్తయు నానందపారవశ్యమున దేలి నిన్ను నుతింపుచు రసస్నిగ్ధ గీతగానము చేయుచున్నది.

సమస్త ప్రకృతియు, సంపూర్ణముగ చైతన్యవంతమై, ప్రాభవోపేతములైన నీ శక్తివిశేషములతో స్పందించుచు, అవ్వాని ప్రేరణకులోనై, వానివలన దీప్తిని బొంది రూపాంతరము చెందుటకై ఉత్సహించుచున్నది.

ఓ జగదీశ్వరా, ఈ జగమున సత్యవస్తువుగ దీపించుచున్నది నీ వాకడవే.

* * *

జూన్ 14, 1914

మేము సాధించవలసియున్న దొక మహత్తరమైన సృష్టికార్యము; నూతన కార్యకలాపములను, నూతన జీవనవిధానములను మేము సృష్టి చేయవలసియున్నది. పుడమిపై ఇంతవరకెన్నడును జరిగియుండని విధమున నీ దివ్యశక్తి సంపూర్ణముగ నభివ్యక్తము గావలసియున్నది. ఈ నూతనావిష్కార కార్యసాధనకొరకే నా యావత్సత్తయు నిపు డేకాగ్రత వహించియున్నది. దీనికి కారణము నీవు నన్నా రీతిని ఆదేశించుటయే, కాని, ఈ పనికై నీవు నన్ను ఎన్నుకొని యుంటివి కావున, దీనిని సాధించు నుపాయమునుగూడ నాకు నీవే అందీయవలెను; అనగా, ఇందుకు గావలసిన జ్ఞానమునెల్ల నీవే నాకు ప్రసాదింపవలెను. మేము మా ప్రయత్నములనెల్ల ఏకోన్ముఖము గావించెదము. నీ శక్తి నభివ్యక్తముచేయు జ్ఞాన సముపార్జనము కొరకై మా వ్యష్టిసత్తయెల్ల నిరంతరముగ నేకాగ్రత వహింపవలసియున్నది; తదనుగుణముగా మా యంతరాంతర్వర్తివైన నీవుకూడ, సకలావరోధములను భేదించి రూపాంతరము చెందించి అతిక్రమించునట్లుగా నీ శక్తివిశేషమును పూర్తిగా ప్రకటన మొనర్పవలసియున్నది. ఇదియే వైయక్తిక జీవనలోకములతో నీవు చేసికొనియున్న ఒడంబడిక. నీవొక వాగ్దానము చేసి, దానిని నెరవేర్చుటకు వలయు శక్తితో సమర్థులను ఈ లోకములలోనికి పంపి యున్నావు. ఆ వాగ్దానము నెరవేరు నిమిత్త మిపుడు నీ పరిపూర్ణసాహాయ్యము గావలసియున్నది.

మాలో ఇప్పుడు, రెండు సంకల్పములు, రెండు ప్రవాహములు సంయోగము పొంది, అట్టి సంయోగఫలితముగా, సకలమును దీప్తముచేయగల యగ్నిస్ఫులింగ ముద్భవింపవలసియున్నది.

అంతయును ఈ విధముగా జరగవలసియున్నది కావుననే ఇది నిశ్చయముగా జరిగితీరును.

* * *

జూన్ 15, 1914

"నా హృదయములోనికి చేరుకొని విశ్రమించి నిశ్చింతగ నుండుము: జరగవలసిన దంతయును జరిగిపోవును. నీకు తెలియకుండ నీవు చేయు కార్యమే అత్యంత సమీచీనముగ చేయబడిన కార్యము."

ప్రభూ, నీ యానతి ప్రకారము ఇపుడు నేను నీ హృదయములోనేయున్నాను. ఇటనుండి నన్నిక ఏదియు కదల్పజాలదు. అగాధములైన యీ నీ హృదయపు లోలోతులనుండియే,— ఇటగల దివ్యానందములోని సుప్రసన్నశాంతి యందు నెలకొనియే,— నీ యభివ్యక్తి రూపమైన యీ సృష్టిలోని బాహ్యరూపముల నన్నింటినీ దిలకింపుచు, నిన్ను చక్కగా అవగాహన మొనర్చుకొనుటకును, నిన్నే నాయం దంతటను చక్కగ అభివ్యక్తము గావించుటకును బ్రయత్నించుచున్నాను.

నీవు నాకు బోధపరచిన రీతిగా, నూతన రూపములలో నీ సాక్షాత్కారోప లబ్ధికి సమయ మాసన్న మయ్యేనేని, ఆ రూపములు అటులనే ఆవిష్కృతము లగునుగాక. స్పష్టముగ నా కింకను దెలియకున్నను నాలో నేదియో దీనిని గురించిన పూర్వజ్ఞానము కలిగినదై, దీని కనుగుణముగ తనను దాను మలచు కొన యత్నింపుచు, నీవు కోరెడి ఉన్నతస్థాయి నందుకొన జూచుచున్నది. కాని, నాలోనే, నిన్ను గురించిన యెరుక గలిగి నీ శక్తియందే వసించుచున్న భాగము నకు మాత్రము, అంతులేని నీ అభివ్యక్తియొక్క క్రమవికాస గతియం దీ నూతన రూపావిష్కారము అత్యల్పమైన పురోగతిగనే గన్పట్టును. నిత్య పరిపూర్ణత లోని నిశ్చల ప్రశాంత దృష్టితో నయ్యది ప్రతి రూపవిశేషమును తిలకింపనేర్చును.

ఈ నిశ్చలప్రశాంతియందే వాస్తవముగ నీ సాక్షాత్కారోపలబ్ధిలోని సమస్త శక్తియు గర్భితమై యున్నది.

అచంచల విశ్వాసముతో ఉన్నతోన్నత భూమికల కెగసి విహరించుటెట్లో మేము తెలియవలెను; అట్టి ఉత్ప్లవన ఫలితముగనే పరిపూర్ణ జ్ఞానోపలబ్ధి కలుగును.

* * *

జూన్ 16. 1914

పరమేశ్వరా, సూర్యుని భంగి నీ తేజోవైభవము భువికి దిగివచ్చుచున్నది. నీ తేజః కిరణములు ప్రపంచము నంతను ప్రకాశింపజేయగలవు. ఆ ముఖ్య తేజోమండల వైభవము నభివ్యక్త మొనర్చుటకు విశుద్ధత, మార్దవము, గ్రహణ శక్తి గల జీవభూతము లెల్ల గుమిగూడుచున్నవి. ఇదేదో అకారణముగ జరుగుచున్నది కాదు; ఏ యొకరి యిచ్ఛపైగాని ఆకాంక్షపై గాని ఆధారపడి యున్నదియును గాదు; వ్యక్తిగత నిర్ణయముతో నేమాత్రము నిమిత్తము లేకుండ, వారి వారి తత్త్వము ననుసరించి ఇది యెల్ల జరుగుచున్నది. నీ తేజోవైభవము సర్వత్ర ప్రసరించును; దాని నభివ్యక్త మొనర్పగలవారు అద్దాని నభివ్యక్త మొనర్తురు. భేదభావవిశిష్టమై యున్న యీ ప్రపంచములో అభివ్యక్తము కావలసియున్న దివ్య తేజఃకేంద్రమును సాధ్యమైనంతలో విశుద్ధముగ వ్యవస్థీకరించుటకై ఈ జీవభూతము లిట్లు గుమిగూడుచున్నవి.

అద్భుతావహమగు నీ చింతనలో, శరీరాణువు లన్నియు ఉప్పొంగి పోవుచున్నవి. సత్యస్వరూపమై వెలయు నా పరతత్త్వ దర్శనముచే ఈ సమస్త పదార్థము పరవశించిపోవుచున్నది. ఇపుడీ పదార్థమును నీనుండి వేరుచేసి చూచుట యెట్లు? పరిపూర్ణతాదాత్మ్యమున ఇపుడంతయును సంపూర్ణముగ, ఘనిష్ఠముగ నీవే అయియున్నావు.

* * *

జూన్ 17, 1914

ఇప్పటిదనుక భావించి తెలిసికోబడిన దంతయు ఇకముందు ఒనగూడవలసి యున్నదానితో పోల్చి చూచుచో బొత్తుగా అసమగ్రము, సర్వసామాన్యముగనే గన్పట్టు చున్నది. పూర్వపు సంసిద్ధులివు దేమాత్రము పనికిరావు. నూతన శక్తివిశేషములను ఆవిష్కరింపజేసి, నీ దివ్యేచ్ఛకు వానిని విధేయము గావించుటకు ఒక వినూత్న మహాశక్తి కావలసియున్నది. "అర్థింపుడు, అది మీకు సిద్ధింపగలదు", — అనునదే నీ నిత్య సమాధానము. ఓ పరమేశ్వరా, ఈ యుపాధియందు నీ విపుడు అచంచలమైన అంతశ్శుద్ధితో గూడిన యాకాంక్షను, — ప్రబలము, ప్రగాఢమునై, అనవరతముగ, అవిచ్ఛిన్నముగ గొనసాగెడి యాకాంక్షను ఉద్బుద్ధ మొనర్పవలసియున్నది. నిశ్చల నీరవత, శాంతి ఇవు డిచట నెల కొనియున్నది. ఆకాంక్షయందలి తీవ్రత నిరంతరమై కొనసాగుటే కావలసి యున్నది. ఓహో, నీ సంకల్పము రూపుగై కొన బోవుచున్నదను నుత్సాహముతో నా హృదయ మిపుడు ఆనందపారవశ్యమున గానము సేయుచున్నది.... నాలో ఇపుడున్న ధాతువు లన్నియు నశించి, నూతనావిర్భూతికి యోగ్యములైన నూతన ధాతువులు వాని స్థానమున అవిర్భవించునుగాక.

ఆహా, నీ దివ్యశాంతి ఎంత విస్తృతము !
నీ యమోఘప్రేమ ఎంత శక్తిమంతము !

బుద్ధిచే భావింపనగుదాని కంతకును ఆవల, మాకు ముందుగనే పొడగట్టుచు నీ యచింత్య తేజోవైభవము విరాజిల్లుచున్నది. ప్రభూ, నీ దివ్యభావనను, దివ్య వాణిని, దివ్యశక్తిని మాకు అనుగ్రహింపుము.

ఓ నవోదిత అజ్ఞాత స్వరూపమా, ఈ ప్రపంచరంగస్థలిలోనికి ప్రవేశింపుము.

* * *

జూన్ 18, 1914

అదే సంకల్పము సదా పనిచేయుచున్నది. తనను దా నావిష్కరించుకొనుటకై ఆ దివ్యశక్తి తరుణము వేచియున్నది. ఈ నవీనావిష్కారమును సాధ్యమొనర్పగల నవ్యరూప మెట్టిదో కనుగొనవలసియున్నది. ప్రభూ, ఈ దివ్యజ్ఞానము ననుగ్రహింపగలవాడవు నీవే, మరెవ్వరును గాదు. ప్రయత్నించుట, అర్థించుట, ఆకాంక్షించుట,— ఇదే మా యావత్సత్తయు చేయవలసిన పని. ఇక, దానికి ప్రతికృతిగా దివ్యతేజస్సును, దివ్యజ్ఞానమును, దివ్యశక్తిని అనుగ్రహించునది నీవే.

ఆహా, విజయవంతమై విలసిల్లు నీ దివ్యసన్నిధిచే నుత్తేజితమై నాలో ఆనందగీతి వెల్వడుచున్నది.

* * *

జూన్ 19, 1914

ఓ పరమేశ్వరా,
మా హృదయములను నీ దివ్యప్రేమానందముతో నింపివేయుము.
మా బుద్ధులను నీ దివ్యతేజోవైభవముతో వెల్లిగొల్పుము.
నీ విజయమును మేము ఆవిష్కరించునట్లుగా అనుగ్రహింపుము.

* * *

జూన్ 20, 1914

ప్రభూ, ఈ రూపాంతరీకరణ కార్యక్రమమును నీవే నిర్వహింపవలెను; ఇందుకు అనుసరించవలసిన మార్గమును చూపవలసినవాడవు, కడవరకును దాని ననుసరింపగల శక్తి నొసగవలసినవాడవు నీవే.

నీవే సమస్తప్రేమకు, జ్యోతిస్సుకు మూలమైనవాడవు. నీ నిజస్వరూపము నెరుంగుట మావలన నయ్యేడి పనిగాదు; కాని, అంతకంత కధికముగా, సమగ్రముగా, శుద్ధముగా దాని నావిష్కరింప నేర్తుము. మా బుద్ధిభావనచే మేము నీ దరి చేరజాలము; కాని, కొలది యిడరాని నీ సంపూర్ణ వరప్రదానమును గోరుచు ప్రగాఢమైన నిశ్చల నీరవతతో నిన్ను సమీపింపగలము. నీ విజయమును మేము సాధించుపర్యంతము నీవే మాకు సాయమొనర్ప విచ్చేయవలెను.

సకలదుఃఖనివారకమగు నీ దివ్యప్రేమ ఆవిర్భవించునుగాక. యథార్థ శక్తికి తావలమై విలసిల్లు అచంచల శాంతిని మాలో నెలకొల్పుము. అంధకారము నెల్ల పటాపంచ లొనర్పగల యఖండిత జ్ఞానమును మాకు ప్రసాదింపుము.

అగాధమైన లోలోతులనుండి, ఈ అత్యంత బాహ్యశరీర పర్యంతము, అద్దాని ప్రతి అణువునను, నీవే పుష్పించుచున్నావు, నీవే నివసించుచున్నావు, నీవే స్పందించుచున్నావు. సకలమును నీవే ప్రవర్తింపజేయుచున్నావు. ఈ సకల సత్తయు నిపుడు ఒకే రాశిగా, అనంత బహుత్వముతో విలసిల్లుచుండియు సుసంగతమైన ఒకే పూర్ణస్వరూపమున నొప్పారి, 'నీవు' అనుదానికి దక్క అన్యమునకు తావులేని ఒకే అఖండస్పందనతో నినదించుచున్నది.

* * *

జూన్ 21, 1914

మానవునికి గల కర్తవ్య మేమి ? తటస్థము, అత్యంత విశుద్ధమునైన దర్పణముగా తా నుండనేర్చి, అదే సమయములో బాహ్యాభ్యంతర విషయజాతము నెడ, సృష్టికార్యకారణములయెడ దృష్టి నిగుడించుచు, తత్ఫలితాంశములను సర్వ నియామకమైన (ఈశ్వర) సంకల్పమునకు నివేదించి, అటుపైన ఆ సంకల్ప స్వరూపమెట్టిదో తా నెరుంగుచు తదనుసారముగ ప్రవర్తించుటే ఇంచుమించుగా అతని కర్తవ్యమైయున్నది. తటస్థముగనుండి గ్రహించుట, తెలిసి ప్రవర్తింప నేర్చుట,— ఈ యుభయరీతులను మేళవించి నిష్కృష్టముగ సాధించుట కడుం గడు కష్టమైన కార్యము. ప్రభూ, మానుండి నీవు అపేక్షించుచున్న దిదియే. అపేక్షించుచుంటివి కావున, ఇట్టి యుపలబ్ధికి వలయు సాధనసంపత్తియు నీవే యొనగూర్పగల వనుటకు సందేహము లేదు.

ఏలన, ఏది జరగవలసియున్నదో అది జరిగితీరును,— మేము ఊహింప గలుగుదానికంటె ఘనతరముగ సైతము జరిగితీరును.

ఈ సృష్టి పరిణామక్రమములో నీ ప్రేమ అంతకంతకు పుష్కలము, పరమము, గంభీరము, పృథులమునై పరిఢవిల్లునుగాక.

* * *

జూన్ 22, 1914

కావలసియున్నది అగుట నిశ్చయము; సాధింపబడవలసినది సాధింపబడుట నిశ్చయము.

ప్రభూ, నీ యనుగ్రహముచే, అపారమైన ప్రశాంత సునిశ్చయభావము నాలో నెలకొని యున్నది. ఎవరిద్వారా, లేక దేని ద్వారా, నీ యభివ్యక్తి జరుగునో ఎవరు చెప్పగలరు?.... పూర్ణతరము, ఉచ్చతరమునగు నూతనావిష్కృతికి ప్రయత్నించు సమస్తమునందును నీవున్నావు. కాని, జ్యోతిఃకేంద్రావిష్కారమింకను జరుగలేదు; ఆ యావిష్కార కేంద్రమింకనూ నిర్దుష్టముగ రూపొందక పోవుటే దానికి కారణము.

ఓ పరమేశ్వరా. కావలసిన దేదియో అయి తీరును; అది లోకమంతయు ఊహించినదానికంటె కడు భిన్నముగ నుండవచ్చునుగూడ.

కాని, కొన్ని నీరవరహస్యములను వెల్లడించుట యెట్లు?

శక్తి యనునది ద్యోతక మగుచున్నది; దాని గర్భస్థమై యున్నదే ఆత్మతత్త్వము.

అయ్యది ఆవిష్కారము చెందుట ఎప్పుడు, ఏ విధముగా? ఎప్పుడనగా, ఉపకరణము తయారై యున్నదని నీవు నిర్ణయించినప్పుడు.

నీ వనుగ్రహించు ప్రశాంత దృఢనిశ్చయము, నీ దివ్యశాంతి యందలి శక్తివిశేషానుభవము ఎంత మధురాతి మధురము!

* * *

జూన్ 23, 1914

రూపాంతరీకరణమును సాధింపగల పరమశక్తిసంపన్నుడవు నీవు.

మా మధ్యవర్తిత్వమున నీతో సంబంధము కల్పింపబడియున్నవా రందరి పైనను నీ ప్రభావమును నీ వేల ప్రసరింపజేయగూడదు? నీ శక్తిపై విశ్వాసము మాకు కొరవడియున్నది. సమగ్రమైన యీ రూపాంతరీకరణము సాధింపబడుటకు, మానవులు బుద్ధిపూర్వకముగా సంకల్పించుట ఆవశ్యకమని మేము నిత్యమూ తలపోయుచుందుము. వారిలో నెలకొనియుండి సంకల్పించునది నీవే యనియు, వారి యావత్సత్తయు వెలుగుచే దీప్త మగునటుల నీవు సంకల్పింపగలవనియు మేము విస్మరింతుము.... ప్రభూ, నీ శక్తిని మేము శంకించుచున్నాము; కావుననే మాది సరియైన మధ్యవర్తిత్వము కాకుండపోవుచున్నది; అద్దాని రూపాంతరీకరణ శక్తిలో విశేషభాగము మా మూలముగనే ఆచ్ఛాదిత మగుచున్నది.

ఓ ప్రభూ. మాలో లోపించియున్న యీ విశ్వాసమును మా కనుగ్రహింపుము; మాకు కొరవడియున్న యీ దృఢనిశ్చయమును సవిస్తరముగ మా యందు పాదుకొల్పుము. సామాన్య పద్ధతిలో ఆలోచించి నిర్ణయముచేయు అలవాటునుండి మాకు విముక్తి కల్పింపుము; నీ యఖండ ప్రేమానుభూతిలో నిత్యమూ నివసించుచు, అనుక్షణమూ దాని కార్యకలాపమునే మేము దర్శింపగలుగునట్లును, అట్టి దర్శన శక్తితో అత్యంత భౌతికానుభవస్థితులకు గూడ నీ ప్రేమస్పర్శను కలుగజేయగలుగునట్లును అనుగ్రహింపుము.

ప్రభూ, అజ్ఞానమునుండి విముక్తిని, యథార్థమైన విశ్వాసబలమును మాకు ప్రసాదింపుము.

* * *

జూన్ 24, 1914

సృష్టి పరిణామక్రమమున ఈ పుడమిపై కొనసాగించవలసియున్న కార్య క్రమము దృష్ట్యా, ఆచార్యవ్యవస్థ యనునది ఆవశ్యకమే. ఇంకనూ అవ్యవస్థితము గనే యున్న యీ ప్రపంచమందు, మధ్యవర్తిత్వపు జోక్యమనునది ఏమియు లేకుండగనే,— అయ్యది నీ నియతికి పూర్తిగా అనుగుణ మనియే చెప్పవలసి యున్నది— ఈ కార్యము సాధ్యమగునా ?.... సాక్షిచైతన్యసత్త కడు ప్రశాం తముగను, నిరపేక్షముగను చిరునవ్వుతో ఈ క్రీడను— క్రమశః ప్రదర్శితమగు ఈ వినోదమును,— తిలకించుచు, ఆయా పరిణామ విశేషములను నిశ్చలభావ ముతో గమనించుచుండును. ఆ పరిణామ విశేషములు ఆవిష్కారము చెందవలసి యున్నదాని అసమగ్ర ప్రతిరూపములు మాత్రమే యని అద్దానికి దెలియును.

కాని, భక్తిభావవిశిష్ట చైతన్యసత్త మాత్రము అట్లుగాక, ప్రేమభరితమైన మహనీయాకాంక్షతో, నీకు అభిముఖమై, ఉత్తమమైన ఉపలబ్ధి పొందగలుగుటకును, సకలావరోధములనూ అతిక్రమింప గలుగుటకును, చీకటి అంతయూ చెల్లాచెదరై ఆహంకారిక అసత్సంకల్పమెల్ల విచ్ఛిన్నము కాగలందులకును నీ సహాయము నర్థించును. ఈ పొందవలసిన ఉత్తమోపలబ్ధి కేవలము ఇప్పటి వ్యవస్థలోని పరిస్థితులయందు ఉత్తమమైనది మాత్రమే కాదు. ఏలన, అట్టిది సర్వసాధారణ ముగా లభించుచునే యుండును. ఇక్కడ జరుగవలసిన దేమన, అపూర్వమైన ప్రయత్న ఫలితముగా ఈ పరిస్థితులే పూర్తిగ రూపాంతరముచెంది, గుణములోనూ పరిమాణములోనూకూడ వినూత్నమూ అత్యంత విశిష్టమూనైన ఒకానొక ఉత్త మోపలబ్ధి ఆవిష్కృతము కావలసియున్నది.

అట్లేయగునుగాక— తథాస్తు.

*
* *

భవిష్యమును గురించి ఇప్పుడు మాకుగల బుద్ధిభావనపు వెలుగులో దానిని నిర్ణయింప బూనుకొనుటయు, కనీసము ఊహింప దొరకొనుటయు ఎంతమాత్రము సరి కానేరదు. ఏలన, ఈ భావన వర్తమాన కాలీనము; నిర్వ్యక్తికముగ నైనను

వర్తమానకాల స్థితిగతుల అన్యోన్య సంబంధరీత్యా రూపొందినదే యగును. ఈ స్థితిగతుల అన్యోన్య సంబంధము పృథ్విపై మానవ జీవితసమస్యకు సంబంధించిన భవిష్యత్కాలపు స్థితిగతుల అన్యోన్య సంబంధమును సమగ్రముగ ప్రతిబింబించునది కానేరదు. వర్తమాన పరిస్థితులను బట్టి భవిష్యత్తును నిర్ధారణ చేయుట హేతువాదస్థాయికి చెందిన మానసిక ప్రవృత్తి మాత్రమే. ఈ నిర్ధారణ మాలోని అవచేతనా విభాగమున జరిగి అంతఃస్ఫూర్తి రూపమున మాలో వ్యక్తమైననూ అయ్యది హేతువాదరూపప్రవృత్తియే యగును. ఈ హేతువాదము కేవలము మానవవ్యక్తికిగల శక్తి విశేషము; దీనికి సంబంధించిన అంతఃస్ఫూర్తులు అనంతము, అపరిచ్ఛిన్నము నైన యీశ్వర చైతన్యమునుండి కలుగునవి కావు. కేవలము సర్వజ్ఞస్థితిలో మాత్రమే,— తెలిసికొనునది, తెలియబడునది, తెలియుట ఈ మూడును ఒకే కాలమున నెప్పుడు మేమే యగు స్థితి మాకు కలుగునో అప్పుడు మాత్రమే,— భూతభవిష్యద్వర్తమాన సంబంధముల నన్నింటినీ మేము తెలియనేర్తుము. కాని, యీ స్థితిలో భూతము, వర్తమానము, భవిష్యత్తు అనునవి విడివిడిగ నుండనేరవు. అంతయు నొకే అనంతకాలము. ఈ సంబంధముల అభివ్యక్తిక్రమము కేవలము పరమప్రేరణ ననుసరించియే,— దైవనియతి ననుసరించియే జరుగదు; ఆ నియతిని వ్యతిరేకించు బాహ్యప్రపంచ ప్రతిఘటన ననుసరించికూడ జరుగుచుండును. ఈ రెండింటి కూడిక వలననే అభివ్యక్తి రూపొందుచున్నది. కాని, ప్రకృతమున నేను తెలియనేర్చినంతలో, ఈ కూడిక ఒక విధముగా ఇదమిద్ధమని నిర్ణయింపరానిది. ఇట్టిదే యీ ప్రపంచ క్రీడ,— ఇట్టిదే ఈ క్రీడలో ముందుగ తెలియబడని సందర్భము.

* * *

జూన్ 25, 1914

ఈ విధముగా ఉండవలెనని, ఆ విధముగా ఉండవలెనని,— ఇట్లు కోరుకొనుటలో విజ్ఞత ఏమున్నది? ఈ రీతిగా మమ్ములను మేము బాధపెట్టుకొను టెందులకు? ఓ పరమేశ్వరా, నీవే కదా పరమకర్తవు? నీ చేతిలో ఒదుగు పనిముట్టుల మగుటయే కాదా మా కర్తవ్యము? పనిముట్టును కొంతకాలము నీవు వాడకుండ ప్రక్కన బెట్టినప్పుడు, తనను ఉపయోగించని కారణమున అది నీవు తనను విడనాడినట్లుగ బాధపడి ఆక్రోశించునా? కొంతకాలము కర్మప్రవృత్తిని, సంఘర్షణను అనుభవించిన పిమ్మట ప్రశాంతి విశ్రాంతుల ననుభవించుటకు సైతము అయ్యది ఇచ్చగింపదా? ఏ క్షణమున, ఎంత సన్నగ పిలుపు వచ్చునో యని, మేము నిరంతరము జాగరూకులమై యుండవలె ననుట నిజమే. ఏలన, బుద్ధితోగాని, హృదయభావనలతోగాని, శరీరముతోగాని పని చేయవలసినదిగ నీవు మాకు సంజ్ఞచేసినప్పుడు మేము నిద్రలో మునిగియుండుటగాని, జడీభూతులమై యుండుటగాని జరుగరాదు. కాని, భక్తిభావమున, నిరంతర జాగరూకతతో ఇట్లు ఎదురుచూచుట వేరు, ఆతురతతో, అశాంతితో వ్యాకులపడుట వేరు,— దీనినీ దానినీ కలగాపులగము చేయరాదు; మేము ఇది కాలేదనీ అది కాలేదనీ, నీవు మానుండి అపేక్షించిన రీతిగా మేము నడవని కారణమున నీ కెక్కడ అసంతుష్టి కలుగునో యనీ,— ఇట్లు కలత చెందుట కూడదు.

మా సకలాందోళనములను పోగొట్టగల పరమ విశ్రాంతి స్థానము నీ హృదయము. దానిని సదా విస్తృతముగ తెరచియుంచవలసినదిగా అర్థించుచున్నాను. వివిధ బాధలతో నీ దరిజేరువారెల్ల అందు పరమమైన విశ్రాంతిని, అభయమును పొందెదరుగాక.

ఓ ప్రభూ,
ఈ యంధకారమును భేదించి, వెలుగును ప్రసరింపజేయుము.
ఈ తుపానును శమింపజేసి, శాంతిని నెలకొల్పుము.
ఈ హింసాప్రవృత్తి నరికట్టి, ప్రేమసామ్రాజ్యమును ప్రతిష్ఠించుము.
నీవే యోద్ధవై, సకలావరోధములనూ పటాపంచలు చేయుము.
నీవే విజేతవై విరాజిల్లుము.

జూన్ 26. 1914

ఓ పరమేశ్వరా, జగన్నాయకా, నీ కిదే నమస్కరించుచున్నాను. అనాసక్తముగా కర్మల నొనర్చు శక్తిని మాకు ప్రసాదింపుము; వ్యక్తిత్వభ్రమకు లోనుగాకుండగనే వ్యష్టివికాసపు శక్తివిశేషములు మాలో పరిఢవిల్లునట్లు అనుగ్రహింపుము. సత్యదర్శనము మాలో స్థిరపడుగాక; ఏకత్వదృష్టి మాయందు దృఢపడునుగాక; సమస్తమైన అజ్ఞానాంధ తమస్సునుండియు మాకు విమోచనము కల్పింపుము.

ఈ యుపకరణపు పూర్ణత్వసిద్ధికై నిన్ను మేము యాచించుట లేదు. ఏలన, ఈ సాపేక్షిక ప్రపంచములో, పూర్ణత్వసిద్ధి యనునదెల్ల సాపేక్షికమే యగును. ఈ ప్రపంచములో వ్యవహరించుట కుద్దిష్టమైన యీ యుపకరణము, ఆ ప్రకారముగా వ్యవహరింపవలెననిన, అయ్యది యీ ప్రపంచమునకు చెందినదిగానే యుండవలెను. కాని, దాని నుద్దీపింపజేయు చైతన్యము మాత్రము నీతో తాదాత్మ్యము చెందియుండవలెను; అయ్యది బహుళవైవిధ్యముతో కూడిన సకల శరీరములనూ ఉద్దీపింపజేయు నిత్యసత్య విశ్వచైతన్యముగా భాసింపవలెను.

ఓ ప్రభూ, సృష్టిలోని సామాన్య రూపవిశేషములకు అతీతులమై మేము మెలగనేర్చునట్లు అనుగ్రహింపుము. అపుడు, నీ నూతనావిష్కారమునకు వలయు ఉపకరణములను ఎంచుకొనుటకు నీకు వీలగును.

గమ్యస్థానమును గురించిన లక్ష్యము మా దృష్టినుండి ఎన్నడును చెదరకుండునుగాక; పృథ్వి ఇంతవరకును పొందియెరుగనట్టియు, పొందగలదనెడి సందేశమును మా ద్వారా నీ వామెకు వెల్లడిచేయుచున్నట్టియు నీ శక్తివిశేషముతో మేము సదా తాదాత్మ్యము చెందియుందుముగాక.

అంతర్ముఖమై లోలోతులకు చొరబారిన ఏకాగ్రతానిష్ఠలో, నా సత్తయందలి అభివ్యక్తి విశేషము లన్నియు నీ దివ్యాభివ్యక్తి కొరకై ఆత్మనివేదనము గావించుకొనియున్నవి.

జూన్ 27, 1914

పరమేశ్వరా, నా జీవసత్త యెల్ల, నీవు ప్రసాదించుదానితో తృప్తి గాంచు చున్నది; నీవు ఏమి చేయుమనిన అది చేయుటకు సిద్ధముగా నున్నది. ఈ విషయమున నది యెట్టి దౌర్బల్యమునకు, ఎట్టి వృథావినయమునకు, నిష్ప్రయోజకమైన ఎట్టి కీర్తికాంక్షకు తావీయదు. నీవు నిలువబెట్టిన స్థానము, అప్పగించిన కార్యము ఎట్టిదైననేమి ?.... ఎట్టి ఆందోళనయు లేకుండ, సాధ్యమైనంతలో సర్వసమగ్రముగ, ఈ జీవసత్త అంతయూ నీ దగుటయే కదా కావలసినది ?

నీవు సంకల్పించిన కార్యము జరిగితీరుననియు, అది జరుపవలసియున్న వారిని నీవు సృష్టించి ఎన్నికచేసి యున్నావనియు అచంచలమైన ప్రగాఢవిశ్వాసము ఈ నా జీవసత్తయందు నెలకొనియున్న స్థితిలో, ఇదివరకే ప్రాప్తమైయున్న దానికొరకిపుడు సంకల్పింపబూని వృథాయాసము పొలగు టెందులకు ? పరమేశ్వరా, ఈ యఖండ విశ్వాసపు పరమశాంతిని నీవు నాకు ప్రసాదించియున్నావు. నీ ప్రేమలో, నీ ప్రేమవలననే జీవించుచు, అధికాధికముగ నేను నీ ప్రేమగనే మారిపోవు అసదృశవరమును నాకు అనుగ్రహించితివి. ఈ దివ్యప్రేమలోనే అక్షరమైన పరిపూర్ణానందము కలదు.

ఒకే ఒక సంప్రార్థనము నీకీ సందర్భమున నేనీ క్రింది విధముగా చేయుచున్నాను. ఈ సంప్రార్థన మిదివరకే ఆలకింపబడియున్నదని నే నెరుగుదును. "ఓ పరమేశ్వరా, నీ ప్రేమలో, నీ ప్రేమవలననే సమగ్రముగ వసింపజాలు ధాతువులయు, అణువులయు, జగములయు సంఖ్యను నాలో నానాటికి అధికాధికముగ వృద్ధినొందించుము,"—— అనునదియే ఆ యీ ప్రార్థన.

సమస్త పృథ్వికి శాంతి ఘటిల్లుగాక, శాంతి ఘటిల్లుగాక.

* * *

జూన్ 28, 1914

ఓ పరమేశ్వరా, సమస్త ప్రకృతియు నీకు నమస్కరించుచున్నది; బాహువులు పైకెత్తి, చేతులుసాచి యర్థించుచున్నది. అఖండమైన నీ యౌదార్యము నామె శంకించుచున్నదని కాదు; అడిగినగాని అనుగ్రహింపబడదను తలంపామెకు ఉన్నదనియు గాదు. అది ఆమె అభివాదపూర్వకముగా నీకు తాను ఆత్మసమర్పణము గావించుకొనెడి తీరు. ఏలన, ఈ ఆత్మసమర్పణము నీ వనుగ్రహించిన దానిని గ్రహించుట కామె సర్వసంసిద్ధతయే కాని మరేమియుగాదు. నీకు అభిముఖమై ప్రార్థనసేయుట ఆమె కానందము. ప్రార్థన అనావశ్యకమని ఆమెకు తెలియును. అయినను ఈ ప్రార్థన అనునది ప్రగాఢము, ఆనందప్రపూర్ణము నైన అర్చన విధానము. అంతటను నీవే ఏకమైయుండి, అన్నిటిలోనూ నీవే యున్నా వనెడి బుద్ధిజ్ఞానమునకు ఎట్టి భంగపాటూ కలుగకుండగనే ఆమె భక్తిభావ మీ ప్రార్థనవలన సంతృప్తి నందుచున్నది.

తెర లన్నియు ప్రీలిపోయి, సకల హృదయములలోనూ వెలుగు నిండారుట నిశ్చయము,

ఓ ప్రభూ, మేము చేయవలసిన కార్యమెట్టిదైనను, ఆ కార్యనిర్వహణమున మాకు దైవముతో తాదాత్మ్యమును, సంపూర్ణజ్ఞానమును ఘటింపజేయజాలు విశుద్ధ ఆత్మప్రశాంతిని ప్రసాదింపుము.

ప్రభూ, నీయెడ నాకుగల ప్రేమ కేవలము నీవే; అయినను, నా ప్రేమ నీ ముందల మోకరిల్లుచున్నది.

* * *

జూన్ 29, 1914

ప్రభూ, వీ రందరకు సంతోషమును, శాంతిని, సుఖమును ప్రసాదింపుము. దుఃఖమును వీ రనుభవింపవలసివచ్చుచో, ఆ దుఃఖము రూపాంతరీ కరణమునకు సాధనమగునట్లొనర్పుము. నీ ప్రేమలోని యానందమును, నీ యేకత్వములోని శాంతిని వీరికి అనుగ్రహింపుము. వీరి హృదయములు నీ నిత్యసాన్నిధ్య స్పందనమును తమలో అనుభవింప నేర్చునుగాక. ఓ ప్రభూ, వీ రందరును నాలో ఉన్నారు, నేను వీరిలో నున్నాను. 'అహంకార' స్థానమున నిపుడు నీ యప్రతిహత ప్రేమమాత్రమే యున్నరీతిగా, వీరందరును నీ ప్రేమలోనే యుండి దానిచే రూపాంతరము చెందగలరు.

ప్రభూ, నా ప్రియదైవతమా, అజ్ఞేయవైభవోపేతుడవైన నీ సుఖశాంత్యానందములను వీరి కనుగ్రహింపుము.

* * *

జూన్ 30, 1914

ప్రతి ప్రవృత్తియు తన పరిధిలో ఎట్టి అవ్యవస్థితి, ఎట్టి గందరగోళము లేకుండ, తనకు నిర్ణీతమైన ప్రత్యేకవిధిని నిర్వర్తించుచున్నది. ఒకదాని నొకటి ఆవరించియుండి, ఒకే కేంద్రము చుట్టును అన్నియు క్రమశః ఏర్పాటైయున్నవి. అంతయు నీ యిచ్ఛ . . . సుస్పష్టత, సువ్యవస్థ మానవ జీవులలో అత్యంతముగ లోపించియున్నవి. జీవియందలి ప్రతి అంశము, ప్రతి అవస్థా విశేషము, తక్కిన వాటితో సామరస్యమున తన విధిని నిర్వర్తించుటకు బదులు దేనికది సంపూర్ణస్వేచ్ఛతో, స్వతంత్రముగ వ్యవహరింపజూచుచుండును. సమస్తలోకము అజ్ఞానవశమున జేయుచున్న పొరపాటిదియే. సమస్త భూమండల పరివ్యాప్తమైన యీ పొరపాటు కోటానుకోట్ల ఉదాహరణలతో మరల మరల చేయబడుచునే యున్నది. కాని, ఈ ప్రవృత్తులు విడివిడిగా, అవ్యవస్థితితో మెలగుచున్నవను నెపమున, నీ యిచ్ఛయే ఏకాంతమున అవిచ్ఛిన్నముగ ప్రవర్తిల్లుటకై వీనిని అణచివేయ బ్రయత్నించుట అసాధ్యమైన వట్టి యసంబద్ధకార్యమే యగును. వీనిని వ్యవస్థీకరించుట

కంటె అణచివేయుట సులభమనుమాట నిజమే. కాని, అణచివేతకంటె సామరస్య పూర్వకమైన వ్యవస్థీకరణము కడుంగడు గొప్పది. అంతిమ లక్ష్యము సత్తాశూన్యమగు నిర్వాణస్థితికి చేరుకొనుటే యైనను, అట్టి నిర్వాణప్రాప్తి సకలసత్తను పరమవిశుద్ధముగ తీర్చిదిద్దుకొనుట ద్వారముననే కలుగునని నాకు దోచుచున్నది.

ఓ నా ప్రియతమదైవమా, ఇవన్నియు నీ యఖండ మృదుస్పర్శను అనుభవింపగలుగునట్లుగా అనుగ్రహింపుము. అట్టి మృదుస్పర్శ వలన కలుగు ప్రశాంతస్థాయి ఫలితముగా ఇవి యెల్ల నీ నియతిలో విలసిల్లు పరమవ్యవస్థితి సాక్షాత్కారోపలబ్ధులను పొందనేర్చునుగాక.

ప్రేమమయమైన నీ యిచ్ఛ, నీ శాంతి సర్వత్ర అభివ్యక్త మగునుగాక.

* * *

జులై 1, 1914

ఓ పరమేశ్వరా, భక్త్యుత్సాహములతో నీకు మేము నమస్కరించుచున్నాము. పృథ్విపై, ఈ లోకమున ఎల్లతావులలోను నీ యిచ్ఛ ప్రవర్తిల్లుటకు, అనవరతము నవనవముగా నీకు మేము ఆత్మార్పణము గావించుకొనుచున్నాము.

నీ దెసకు అభిముఖమై మా బుద్ధి మౌనము వహించినది. కాని, మా హృదయముమాత్రము, అన్నింటనూ నీవే ప్రకాశించుచుండుటచే, అత్యంత సూక్ష్మమైన ఇసుకరేణువుసైతము భక్తిభావోద్దీపకమే యగుటచే, ఉల్లాసమున పారవశ్యము చెందుచున్నది.

అంతులేని ప్రేమతో, అవాఙ్మానసగోచరమైన ఆనందముతో, ఓ ప్రభూ, నీ మ్రోల మోకరిల్లుచున్నాము; నీతో ఐక్యమును పొందుచున్నాము.

ఈ యఖండానందము సర్వులకు ప్రసాదింపబడుగాక.

* * *

జులై 4, 1914

విజయశీలములగు అఖండ శక్తిసామర్థ్యములకు, పరమనైర్మల్యానంద ప్రేమలకు నిలయమైన ఓ దేవా, ఈ జీవసత్త సకలము, ఈ శరీరము సర్వస్వము పరమభక్తితో నిన్ను సమీపించి, నీ యిచ్ఛకు సంపూర్ణముగా నివేదితమైన యీ అభివ్యక్తి సాధనమును సమగ్ర వినయపూర్వక ఆత్మార్పణము ద్వారా నీకే అర్పణ మొనర్చుకొనునుగాక. ఇట్టి యుపలబ్ధికి పలయు పరిణతి దాని కింకనూ కొంత కొరవడి యున్నను అది యట్లే జరుగున ట్లనుగ్రహింపుము.

ఎదురుచూచిన ఈ యలౌకిక సంఘటనము ఒకానొకనాడు తప్పక సంఘటిల్లి, నీ పరమవైభవము సంపూర్ణముగ అభివ్యక్తము కాగలదన్న సునిశ్చల, సుదృఢ నిశ్చయముతో, పరమౌత్సుక్యమున నీ కభిముఖులమై, పరమ మౌనమున నిన్ను వేడుకొనుచున్నాము.

అఖండము, అనంతము, అద్భుతము నగు స్వరూపము నీయది. సకల వస్తుజాతమునందును నెలకొనియుండి ప్రకాశించుచున్నవాడవు నీవే. నీ యిచ్ఛ నెరవేరు ఘడియ సమీపించుచున్నది. సకల ప్రకృతియు గంభీరముద్ర వహించి, ప్రశాంత నిశ్చలమైన ఏకాగ్రత నుపాసించుచున్నది.

భక్తిపూర్వకమైన ఆమె అభ్యర్థనమును నీవు మన్నించి ప్రత్యుత్తర మొసగుచున్నావు.

* * *

జులై 5, 1914

బాహ్యము, అవరములై, ఇంకనూ తెలియని స్థితిలోనే యున్న జీవసత్తకు సంబంధించిన దంతయు గాఢమైన మూగభక్తితో నీ ముందు మోకరిల్లి నిన్ను పూర్ణముగ నభివ్యక్త మొనర్చు యోగ్యతను తనకు ఘటింపజేయగల విశుద్ధిని ప్రసాదింపవలసినదిగా అర్థించుచున్నది.

భక్తిభావపూర్వకమైన యీ సమర్చనమునందు సంపూర్ణముగు నిశ్చల నీరవతయు ఆనందబంధురతయు తొణికిసలాడుచున్నవి.

నిండారిన కరుణతో ఈ అభ్యర్థనమునకు నీ విటుల సమాధాన మిచ్చుచున్నావు : "జరుగవలసినది జరిగితీరును. ఇందుకు అవసరమైన ఉపకరణములు సిద్ధము చేయబడును. నిశ్చయభావముతో ప్రశాంతముగ నీ ప్రయత్నమును కొనసాగింపుము."

* * *

జులై 6, 1914

ఈ దర్శనమెంత సర్వసమృద్ధము ! వినయ విధేయతలతో, సర్వసమర్పణ భావమున, మందహాసపూర్వకముగా, సుస్థిరప్రశాంతియందు నెలకొని నిన్ను ఆరాధించుచున్న యీ వ్యష్టిజీవికి ప్రత్యేకమైన విలువ ఏదియును లేదు. అయ్యది సమస్త వస్తుజాతముతోడను సంపూర్ణైక్యమును బొంది, అట్టి యనుభూతితో పరిపుష్టమై నీకడ మోకరిల్లుచున్నది; ఇదే సమయములో, నీ యఖండ శక్తి విశేషము కూడ, అభివ్యక్తికై తరుణము నిరీక్షించుచు సిద్ధముగ నుండి, అనుకూలావకాశ ఘటనమందు నిమగ్నమై యున్నది. అయ్యది విజయశీలమున నొప్పారు నీ యఖండ తేజోబల ప్రాభవములకు గల అసదృశవైభవము.

అల్లదిగో, ఆ శక్తి యచట సిద్ధముగనే యున్నది. దాని కొరకై ప్రత్యాశతో నిరీక్షించువా రెల్లరు ఆనందించవలసిన తరుణమిది. ఈశ్వరోద్దిష్టమైన యీ

నూతనావిష్కరణము నిశ్చయము; దాని సమయ మాసన్నమైనది.

అల్లదే, ఆ శక్తి యచట సిద్ధముగనే యున్నది. ప్రకృతి యెల్ల ఉత్సాహ భరితమై ఉల్లాసమున గానము సేయుచున్నది. ఎల్ల ప్రకృతికి ఇది పండుగదినము. ఆ దివ్యశక్తి యచ్చట సిద్ధముగనే యున్నది.

లేచి చైతన్యవంతులు కండు; లేచి జ్ఞానదీప్తి నందుకొనుడు; లేచి సర్వమును రూపాంతరము చెందించుటకు పోరాటము కొనసాగింపుడు; ఆ దివ్యశక్తి అచట సిద్ధముగనే యున్నది.

* * *

జులై 7, 1914

శాంతి, శాంతి, పృథ్వి యంతటను శాంతి....

ఇయ్యది నిశ్చేతనపు నిద్రలోని శాంతి కాదు; ఆత్మసంతృప్తి నొందిన జడత్వములోని శాంతియునుగాదు; ఘనిష్ఠమైన యుపేక్షాభావమందును, ఆత్మవిస్మృతి కరమగు అజ్ఞానస్థితియందును గోచరించు శాంతియును గాదు; ఇయ్యది అఖండ శక్తియందలి శాంతి; పరిపూర్ణమగు ఈశ్వర తత్త్వానుసంధానముచే గలుగు శాంతి; సమగ్రమైన బోధచే, సకల పరిమితులు, సమస్తాంధకారము పటాపంచ లగుటచే అనుభూతమగు శాంతి.

ఆత్మహింసతో కూడిన యీ బాధానుభవమిక ఎందులకు? ఎందుల కింకను ఈ కఠినమైన పోరాటము, ఈ దుఃఖభాజనము, తిరుగుబాటుధోరణి? ఎందులకీ నిరర్థకమైన ఆసురీవృత్తి, ఈ నిశ్చేతనపు గాఢనిద్రావస్థ! భయము విడనాడి మేల్కొనుడు; మీ సంఘర్షణలను శమింపజేసికొనుడు; మీ వివాదము లకు స్వస్తి చెప్పుకొనుడు. మీ నేత్రములను, హృదయములను విచ్చి తిలకిం పుడు; అల్లదిగో, ఆ దివ్యశక్తి అచటనే యున్నది; పరమ విశుద్ధమై, ప్రకాశ వంతమై శక్తిపూర్వకమై అచటనే యున్నది. అఖండ ప్రేమగా, అమోఘశక్తిగా,

నిర్వివాద సత్యముగా, అమలిన శాంతిగా, అకుంఠితానందముగా, పరమ శుభప్రదాయినిగా అది అచటనే యున్నది. అదియే సద్వస్తువు; అదియే అఖండ చిదానంద జ్యోతి....వాక్కులతో వర్ణించుటకు అలవికానిది. కాని అయ్యది రూపాంతరీకరణ సమర్థమైన అఖండశక్తిగా భావాతీత ఊర్ధ్వలోకములందును, దుఃఖనివారణ సమర్థమైన అమోఘశక్తిగా జడపదార్థపు నిశ్చేతనా గాధతలములందును పనిచేయుచునే యున్నది,

జ్ఞానప్రబోధము నభిలషించెడి యో జిజ్ఞాసువులారా, వినండి, వినండి.

అల్లదిగో ఆ దివ్యశక్తి అచటనే సిద్ధముగ నున్నది. దర్శించగోరువారు దర్శించి, అనుసంధానించి, తద్విధేయులుగ మీ జీవితములను మలచుకొనండి.

* * *

జులై 8, 1914

ఓ పరమేశ్వరా, నీవు దివ్యశక్తి స్వరూపుడవు; పరమవిజ్ఞాన ప్రదాతవు. మా ప్రార్థన నాలకింపుము; మానుండి దూరమై పోకుము, మమ్ము వదలివేయకుము, ఈ యుదాత్త సమర నిర్వహణములో మాకు తోడ్పడుము. సమరమునకు వలయు బలము చేకూర్చి, విజయము సాధించు శక్తి ననుగ్రహింపుము.

ఓ నా ప్రియతమదైవమా, నీ స్వరూప మిట్టిదని తెలియనేరకయే నా హృదయము నిన్నర్చించుచున్నది; నీ సాక్షాత్కారము పొందనేరకయే నేను నీవైయున్నాను. నా వ్యష్టిచైతన్య మంతయు నీ మ్రోల సాగిలపడి, ఈ పోరాటము కొనసాగించు కర్మవీరుల పక్షమున, ఆవేదనతో సతమతమగు పృథివి పక్షమున, దుఃఖావిలమైన మానవజాతి పక్షమున, ఈ మహోద్యమము నిర్వహించు విశ్వప్రకృతి పక్షమున, నిన్ను అర్థించుచున్నది. ఓ నా ప్రియతమ దైవమా, తెలియరాని అద్భుతస్వరూపము నీది; సకల వరప్రదాతవు. తమస్సులోనుండి జ్యోతిని, దౌర్బల్యములోనుండి బలమును ఆవిర్భవింపజేయగలవాడవు. మా యత్నములకు ఊతనొసగి, మార్గదర్శివై, విజయసంసిద్ధికి మమ్ము దోడ్కొనిపొమ్ము.

జులై 10, 1914

ఓ పరమేశ్వరా, నిత్యుడవు, అక్షరుడవు నైన నీవు, ఈ సృష్టి యందు నీ సంభూతికొరకై నూతనజ్యోతిని, నూతనప్రేరణను సంతరించుటకై ఇచట వెలసియున్నావు. నీ స్వరూపమును మరింత సమగ్రముగా, సంపూర్ణముగా ఆవిష్కరింపజేయుము. ఉత్సాహభరితమగు సంపూర్ణ ఆత్మసమర్పణ భావమున ఈ యుపకరణము నీకు తనను దా నర్పించుకొన్నది. దీనిని నీవు విసర్జించి ధూళిపాలుచేయనూ గలవు, స్వీకరించి సూర్యజ్యోతిగా రూపాంతరము, చెందించనూ గలవు. నీ యిచ్ఛ ఎట్టిదైననూ దాని కిది ఎట్టి ప్రతిఘటనమును చూపబోదు. ఈ విధమైన ఆత్మార్పణమునందే దీని యథార్థ శక్తివిశేషముకలదు. ఇదే దీనికి పరమానందము.

కాని, శరీరగతమైన పశుత్వమునెడ నీ వింకను ఏల సహనము వహించెదవు ? నీ మహాశక్తి ప్రాబల్యమునకు గల అనంత్యమునకు, అత్యద్భుత సంకీర్ణస్వరూపమునకు అనుగుణమగు రీతిని అయ్యది తనను దాను సరిదిద్దుకో గలందులకై తగినవ్యవధి నీయవలెననియా ? బలాత్కారముగ దేనినీ పరివర్తింపజేయక, పరివర్తన కనుకూలముగ తమ్ము తాము సరిదిద్దుకొనుటకు తగు అవకాశము సకల ధాతువులకు కలుగజేయనెంచి, తన్నిమిత్తముగ వానియెడ సహనము చూపుటే నీ యిచ్ఛయగునా ? అట్లు సహనముచూపుటే శ్రేయస్కరమై, చూపనియెడల నయ్యది బొత్తుగ కార్యసాధకము గానేరదా ? నీవు మహోదారతతో సైరించుచున్న ప్రత్యేక దౌర్బల్యమా యిది ? లేక, రూపాంతరము చెందించవలసియున్న ప్రతి దానికిని తప్పనిసరిగ వర్తించెడి సామాన్యనియతిలో ఇదియు నొక భాగమా ?

ఏమైనను, దానిలక్షణము అట్లున్నదిగావున, దానినిగురించి మాటలపోతలకు ఎట్టి ప్రాముఖ్యమును లేదు. దానియెడ ఏ దృష్టితో నుండవలెనన్నదానికే ప్రాధాన్యము. దానికి వ్యతిరేకించి పోరాడవలెనా, లేక ఆమోదించి శిరసావహించవలెనా ? విచారించిచూడ, ఈ దృష్టిని నియమించువాడవును నీవే; ప్రతిక్షణమునను దానిని నిర్ణయించునది నీ యిచ్ఛయే. ఎప్పటికప్పుడు సరిచూచుకొనుచు

శిరసావహించుట సముచితకార్యమై యుండగా, రాబోవుదాని నూహాసేయుచు కల్పనలకు దిగుటెందులకు?

శరీరములోని జీవకణవ్యవస్థయందు కొనసాగుచున్న కార్యకలాపము స్పష్టముగ గానవచ్చుచునే యున్నది. ఘనతరమగు శక్తిచే భేదించబడి అయ్యది విస్తృతినీ లఘుత్వమునూ బొందుచున్నట్లున్నది. కాని, మెదడుమాత్ర మింకనూ భారముతో నిద్రమత్తులోనే యున్నది. దేవా, ఈ శరీరముతోడి తాదాత్మ్యమువనే నిపుడు నీకు పెట్టుకొనుచున్న మొర యిది: "నాయెడ నీ వేమాత్రము వైరణ చూపవలదు; నీ యప్రతిహత శక్తి విశేషముతో నన్ను సంపూర్ణముగ తీర్చిదిద్దుము. సంపూర్ణ రూపాంతరీకరణము నపేక్షించు దృఢసంకల్పమును నాలో నీవు ప్రవేశపెట్టియున్నావు.

* * *

జులై 11, 1914

తాను సంపూర్ణముగా లయించిపోయి, నీయెడ అంతులేని భక్తిపారవశ్యముతో మరల పునర్వ్యవస్థ నొందవలెనని యీ నా సకల శారీరిక సత్తయు వాంఛించుచున్నది. భౌతికపదార్థమునకు పరమమైన శక్త్యానందస్పర్శ గలిగించు సందేశహరుడవుగా నీ వేతెంచియున్నావు. పూర్ణోపలబ్ధియన నెట్లుండగలదో ఆ సమ్యగ్భావనను నీవు ఆవిర్భవింపజేసినావు. కాని, పరమమైన ఆ నీ యాదేశము తనను పరిస్ఫుటముగా ఆవహించియున్నదనెడి నిండువిశ్వాస మీ జీవసత్తకు స్థిరపడియున్న సమయములో, అయ్యది మునుముందు సంభవించుట నిశ్చయమనెడి వాగ్దానము మాత్రమే యని తెలియజేయుచు నీవు తిరోధానము చెందుచున్నావు. అకటా, ఈ భౌతికపదార్థ మింకనూ ఎంత లోపభూయిష్ఠముగ నున్నది! నిన్ను చేపట్టి నిలుపుకోలేకున్నదిగదా! ఓ పరమేశ్వరా, నీ యఖండ శక్తిని వినియోగించి, ఇచట నీ శాశ్వత సాన్నిధ్యము నెలకొనుట యనెడి యలౌకిక మహాకార్యమును సాధింపుము. మమ్ముల నిట్లు ఇంతగా ఉపేక్షసేయు టెందులకు? మేము విజయము సాధించుటో, లేక నశించిపోవుటో జరిగితీరవలెను.

విజయము, విజయము, విజయము ! మాకు గావలసినది రూపాంతర ప్రాప్తిరూపమైనవిజయము !

* * *

జులై 12, 1914

ఓ పరమేశ్వరా, నీవు ఎల్లచోటులందును నిత్యముగ సన్నిధిచేసియున్నావు. కావుననే సకలావస్థలలో, సకల కార్యప్రవృత్తులలో, సకలలోకములలో, ఈ జీవసత్త నిన్ను సాక్షాత్కరించుకొని నీతో ఐక్యము చెందగలిగియున్నది. తన సత్తలోని ఏ యొక కార్యప్రవృత్తియందో, విశ్వములోని ఏయొకలోకమునందో నిన్ను సాక్షాత్కరించుకొన్న మనుజుడు, "నేను పరమేశ్వరుని కనుగొంటి" ననుచు తృప్తిచెంది, ఇతరాన్వేషణము నెల్ల మానివేయును. మానవుడందుకోదగిన శిఖరస్థానము తనకు అందినదని యాతని భావన ! ఎంతపొరపాటు ! సకల అవస్థా విశేషములలో, సకల గుణప్రవృత్తులలో, సకల వస్తువులలో, సకల లోకములలో, సకల మూలతత్వములలో,— అంతటను నిన్ను మేము కనుగొని నీతో ఐక్యము చెందవలసియున్నది. అత్యల్పమైనదే యగుగాక,— ఏ యొక ధాతువిశేషము నైననూ మేము వదలివేయుదుమేని, నీతోడి మా యైక్యము సంపూర్ణమైనది కానేరదు, పూర్ణోపలబ్ధి కొరవడియే యుండును.

కావుననే, అనంతమైన యీ యారోహణక్రమమునందు, నిన్ను కనుగొనుట యన్నది తొలియడుగుమాత్రమే యగుచున్నది.

ఓ నా ప్రియతమ దైవమా, రూపాంతరీకరణము సాధించుటయం దఖండ శక్తిసంపన్నుడవు నీవు. మాలో ఎట్టి అశ్రద్ధయు, ఎట్టి అలసత్వమును ఇక పొడసూపకుండునుగాక. మాలోని సకల శక్తులను ఒకే పనగా చేర్చి కట్టి అనివార్యము, అప్రతిహతము నగు ఒకే సంకల్పముగా దానిని తీర్చి దిద్దెదవుగాక.

దివ్యజ్యోతికి, దివ్యప్రేమకు, వర్ణనాతీతమైన దివ్యశక్తికి నిలయమైయున్న ఓ యీశ్వరా, నాలోని సకలాణువులలోనికిని నీవు చొరబారి వాటిని రూపాంతరము చెందించగలందులకై అవి నిన్ను ఉచ్చైఃస్వరమున వర్థించుచున్నవి.

నీతోడి యనుసంధానరూపమైన పరమానంద మన్నింటికిని అనుగ్రహింపబడుగాక.

* * *

జులై 13, 1914

సహనము, సామర్థ్యము, ధైర్యము, స్థిరత్వము, అఖండ శక్త్యుత్సాహ గరిమ,— నీ సంపూర్ణాభివ్యక్తి కొరకై నీనుండి మాకు ప్రసరించెడి యీ శక్తు లన్నింటిని వెన్వెంటనే సద్వినియోగ పరచుకో గలుగుచు నా మనస్సు నిశ్చలనీరవతా నిష్ఠ నలవరించుకొనునుగాక.

కాని, నీ యిచ్ఛ నభివ్యక్తముచేయుటకు ఇంతటి అత్యల్పమైన, అతి సామాన్యమైన, అత్యంతలోపభూయిష్ఠమైన యీ యుపకరణ మేల ఎన్నికచేయ బడుట తటస్థించినది ?

* * *

జులై 15, 1914

పరమేశ్వరా, ఇక జరుగవలసినదేమి ?

నీవు ఇచ్ఛయించినదే,—నీవు ఇచ్ఛయించినదే జరుగుగాక.

దుర్బలమైన, కడు సామాన్యమైన ఉపకరణమిది; సమస్తకార్యములు దీనికి సాధ్యములేననియు, మానవులు నిర్వర్తింపగల కార్యములం దేదియు దీని కసాధ్యము గానేరదనియు నీవు దీనికి బోధించియున్నావు. కాని, దైవముచే నిర్వర్తింపబడు కార్యారంభమునకు మాత్రము విశేష ప్రగాఢతయు, విశుద్ధియు గావలసియుండును. ఇప్పటివరకును నీవీ యుపకరణమునకు ఎట్టి విశిష్టమైన ప్రగాఢతయు, ఎట్టి యథార్థమైన విశుద్ధియు అనుగ్రహించియుండలేదు. సమష్టిగా వాగ్దాన మిచ్చుట జరిగినదేగాని వ్యష్టిగా ఎట్టి ఉపలబ్ధియు సంపూర్ణముగ ఒనగూడి యుండలేదు.

ఏమి కారణము, ప్రభూ ?

ఉపేక్షాప్రాయముగ దోచు సంపూర్ణమైన యీ శాంతి నొకదానిని నా హృదయమందు నీవు ప్రవేశపెట్టియున్నావు. అపారమైన యీ సుస్థిర ప్రశాంతియందు నినదించుచున్న దిదియే.

"నీవు ఇచ్ఛయించినదే.— నీవు ఇచ్ఛయించినదే జరుగునుగాక."

* * *

జులై 16, 1914

నిశ్చల నీరవ, వినమ్ర భక్తిభావముతో నీ క్రిదే నమస్కరించుచున్నాను.

నీ మహిమాతిశయము తన సంపూర్ణ వైభవముతో నన్ను వశీకృతమొనర్చుకొనుచున్నది. దానికి నా జోహారులు.

ఓ ప్రభూ, నీ పాదములమ్రోల లయించి నీలో కరగిపోవుదును గాక.

* * *

జులై 17, 1914

ఐహికోపలబ్ధులు గొప్ప ప్రాముఖ్యము కలవిగా మా కన్నులకు అప్రయత్న ముగ కనుపట్టుచుండును. కారణమేమన, మమ్ములను మానవులనుగా జేయు చున్న యీ పరిచ్ఛిన్న రూపమగు బాహ్యసత్త దృష్టితో ఆపాదించబడిన గొప్ప దనమది. కాని, నీ యెట్టయెదుట, నీతో పోల్చిచూచినపు డీ యైహికోపలబ్ధి యేపా టిది ? అది యెంత విశుద్ధము, ఎంత సమగ్రము, ఎంత దివ్యము నైనను అది నీ నిత్యస్వరూపమందొక అలతిక్షణము మాత్రమే. దానివలన చేకూరెడి ఫలములు ఎంత శక్తిమంతములైనను, ఎంత అద్భుతములైనను, అయ్యవి నీవైపు కొనసాగు అనంతపురోగతియందు దృష్టి కగోచరమగు అణుమాత్రమే. నీ కార్యము సాధించువా రీ విషయము నేమాత్రము విస్మరించరాదు. విస్మరించుచో వారు నిన్ను సేవించుట కనర్హులే యగుదురు.

ఓ నా ప్రియతమ దైవమా, ఎవరుగాని ఏ పనికైననూ తానే బాధ్యుడనని తలంచుట, పరమమైన నీ దివ్యేచ్ఛకు వ్యష్టిభావన నాపాదింపజూచుట ఎంత అవి వేకము ! నీ అంతర్హృదయముతో ఏకత్వమును పొంది, శాశ్వతముగా అందే వసించుట చాలదా ? సకల బాధ్యతను అపుడు నీవే స్వీకరింతువు; మాకు తెలియవలసిన ఆవశ్యకత సైతము లేకయే నీ యిచ్ఛ పనిచేయ మొదలిడును. ఎంతటి ఉన్నతోపలబ్ధియైనను, బాహ్యపరిస్థితులపై ఏ మాత్రము ఆధారపడక సంగ రహితముగ విలసిల్లిననే తప్ప అయ్యది విలువకలిగిన సరియైన యుపలబ్ధి కానేరదు. ఇట్టి యోగ్యతలు ఒనగూడవలె నన్నచో, నీతో ఘనిష్ఠమైన, సమగ్ర మైన, సునిశ్చతమైన ఐక్యమును బొందుటే దానికి ఉపాయము. కాలాధీనమై చలించుచున్న యీ ప్రపంచములో, ఈ యశాశ్వత జీవితమునందు, క్షణికమైన యీ శరీర రక్షణ బాధ్యతను వహించవలసినవాడవు నీవే; దాని నేవిధముగా వినియోగించుట అవసరము, యుక్తమునని నీకు తోచునో అట్లే చేయుము.

ఓ నా ప్రియతమదైవమా, జగత్ప్రభూ, నా బాధ్యతల నన్నింటినీ నీవే చేపట్టి, నీతోడి దివ్యైక్యమున గలుగు పరమానంద పారవశ్యమును మాత్రమే నాకు దూరవిడిచి యున్నావు.

జులై 18, 1914

అత్యంత తీవ్రమగు పెనుతుపానుగాలుల నడుమ కడు నిశ్చలముగా నిలిచియున్నవి రెండే,— ఒకటి, యథార్థమైన ఆనందముతో,— నీ ఆనందముతో,— సమస్తమూ ఆనందించుచుండవలె ననెడి సంకల్పము; రెండవది, పరిపూర్ణ తాదాత్మ్యమున నీతో ఏకమై యుండవలెననెడి తీవ్రవాంఛ. ....తక్కినదెల్ల బహుశః ఇంకనూ ఏదో ప్రయత్న ఫలితముగను, లేక నటనముగను కన్పట్టుచున్నను, ఇయ్యది మాత్రము అచంచలముగ స్వచ్ఛంద వృత్తితో కూడినదై యున్నది. నా పాదముల క్రింది భూమి సైతము విచ్చిపోవుచున్నట్లుండి, సర్వమూ కుప్పగూలిపోవుచున్నట్లున్న తరుణములో కూడ ఇయ్యది తేజోవంతమై, విశుద్ధమై, సుస్థిరమై, మబ్బులనెల్ల చీల్చివేయుచు, చీకటినెల్ల పటాపంచలుచేయుచు, సమస్త శిథిలముల నడుమనుండి మరింత ఘనముగా, మరింత ప్రబలముగా వెల్లుబికి వచ్చినదై, నీ యఖండ శాంత్యానందములను తనలో తొణికిస లాడించుకొనుచున్నది.

* * *

జులై 19, 1914

ఓ ప్రభూ, నీ స్వీయాభివ్యక్తికి నీవే సర్వశక్తితో కూడిన అధినేతవు; ఈ యుపకరణము లెల్ల అత్యంత సామాన్యములు, కఠినములునైన తమ పరిధుల నుండి, సంకుచిత చట్రములలోనుండి విడివడ గలుగునట్లుగా అనుగ్రహింపుము. నీ యఖండ శాంతిలోని లేశమాత్ర మభివ్యక్తము గావలెనన్నను, అందులకు మానవశక్తి సాధ్యములగు సమస్త సంపదలును గావలసియుండును.... మూసి యున్న కవాటములను తెరచి, వాని వెనుకనున్న అమృతజలరాసులను ముందుకు ప్రవహింపనిమ్ము. అఖండ వాగ్ధాటిని, సౌందర్యమును వెలార్చుకొనుచు నీ ప్రవాహములు లోకము నంతనూ ముంచెత్తునుగాక. పౌష్కల్యము, ప్రాభవము, ఉదాత్తత, లాలిత్యము, మనోజ్ఞత, గాంభీర్యము, వైవిధ్యము, ప్రాబల్యము,— ఇది యెల్ల నీ సందర్భమున గావలసియున్నవి. ఏలనన, అభివ్యక్తికై ప్రభువు సంకల్పించియున్నాడు.

ఓ నా ప్రియతమ దైవమా, నీవే మా విధిని అనుశాసించు నిర్ణేతవు; నీవే నీ యభివ్యక్తికి అఖండితాధినేతవు గూడ.

ఈ లోకము, లోకములోని యీ జీవులు, ఈ అణుసముదాయము,— అన్నియు నీయవియే; వీనిని రూపాంతరము చెందించి తేజోవంత మొనర్పుము.

* * *

జులై 21, 1914

ఈ శరీరము కానరాలేదు; ఇంద్రియానుభూతులును లేవు; మూలాధారము నుండి సహస్రారమువరకు జ్యోతి యొకటి స్తంభమురీతి పైకి లేచినది; ఆ సహస్రారమున చంద్రకాంతినిబోలు కాంతిచక్రమొకటి రూపొందెను; అంతట ఆ జ్యోతిస్తంభము శిరస్సుకంటెనూ ఎంతగనో పైకెదిగి, అచట బహువర్ణశోభితమై కనులు మిరుమిట్లు గొలుపజేయు నఖండ సూర్యమండలములోనికి చొచ్చుకొనిపోగా, ఆ మండలమునుండి హిరణ్మయ కాంతివర్షము కురిసి భూమినంతనూ నింపివేసెను.

అంతట నా జ్యోతిస్తంభము నెమ్మదిగా క్రిందికి దిగి, కోడిగ్రుడ్డు ఆకారము గల సచేతనమైన వెలుగై, శిరస్సుపైనను, శిరస్సులోను, కంఠము, హృదయము, నాభి, మూలాధారస్థానము, దాని కింకను దిగువ,— ఈ స్థానము లన్నింటను గల చక్రములను ఒక్కొక్కదాని నొక్కొక్క ప్రత్యేక స్పందనతో, ప్రత్యేక రీతిలో నుత్తేజిత మొనర్చి భ్రమింపజేయ మొదలిడినది. జానువుల స్థానములో ఈ పైకినీ క్రిందికినీ ప్రవహించు ప్రవాహములు కలిసికొనగా, ఈ కాంతి ప్రసార మొకవిధముగా అవిచ్ఛిన్నమై తనరారి, యావత్సత్తనూ సచేతనమైన యొక కాంతిమండలముతో నావరించివేసెను.

పిమ్మట చైతన్యము నెమ్మదిగా మరల, ఒక్కొక్క లోకమునందే ఆగుచు, క్రమక్రమముగా దిగివచ్చి, కడకు శరీరస్ఫురణము కలుగు స్థితికి చేరు

కొనెను. ఇట్లు శరీరస్ఫురణము కలిగిన దశ ఎనిమిదవది యని నాకు జ్ఞాపకము. ఈ స్థితియందు, శరీరమింకనూ పూర్తిగ బిర్రబిగిసి, అచలముగనే యుండెను.

* * *

జులై 22, 1914

ఓ పరమేశ్వరా, ప్రేమమయుడవు నీవు. నీ ప్రేమ ప్రతి హృదయమందును, ప్రతి బుద్ధిభావనయందును, అంతరాంతమున భాసిల్లుచున్నది. నీ పరివర్తన కార్యమును నిర్వహించి మాకు దీప్తి నొసగుము. ఇంకనూ మూతపడి యున్న కవాటములను తెరువుము. సీమాంతరేఖను విస్తరింపజేసి, శక్తిని ప్రతిష్ఠించి, మా సత్త నంతనూ ఏకోన్ముఖమొనర్చి, నీ దివ్యానందములో మమ్ము పాల్గొనజేసి, అట్టి భాగస్వామ్యము నందుకొనుటలో ఇతరులకు సైతము మేము తోడ్పడున ట్లనుగ్రహింపుము. కట్టకడపటి బాహ్యాభ్యంతరావరోధముల నెల్ల మేము జయించి, తుట్టతుది కష్టములను సైతము అధిగమింతుముగాక. నిన్ను ఉద్దేశించి శ్రద్ధాభక్తులతో మేము చేసిన ఏ ప్రార్థనయు ఎన్నడును వమ్ముకాలేదు. మేము పిలిచినపుడెల్ల నీ యనుగ్రహ విశేషమును మాపై కుమ్మరించుచునే యున్నావు. నీ కృప యనంతము.

ఓ పరమేశ్వరా, ఈ అవ్యవస్థితిరూపమైన అంధకారముపై నీ వెలుగు ప్రసరించి, ఒక నూతన ప్రపంచము అందుండి ఆవిర్భవించునుగాక. ఇప్పటి సన్నాహమంతయు నెందుకొరకో అయ్యది నెరవేరి, నీ వినూత్న పరమనియతిని సంపూర్ణముగ అభివ్యక్తము సేయగల వినూత్న మానవత ఆవిష్కృత మగునుగాక.

తరగని యుత్సాహముతో, బడలికలేని గమనముతో, మా సకలాశయములను, సకల ప్రవృత్తులను నీయందే కేంద్రీకరించి, నీ దివ్యేచ్ఛకు పరమవిధేయుల మగుటచే గలుగు పటిమతో, నీ సంపూర్ణాభివ్యక్తి రూపమైన విజయసంసిద్ధి వైపునకు, ఏ యవరోధములూ ఈ విజయసంసిద్ధి నడ్డగింప జాలవనెడి సుస్థిర నిశ్చయభావమున హుటాహుటిగా మేము ముందుకు సాగిపోయెదముగాక.

అజ్ఞాన ప్రతిబంధకము లెల్ల పటాపంచలుచేయు నో జగన్నాయకా, నీ కివే మా జోహారులు.

* * *

జులై 23, 1914

అఖండ శక్తిసంపన్నుడవైన ఓ పరమేశ్వరా, ఈ యుద్ధమున నీవే యోద్ధవై విజయమును సాధింపుము. నీ దివ్యప్రేమయే మా హృదయములందు నెలకొని రాజ్యమేలునుగాక. నీ దివ్యజ్ఞానముచే మా బుద్ధివృత్తు లెప్పుడును దీప్తము లగుచుండునుగాక . . . అశక్తతయందు, అంధకారమునందు, మమ్మె న్నడును విడనాడబోకుము. ఎల్ల పరిమితులను కూల్చివేయుము; ఎల్ల బంధములను త్రుంచివేయుము; ఎల్ల విభ్రమలను పటాపంచ లొనర్పుము.

ప్రగాఢ భక్తియుతమగు ప్రార్థనారూపమున మా యాకాంక్ష నీదెసగా ఉద్గమించుచున్నది.

* * *

జులై 25, 1914

ప్రభూ, నిన్ను వాంఛించుటేగాక, తెలిసికొని నీవే అయిపోవుటకూడ సాధ్యమైన యీ లోకమును కీర్తించుచు నే నీ ప్రాతఃకాలమున గానము చేసితిని. కొందరీ జగత్తును వదలివైచి వేరొక దివ్యజగత్తును జేరుకొనవలెనని యేల తీవ్రముగ గాంక్షింతురా యని నాకు ఆశ్చర్యము కలిగినది.

ఎంతేని సంతృప్తితో నా హృదయమును నీవు నింపియున్నావు. ఇందు మూలమున, ఎట్టి బాహ్యాభ్యంతరపరిస్థితులలోనైనను సంతృప్తి వహింపకయుండుట నా కసాధ్యమే యగుచున్నది. అయినను, నాలో నేడియో నిరంతరమూ, మరింత సౌందర్యమును, మరింత వెలుగును, మరింతజ్ఞానమును, మరింత ప్రేమను,—పెక్కేల, మరింత యెరుకతో నీతోడి నిత్యసంబంధమును గాంక్షించు

చునే యున్నది. . . . కాని, అదియును నీ యిచ్ఛ ననుసరించి జరుగుచున్నదే. నీవు ఇచ్ఛయించిననాడు పరిపూర్ణ రూపాంతరీకరణమును సైతము నాకు నీ వను గ్రహింపగలవు.

* * *

జులై 27, 1914

కడు నెమ్మదిగా, వినమ్రభావముతో నీదెసగా నా సంప్రార్థన ముద్గమించు చున్నది. ఓ ప్రియతమదైవమా, నీకు సమర్పించబడిన సమస్తమును నీవు ఎట్టి వివాదము, విమర్శయు లేకయే పరిగ్రహించుచుందువు; యోగ్యతను విచారణ చేయకయే ఎల్లరకును నిన్ను నీవు ఎరుకపరచుకొనుచుందువు; నీ యావిష్కారము నకు దేనినిగాని కడుదుర్బలమైనదిగా, అల్పమైనదిగా, సామాన్యమైనదిగా, అసమగ్ర మైనదిగా నీవు పరిగణింపవు.

నీ పాదములచెంతనే, వ్రాలి నీ హృదయమున కరగిపోయి, నీలో అదృ శ్యమై, నీ దివ్యానందమున 'నే' నన్నదియే లేకుండబోవుదును గాక; లేక, మరి యే ఇతర ప్రవృత్తియు లేకుండ కేవలము నీ సేవకురాలనుగనే మనగలుగుదును గాక. ఇంతకంటె నేను కోరునది, ఆకాంక్షించునది వే రెద్దియునులేదు; కేవలము నీ సేవకురాలనుగనే మనగోరుచున్నాను.

* * *

జులై 31. 1914

యోగసాధనకు పరమగమ్యమై, దాని పూర్ణసంసిద్ధికి నిదర్శనముగా నెన్నదగు శిఖరస్థానపు అనుభూతులన్నింటినీ క్రమముగా నాకు కలిగించుట నీ సంకల్పముగా దోచుచున్నది. ఈ యనుభూతి అత్యంత ప్రగాఢము, సమగ్రము, ప్రబలమునై, తత్ఫలితములను గురించిన జ్ఞానమునుసైతము కలుగజేయునదై యున్నది. సంకల్పపూర్వకముగా, తెలిసి యనుభవింప బడుచున్న ఈ యనుభూతి యాదృచ్ఛికముగా అనుకోకుండ ఘటిల్లుచున్నదికాదు; క్రమబద్ధమైన ప్రయత్నఫలితముగా నియ్యది సంప్రాప్తమగుచున్నది. అయినను, ప్రతి అనుభూతియు ప్రత్యేకమైన విశిష్టత కలిగి, ఒకదానికొకటి వేరై, మార్గమున దూరదూరముగ నుంచబడిన మైలురాళ్ళవలె నున్నవి. అదియునుగాక, అనంతమైన ఆరోహణ మార్గములోని యీ మైలురాళ్ళకు ఒండొంటితో పోలికయే లేదు; దేనికది అన్నియు క్రొత్తదనమునే కలిగియున్నవి; దేనికిని మరొకదానితో సంబంధమున్నట్లే కానుపింపదు. అసంఖ్యాకములైన యీ అనుభూతుల నన్నింటినీ సమన్వయపరచి, తత్ఫలితముగా నొక నూతనోపలబ్ధిని నేను సాధించగలుగునట్లుగా నీవు అనుగ్రహించు ఘడియ ప్రాప్తించునా? ఆ నూతనోపలబ్ధి నే నింతవరకు పొందియుండిన అనుభూతు లన్నిటికంటె మరింత సమగ్రము, మరింత సుందరమునై యుండవలెను. అట్టి ఘడియ ప్రాప్తమౌనో లేదో నాకు తెలియదు. కాని, నేను కోరిన ఏ ప్రత్యేకానుభూతినిగూర్చియు,—అది నాకు కలుగక పూర్వమెట్లో అట్లే కలిగి అంతర్ధానమైన పిమ్మటకూడ,—చింతపడకుండుటయెట్లో నీవు నేర్పియున్నావు. అట్టి యంతర్ధానము నేను సాధించిన పురోగతి నిలుకడ లేనిదయ్యె ననుటకు సూచనగా తలంపను. ఈ మార్గములో గడవవలసిన దశలెన్నియో కలవు. కావున, ఏ దశయందును అవసరమునకు మించి తడయకుండ, ఇచ్ఛాపూర్వకముగా ముందుకు పోవుచున్నదానికి నిదర్శనముగనే భావింతును.

నీ యభివ్యక్తసాధనముగా నున్న యీ ఉపకరణము కడు పరిచ్ఛిన్నమైనదిగ మేము తలపోయుటచే పరిచ్ఛిన్నమే కాని, వాస్తవమునకు అది యట్లు కాదని ప్రతిసారియు నీవు నాకు బోధించుచునే యున్నావు. నీ యానంత్యమున చక్కగా బాల్గొనగల సామర్థ్యము దాని కెంతేనియు కలదన్న విషయము మరింత

స్పష్టముగ విశదపరచుచునే యున్నావు. నీ యానంత్యమునందే మాత్రమో ప్రతిసారికూడ ఈ యుపకరణమునకు అందుబాటగుచునే యున్నది. దాని నివాస స్థాన మా యానంత్యమే. సీమాంతరేఖలను అంతులేకుండ విస్తరింపజేయుచు ఆ యానంత్యము తన కవాటములను పూర్తిగా తెరచి స్వాగతము పలుకుచునే యున్నది.

*　　*　　*

ఆగస్టు 2, 1914

ఓ సర్వేశ్వరా, సత్స్వరూపుడవు, అసత్స్వరూపుడవు, ఆ రెంటికి అతీతుడవుగూడ నీవే. తెలియరాని అత్యద్భుత స్వరూపము నీయది. నీవే మాకు ఏడుగడవు.

పృథ్విపై ఆవిష్కారము చెందనున్న యీ దేవత లందరును ఎవరు? బహువిధమై సర్వసమగ్రముగ నెరవేర్చబడిన నీ దివ్యకర్మపు రీతివిశేషములేకారా? సకల రూపములను ప్రకాశింపజేసి భావించి తీర్చిదిద్దుచున్న అసంఖ్యాక సూర్య కిరణజాలమును బోలినవగు నీ బహువిధ తేజోమయ బుద్ధివృత్తి విశేషము లన్నియు నేమిటి? నీ యనంతసంకల్పపు ఒకానొక రీతివిశేషము, నీ యభివ్యక్తి కార్యపు ఒకానొక సాధనవిశేషము మాత్రమే కావా? నీవే మా విధివిన్లేతవు, మా ఊహకందని సత్యస్వరూపుడవు, ఇపు డున్నదానికి, ఇకమీద కానున్న దానికి,— సమస్తమునకును అధినేతవు.

మరి యీ మానసికశక్తులు, ప్రాణిక వ్యాపారములు, భౌతికతత్వములు,- ఇవన్నియు నేమిటి? ఇవన్నియు నీ అత్యంత బాహ్యరూపము, నీ యభివ్యక్తి కార్యపు చరమరీతివిశేషము మాత్రమే కావా? ప్రభూ, అత్యంత భక్తిపురస్సరముగా నిన్ను మే మారాధించుచున్నాము. మా లోనికి చొచ్చి, మాయందు చైతన్యము పూరించుచు, మాకు మార్గము చూపి నడిపించుచునే, మాకు అందరాక అన్నివైపుల నుండియు తప్పించుకొనుచున్నావు. నీవు తెలియరానివాడవు, నిర్వచింపరానివాడవు, ఏ పేరుతో పిలుచుటకును వీలులేనివాడవు; నిన్ను మేము

అందుకొనలేము, ఆలింగనము చేసికొనలేము, భావించనూలేము; అయిననూ మా ప్రతిచిన్న కార్యప్రవృత్తియందును అనుభూత మగుచున్నావు.

అపారమైన యీ విశ్వమంతయు నీ సత్యసంకల్పమునం దొక అణువు మాత్రమే.

ప్రస్ఫుటమైన నీ దివ్యసాన్నిధ్యపు ఆనంత్యములో సమస్తమూ క్రమక్రమముగా ఆవిష్కృత మగుచున్నది.

* * *

అగస్టు 3, 1914

ఈ ప్రాంతఃకాలమున నా యావత్సత్తయు నిశ్చల, నీరవ, భక్తిభావ రూపమున తనరారి, అద్దాని యాత్మయందు నీ యనంత దివ్యప్రేమ నిండి తొణికిసలాడినది.

కార్య సన్నాహమూ నిర్వహణమూ, నిర్వహణమూ సన్నాహమూ, — ఇట్టివి పర్యాయక్రమమున కొనసాగుచు, ఒందొంటిపై ఎంతగా ఆధారపడియున్నవనిన, ఒక్కొక్కసారి వీనిని విడదీయుట కష్టమై, పుడమిపై నీ దివ్యజీవనమునకు వీని కలయికయే ముఖ్యలక్షణ మగుచున్నది. మేము ఎట్లుండవలెనన్నదొకటి, ఏమి చేయవలెనన్నది మరియొకటి. మొదటిది నీ యుపకరణమును నిర్దుష్టముగ రూపొందించుటకు సంబంధించినది కాగా, రెండవది అద్దాని వినియోగమునకు సంబంధించినదై యున్నది. ఇవి రెండునూ కలిసి కొనసాగవలసినవే. ఈ యుపకరణము సుసంపన్నముగ వికాసము చెందవలెననియు, అవరోధములనెల్ల తొలగించుకొని తన విజ్ఞానానుభవమును అనంతపరిధులకు విస్తరింపజేసికొనగలిగియుండవలెననియు, తా నావిష్కరింపగల పరమేశ్వరునితో ఏకత్వముపొందనేర్చి యుండవలెననియు, వివిధ లోకములతో సచేతనానుబంధములను పెంపొందించుకొనగలిగి యుండవలెననియు ఒక్కొక్కసారి నీవు సంకల్పించుచుందువు. వేరొక్కొక్కసారి, అయ్యది తన్ను దాను మరచి కర్మాచరణమున కేవలము నీ

శక్తిగా రూపొందవలెనని సంకల్పించుచుందువు. కాని, నీ సంకల్పముతోడి పూర్ణానుసంధానపు పరమధర్మము మాత్రము ఈ రెండింటి మేళనమునందే కలదు.

ఈ ప్రాతఃకాలమున నా యావత్సత్తయు నిశ్చల, నీరవత, భక్తిభావరూపమున తనరారగా, అద్దాని యాత్మయందు నీ యనంత దివ్యప్రేమనిండి తొణికిసలాడినది.

* * *

అగస్టు 4, 1914

వివిధ శక్తుల సంఘర్షణకు లోనై, మానవులు నేడు మహత్తర యజ్ఞకర్మ నొకదానిని నిర్వర్తించుచున్నారు; రక్తబలిదానరూపములో తమ ప్రాణముల నాహుతి చేసికొనుచున్నారు.

ప్రభూ, జగన్నాయకా, ఇదంతయు వృథయై పోకుండున ట్లనుగ్రహింపుము; తరగని నీ దివ్యశక్తి ప్రవాహములు ఈ వ్యాకులితావరణములోనికి, శక్తి సంఘర్షణముల కాలవాలముగానున్న ఈ కల్లోల స్థితిలోనికి చొచ్చుకొనివచ్చి పుడమి యంతటను వ్యాపించునుగాక. నీ దివ్యజ్ఞానపు విశుద్ధతేజము, నీ దివ్యానుగ్రహపు ప్రేమరస ప్రవాహము మానవ హృదయములలో నిండారి, వారి ఆత్మలలోనికి చొచ్చుకొనిపోయి, వారి చైతన్యము నంతనూ దీప్తిమంత మొనర్చి, అతి భయంకరము, అంధకారబంధురమునైన ఈ అయోమయస్థితిలోనుండి, నీ దివ్యసాన్నిధ్య వైభవము పెల్లుబికి ప్రవహించునట్లుగా అనుగ్రహింపుము.

తెలియక వారు చేయుచున్న యీ ఆత్మాహుతి ఫలప్రదాయిని యగుటకొరకై, నా యావత్సత్తయు నీకు పూర్ణమైన ఆత్మాహుతి గావించుకొనుచున్నది.

ఈ యాహుతి స్వీకరించి, మా మొర ఆలకించి విచ్చేయుము.

* * *

ఆగస్టు 5, 1914

ఓ పరమేశ్వరా, చైతన్యోద్దీపకమైన శ్వాసవోలె, మధురాతి మధురమైన శాంతివోలె, అజ్ఞానపు మబ్బులను చీల్చివేయు తేజోమయమైన ప్రేమభాస్కరుని వోలె, సకల వస్తుజాతమునందునూ నీ వున్నావు.

ఈ పుడమిపై, అజ్ఞాన కలితులు, దుఃఖభాజనులు నగు మా మానవసోదరుల మధ్యమున మేము, చైతన్యోద్దీపకమైన నీ శ్వాసరూపులము, మధురాతి మధురమైన నీ శాంతిరూపులము, తేజోమయమైన నీ ప్రేమరూపులము నై వర్తించున ట్లనుగ్రహింపుము.

ఓ దివ్యప్రభూ, నీ కార్యము నెరవేర గలందులకును, కాలము వ్యర్థముగా గడచిపోకుండుటకొరకును, పూర్ణమైన నా యాత్మాహుతిని స్వీకరింపుము.

నీ సొత్తునకు నీవే తిరిగి అధిపతివి కాగలందులకు, అసంఖ్యాకములగు ప్రతి ఒక్క అణువులోను, సామరస్యమున నొప్పారు చిత్స్వరూపపు సమైక్య స్థితిలోను నీకు నీవే తిరిగి అధినాథుడవు కాగలందులకు, ప్రశాంతమైన ఆనంద పారవశ్యముతో నన్ను నీకు సమర్పించుకొనుచున్నాను.

ఓ దివ్యప్రభూ, కాలము వ్యర్థముగా గడచిపోకుండుటకై, పూర్ణమైన యీ నా ఆత్మాహుతిని స్వీకరింపుము.

విశుద్ధ ప్రేమయజ్ఞపు భక్తిమయ హోమాగ్నిజ్వాలగా నా యావత్సత్తయు పరివర్తనము చెందినది.

నీ రాజ్యమునకు నీవే తిరిగి అధిపతివి కమ్ము; జడాత్మక, అజ్ఞానపూర్వక అసత్సంకల్పపు అమితభారమున క్రుంగుచున్న యీ పృథ్వికి విమోచనము కల్పింపుము.

ఓ నా ప్రియతమదైవమా, ప్రేమయజ్ఞపు భక్తిమయ హోమాగ్నిజ్వాలా రూపమున నా యావత్సత్తయు జ్వలించుచున్నది. అవరోధమెల్ల పటాపంచలై పోవుటకు ఈ నా ఆత్మాహుతిని స్వీకరింపుము.

* * *

ఆగస్టు 6, 1914

నేను సమర్పించినది నీవు ప్రీతిపూర్వకముగా స్వీకరించకపోవుటకు, నా ఆత్మాహుతి స్వీకారయోగ్యముగా నీవు తలంచకపోవుటకు, ఈ సమర్పణమునం దింకను ఏ దోషములున్నవి ?.... ఏ లోపములున్నవి ? ఈ సత్తలో ఇంకనూ కానవచ్చుచున్న ఈ లోపములను నీవు చక్కజేయవా ?

ప్రభూ, పృథ్వి కిది కడు సంకటసమయమని మే మెరుంగుదుము. సంక్షోభములోనుండి మహత్తరసామరస్యము, విరూపతలోనుండి దివ్యసౌందర్యము ఆవిర్భవింపజేయునిమిత్తము నీ దూతలుగా నీకూ పృథ్వికీ మాధ్యస్థ్యము నెరపగలవారు ఆ కార్యమునకు సంసిద్ధులై యుండవలెను. దేవా, మా ప్రయత్నములయెడ నీ కృపాదృష్టి బరపి, జ్ఞానదీప్తి నొసంగుచు, మాకు దారిచూపి, ఆంతరికములైన సకల ప్రతిరోధములను మేము విచ్ఛిన్నము చేయగలుగుటకును, సమస్త ప్రతిబంధకములను అతిక్రమింపగలుగుటకును వలయు శక్తిసామర్థ్యములను మాకు ప్రసాదింపుము.

ఓ నా ప్రియతమ దైవమా, నీ పాదముల చెంత సాగిలబడి నే నిదే ప్రణమిల్లుచున్నాను. వ్యక్తిగత ప్రాముఖ్యమునెడ ఆశాలేశము సైతము నాకు లేకుండునట్లు అనుగ్రహించవలసినదని, నా యావత్సత్తయు భక్తివినమ్రమై నీకు మొరవెట్టుకొనుచున్నది.

* * *

ఆగస్టు 8, 1914

నా లేఖిని మౌనము వహించినది.... ఈ భౌతిక ప్రపంచమున కింతటి యాకర్షణమా! మా దృష్టిలో దీనికి ఏల ఇంతటి ప్రాధాన్యము? ఇది మా దౌర్బల్య లక్షణమా, లేక నీ యిచ్ఛయా?

ప్రియతముడవైన ఓ దేవా, నేను నీయందే జీవించవలెనన్నది నా కోరిక; కాని, నేను నీ కోసమై జీవించవలెనని నీ వాదేశించితివి. ఇట్లు నేను నీ కోసమై జీవించు సమయమందు. నా చైతన్యము బాహ్యక్షేత్రముల వైపు మరలి, నీకు నేను కడుదూరమై పోవుచున్నట్లనిపించుచున్నది.

ఇది యెంతమాత్రము సరికాదని నే నెరుగుదును. కాని, నా సత్తయం దింకనూ ఏదియో ప్రతిరోధ మున్నది. అది పై దొలగుట కెంతమాత్ర మిచ్ఛ గించుట లేదు. దీప్తబుద్ధి రూపమైన ద్వార మొకటి యింకనూ మూతవడియే యున్నది. దానిని తెరచు ప్రయత్నమేమియు నింతవరకు జరుగలేదు. నీ యభి వ్యక్తి కిది విపరీతముగా అడ్డుదగులుచున్నది.

ఇదంతయు తొలగిపోవు ఘడియ ఆసన్నమైనట్లు నీవు నిర్ణయించు టెన్నడు?

భయంకర శక్తులు పెనుతుపానువలె పుడమి నంతనూ అల్లాడించివేయు చున్నవి. అంధప్రాయములు, తమోమయములునై అయ్యవి అత్యంత తీవ్ర స్వరూపమున గోచరించుచున్నవి. ప్రభూ, వీనికి జ్ఞానదీప్తి నొసగగల శక్తిని మా కనుగ్రహింపుము. నీ వైభవస్ఫూర్తి వీనియందంతటనూ వెల్లుబికి వచ్చి వీని ప్రవృత్తి నెల్ల రూపాంతరము చెందించవలసియున్నది. చేయవలసిన వినాశమంతయుచేసి యివి ఉపశమించినమీదట ఈ క్షేత్రములో దివ్యబీజ మొకటి మొలకెత్తు టత్యంతావశ్యకము.

ఓ ప్రభూ, నా ఆత్మసమర్పణమును త్రోసిపుచ్చకుము. ఈ సమర్పణము పరిపూర్ణమై, పరిపూర్ణముగ నేను నీదాన నగుచు, నీ యావిష్కారమునకు వలయు యోగ్యతను సంతరించుకో గలుగునట్లు అనుగ్రహింపుము.

* * *

ఆగస్టు 9, 1914

ప్రభూ, నీ యిచ్ఛ నెరవేరుటకై మేమిట నీమ్రోల నిలిచియున్నాము, మా తలంపులోనుండి సకల ప్రతిరోధములను, సకల సంశయములను, సకల దౌర్బల్యములను, పరిమితులను, మా జ్ఞానమును ముసుగువడజేసి అవగాహనమును మసకపరచు సమస్తమును తొలగించివేయుము.

నీ చైతన్యోపలబ్ధికై నేను దప్పిగొనియున్నాను; భౌతిక కర్మక్షేత్రము నుండి పలాయనమై నిష్క్రియత్వమున నుండుటకుగాక, అచట నీ యిచ్ఛను సంపూర్ణముగా, సమగ్రముగా, నిరపేక్షముగా నెరవేర్చునిమిత్తము నీతోడి పరిపూర్ణైక్యానుభవస్థితిని చూరగొనుటకై దప్పిగొనియున్నాను.

పృథ్విని నలువైపులనుండియు పైకొని అలమివేసిన యీ అంధకార మంతటిలోనుండియు నీ దివ్యతేజోవైభవము పెల్లుబికివచ్చి విజృంభించునుగాక.

* * *

ఆగస్టు 11, 1914

ఓ నా ప్రియతమప్రభూ, గజిబిజిగా నున్న యీ బుద్ధివృత్తు లన్నిటిలోనికిని, కలగుండు వడుచున్న యీ హృదయ భావావేశము లన్నిటిలోనికిని నీవు ప్రవేశించి, నీ దివ్య సాన్నిధ్యాగ్నిని వీనియందు రగిలించుము. తనవలన వ్యాపించిన నీడ తననే కప్పివేయగా, తన్మూలమున పృథ్వి యిపుడు మిగుల సంక్షుభితమై యున్నది. అవ్యయమై ప్రకాశించు నీ భానుతేజమును ఆమె నీడ మరుగుపరచివైచెను. అది యిప్పుడీ నిస్సహాయ ప్రపంచముమీదనే విరుచుకొనిపడి సమూలముగ గంపింపజేయుచు, భయంకరమైన అవ్యవస్థితిని గల్పించుచున్నది. నీ దివ్యతేజమును ప్రసరింపజేయవలెనను నిచ్ఛతో, ఈ అవ్యవస్థితిని నీవు చక్కజేయ దలంపవా ?

అద్భుతమైన అజ్ఞాతస్వరూపము నీయది; ఇంతవరకును నిన్ను నీవు ఆవిష్కరించుకొని యుండలేదు; అనుకూలమైన శుభఘడియకై నిరీక్షించుచున్నావు; నీ బాటలను సిద్ధము చేయుటకై మమ్ముల నీ పృథ్వీతలమునకు పంపియున్నావు; ఈ నా సత్తయందలి సకల ధాతువులును "నీ యిచ్ఛయే నెరవేరుగాక" యని నీకు మొరవెట్టుకొనుచు అప్రతిహతమగు పరమోత్సాహమున ఆత్మార్పణ మొనర్చుకొనుచున్నవి.

దుఃఖావిలమైన యీ పృథ్విని శక్తిమంతములైన నీ కరుణామయ బాహువులలోనికి గైకొని, మంగళప్రదమైన నీ యఖండ ప్రేమరసప్రవాహములతో ఆమెయందు చైతన్యము నుద్దీపింపజేయుము.

శక్తిమంతములైన నీ కరుణామయ బాహువులు నేనే; నేను నీ యఖండ ప్రేమరస పూరితమైన విశాల వక్షము.... దుఃఖావిలమైన పృథివినంతనూ ఈ బాహువులు చుట్టవేసి, ఉదారమైన హృదయమునకు అల్లన హత్తుకొనుచున్నవి; పరమ మంగళమైన చుంబనముద్ర యొకటి యీ సంక్షుభితాణువుపై అలవోకగా ముద్రిత మగుచున్నది; అయ్యది సమాశ్వాసపూర్వకముగా బాధల నుపశమింపజేయు దివ్యజనని చుంబనము.

ఆగస్టు 13, 1914

భక్తిపూర్వకమైన ఆకాంక్షతో, బాహువులు పైకెత్తి, అరచేతులు విచ్చి, ఈ యావత్సత్తయు నీ ముందు నిలబడియున్నది.

పృథ్వికి ఎంతేనియు ఆవశ్యకమైయున్న ఈ ప్రేమ, ఈనాటివరకును అభివ్యక్తమైయున్నదానికంటె బృహత్తరము, అద్భుతావహము నైయున్నది; ఆమె ప్రాధేయపడుచున్నది ఈ ప్రేమకొరకే ....ఈప్రేమసందేశము నామెకు అందజేయు దూతగా మాధ్యస్థము నెరపగల సమర్థులు, యోగ్యులు ఎవరో? ఎవరో? ఎవరైననేమి? ఆ కార్యము నెరవేరుటమాత్ర మావశ్యకము. ప్రభూ, నా సంప్రార్థన మంగీకరింపుము; నా యీ సత్తయాత్మార్పణను స్వీకరింపుము. ఏ లోపము లున్నను, ఎంత లఘుతరమైనను, ఈ యర్పణను స్వీకరించి విచ్చేయుము.

నవజీవన ప్రదాయినులైన యీ ప్రవాహములు జగమంతటను ప్రవహించునుగాక. సకలమును రూపాంతర మొందించి దీప్తము గావింపుము. అజ్ఞాన మూలకములైన యీ అహంకారముల నెల్ల విచ్ఛేద మొనర్పవలపియున్నది; ఎంత కాలము నుండియో ఎదురుచూచుచుండిన యీ పరమాద్భుతకార్యమును సాధింపుము; ప్రతి హృదయముననను నీ దివ్యజ్యోతిని రగిలించుము. ప్రశాంత నైశ్చల్యస్థితియందు మేము జడప్రాయులము కాకుందుము గాక. నవ్యము; ప్రాభవోపేతము నైన నీ దివ్యప్రేమావిష్కారము జరుగునంతవరకు మేము విశ్రమించకుందుముగాక.

మా సంప్రార్థనము నాలకింపుము; మా పిలుపు నందుకొని విచ్చేయుము.

* * *

ఆగస్టు 16, 1914

నూతన దర్శనముల నాశించుచు, భక్తిపూర్వక ప్రార్థనా వృత్తితో మూడు దినములు నిరీక్షించితిని.... నీ యావిష్కారము నాచ్ఛాదించి, అవరోధించి, వికృత పరచుటకై నానావిధ ప్రతిరోధములును చెలరేగెను. తత్ఫలితముగ మేమిపు డింకను ఎప్పటి దూరముననే యున్నట్లున్నాము.

ఓ నా ప్రియదైవమా, నీ హృదయములోని నా భవ్యస్థానమును వీడి నన్నేల యీ పుడమికి మరలిరా నాదేశించితివి ? ఇచట ఏ యుపలబ్ధికై ప్రయత్నింప నీ వాదేశించితివో అది కేవల మసాధ్యమని ఇచటి ప్రతిదియు నిరూపించు చున్నట్లుగా నున్నది..... నా వలన ఏమి అపేక్షించి నీవు, అద్భుతమైన నీ దివ్య ధ్యాన సమాహితస్థితిలోనుండి నన్ను పెకల్చివైచి, సంఘర్షణతో కూడిన యీ తమోమయ ప్రపంచములోనికి దుమికించినావు ?

నీ దివ్యశక్తి స్వీయాభివ్యక్తికై క్రిందికి అవతరించునపుడు, నీ సేవకులుగా నుండ నిశ్చయించుకొనియు ప్రత్యేకమైన తమ ఆసురస్వభావ ప్రాబల్యమును విడువనొల్లని ప్రముఖమైన ప్రతి అసురజీవియు ఆ దివ్యశక్తిని కేవలము తానే ఆకట్టుకొని, అటుపిమ్మట తానే ఇతరులకు పంచిపెట్ట నభిలషించుచుండును. తానే ముఖ్యమైన మధ్యవర్తిగా నుండవలెననియు, తన మాధ్యస్థముద్వారా గాక ఇతరులకు నీ శక్తితో సంబంధ మేర్పడరాదనియు వాంఛించుచుండును. విషాదకరమైన యీ నీచభావన చాలవరకు తెలిసి చేయబడునట్టిదే. కాని, ఎడతెగక సదా ఇట్లు కొనసాగుచుండు కారణమున, నెరవేరవలసినవి నెరవేరకుండ ఇది నిరవధికముగా అడ్డుదగులుచుండును. నీ పూర్ణాభివ్యక్తిని సాధించు ప్రయత్నములో విషాదకరమైన యిట్టి లోపములకు లోనుగాకుండ తప్పించుకొనుట ఎంత లేసివారికైనను అసాధ్యమే యగుచో ఈ సంకుచితభావనకు బలిమిని నన్నేల అగ్గము చేసెదవు ప్రభూ ?

ఇది ఇట్లగుటయే నీ యిచ్ఛయగుచో, కట్టకడపటి తెరనుసైతము నీవే

చీల్చివైచి, నీ విశుద్ధవైభవముచే నిఖిల ప్రపంచమూ రూపాంతరము చెందునట్లు అనుగ్రహింపవలసియున్నది.

ఈ దివ్యకార్యమును నీవే సాధింపుము; లేనిచో; నన్ను నీ హృదయ గర్భములోనికి మరల చేరుకొని విశ్రమింపనిమ్ము.

* * *

ఆగష్టు 17, 1914

గతము నంతనూ ఊడ్చిపారవైచుచున్న యీ విలయపు టావర్తమున బడి ఎల్ల అసద్వృత్తులు, ఎల్ల దుర్భావనలు, ఎల్ల అపోహలు అంతర్ధానమై పోకతప్పదు. జ్ఞానతేజము పూర్ణస్వచ్ఛతను సంతరించుకొని, అపరిచ్ఛిన్నమై దీపించుచు, నిన్ను సంపూర్ణముగా అభివ్యక్త మొనర్పవలసియున్నది. ప్రభూ, ఈ పరమాద్భుత కార్యమును సాధింపగల శక్తిసంపన్నుడ వీవు; తప్పక సాధించెదవుకూడ.

విజయము నిశ్చయమనెడి సుదృఢభావమును ఈ నా చేతనయందు వీవు నెలకొల్పియున్నావు.

* * *

ఆగష్టు 18, 1914

ప్రగాఢమైన నిశ్చల నీరవ ధ్యాననిష్ఠా పూర్వకముగ నా యావత్సత్తయు నీదెస కున్ముఖ మగునుగాక; తన బహుముఖ ప్రవృత్తులతోపాటుగా సంపూర్ణముగ నయ్యది నీ పాదములమ్రోల సమర్పితమైపోవునుగాక; ఆ యా శక్తుల ఖేలనము నంతనూ అరికట్టి, ఆ యా చైతన్య ప్రవృత్తుల నన్నింటినీ ఏకము గావించి, తుద కంతయునొక్కే చైతన్యవృత్తియై దీపింపగా, అదే నీ యాదేశము నాలకించి అవగాహన మొనర్చుకొనునట్లు చేసికో గలుగుదునుగాక; పరమమంగళ మహార్ణవము లోనికి,—సమస్తమైన అజ్ఞానమును శాశన మొనర్పగల మహార్ణవములోనికి ముని గినట్లుగా నీ స్వరూపములోనికి మరల నేను మునిగెదనుగాక. సంశయములకు విల

యమై అంధకారబంధురమైన అగాధ పాతాళతలములోనికి దిగిపోయి, నీ నిత్య వైభవస్ఫూర్తులకు వెలియైపోయినట్లున్నాను. కాని, ఇట్లు దిగివచ్చుట మూలము ననే నేను మరింతఉన్నతస్థాయికి మరల అధిరోహించి, మరింత విస్తృతపరిధు లకు విస్తరిల్లుచు, మరింత సన్నిహితముగ నీ యనంత పరసీమలను జేరు నదవ కాశ మేర్పడగలదనియు నే నెరుంగుదును. తేజోమయ సీమలయందు వోలె పాతాళపు అగాధ తలములందు సైతము నీ తేజస్సు స్థిరముగా, నిర్విరామముగా, మార్గదర్శకమగుచు ప్రకాశించుచునే యున్నది. తదనుగుణముగా నా చేతన యందు సైతము, ఒకానొక ప్రగాఢ విశ్వాసము, సుస్థిర ఔదాసీన్యము, ప్రశాంత నిశ్చయ భావము శాశ్వతరీతిని నాలో నెలకొనియున్నవి. సుదీర్ఘకాలము రేవు లోని సౌఖ్యము లెల్ల అనుభవించి, పిమ్మట ఆకసమున కారుమబ్బులు క్రమ్మి సూర్యమండల మాచ్ఛాదితమై తుపానుగాలి రేగిన సమయములో, తెలియని తీర ములు, తెలియని దేశములవైపుగా, తెలియని సీమలకు తెరచాపలెత్తి ప్రయా ణమైన పడవరీతిగా నున్నది ఇప్పటి నా స్థితి.

ప్రభూ, నేను పూర్తిగా నీదానను; ఇందెట్టి సంకోచములు, మినహాయిం పులు లేవు. కఠోరనియతితో, నీ యిచ్ఛయే సర్వ సమగ్రముగ నెరవేరుగాక. నా యావత్సత్తయు ప్రశాంత నిశ్చలభావమున సంతోషపూర్వకముగ దానికే విధే యమై యుండగలదు.

భవిష్యమును గురించి నా కిపుడు ఎట్టి భావనయు లేదు. నీ నియతిని గురించి ఏదేని యొక సముచితమగు నూతన భావనను పొటమరింప జేయగలవా డవు నీవే.

అత్యంతపరిపూర్ణమగు ఆత్మసమర్పణ భావముతో, అత్యంతసమగ్రమైన దృఢవిశ్వాసమును హృదయమున పూరించుకొని నేను నిరీక్షించుచున్నాను. నాకు మార్గదర్శి నీ దివ్యవాణియే.

* * *

ఆగస్టు 20, 1914

ఇతరకోణములనుసైతము ఉపయోగకరముగా దీప్తమొనరింపగల యొక మాతనకోణమునుండి చరమగమ్యమును మేము లక్షింపవలెనన్నచో, మాలో అంతరికజ్ఞానానుభూతిని నిరంతరముగ పెంపొందించుకొనుచు, మాప్రయాణస్వరూపమెట్లుండునో ముందుగనే ఎన్నడును నిర్ధారణ చేసికొనకయే, మాచైతన్యపు చరమావధిపర్యంతము ఉత్క్రమింపవలసియున్నది.

కాని, మనస్సు సహజముగా, చరమ కేంద్రములో తన చేతనకు గలిగిన ఏ పూర్వ స్పర్శ, లేక స్పర్శల ముద్రాంకితమునో గుర్తునకు దెచ్చుకొనుచు, "యాత్రా పథమున కట్టకడకు తెలియబడునదిదియే" యని తనలో తాను అనుకొనుచుండును. తాను భావించుచున్న ఆ "ఇది" ఆ చరమగమ్య స్వరూపమును అనువదించిగాని వికృతపరచిగాని చూపునట్టి అసంఖ్యాక రీతులలో నొకటియే యను సంగతి నది గణుతింపదు. బుద్ధిభావన యనుదానికి స్థానము అనుభూతికి అనంతరమునగాని పూర్వమున గాదు.

మార్గమున ప్రయాణ మిదివర కెన్నడును చేసియుండలేదన్న సంపూర్ణ శిశుభావముతో ప్రయాణమును సాగించుటయే సంపూర్ణమైన అంతశ్శుద్ధితో కూడిన సరియగు నిష్కలుష విధానము. అదియే నిరాటంకమైన పురోగతికి, వికాసమునకు, సంపూర్ణమైన సంసిద్ధికి దారి తీయును.

ఎరుకతో కూడిన సమస్త భావనాసరళియు శమించిన నిశ్చల నీరవ మౌన స్థితిలో, వాక్కుల కందని లోతున నాయం దేదియో, అచింత్యస్వరూపుడవైన ఓ మహాప్రభూ, పరమాకాంక్షతో నీ దెస కున్ముఖమై, ఈ సకల వ్యాపారములను సకల వైఖరులను నీకే అర్పణము గావించుచు, పరమమైన జ్ఞానదీప్తి నిమ్మని యర్థించుచున్నది.

నీ స్వరూపము నా భావన కందునది కాదు. కాని, నిశ్చయముగా నిన్ను నే నెరుంగుదును.

ఆగస్టు 21, 1914

ప్రభూ, ప్రభూ, సమస్త పృథ్వియు మూర్ఛాగతమై కంపించిపోవుచు, మూల్గుచు, బాధపడుచు, ఒక మహాసంకటములో నున్నది. ఇంతబాధను ఆమె యనుభవించుట ఎంతమాత్రము వృథాకారాదు. క్రుమ్మరిల్లిన యీ రక్తమంతయు సౌందర్యము, ప్రేమ, జ్ఞానము అను బీజములను శీఘ్రమే మొలకెత్తునట్లు చేయు గాక. త్వరలో ఇవి పుష్పించి పండి కోతకువచ్చి పృథ్వినంతనూ సుసంపన్నము చేయవలసియున్నది. అంధకారబంధురమైన ఈ అగాధతలమునుండి సమస్త పృథ్వియు తనకు గాలి, వెలుతురు నిమ్మని నిన్నర్థించుచు మొరపెట్టుకొనుచున్నది. ఊపిరాడక ఉక్కిరిబిక్కిరి యగుచున్న దీని నాదరింపవా?

ప్రభూ, విజయసంసిద్ధికి మేము చేయవలసినదేమి?

ఎన్ని కష్టములు వచ్చినను మేము విజయము సాధించితీరవలె. గాన, మా మొర ఆలకింపుము. సమస్త ప్రతిబంధకమును విచ్ఛిన్నమొనర్పుము; విచ్ఛే యుము.

* * *

ఆగస్టు 24, 1914

ప్రభూ, గాఢమైన కృతజ్ఞతతో ప్రేరితురాలనై నిన్ను సమీపించుచున్నాను. నే నెంతగనో ఆశించిన జ్ఞానానుభవపు తొలివాక్కులను నీవు నాకు ప్రసాదించితివి. ఈ జ్ఞానముతోపాటుగనే, సకలసాక్షాత్కారోపలబ్ధిక్షేత్రముల నిక్కమైన శక్తివిశే షము సైతము చేకూరినది.

ఇది ప్రారంభము మాత్రమే, పూర్ణసిద్ధికాదు. కాని, మార్గము మాత్రము విచ్చుకొని, స్పష్టముగా, సూటిగా కానవచ్చుచున్నది; దానివెంట సాగిపోవుటయే ఇక జరుగవలసిన పని. అయోమయస్థితిలో గడచిన రోజుల ప్రయత్నఫలిత ముగా,— వినమ్రమయ్యును అత్యంతప్రబలమైన ప్రయత్నఫలితముగా,— తెర

వ్రీలిపోయినది. ఇదే రీతిగా మార్గము ఎల్లరకును ప్రకాశవంతమగునట్లు అనుగ్రహింపుము. మాలో జ్ఞానోదయము స్పష్టముగా నైనపిమ్మట, ఇక ఇతరులలో కూడ ఈ జ్ఞానోదయ మగుటకు ఎట్టి నూతనాటంకములును లేకుండునుగాక. మానవుడు ఎంత గొప్పవాడైనను పరిచ్ఛిన్నుడే; తన మానవత్వ కారణముగ దీర్ఘ కాలము దనుక పరిచ్ఛిన్నుడుగనే యుండక తప్పదు; బృహత్తత్వముతో ఆతనికి సంబంధ మేర్పడినను అయ్యది ఆతని వ్యక్తిత్వద్వారముననే ఏర్పడి, ఆతని బాహ్యచేతనయం దభివ్యక్తమగుచుండును. ఆతని దృక్కోణముచే పాక్షికముగా ఏదోవిధమున ముసుగువడని దర్శన మాతనికి కలుగుట కడుంగడు కష్టము. కాని, ఈ కడపటి యవరోధముల నన్నింటినీ అధిగమించి మరల తలయెత్తకుండ నిశ్చితముగా తూలించివేయవలసిన అవసరమున్నది. మార్గము పూర్ణస్వేచ్ఛాయుతమై, దర్శించిన జ్ఞానము స్థిరముగా పాదుకొనుట అత్యంతావశ్యకము. ప్రభూ, నీ యనుగ్రహము మాయెడ కలదు. బాహ్యదృష్టికి ఎంత చీకటియున్నను అది మమ్ములను విడనాడబోదు. ఘనతరమైన ఉషోదయ ప్రాప్తికొరకు రాత్రియు నొక్కొక్కప్పుడు అవసర మగుచుండును. కాని, బహుశః ఈ సారి మాకు నీవు ఎన్నిటికిని తొలగని ఉషోదయమును ఘటింపజేయ నెంచినట్లున్నావు.

మా భక్తిపూర్వక కృతజ్ఞతాంజలులను, మా పరిపూర్ణ ఆత్మసమర్పణము స్వీకరింపుము.

ఆధ్యాత్మిక జీవితములోని ఒక ఘట్టము పూర్తియగుటతో ఈ పుస్తకము ముగియునని నే నెరుంగుదును. అదే యిపుడు వాస్తవముగా సంభవించుచున్నది.

వెలుగు ప్రసరించినది; మార్గము విచ్చుకొని కానవచ్చినది. శ్రమాకులమైన గతమునకు కృతజ్ఞతాభివందన పూర్వకముగా, నీచే సువిశాలముగ తెరువబడిన యీ నూతనమార్గము మీదుగా మేము ముందునకు చొచ్చుకొని పోయెదము.

విశాలతరము, అధికతర చైతన్యోద్భాసితమునగు ఈ నవీనోపలబ్ధి ప్రవేశద్వారము చెంత, ఓ ప్రభూ, భక్తిపూర్వక సంపూర్ణ ఆత్మసమర్పణ భావ

మున నీకు మేము ప్రణమిల్లుచున్నాము. ఈ అర్పణమునందు మాకు ఎట్టి మినహాయింపులును లేవు.

మరల నిపుడు మాలో నీవే,— నీ వొక్కడవే,— నివసించుచున్నావు. నీ రాజ్యమునకు నీవే మరల నిపుడు ప్రభువు వైతివి. ఈ రాజ్య మిపుడు వెనుకటికంటె విస్తృతము, సమగ్రమునై, నీ పరిపాలనకు మరింత యోగ్యతను సంపాదించుకొనియున్నది.

* * *

ఆగస్టు 25, 1914

ప్రభూ, నీ యిచ్ఛయే నెరవేరుగాక; నీ కార్యమే నిర్వర్తించబడుగాక. మా భక్తిని దృఢ మొనర్పుము; మా ఆత్మసమర్పణమును పెంపొందించుము; మార్గమున మాకు వెలుగునిమ్ము. సమస్త పృథ్వికి నీవే పరమప్రభుడవై నెగడు నిమిత్తము, నిన్నే పరమ ప్రభునిగా మా యంతరంగమున ప్రతిష్ఠించుకొని యున్నాము.

మా వాక్కులింకనూ అజ్ఞాన కలితములుగనే యున్నవి; వానికి జ్ఞానదీప్తి నొసగుము.

మా యాకాంక్ష యింకను దోషజుష్టముగనే యున్నది; దానిని నిర్దుష్టము గావింపుము.

మా యాచరణ మింకనూ శక్తివిహీనముగనే యున్నది; దానికి శక్తి నొసంగుము.

ఓ ప్రభూ. ఈ పృథ్వి మూల్గుచు బాధనొందుచున్నది; కల్లోల మీ ప్రపంచమున స్థావర మేర్పరచుకొనియున్నది.

ఈ మహాతమస్సును విచ్ఛిన్నము చేయగలవాడవు నీవే; నీ కార్యము వెర వేర్చబడునట్లుగా, విచ్ఛేయుము; ఆవిర్భవించుము.

* * *

ఆగస్టు 26, 1914

ఆనందనిలయుడవైన ఓ నా ప్రియదైవమా, ఒంటొంటితో పెనవేసికొని ఒండొంటిని పూరించుకొనుచున్న యీ ఆనందలోకములు సమ్మిశ్రితములై చూడ శక్యము గాకున్నవి. వీని నియతి విశేషముల జ్ఞానమును మా కొసగి, ఇంత గ్రుడ్డిగా అన్వేషించబడుచున్న యీ గమ్యస్వరూపమును అవగాహన మొనర్చుకొని దర్శింపగల శక్తి పృథ్వియందు ప్రబుద్ధ మగునట్లొనర్పుము.

సకల వస్తువులందును అకలంకానంద స్వరూపుడవుగా నున్నది నీవే.... కాని, యీ ఆనందము అత్యంత బాహ్యాభివ్యక్తినుండి అత్యంత అగాధతలముల పర్యంతమూ నిండారినగాని పూర్ణమనిపించుకొననేరదు.

ఓ ప్రభూ, అద్భుతావహమైన యీ ద్వారదేశమందు నన్ను నీవు నిలిపి యున్నావు; ఈ జ్ఞానమును నాలో దృఢతర మొనర్పుము. ఏ చైతన్యకేంద్రము నుండి చూచినచో సకల కర్మలు కేవలము నీ నియతిని అభివ్యక్త మొనర్చునవియై కానవచ్చునో, ఆ స్థానమున నన్ను ప్రతిష్ఠింపుము.

నిశ్చల, నీరవ, శక్తిమయ భక్తిభావమున ఇందుకొరకే నిరీక్షించుచున్నాను.

* * *

ఆగస్టు 27, 1914

నా సత్తయందలి సమస్త భూమికలలో, ప్రతి ప్రవృత్తి యందును, శక్తిమంతము, అఖండము, అగాధము నైన దివ్యప్రేమరూపముగా నే నుండగోరుచున్నాను. ప్రభూ, నీకు నా అభ్యర్థన మిదియే. సత్తయందలి సమస్త భూమికలలో, ప్రతి ప్రవృత్తియందును, శక్తిమంతము, అఖండము, అనంతము నైన ఈ దివ్యప్రేమజ్వాలతోనే నేను దహింపబడిపోదునుగాక! భూ వాతావరణమునెల్ల తన మంటలో విశుద్ధము గావింపగల ఆ జ్వలితాగ్నికుండముగా నన్ను రూపాంతరము చెందింపుము.

అవును. నేను నీ యఖండప్రేమగనే మారిపోవలెను.

* * *

ఆగస్టు 28, 1914

ప్రభూ, సనాతనగురూ, నా బుద్ధిభావన యెల్ల నీమ్రోల మూగవోయి అశక్తమై నిలచియున్నది; కాని, నా హృదయములోనుండి నిర్గతమగుచున్న మొర మాత్రము నీ కొరకే. నీ వుపయోగించుకొను ఉపకరణమై, నీ సేవయందే సంపూర్ణముగ వినియుక్తమగునట్లుగా నా యావత్సత్తను ఉద్బుద్ధము గావింపుము.

అన్నిటిలో, అంతటా, అన్నివేళలా, అఖండితముగ నీవే నేనై యుండ గోరుచున్నాను. పరమమైన నిశ్చల నీరవతయందును, గతివిన్యాసములందును గూడ నేను నీవే కావలెను.

ఏ యవధియు లేక, ఏ అజ్ఞానాంధ్యమును లేక, అన్నింటిలోనూ ఉండి, అన్నిటినీ అంతర్భూత మొనర్చుకొనే ఆ ఏకవస్తువే నేనై పోవలెను.

అఖండజయసంపాదివగు నో ప్రభూ, సకలావరోధములనూ జయించి విలసిల్లెదవుగాక!

ఆగస్టు 29, 1914

మానవుడు, ఏది నిత్యమై అనభివ్యక్తమై యున్నదో దానికినీ, అభివ్యక్తమై యున్న యీ జగత్తునకునూ నడుమ సేతువును నిర్మింపజాలడేని, అట్టి మానవుని వలన నేమి ప్రయోజనము? దివ్యజీవనపు సకల ప్రవృత్తి విశేషములకు, వైభవములకును, భౌతికప్రపంచపు దుఃఖపూరితమగు అజ్ఞానస్థితికిని నడుమ అతడీ సేతువును నిర్మింపవలసియున్నది. ఇకమీద కావలసియున్నదానికీ, ఇపుడు అయియున్న దానికీ మధ్యవర్తియై యున్నాడు మానవుడు. అగాధముమీదుగా వేయబడిన వంతెన వంటివా డతడు; పరాపరార్థములను గలిపెడి లంకె. అజ్ఞేయమైన అనంత తత్త్వము బహురూపముగ అభివ్యక్తమగుటకై ఎచ్చోట నిశ్చితరూపము గైకొనుచున్నదో, ఆ బృహత్తరమైన క్రాసు (X) యొక్క నాలుగు భుజములునూ కలియు చోటగు నడిమిలోకమునందు అతని చైతన్యము ప్రతిష్ఠితము గావలసియున్నది.

ఈ కేంద్రము పరమప్రేమకు, విశుద్ధ చైతన్యమునకు నిర్మల, పరిపూర్ణ జ్ఞానమునకు నెలవు. ఓ ప్రభూ, నిన్ను నిక్కముగా ఎవరు సేవింతురో, సేవింపవలెనో, వారిని ఆ స్థానములో ప్రతిష్ఠింపుము. వారి ద్వారముననే నీ కార్యము నెరవేరి, పరాపరముల నడుమ వంతెన నిర్మాణమై, నీ శక్తి విశేషములు జగమందంతటను అవ్యాహతముగ వ్యాప్తము గావలసియున్నది.

* * *

ఆగస్టు 31, 1914

ఈ భయంకరమైన అవ్యవస్థితియందును, వినాశమునందును ఒకానొక మహాప్రయత్నము కాననగును. ప్రపంచమున నొక క్రొత్త మానవజాతిరూపముతో దివ్యమైన పంటపండించు నిమిత్తముగ క్రొత్తగా విత్తనములు జల్లి అద్భుతమైన ధాన్యపుపైరు మొలిపించుటకై పృథ్విని సిద్ధముచేయుట కావశ్యకమైన కృషి పరిశ్రమ యిది..... ఈ దర్శనము కడు విస్పష్టముగనే యున్నది. నీ దివ్య నియతి విధాన మెంత విశదముగా పొడగట్టుచున్నదనిన, కార్యకర్తల హృదయ సీమలలోనికి శాంతి మరలివచ్చి ప్రభువురీతి సుప్రతిష్ఠితమై యున్నది. ఏ సంశయములు, సంకోచములు ఇక లేవు; ఏ ఆందోళనకు, అసహనమునకు ఇక తావు లేదు. ఏమి వచ్చినను, ఏ ప్రతిఘటన లెదురైనను, ప్రతికూలములగు ఎట్టి భ్రమాత్మక ప్రదర్శనలు కానవచ్చినను, నిత్యముగ కొనసాగు నీ మహాకార్యసరళి సూటిగ గానవచ్చుచునేయున్నది. నీ యనంతసంభూతియందలి అలతిక్షణములను బోలిన యీ మానవవ్యక్తు లెరుంగుదురు—— తాత్కాలిక పరిణామము లెట్టివిగా కానవచ్చినను, అవ్యాహతముగా, అవశ్యముగ సిద్ధించు ఫలితములను గురించిన ఆందోళన మేమియు లేకుండ, మానవజాతిని ఒక అడుగు ముందుకు వేయించిన యోగ్యతావిశేషము తమకు దక్కగలదని. ఓ మహాప్రభూ, నీతోడి ఐక్యమును వీరు పొందుచున్నారు; ఓ విశ్వజననీ, నీతోడి ఐక్యమును వీరు పొందుచున్నారు. అభివ్యక్తికి అవ్వలనున్నదానితోడను, అభివ్యక్త రూపమై యున్నదానితోడనుగూడ ఇట్లు ద్విముఖమైన ఐక్యమును బొందగలుగుచున్న హేతువుచే, సంపూర్ణ నిశ్చితత్వపు అఖండానంద రసాస్వాదనమును వీరు చేయగలుగుదురు.

ప్రపంచ మెల్లెడలను శాంతి;
యుద్ధము బాహ్యావిడంబనము మాత్రమే;
సంక్షోభ మంతయు నొక భ్రమ;
ఉన్నది శాంతియే,—— అక్షరమైన శాంతి.

ఓ జననీ, ప్రియజననీ, నీతో నే నేకమై యున్నాను. ఏకకాలముననే నీవు సంహర్త్రివి, నిర్మాత్రివి కూడ.

అసంఖ్యాక ప్రాణిసంఘాతముతో కూడిన సమస్త విశ్వము నీ హృదయములో నున్నది; అద్దాని అల్పాల్పమైన అణువునందు సైతము నీ యనంతత్వముతో నీవు సన్నిధిచేసి యున్నావు.

నీ యనంతత్వములోని యాకాంక్ష, ఇంకను అనభివ్యక్తమై యున్నదాని కభిముఖమై, మరింత సమగ్రము, సంపూర్ణమునైన అభివ్యక్తికొరకై అభ్యర్థించుచున్నది.

వ్యష్టి, సమష్టి, ఈ రెండింటికి అతీతమైన అనంతము,— ఈ త్రివిధాత్మకమైన పూర్ణచైతన్యమునందు, ఏకకాలముననే సర్వమూ భాసించుచున్నది.

*　　*　　*

సెప్టెంబరు 1, 1914

పరమదివ్యస్వరూపిణివైన ఓ మాతా, అత్యంత భక్తితో, అత్యంత ప్రేమతో నీ కడకు నే నరుదెంచితిని. నీ దివ్యచైతన్యపు లోలోతులను, నీ పరమప్రేమానందముల ఉన్నతస్థాయిని నేను చేరుకొని, నన్ను నీవు నీ చేతులలోనికి గైకొని అక్కున గదియించుకొనగా, ప్రగాఢప్రేమతో నిన్ను ప్రేమించి నీలో విలీనమగుచు కేవలము నీవే అయిపోతిని. అపుడు, ఆ మన మౌనానందపారవశ్యపు నిశ్చల నీరవతాస్థితిలో, అంతకంటెను లోతైన లోతులలోనుండి ఒక వాణి వెలువడినది. "ఎవరికి నీ ప్రేమావశ్యకత కలదో వారివైపు తిలకించుము,"— అని యా వాణి పలికెను. చైతన్యపు సకల భూమికలు, అంచెలంచెలుగా నున్న సకలలోకములు నాకు దృగ్గోచరమైనవి. కొన్ని అద్భుతముగ, కాంతిమంతములై, సువ్యవస్థితిలో సుస్పష్టములై చూపట్టెను; జ్ఞాన మచ్చట దీప్తిమంతమై ప్రకాశింపగా, దాని అభివ్యక్తి సామరస్యపూర్వకమై విశాలతమ సంతరించుకొనెను; సంకల్పము శక్తిమంతము, అప్రతిహతము నై కన్పట్టెను. ఆ తరువాతి లోకములు అంత

కంతకు కాంతివిహీనము లగుచు, అధికతర అవ్యవస్థితిలో నానావిధములై చూపట్టెను, శక్తిప్రకటనము హింసాత్మకమయ్యెను. భౌతిక జగత్తు అజ్ఞాన భూయిష్ఠము దుఃఖమయమునై కానవచ్చెను. అంతట అఖండప్రేమ మాలో ఉద్భూతము కాగా "మేము", వికృతమైన యీ జగద్దుఃఖము నంతనూ పరికించి, మా బిడ్డలే యిట్లు తమ ముఖ్యలక్ష్యమును విడనాడి ఒండొరులతో తీవ్రసంఘర్షణ మున నిమగ్నులగుచుండుట నవలోకించి, దివ్యప్రేమజ్యోతి యీ లోకమందు అభివ్యక్తము గావలెననియు, అయ్యది యీ విపరీత పరిస్థితుల నడుమ సకలమును రూపాంతరము చెందించగల శక్తిగా విలసిల్లవలెననియు, ప్రగాఢముగ సంకల్పించితిమి.....ఆ పిమ్మట ఆ సంకల్పము మరింత ప్రబలము, శక్తిమంతమునై పని చేయు నిమిత్తము, ఓ అచింత్య స్వరూపా, "మేము" నీవైపు తిరిగి, నీ సహాయము నర్థించితిమి. అపుడు తెలియరాని నీ యగాధతలములోనుండి పరమమైన యొక ప్రత్యుత్తరము మాకు విననయ్యెను. "భూలోకమిక రక్షితమైనది" అనెడి సంతృప్తిని అపుడు "మేము" పొందితిమి.

* * *

సెప్టెంబరు 4, 1914

పుడమి యంతటను చీకటి, దట్టమై, తీవ్రమై, అప్రతిహతమై యావరించి నది. ఈ భౌతిక ప్రపంచములో అంతయు దుఃఖము, భయము, వినాశము తాండవించుచున్నవి. దుఃఖపు తెరమరుగున నీ ప్రేమదీప్తివైభవము మరుగువడి పోయినది.

ఓ నా ప్రియజననీ, అఖండ ప్రేమతో, అఖిలభూతేశ్వరునియెడ ప్రగాఢమైన ఆత్మసమర్పణ భావముతో, నీలో విలీనమై పోవుచున్నాను, ఆయనయే మనకు మార్గదర్శియై ధీరత్వమున మనము నడచుటకనువుగా, తన కార్యపథమును మనకు నిర్దేశించి చూపవలసియున్నది.

కాలము ప్రబలమై తొందరపెట్టుచున్నది; ప్రభూ, ఆందోళిత హృదయురాలగు పృథ్వికి తోడ్పడు నిమిత్తమై దివ్యశక్తులు దిగిరావలసియున్నది.

జననీ, ప్రియజననీ, విశాలమగుకు నీ హృదయమునకు నీ బిడ్డల నందరను హత్తుకొని, సమానమైన నీ ప్రేమతో వారిని కప్పివేయుచున్నావు.

నిశ్చల, నీరవ, అచింత్యస్వరూపుడవైన ఓ ప్రభూ, నే నిపుడు సమస్తమును పునీతముచేయు నీ ప్రేమాగ్ని స్వరూపమై యున్నాను. ఈ ప్రేమాగ్ని కుండమున నే నర్పించు ఆత్మాహుతి నంగీకరింపుము. దీని పర్యవసానముగా నీ రాజ్య మిట ప్రతిష్ఠితము గావలసియున్నది; అంధకారమును, మృత్యువును పారద్రోలి నీ దివ్యజ్యోతి యఖండవిజయము సాధింపవలసియున్నది.

ఆవిర్భవింపజేయుము నీ దివ్యశక్తిని; రోజురోజుకు, గంటగంటకు మా సంప్రార్థనమిదియే; "ఓ ప్రభూ, నీ దివ్యశక్తి నావిర్భవింపజేయుము.

* * *

సెప్టెంబరు 5, 1914

"ఎదురుతిరిగి ప్రమాదస్థితిని ఎదుర్కొనుము,"—అని నీవు నన్ను హెచ్చరించితివి. "కార్యరంగమునుండి దృష్టిని మరల్చి, పోరాటమునుండి పలాయనమై, ప్రగాఢమగు పరతత్వానుసంధానమున నిమగ్నము కావలెనని యేల కోరెదవు? ఆ పరతత్వపు పూర్ణాభివ్యక్తినే ఇట నీవు సాక్షాత్కరించుకొని సాధింపవలసియున్నది. అంధతమస్సువలనను, అహితశక్తులవలనను కల్పింపబడు సకలావరోధములపైననూ అద్దాని విజయమే ఇట సాధింపబడవలసినది." — అనియును నీ హెచ్చరిక.

ప్రభూ, జడపదార్థమునకు దాసోహమనుటకు సదా సిద్ధమగుచు, అందుకు పరిహారముగా పరమమైన ఒకానొక బౌద్ధిక, ఆధ్యాత్మిక స్వాతంత్ర్యసంపాదన ప్రయత్నములోనికి తప్పించుకొనిపోజూచెడి ఈ బాహ్యప్రకృతి దౌర్బల్య మెటువంటిదో నే నెరుగుదును. కాని, మావలన నీవు కర్మాచరణము నపేక్షించుచున్నావు. కర్మాచరణమునకు ఇటువంటిపై ఖరి పనికిరాదు. కేవలము అంతర్లోకములలోనే మేము విజయము సాధించిన చాలదు, అత్యంత బాహ్యలోకములందు

సైతము మేము విజయసిద్ధి బడయవలసియున్నది. ఆటంకము లేమియు లేని చైతన్య స్థానమున తలదాచుకొను శక్తి మనకున్నదిగదా యని, ఆటంకముల నుండియు ప్రమాదములనుండియు మేము పారిపోజూడరాదు. నీ పూర్ణశక్తి యందు విశ్వాసముంచి, అదియే విజయము గాంచగలదనెడి నమ్మకముతో, ఎట్టి ప్రమాదమువైనను సూటిగా ఎదుర్కొని మేము పోరాడవలసియున్నది.

ప్రభూ, యోధున కుండవలసిన పరిపూర్ణమైన గుండెధైర్యము నాకిమ్ము; ఆపైన నిక నీ విజయము నిశ్చయము.

"ఎంతటి త్యాగముతోనైనను విజయము సాధించవలె" నన్నది యిప్పటి మా లక్ష్యముగా నుండవలెను. ఎందువలన? కర్మయందును, కర్మఫలము నందును మాకు ఆసక్తి యుండుటవలన గాదు; అట్టి కర్మతో మాకు అవసర ముండుటవలనను గాదు; ఆయాపరిస్థితులనుండి తప్పించుకోగల సామర్థ్యము మాకు లేకపోవుటవలననూ గాదు.

మరి ఎందువలనన్నచో, అది మాకు నీ యాజ్ఞయైనందువలన; పుడమిపై నీ విజయము సిద్ధించవలసిన తరుణ మాసన్నమైనందువలన; పరిపూర్ణవిజయసిద్ధి నీ ఇచ్ఛయగుటవలన.

ప్రపంచమునెడ అఖండ ప్రేమలో నిమగ్నమై మేము పోరాడెదముగాక.

* * *

సెప్టెంబరు 5, 1914

ఊర్ధ్వమునకు, నిరంతర మింకను ఊర్ధ్వమునకు! సాధించినదానితో మే మెన్నడును తృప్తి చెందకుందుముగాక; ఏ యుపలబ్ధితోనూ ఆగిపోక, ఉత్సాహముతో నిరంతర మంతకంతకు మరింత పూర్ణతరోపలబ్ధివైపునకు, అంతకంతకు మరింత ఉన్నతము, సమగ్రము నైన చైతన్యోపలబ్ధివైపునకు సాగిపోవుదుము గాక....నిన్నటి విజయము రేపు సాధించవలసిన విజయమున కొక మెట్టువంటిది మాత్రమే. రేపు ఒనగూడిన శక్తివిశేషము ఆ తరువాత ఒనగూడగల శక్తి సంపదతో పోల్చిచూచినచో దుర్బలతయే యగును.

ఓ దివ్యజననీ, నీ యాత్ర అవిచ్ఛిన్నముగ విజయవంతమై సాగుచున్నది. పూర్ణప్రేమయుం దెవరు నీతో ఏకత్వము పొందుదురో వారు, నిరంతరముగా విశాలతర సీమాంతరేఖావలయములవైపునకు, అధికాధికముగా సమగ్రతర సాక్షాత్కారోపలబ్ధులవైపునకు, నీ దివ్యతేజోవిభూతియందు ఒక శిఖరమునుండి యింకొక శిఖరమునకు కుప్పించియెగయుచు, నీ అజ్ఞాత స్వరూపపు నిగూఢరహస్యముల కొల్లగొని వాని పరిపూర్ణాభివ్యక్తిని సాధించు నిమిత్తముగా సాగిపోవుచుందురు.

దివ్యవిజయినివగు నో మాతా, పుడమియెల్ల నిన్ను కీర్తించుచు గానము చేయుచున్నది. సకలశక్తి సామర్థ్యములును నీకే విధేయము లగుచు ప్రవర్తిల్ల గలవు.

ఏలన, ప్రభువు సెలవిచ్చినాడు, "సమయ మాసన్నమైన" దని.
ఇక నే యవరోధములు అడ్డము నిలువనేరవు.

* * *

సెప్టెంబరు 9, 1914

ఓ పరమేశ్వరా, ఆధిపత్యమునకై పెనుగులాడు రెండు విరుద్ధశక్తుల రూపమున ప్రపంచము విభక్తమైయున్నది; నీ నియతిని వ్యతిరేకించుటలో రెండునూ సమానములే. కారణమేమన, మృత్యుసదృశమగు స్తబ్ధత, అంధత్వమున కొనసాగు వినాశము,- ఈ రెండును నీవు ఇచ్ఛయించుచున్నవి కావు. నిరంతర మధికాధికముగా కొనసాగు దివ్యపరివర్తనరూపమున నిన్ను నీవు ఆవిష్కరించుకొనుచుందువు. నీ యిచ్ఛను మేము అభివ్యక్తము చేయవలెననిన, ఈ పరివర్తనమునే పుడమిపై మేము సాధించవలసియున్నది.

ఒక్కొక్కప్పుడు, ఓపిక కోల్పోయి మేము, ఈ యభివ్యక్తిసాధన మేదియో తక్షణమే తెలియ నభిలషించుచుందుము. ఇందువలన కలుగు ప్రయోజనము శూన్యము. నీవు మాకేమియు తెలియజేయవు. కారణమేమన, ఈ తెలియవలసినది కార్యాచరణ సమయమున అవసరమునుబట్టి తెలియజేయబడుచుండును.

అందువలననే మేము, బుద్ధికి విశ్రాంతి నిచ్చి, లక్ష్యమును సాధించు సంకల్పమును సుస్థిరము, సుదృఢము గావించుకొని, నీ యాదేశ మేవేళ వచ్చునోయని నిరీక్షించుచున్నాము.

* * *

సెప్టెంబరు 10, 1914

పొంగివచ్చు తరంగము రీతి, ఓ ప్రభూ, నీ దివ్యప్రేమ మా యావత్సత్తపైనను ఎత్తివచ్చుటతోపాటు సకల భూతజాలమును ముంచెత్తునదై యున్నది. సకల హృదయములలోనికిని ఆ ప్రేమ చొచ్చుకొనివచ్చి, వానియందు ఆరని దివ్య జ్వాలను రగిలించి, చెరగని దివ్యసౌందర్యమును ప్రతిష్ఠించును; సకలవైరుధ్యములను అతిక్రమించి, ఎల్లరియందును పరమ మంగళమగు సుస్థిరానందమును విలసిల్ల జేయును.

నీ దివ్యతేజస్సుసైతము, పొంగివచ్చు తరంగమును బోలినదే. అయ్యది మా యావత్సత్త పైనను ఎత్తివచ్చుటతోపాటు సకల భూతజాలమును ముంచెత్తునదై యున్నది. సకల బుద్ధిభావనలలోనికిని అ దివ్యతేజస్సు చొచ్చుకొని వచ్చి, చాంచల్యములేని వైశద్యమును, పొరపాటులేని దివ్యస్ఫురణను అవ్వానికి కలుగజేయును; సకలవైరుధ్యములను అతిక్రమించి, ఎల్లరియందును పరమ విజ్ఞానరూపమగు నీ దివ్యజ్ఞానవైభవమును విలసిల్లజేయును.

అటులనే నీ దివ్యశక్తి కూడ, పొంగివచ్చు తరంగమును బోలినదై, మా యావత్సత్తపైకిని ఎత్తివచ్చుటతోపాటు, సకల భూతజాలమును ముంచెత్తునదై యున్నది. సకల జీవనములోనికిని ఆ దివ్యశక్తి చొచ్చుకొనివచ్చి, వైఫల్యములేని సామర్థ్యమును, అప్రతిహతమగు దివ్యబలస్ఫూర్తిని అద్దానికి కలుగజేయును; సకల వైరుధ్యములను అతిక్రమించి, ఎల్లరియందును పరమ సంకల్పరూపమగు నీ దివ్యశక్తి వైభవమును విలసిల్లజేయును.

* * *

సెప్టెంబరు 13, 1914

ఓ దివ్యజననీ, నిండుభక్తితో నీ మ్రోల ప్రణమిల్లుచు, ప్రగాఢ భావాతిరేకమున నీతో ఐక్యమును పొందుచున్నాను. అటులనే ఓ దివ్యప్రభూ, నిండు భక్తితో నీ మ్రోల ప్రణమిల్లుచు, ప్రగాఢమైన ఆకాంక్షతో నీతోడి ఐక్యమును పొందుచున్నాను.

ఇక ఆపైన విలసిల్లునది అద్భుతమైన నిశ్చల నీరవతాస్థితి మాత్రమే. వ్యక్తస్థితి అవ్యక్తస్థితిలో లీనముకాగా, అంతయు అక్షరము, నిశ్చలమునై అట్టే నిలిచిపోయియున్నది.

వర్ణింపనలవికాని యీ స్థితిని వర్ణించుటెట్లు?

* * *

సెప్టెంబరు 14, 1914

'నే' ననునది ఇక ఏమియును లేదు; ఏ వ్యక్తిత్వమును, ఏ వైయక్తిక పరిమితులును లేవు. ఉన్నది మా దివ్యజననియైన అపార విశ్వము మాత్రమే. పరమేశ్వరుడవైన నీ యఖండేచ్ఛను చాటుచు ఇయ్యది నిఖిల మలములను దహించివేయు విశుద్ధాగ్నిగా ప్రజ్వలించుచున్నది. నీ యిచ్ఛ నెరవేరుటకిక ఎట్టి యాటంకములును లేకుండుటకే యీ జ్వలనము.

ఓ ప్రభూ, ప్రగాఢ భక్త్యుత్సాహభరితమగు అఖండ సంకీర్తనముగా ఇయ్యది నీదెస కుద్గమించుచున్నది. వర్ణనాతీతమైన భక్తిపారవశ్యమున సమస్త పృథ్వియు నీతో ఐక్యమును పొందుచున్నది.

ప్రబలమైన నీ నిశ్వసనముతో ఈ యగ్నికుండమును మరింతగా ప్రజ్వలింపజేయుము. తత్ఫలితముగా నియ్యది మరింత విస్తృతముగ, బృహత్తరమై జ్వలించునుగాక; సకలాంధకారము, సకలాంధతమః ప్రతిరోధములు ఆహరించి

వేయబడి, సకలమలధ్వంసినియైన యీ జ్వాలాముఖమున తేజోరూపముగ దివ్య పరివర్తనమును గాంచుగాక.

ఆహా, సమస్త కలుషములను హరించివేయు నీ దివ్యవైభవ మెంత ప్రశాంతసుందరము!

* * *

సెప్టెంబరు 16, 1914

దివ్యమైన నీ ఉషోదయమును కీర్తింపుచు ఊర్ధ్వముఖమై బయల్వెడలిన యీ వాణిని, — ఈ సంకీర్తనము నాలకింపుము.

నీ పరమనియతియే అప్రతిహతముగ నెరవేరునుగాక. అయ్యది నిత్యమైన యీ వ్యక్త జగద్రూపమున విలసిల్లుట గావచ్చును; లేక, అవ్యక్త స్థితిలోనికి మరల విలీనమైపోవుటయు గావచ్చును; ఏమైనను మాకది అప్రధానవిషయము. ఈ రెంటిలో ఏ యొకదానినో మేము ఎన్నికచేసి తీరవలెనా? ఆ పని నేను చేయజాలను. నా చేతనయం దిపుడు ఏ అభిమానమును లేదు. ఉన్నదెల్ల ఒకే ఒక ఇచ్ఛ; అది భావాతీతుడవగు నీ యిచ్ఛయే.

సమస్తవిశ్వము ఇప్పుడు, దివ్యమైన నీ ఉషోదయమును కీర్తింపుచు నుద్గమించిన సంకీర్తనరూపముగ విలసిల్లుచున్నది. దాని కిపుడు ఆ రూపముతప్ప మరే రూపమును లేదు.

* * *

సెప్టెంబరు 17, 1914

నేను చేయు కర్మకు ప్రేరణమిప్పుడు బయటనుండిగాని, మరి యేదో ప్రత్యేక ప్రపంచము నుండిగాని వచ్చుట కవకాశము లేదు. నా సత్తయొక్క లోతులనుండి సకలమును ప్రేరేపించి నడిపించుచున్నవాడవు నీవే; నీ యిచ్ఛయే సర్వమును నడపుచున్నది; నీ శక్తియే సర్వత్ర పనిచేయుచున్నది; అయ్యది పరిచ్ఛిన్న మగు వ్యష్టిచైతన్యక్షేత్రమునగాక, విశ్వవిశాలసమష్టిచైతన్యమునందు కొనసాగు చున్న పని. ఈ సమష్టిచైతన్యక్షేత్రమున, నా సత్తయందలి ప్రతి అవస్థావిశేషము సర్వముతో ఏకమై యున్నది. ఈ స్థితియందు, బహుప్రకారములగు విశ్వవ్యాపారము లన్నింటినీ,— అవ్వాని గందరగోళపుస్థితిని సైతము,—జీవి తన అంతశ్చేతన యందు దర్శింపనేర్చును. అంతేకాదు, వానితోపాటుగా. అఖండితమైన నీ యక్షర స్వరూపపు నిశ్చల, నీరవ, పరమశాంతిని సైతము ఆత డనుభూత మొనర్చుకో గలుగును.

* * *

సెప్టెంబరు 20, 1914

నా బుద్ధి మౌనముద్ర వహించినందున, కలముగూడ మూగవోయినది; కాని, ఓ ప్రభూ, నా హృదయము మాత్రము, మా దివ్యజననితో పాటుగ అదే భక్తిశ్రద్ధలతో నీతోడి యేకత్వము భజింపుచు, నీకై యాకాంక్షించుచునే యున్నది. అంతేకాదు, నీ ద్వారమున నా యావత్సత్తయు, ఆద్దాని కతీతముగ విలసిల్లు అవాఙ్మానసగోచరమునకై, దానితో ఏకత్వము భజించిన నిశ్చల నీరవత కతీతముగా సైతము పరిశ్రమించుచున్నది గూడ.

* * *

సెప్టెంబరు 22, 1914

అవాఙ్మానసగోచరపు ద్వారదేశమున విలసిల్లుచున్న ఓ ప్రభూ, నీకు నమస్కారము.

మరియు, నీకు నీవే చేసికొనెడి ఈ నమస్కారము, పరమసత్తయందలి అచింత్య మూలతత్వములో, అద్దాని అగాధపు లోలోతులలో, అద్దాని అత్యంత బాహ్యోపలబ్ధుల పర్యంతము కూడ విలసిల్లుచుండుట లేదా? ఆ పరమసత్త స్వరూపస్థితి ఎట్టిదైనను, ఎంత అచింత్యసనాతనమైనను, అదియును నీ మూల తత్వమున నీవే అయియున్నావు. వస్తుస్థితియందేగాక, జ్ఞానమునందు, క్రియ యందు సైతము మేము నీవై మనగలందులకై, ఈ పూర్ణచేతనను మాకు నీవు అనుగ్రహించియున్నావు. ఇట్టిది అంతయు నొక వినిమయముగా, ఆనందము తొణికిసలాడు భక్తిప్రేమమయ నమస్కారముగా, మా దివ్యజనని నీకై చేయు భక్తిపూర్వకమైన ఆకాంక్షరూపమునను, ఆమె యాకాంక్షకు నీనుండి ప్రసరించు అఖండ, శక్తిసమన్విత ప్రతిస్పందనము రూపమునను, పర్యవసానమున, ఇంకనూ అభివ్యక్తము కానిదై, అజ్ఞేయమై, అంతకంత కెక్కుడుగా మాకు తెలియవచ్చు చునే సదా అజ్ఞేయముగనే యుండిపోగలదానికొరకు నీ యావత్సత్తయు చేయు నాకాంక్షరూపమునను విలసిల్లుచున్నది.

పరమమైన నిశ్చల నీరవతలో సమస్తమూ ఇప్పుడునూ ఎప్పుడునూగూడ ఉండనే యున్నది; అనంతమైన సంభూతిరూపమున, జగదభివ్యక్తియందు సైతమూ సమస్తమూ సదా ఇకమీద ఉండగలదుకూడ.

ఓ జగదీశ్వరా, ఏది ఉన్నదో, ఏది ఉండగలదో, అవి రెండునూ ఏకకాల మున నీవే అయియున్నావు. ఆ కారణమున, ఏది ఉన్నదో, ఏది ఉండగలదో, వాని మధ్య నున్నవాడవు సైతము నీవే కాదా? నీ కిదే నా ప్రణామము.

పూర్ణమైన జ్ఞానదీప్తియందు, ఏకకాలముననే జ్ఞేయము, అనిర్వచనీయమునై యొప్పారు నో అత్యద్భుత అనంతస్వరూపా, నీ కిదే నా ప్రణామము.

సెప్టెంబరు 24, 1914

ఓ ప్రియజననీ, మా నడుమ నీవు సదా మెలగుచునే యున్నావు గదా. నీ యండదండలు మాకు పూర్తిగా కలవనెడి అభయము మా కొసగుచు, ఏ దివ్య సంకల్పము మా ద్వారా అభివ్యక్తము కావలసియున్నదో అయ్యది తన సత్య ధర్మము నెరవేరుటకు వలయు పరికరములను సమకూర్చుకొని యున్నదని, ప్రస్తుతము నీవు సాధింపనైయున్న విశేషములకును ఆ ధర్మమునకును చక్కని పొత్తు ఒనగూడి యున్నదనియు మాకు విస్పష్టము చేయుచున్నావు. నీ దివ్యసంకల్పమును, సత్యధర్మమును నూతనరూపమున అభివ్యక్తము చేయుటకు ఈ భౌతిక జగత్తుసైతము సిద్ధముగా నున్నదని నీ దివ్యసన్నిధి మాకు ధైర్యమిచ్చుచున్నది. ఆకారణమున, అత్యంత కష్టసాధ్యములు, అసంభావ్యములు, మీదుమిక్కిలి అసాధ్యములునై చూపట్టినవికూడ ఇప్పుడు సాధ్యములై కనుపట్టుచున్నవి.

పరమసామరస్యమున నొప్పారు ఆనందకందళిత హృదయముతో నీకు ప్రణమిల్లుచున్నాను; నీదివ్యకార్యములకు, దివ్యధర్మమునకు ప్రణమిల్లుచున్నాను.

* * *

సెప్టెంబరు 25, 1914

పరమపూజ్యవగు నో దివ్యజననీ, నీ సాయమున్నచో నిక అసాధ్య మేముండును? కార్యసిద్ధిఘడియ సమీపించినది. నీ పరమేచ్ఛను సమగ్రముగా మేము నెరవేర్చుటకై వలయు తోడ్పాటు నీవలన మా కొనగూడగలదని అభయ మొసగియున్నావు.

అచింత్య వాస్తవిక స్థితులకును, ఈ భౌతికప్రపంచపు సాపేక్షికస్థితులకును పొత్తుగూర్పగల మధ్యవర్తులనుగ మమ్ము నీ వామోదించియున్నావు. మా మధ్య నిత్యమూ నీ దివ్యసాన్నిధ్యముండుటే నీ సహాయసంపత్తి మాకు నిశ్చయ మను దానికి గురుతు.

ప్రభువు సంకల్పించినాడు; నీవు నెరవేర్చుచున్నావు.

ఒక నవ్యతేజము భువిని వెల్లిగొలుపనున్నది.

ఒక నూతన ప్రపంచము ఆవిర్భవించనున్నది.

ప్రకటితములైన కార్యములన్నియు నెరవేరనున్నవి.

*　　　*　　　*

సెప్టెంబరు 28. 1914

ప్రభూ, నీ సాన్నిధ్యమును కీర్తించుటకు నా కలము మూగవోయినట్లుగా నున్నది. అయినను, నీవు తన రాజ్యమునెల్లను స్వాయత్తపరచుకొన్న ప్రభువురీతి నున్నావు. సకలమును వ్యవస్థచేసి సముచితస్థానమున నుంచుచు, ప్రతిమండలమును అభివృద్ధిపరచి సమృద్ధము గావించుచున్నావు. నిద్రించుచున్నవారిని మేల్కొలుపు చున్నావు; జడావస్థలో కూరుకొనిపోవుచున్నవారిని క్రియాపరులనుగ జేయుచున్నావు; ఎల్లెడలను సామరస్యమును నెలకొల్పుచున్నావు. ఈ సామరస్యస్థాపన నెరవేరెడి దినము రాగలదు. దేశజీవనప్రవృత్తి అంతయు నీ యాదేశమునూ అభివ్యక్తినీ సాధించునదై విరాజిల్లగలదు.

కాని, ఈ లోపుగా, నిన్ను కీర్తించుటకు నా కలము మూగవోయినట్లుగా నున్నది.

*　　　*　　　*

సెప్టెంబరు 30, 1914

ప్రభూ, మనోభావనల అవరోధముల నన్నింటినీ నీవు కూలద్రోసినావు; సంపూర్ణమైన సాక్షాత్కారము కలిగినది. ఇందలి విశేషములలో ఏ యొకదానినీ మేము విస్మరింపరాదు; దేనినీ ఉపేక్షించక, ఏకకాలముననే అన్నింటినీ నెరవేర్చుటకు బూనుకోవలెను. మార్గమున అడ్డుదగిలి మా పురోగతి సాగనీకుండజేయు నెట్టి పరిమితులకు, ఎట్టి నిబంధనలకు మేము తావీయరాదు. ఇట్లు చేయుటకు మాకు తోడ్పడు నిమిత్తమే మా విషయమున నీవు జోక్యము కల్పించుకొనుచుందువు. ఏదైన నొక ప్రత్యేక కార్యసిద్ధిని సాధించుటలో నిన్నే అభివ్యక్త మొనర్చువారై కేవలము నీ స్వరూపులే యైనవా రందరును ఈ మహాకార్యమున మాకు సహకారులే యగుదురుగాక. అదియే నీ దివ్యేచ్ఛ.

మా దివ్యజనని మాతోడనే యున్నది; అంతులేని అగాధతలములు మొదలుకొని, అత్యంత బాహ్యేంద్రియ ప్రపంచపర్యంతము, పరిపూర్ణ పరమ దివ్యచేతనతోడి తాదాత్మ్యమును మాకు ఘటింపజేయుట కామె వాగ్దానము చేసియున్నది. ఈ క్షేత్రము లన్నింటిలోనూ, అగ్నిదేవుని సహకారము మాకు వాగ్దత్తమై యున్నది. సాక్షాత్కారోపలబ్ధిని త్వరితపరచుటకై అతడు, విశుద్ధికరమగు తన జ్వాల నుపయోగించి, అవరోధములనెల్ల ధ్వంస మొనర్చుచు, శక్తిసామర్థ్యముల రగుల్గొలిపి సంకల్పబలము నుద్దీపింప జేయును. అట్లే ఇంద్రుడును మాకు నిత్యసన్నిహితుడై యుండి, మా జ్ఞానబోధను పరిపూర్ణమొనర్చుటకు తోడ్పడును. అదే రీతిగ, దివ్యుడైన సోముని సహకారముగూడ మాకు లభించినది. అతడు పరమానందానుభూతుల నందించెడి తన అఖండ, అప్రతిహత, అద్భుతప్రేమతో మాయందు దివ్యపరివర్తనము ఘటింపజేసినాడు.

మధురస్వరూపిణివైన ఓ దివ్యజననీ, వర్ణనాతీతము, ఆనందపరవశమునైన పరమగంభీర భావాతిశయముతో, అపరిమితవిశ్వాసముతో నీ కిదే ప్రణమిల్లుచున్నాను.

అత్యద్భుతస్వరూపుడవైన ఓ అగ్నీ, నాయం దెంతయు సచేతనముగ విలపిల్లుచున్న నీవు మరింత సచేతనత్వమున విలపిల్లగలందులకై, నీవు ప్రజ్వలించు

కుండము మరింత అపారవిస్తృతి గాంచగలందులకై, నీ జ్వాలా శిఖలు మరింత ఉన్నతోన్నతముగ శక్తిమంతములై ఎగయగలందులకై, నా యావత్సత్తయు కేవల మొక మహోగ్రజ్వాలగా, కలుషముల నెల్ల దహించివేయు చితిమంటగా విరాజిల్లగలందులకై నిన్ను ఆవాహనము చేయుచున్నాను.

దివ్యజ్ఞానదాతవై విలసిల్లు వో యింద్రా, నిండుభక్తితో స్తోత్రపూర్వకముగా నిన్ను నే నర్థించునదిదియే — నాతో నీ వైక్యము పొంది, భావనారూపములగు అడ్డుకట్టలనెల్ల కూలద్రోసి, దివ్యజ్ఞానమును నాకు ప్రసాదింపుము.

నా యావత్సత్తకును సారభూతురాలవైన ఓ పరమప్రేమదేవతా, వేరొక పేరుతో నిన్ను నేను పిలువనొల్లను. నా శరీరమునందలి సూక్ష్మాతిసూక్ష్మములైన అణువులందును, అటులనే ఈ యనంత విశ్వమునందును దాని కవ్వలనూ గూడ నీవు సచేతనముగ స్పందించుచుండుట నాకు గోచరించుచున్నది. ప్రతిశ్వాసయందును శ్వసించుచున్నది నీవే. ప్రతి కార్యగర్భమునందును విలసిల్లుచున్నది నీవే. సకలసత్సంకల్పములకును వెలుగు నిచ్చుచున్నది నీవే. సకల దుఃఖముల మాటునను దాగియున్నది నీవే. అంతులేని పూజ్యభావము నీయెడ నాలో అంతకంతకు తీవ్రతర మగుచున్నది. అంతకంత కత్యంత సహజముగా నన్ను నేను నీవుగనే భావించుకోగలుగున ట్లనుగ్రహింపుము.

మరి, ఈ యంతయును నీవే యగుచు, ఇంతకుమించికూడ విలసిల్లువాడవైన ఓ ప్రభూ, నీ స్వరూప మేమని వర్ణింపగలను? సమస్తమునకును నీవే పరమాధినేతవు; మా భావనలకు చరమావధివి. నీ యజ్ఞాతస్వరూపపు ద్వారదేశమున మాకొరకై నీవు నిలిచియున్నావు. నీకార్యమంతయు చక్కగా నెరవేరి, ఈ విశ్వమంతయు పరమమైన తాదాత్మ్యమువైపుగా, పరమమైన అభివ్యక్తివైపుగా మరొకఅడుగు ముందుకు వేయగలందులకై, ఆ నీ యచింత్యస్వరూపమునుండి యొకానొక వినూత్నవైభవము పెల్లుబికి వచ్చి, ఉచ్చతరమూ పూర్ణతరమూ నైన సాక్షాత్కారోపలబ్ధిని సాధ్యమొనర్చునట్లుగా అనుగ్రహింపుము.

ఇపుడు నా కలము మరల మూగవోవుచున్నది. నిశ్చల నీరవతలో మాత్రమే ఇపుడు నేను నిన్నారాధించుచున్నాను.

* * *

అక్టోబరు 5. 1914

ఓ పరమేశ్వరా, నీ ధ్యానమునందలి సుస్థిర నిశ్చల నీరవతలో, ప్రకృతి వినూత్నబలమును సంతరించుకొని పదనుదేరినది. వ్యక్తిత్వభావన యెల్ల అధిగమింపబడగా, ఆమె నీ యానంత్యములోనికి అమాంతముగా విసరివేయ బడినట్లయ్యెను. అన్నిభూమికలలోనూ గజిబిజి లేకుండ అచట అనుభూత మగునది నీ యేకత్వమే. మార నొల్లనిది, ముందుకు సాగునది, ఎల్లప్పుడును ఉండునది,—ఈ మూడు తత్వములయు సమ్మిశ్రితసామరస్యము నెమ్మది నెమ్మదిగా, అనవరతమూ మరింత విస్తృతము, మరింత సంకీర్ణము, మరింత మహోన్నత సమతా విశిష్టము నగు రీతిలో అచట సాధితమయ్యెను. జీవితమునందలి యీ త్రిగుణములయు అంతర్వినిమయము వలననే సృష్టికి పూర్ణత్వము ఘటిల్లుచుండును.

ఆందోళితహృదయులు, అనిశ్చిత మనస్కులునై అనేకు లీ తరుణములో నిన్ను అన్వేషించుచున్నారు. నీ దివ్యతేజము వారికి జ్ఞానదీప్తినొసగి, నీ దివ్య శాంతివలన వారు స్వస్థహృదయులు కాగలందులకై నీతోడి యనుసంధానము వారికి నేను గూర్చగలుగునట్లుగా అనుగ్రహింపుము.

ఇపుడు నేను నీ చర్య కొరక ఆలంబన స్థానముగానూ, నీ చైతన్యమున కొరక కేంద్రస్థానముగానూ ఉన్నాను. వెనుకటి పరిమితు లన్నియు నిప్పుడు ఏమై పోయినవో, వెనుకటి ఆటంకములన్నియు ఎచటికి పలాయనమై పోయినవో! నీ రాజ్యముపై పరిపూర్ణాధికారమున విలసిల్లు మహాప్రభువువు నీవే.

* * *

అక్టోబరు 6, 1914

ఓ ప్రియజననీ, నేను నిత్యమూ సంపూర్ణముగ నీవే అయిపోవుటెట్లో నాకు నీవు నేర్పగోరుచున్నాను. ఇట్లగుటమూలముగా నేను, ఏ పరతత్త్వము తనను దా నభివ్యక్త మొనర్చుకొన సంకల్పించినదో అద్దాని అభివ్యక్తికి అధికాధికముగా పరిపూర్ణ సాధనమగునట్లు నన్ను నే నంకిత మొనర్చుకోవలెనని నా యభిలాష.

అంతయూ ప్రశాంతముగా, ప్రసన్నముగా నున్నది. ఇక ఏ సంఘర్షణయు, ఏ ఆందోళనయు లేదు. ఆకాంక్షసైతము, తన తీవ్రత నేమాత్రమూ కోల్పోకయే, తన ఆనంత్యమున అఖండితమగు పరమశాంతితో విలసిల్లుచున్నది. చైతన్యమునందలి ఒకానొక విచిత్ర వైరుధ్య సన్నివేశ ఫలితముగా, ఒకే పతకమునకు రెండువైపులున్నమాదిరిగ, నేనిపుడు ఏకకాలమునే, ఎట్టిమార్పులూ లేక సమస్తమునూ తనలో సదా ఇముడ్చుకొనియున్న అఖండ సత్యపు అక్షరశాంతినీ, అవిచ్ఛిన్న పురోగతి రూపమున నిరంతరాయముగా సమస్తమూ సాగిపోవు సత్వర సుతీవ్ర గమనమునూ కనుగొనుచున్నాను.... నీదృష్టిలో, ఓ ప్రభూ, ఇవి రెండునూ సమాన సత్యములే.

* * *

అక్టోబరు 7, 1914

దివ్యతేజస్సు పుడమియందంతటను క్రుమ్మరించబడునుగాక; దివ్యశాంతి ప్రతి హృదయమునను నెలకొనునుగాక!....బరువై, జడమై, గతానుగతికమై, అజ్ఞానభూయిష్ఠమైన భౌతికజీవనమును మాత్రమే దాదాపుగ ఎల్లరును ఎరుంగుదురు. వారి ప్రాణిక శక్తులు ఈ భౌతికరూపముతో నెంతగా ముడివడియుండుననిన, అవి కేవలము తాముగా శరీరమునకు వెలుపల నున్నప్పుడుగూడ, అమితబాధాకరములైన యీ భౌతిక అనిశ్చిత పరిస్థితులతోడనే పూర్తిగా సతమత మగుచుండును. ఇక, మానసిక జీవనము ఉద్బుద్ధమైయున్న మానవులలో, వారు విశ్రాంతిలేక, బాధాకలితులై, ఆందోళిత మనస్కులై, యథేచ్ఛావృత్తులై, నిరంకుశులై మెలగుచుందురు. తాము కలలు గనెడి పరివర్తనములయు, పునః పునః ప్రయత్నములయు, సుడిగుండములో పూర్తిగా జిక్కుకొని, నిర్మాణమునకు వలయు పునాదిని గురించిన జ్ఞాన మేమియు లేక, ప్రతిదానిని నిర్మూలము చేయుటకు సిద్ధమగుచుందురు. వారి జ్ఞానము చీకటులు గ్రమ్ము మెరపులతో కూడినది మాత్రమే యగుటచేత, దానివలన వారు గజిబిజిని, గందరగోళమును మరింత హెచ్చుచేయుదురేగాని. తొలగజేయుటకు తోడ్పడనేరరు.

శక్తియుక్తమగు నీ ధ్యాననిష్ఠలోని అక్షరశాంతి, అవ్యయమగు నీ యనంతత్వపు ప్రశాంత దర్శనము వీ రందరిలోను మృగ్యముగా నున్నవి.

ప్రభూ, నీ పరమానుగ్రహమునకు పాత్రమైన యొక వ్యక్తిగా నాలో నిండారిన అపార కృతజ్ఞతాభావ పురస్సరముగా నిన్ను నేను యాచించున దేమన, ఇప్పటి ఈ మహాసంక్షోభపు ముసుగులోనే, విపరీతమైన యీ మహాగందరగోళమిట్లు కొనసాగుచున్న స్థితిలోనే, ఆ యలౌకిక సంఘటనము ఘటిల్లి, పరమ ప్రశాంతి పూరితమైన నీ దివ్యధర్మము, సుస్థిర నైర్మల్యమున నొప్పారు నీ దివ్య తేజము ఎల్లరికిని దృగ్గోచరమై, కడకు నీ దివ్యచైతన్యమున కుద్బుద్ధమైన మానవాళితో విలసిల్లు పుడమినంతనూ పరిపాలించును గాక.

ఓ నా ప్రియతమదైవమా, నా ప్రార్థనను నీ వాలకించినావు, నా పిలుపు నాదరించి బదులు పలుకగలవు.

* * *

అక్టోబరు 8, 1914

కర్మాచరణమున మాకు గలుగుచున్న ఆనందమునకు ప్రతిగా, పరిహారముగా, బహుశః అంతకంటెనూ ఘనతరమగు నానందము కర్మాచరణమునుండి విరమించుటలో మాకు అనుభూత మగుచున్నది. ఈ రెండు స్థితుల అనుభూతులును మాలో పర్యాయక్రమమున గలుగునప్పుడును, లేక రెండునూ ఏకకాలముననే అనుభూత మగునప్పుడునూ గూడ, ఈ యానందము పరిపూర్ణతను గాంచుచున్నది. కారణమేమన, ఓ ప్రభూ, అది నీ పూర్ణత్వ సాక్షాత్కారానుభూతి.

ఓ పరమేశ్వరా, నీ దివ్యధ్యానమునందలి యపరిచ్ఛిన్నతను, నీ నిత్య నిరవధికస్వరూపమునందలి పరమ సుప్రసన్నతను నీవు నా కనుగ్రహించియున్నావు. సర్వమును నెరవేర్చు మా దివ్యజననితోడి తాదాత్మ్యముద్వారా, ఏకకాలముననే స్వరూపచైతన్యమున విలసిల్లుచు కర్మాచరణ మొనర్చు నామె యఖండ శక్తిసంపదలో పాల్గొను భాగ్యమును సైతము నీవు నాకు ప్రసాదించితివి.

అఖండము, సర్వశక్తిమంతము నగు నీ దివ్యానందమున నోలలాడుచు నీకిదే ప్రణమిల్లుచున్నాను.

అక్టోబరు 10, 1914

నా యావత్సత్తతోనూ నేను చేయు నీ యర్పణము నిత్యనూతనమై విల సిల్లుచు, అధికాధికముగ పూర్ణత్వము సంతరించుకొనునుగాక. ఈ యర్పణము పరమమైన నీ సత్యస్వరూపమునకు. ఇట్టిదట్టిదని నిరూపింపరాని యీ నీ యచింత్యస్వరూపము కాలగతిలో అనంతముగా, అంతకంతకు సమగ్రమూ సంపూర్ణమూ నగు నభివ్యక్తిరూపమున తనను దా వ్యక్తపరచుకొనుచున్నది. ప్రభూ, నిన్ను ఏ పేరున పిలువవలెనో నాకు తెలియదుగాని, పరిపూర్ణ ఆత్మార్పణపూర్వకమగు పరమమైన నిశ్చలనీరవతలో నీ యిచ్ఛనుమాత్రము పొడగనుచున్నాను. సమస్త పృథ్వికిని నేను ప్రతినిధి నగునట్లనుగ్రహింపుము. నా చైతన్యముతోడి ఏకత్వమున నామె నీకు ఏ మినహాయింపులును లేని యాత్మార్పణము గావించుకొనును గాక.

పరమ శాంతి స్వరూపుడవు నీవు; అత్యద్భుత సాఫల్య స్వరూపుడవు; అక్షరముగ కాలాతీతమై విలసిల్లుచు, దేశకాలచైతన్యమునందు సైతమూ అంతకంత కధికతరముగ నభివ్యక్తమగు నీ జగద్రూపమున భాసించుచున్న దంతయును నీవే. అఖండ అక్షరత్వమున విరాజిల్లుచున్నదియు, అభివ్యక్తము కాగోరు సమస్త దివ్యాశయరూపమున విలసిల్లుచున్నదియు, అంతయును నీవే. నమ్మశక్యముగాని నీ వరములతో ఈ పుడమి ననుగ్రహింపుము.

శాంతి, శాంతి, పుడమి యంతటను శాంతి నెలకొనునుగాక.

* * *

అక్టోబరు 11, 1914

ఇంచుక వ్యాకులపాటు లక్షణముతో, ప్రతీక్షా భావముతో, పీడక ద్యోతమాన మగుచున్న యీ సంస్కార విశేషమున కేమి హేతువు? నా యావత్సత్తయు నీ వైపుగనే తిరిగి, నీతోడి దివ్యానుసంధానపు మహదానందమున మను చున్నది; అంతటను సుస్థిరత, సుప్రసన్నత, సుదృఢత్వము, అఖండితమగు

సుప్రశాంతి నెలకొనియున్నవి; విస్తరించిన సీమాంతరేఖలం దంతటను వెలుగు నిండారియున్నది; నిశ్చల, నీరవ, నిదిధ్యాసనమున భక్తిభావము మరింతగా ప్రగాఢతను సంతరించుకొన్నది. ఇట్టి స్థితిలో, నా ఉనికికి అంటుగట్టబడిన మాదిరిగ భౌతికస్థాయిలో ఇంకనూ సరిగ ఉద్బుద్ధముగాని చేతన కొక హెచ్చరిక వోలె గానవచ్చు నీ సంస్కారవిశేషమున కర్థమేమి?

ప్రభూ, ఇది నిన్నడుగుచున్నాను. దీని కారణము నే నెరుగవలసిన యవసరమున్నచో, అది నీవు నా కిదివరకే చెప్పియున్నావనియు, నా యశక్తత మూలముననే అయ్యది నా కెరుకపడలేదనియు నే నెరుంగుదును. లేక, అది నే నెరుంగుట ఉపయోగకరము కాకపోగా, ఇంచుక సహాయకమైనను గాకపోవచ్చును. అట్టియెడ, నేను వేసిన ప్రశ్నకు జవాబు రానేరదు.

కాని, నాలోని శాంతి మాత్రము మరింతగా ఇంకనూ ప్రబలమగుచున్నది. అఖండ సామరస్యస్థితిలో నెలకొని నా యావత్సత్తయు దాని పరమసమృద్ధియం దోలలాడుచున్నది.

* * *

అక్టోబరు 12, 1914

ప్రభూ, వారి బాధ, వారి దుఃఖమే నా భౌతికదేహములో నేను అనుభవించుచుంటిని. అజ్ఞానము లయించిపోవు టెప్పటికి? దుఃఖ మెప్పటికి తొలగిపోవును? విశ్వమునందలి ప్రతి అంశము తన నిజతత్త్వమును తా నెరుగనేర్చునట్లును, తాను లయించిపోవుటకు బదులు రూపాంతరము చెందునట్లును అనుగ్రహింపుము. నిన్ను గానరాకుండ జేయుచున్న అహంకారికాంధకారపు తెరలన్నియు వ్రీలిపోయి, పూర్ణాభివ్యక్తితో తేజోమయుడవై నీవు సాక్షాత్కరింతువు గాక. నీ పరమశాంతిలో సమస్తమూ నిత్యముగ విలసిల్లుచునే యున్నది. కాని, పరిపూర్ణ చేతనలో అద్దాని అభివ్యక్తి మాత్రము అంతులేని క్రమవికాసరూపములో కొనసాగుచుండును.

అక్టోబరు 14, 1914

దివ్యజననీ, నీవు మాతోడనే యున్నావు; అనుదినమును మా కభయదాన మొసగుచునే యున్నావు. అంతకంతకు సమగ్రమై, నిరంతరమై యొప్పారు తాదాత్మ్యభావమున నీతో నత్యంతముగ నైక్యము నందుచు "మేము" క్రొత్త వెలుగును పొందగోరెడి మహనీయాకాంక్షతో జగదీశ్వరుని దిశగా, సర్వాతీతమగు "తత్" పదార్థము దిశగా తిరిగి నిరీక్షించుచున్నాము. సమస్త పృథ్వియు నిపు డొక జబ్బువడిన శిశువురీతి మా యొడిలో నున్నది, దాని దౌర్బల్యస్థితి కారణ ముననే దానియెడ ప్రత్యేకానురాగము మాలో సముద్భూతమై యున్నది. నిత్య సంభూతుల ఆనంత్యమనెడి ఊయెలలో, మేమే ఆ సంభూతులుగా నై యూప బడుచు, సద్దుమణగిన యానందముతో, ఆ అనంత అక్షర పరమనీరవతా స్వరూ పము నుపాసించుచున్నాము. అయ్యది సమస్తమూ అక్షర, పరిపూర్ణ, సచ్చిదా త్మకముగా సాక్షాత్కృతమయ్యెడి స్థానము; సర్వాతీతమగు అజ్ఞాత తత్వములోనికి ప్రవేశ మొసగెడి అప్రాకృత ద్వారదేశము.

అంతట తెర ప్రీలిపోయి, వర్ణింపనలవికాని యా మహావైభవము ప్రత్య క్షము కాగా, అద్దాన నిండారిన హృదయములతో, ఆ శుభవార్త నందింపగోరుచు, జగత్తున కభిముఖముగా వెనుకకు మరలుచున్నాము.

ప్రభూ, అఖండమైన ఆనందమును నీవు నాకు ప్రసాదించినావు.... ఇక ఎట్టి పరిస్థితులును ఈ స్థితిలోనుండి నాకు చ్యుతిని కలిగింపజాలవు.

* * *

అక్టోబరు 16, 1914

నీ దివ్యశక్తులు పుష్కలముగా జగత్తులోనికి ప్రవహిల్లునిమిత్తమై నే నొక పెద్ద కాల్వగా రూపొందవలెనన్నది నీ దివ్యసంకల్పము. ప్రభూ, అట్లే యగునుగాక! ఇపుడు నేను పరమానందముతో తొణికిసలాడు నీ దివ్యసంకల్ప, దివ్య చైతన్య స్వరూపురాలనే కాదా?

ఇపుడు నా యెల్లసత్తయు, నీ విశ్వమంతగా విస్తృతరూపము దాల్చగోరి యమేయముగా విస్తరిల్లుచున్నది.

* * *

అక్టోబరు 17, 1914

దివ్యజననీ, అవరోధము లెల్ల తొలగి, శత్రువు లెల్లరును అణచివేయబడుట నిశ్చయము. ప్రాభవోపేతమగు నీ ప్రేమతో సమస్తజగమును నీ వికపాలించగలవు; మానవజాతి చైతన్యము నీ ప్రశాంతస్వరూపపు దివ్యతేజముతో తొణికిసలాడగలదు.

ఇదే నీవు చేసిన వాగ్దానము.

* * *

అక్టోబరు 23, 1914

ప్రభూ, నా యావత్సత్తయు నిపుడు సర్వసన్నద్ధమై, తాను కేవలమూ నీ సొత్తేకావున, నీసొత్తును నీవు స్వాధీనపరుచుకోవలసినదిగా ని న్నర్థించుచున్నది. యజమాని ఉపయోగించకపోయినచో ఆ యుపకరణమువలన నేమి ప్రయోజనము? నీ యభివ్యక్తివిధాన మెట్టిదైన నగుగాక; ఎట్టిదైననూ మంచిదే; ఆ యభివ్యక్తి

అత్యంత సామాన్యము, అత్యంత గూఢము, అత్యంత జడము, బాహ్యమున కత్యంత పరిచ్ఛిన్నము నైనది కావచ్చును; లేక, అత్యంత తేజోవంతము, అత్యంత శక్తిమంతము, అత్యంత బుద్ధిపాటవసమన్వితము నై విరాజిల్లునదియు గావచ్చును; లేక, ఈ రెండింటికి నడుమ ఇంకెట్టిదిగా నైనను నుండవచ్చును. ఎటులున్నను దానినిగురించిన చింత అనావశ్యకము.

అభివ్యక్త మగుటకై నీవు సంకల్పించు పర్యంతము నా యావత్సత్తయు నిపుడు, తటస్థభావపూరితమగు నిశ్చల నీరవతతో సర్వసన్నద్ధమై నిరీక్షించు చున్నది.

* * *

అక్టోబరు 25. 1914

ప్రభూ, నిన్ను గురించిన నా యాకాంక్ష, చక్కగా వికసించి సామరస్యమున నొప్పారుచు సువాసనల విరజిమ్ము సుందరమైన గులాబీపూవురూపము ధరించినది. రెండుచేతులతోనూ దానిని నీ కర్పణముచేయురీతిలో కృతాంజలి వగుచు నిన్నిట్లు ప్రార్థించితిని: 'నా జ్ఞానము పరిమితమై యున్నచో దానిని విస్తరింపజేయుము; నాహృదయమున భక్తితీవ్రత లేనిచో దానిని రగులుగొల్పుము; నా ప్రేమ అల్పాల్పమైయున్నచో దానికి గాఢత్వము నలవరించుము; నా భావములు అజ్ఞానకలితములు, అహంకారపూరితములు నై యున్నచో, వానికి నిండైన సత్య జ్ఞానదృష్టిని ప్రసాదింపుము.' ప్రభూ, ఈ రీతిగా నిన్ను కోరుచున్న ఈ 'నేను' ఇతరములగు 'నేను' లలో ఒకటిగా కలసిపోయిన అల్పవ్యక్తి కాదు, సమస్త పృథ్వియు భక్తిభావప్రపూర్ణముగ నిట్లు నీకొరకై యాకాంక్షించుచున్నది.

సంపూర్ణమైన నిశ్చల నీరవతతో నొప్పారు నా ధ్యానస్థితి యిప్పుడు అనంత రూపమున విస్తరిల్లుచున్నది. ఆ నీరవతలోని పూర్ణప్రశాంతియందు దేదీప్యమానమైన నీ దివ్యతేజోవైభవముతో నీవు సాక్షాత్కరించుచున్నావు.

నవంబరు 3, 1914

పరమేశ్వరా, నా కలము చాలకాలముగా మూగవోయియుండినది..... అయి నను మరువరాని దివ్యజ్ఞానదీప్తులతో నొప్పారిన ఘడియలను నీవు నాకు అనుగ్రహించియున్నావు. ఆ ఘడియలందు, అత్యంత దివ్యచేతనకు, అత్యంత భౌతిక చేతనకు పరిపూర్ణైక్యము ఘటిల్లినది: వ్యష్టి జీవచైతన్యమునకు విశ్వజననితోడను, విశ్వజననికి నీ తోడను సంపూర్ణతాదాత్మ్యము విలసిల్లినది. ఆ స్థితిలో వ్యష్టిచైతన్యము ఏకకాలముననే తన ఉనికిని, సమస్త విశ్వజీవనమును, దాని కవ్వల ఏ మార్పులును లేని నీయానంత్యమును గుర్తించుకోగలిగినది. వర్ణింప నలవికాని అఖండశాంతిలో ఆనందము మహోన్నతస్థాయికి చేరుకొన్నది. చైతన్యము తేజోవిలసితమై, అమేయమై, సంకీర్ణమయ్యునూ ఏకమై యొప్పారినది; యావత్సత్తయు నఖండశక్తియుక్తమై మృత్యుంజయత్వమున విలసిల్లినది. ఇది దీర్ఘకాలపు ఏకాగ్రతాఫలితముగ చేకూరి వెనువెంటనే అంతర్ధానమగు తాత్కాలికానుభవస్థితి గాదు; ఏకకాలముననే హఠాత్సంభూతము, నిరవధికమునగుచు, అనంత కాలమును తమలో నిండించుకొన్న సుదీర్ఘఘడియల పర్యంతము నిలువదాకినస్థితి. దీనిని కోరినప్పుడెల్ల పొందుటకు వీలున్నది. అనగా, ఇది యొక సుస్థిరమైన స్థితియే. పరిస్థితు లనుకూలించినపుడెల్ల ఒక నిశ్చితమైన మానసికవ్యాపారమున గాని, శారీరికవ్యాపారమునగాని నిమగ్నమైయుండనపుడెల్ల, అత్యంత భౌతికచైతన్యమునకు సైతము నీతోడి సంస్పర్శ కలుగుచుండును. సమస్త వ్యాపారము నందును, నిరంతరముగా, సదసదాత్మకమైన నీ ద్వంద్వస్వరూపమున నీ అవ్యయ సన్నిధియే దృగ్గోచర మగుచుండును, కాని, ఆ గోచరించుట, జరిగెడి వ్యాపారముపై తప్పనిసరిగా కుదురుకొను నేకాగ్రతచేత అల్లబడిన ఒకానొక పలుచని తెర మాటుననుండి గోచరించినట్లుగ నుండును. ఏకాంతపు ఘడియలలో మాత్రము, జీవసత్తను శక్తిమంతము, సుస్వచ్ఛము, సుస్థిరము, దివ్యము నగు నొకానొక వాతావరణ మవ్యవహితముగా నావరించియున్నట్లు అనుభవము కలుగును. అంతట మరల నొకానొక యద్భుతజీవనము స్వకీయమైన పరమ, సంకీర్ణ, సర్వసమృద్ధితో ప్రారంభమగును. భౌతికశరీరము ఒకానొక మహాత్వమును సంతరించుకొని; పేశలము, దృఢము, శక్తిమంతము నై యొప్పారును. మనస్సు సుస్థిర సుప్రసన్న స్థితిలో ఎంతేనియు చురుకుగ బనిసేయుచు, నీ దివ్యసంకల్పశక్తులను ప్రసా

రము చేసి మార్గనిర్దేశము గావించుచుండును. యావత్సృష్టియు ఒకానొక అంతు లేని యానందముతో, అఖండప్రేమతో, అప్రతిహతశక్తితో, సంపూర్ణజ్ఞానముతో, అనంతచైతన్య విలసనముతో నొప్పారును.....అప్పుడు శరీరమునందు ప్రతి అణువులోకూడ సచేతనముగా విలసిల్లునది నీవే, కేవలము నీవే.

ఈ విధముగా, పుడమిపై నీ కార్యమునకు వలయు గట్టిపునాదులు వేయబడి యున్నవి. నిర్మాణము కావలసిన బృహత్సౌధమునకు మూలమట్టములు నిర్మింప బడుచున్నవి. ప్రపంచపు మూలమూలలలో, సచేతనము, నిర్మాణాత్మకము నగు భావనాశక్తిచే నీ దివ్యశంకుస్థాపనకార్యము కొనసాగుచున్నది. ఈ రీతిగా సన్న ద్ధము చేయబడిన పృథ్వీతలము, నీ నూతన, సమగ్రతరాభివ్యక్తిరూపమగు దివ్య మందిరముతో శోభిల్లుచు మురియుటకు నికమీద సర్వసన్నద్ధమై యుండగల దను టలో సందియము లేదు.

* * *

నవంబరు 8, 1914

ప్రభూ, నీ దివ్యతేజఃప్రసారపు సర్వసమృద్ధికోసమై నిన్ను మేమర్థించు చున్నాము. నిన్ను అభివ్యక్తముచేయగల శక్తిని మాకు ప్రసాదింపుము.

ఎడారిలోని దోరీయందువలె నా సత్తయందిపు డంతయు మూగవోయియు న్నది. కాని, యా నిలినీడకు లోలోపల, ఈ నిశ్చలనీరవతాగర్భములో, ఎన్న టికినీ ఆరని దీప మొకటి వెలుగుచున్నది. నిన్ను తెలిసికొని, నీయందే సంపూర్ణ ముగ నివసించవలెననెడి తీవ్రాకాంక్షారూపమైన దివ్యాగ్నిశిఖ యది.

పగళ్ళ తరువాత రాత్రులు వచ్చుచుండును; గతకాలపు ఉషస్సుల పిమ్మట నవీనోషస్సులు విసువుచెందక వచ్చుచుండుటయు జరుగుచునేయుండును. అయి నను, పరిమళభరితమై నిరంతర మంతకంత కధికాధికముగా నతిశయిల్లుచుండు నా దీపజ్వాలను మాత్రము ఎట్టి తుపానుగాలియు చలింపజేయనేరదు. నానాటికధికముగా

అది పైకి సాగుచు తుదకు, ఇప్పటికినీ మూతపడియే యున్న పైకప్పును చేరుకొనును. మన ఐక్యము నడ్డగించు తుట్టతుది యవరోధమదియే. పైకెగయుచున్న ఈ దీపజ్వాల ఎంతేనియు తిన్నగా, విశుద్ధముగా, సగర్వముగా కొనసాగుచున్న హేతువుచే, కడ కా తుదియవరోధముకూడ హఠాత్తుగ తొలగిపోవుట నిశ్చయము,

అపుడు నీవు, నీ సమస్త దివ్యవైభవముతో, కనులు మిరుమిట్లుగొలుపు నీ యఖండ మహత్వశక్తిస్ఫూర్తితో సాక్షాత్కరింతువు; నీ సంగతి నొందిన హేతువుచే నా దీపజ్వాల యొక మహనీయ జ్యోతిస్తంభముగా మారి, నీడలనునవే యిక యెన్నటికిని లేకుండ పారద్రోలును.

అంతట, పరమావిష్కారరూపమై నీ దివ్య వాణి ఆకస్మికముగా ముందుకు లంఘించి అంతఃశ్రవణగోచరమగును.

* * *

నవంబరు 9, 1914

ఓ ప్రభూ, పరిపూర్ణ చైతన్యోపలబ్ధిని మే మాకాంక్షించుచున్నాము. నా యావత్సత్తయు నిపుడు, నానావిధములయ్యును పరమసామరస్యముతో చక్కగా జేర్చి కూర్చబడిన పూలమాలికవలె నున్నది. పూవులను సేకరించిన చేయీ, వాటిని మాలగా గుచ్చిన దారమూ సంకల్పమే. ఇపుడా మాలను సురభిళోపాయనముగ నీ కర్పణము సేయుటకై పైకెత్తుచున్నదియు సంకల్పమే. అలసట, తడబాటు లేకుండ ఈ మాల యిట్లు నీ కొరకై ఎత్తబడియున్నది.

* * *

నవంబరు 10, 1914

ఓ ప్రభూ, నీ దివ్యసాన్నిధ్య మిపుడు నాలో అచలశిలవోలె నున్నది. సర్వసమగ్రమగు సమర్పణభావమున, రవంతయేనియు మినహాయింపులేక నీకే చెందియుండిన కారణముచే, నా యావత్సత్తయు పరవశించి పోవుచున్నది.

ఓ నిశ్చల, పరమప్రశాంత, దివ్యచైతన్యస్వరూపమా, ప్రపంచపు పొలిమేరలలో నీవు, అనంతకాలపు స్త్రీముఖ సింహశరీర యక్షిణి (sphinx) రీతి కావలి కాయుచున్నావు. అయినను, కొందరకు మాత్రము నీవు నీ నిగూఢరహస్యమును వెల్లడిచేయుచుందువు.

నిష్పక్షపాతముగ ఎన్నిక సేయుచు, నిష్కామముగ కార్యనిర్వహణ మొనర్చు నీ యప్రతిహత దివ్యసంకల్పరూపులై యట్టివారు భాసిల్లుచుందురు.

* * *

నవంబరు 15, 1914

చేరవలసిన గమ్య మొక్కటే గణుతింపదగిన ముఖ్యవిషయము. దానికి మార్గ మేదైనను అంత లెక్కచేయవలసిన పనిలేదు. మార్గస్వరూపము ముందుగా తెలిసికొనకుండుటే తరచుగా అపేక్షణీయ మగుచుండునుగూడ. కాని, తెలియవలసిన దొకటి కలదు: పృథ్విపై దివ్యకర్మకు సమయము నిజముగా వచ్చినదా, అంతరాంతరమున భావితమైన ఆ కార్యము నెరవేరుట కవకాశమున్నదా, అనునది మేము తెలియవలసియున్నది.

ఈ విషయమున నో ప్రభూ, నీవు మాలో నిండువిశ్వాసమును పూరించియున్నావు. దీనికి, విశ్వచైతన్యరూపిణియగు పరాప్రకృతి యొసగిన పరమ శక్తిమంతమగు వాగ్దానము తోడై నిలచియున్నది.....కావున, ఏది జరగవలసియున్నదో అది జరుగగలదనెడి నిశ్చయభావమును మేము పొందియున్నాము. నూతన

నాభివ్యక్తిరూపమగు నీ ఘనవిజయమునందు పాల్గొనుటకై యిప్పటి మా వ్యష్టి సత్తకు పిలుపు వచ్చినదను నిశ్చయము సైతము మాకు కలిగియున్నది. ఇంత కంటె ఇక మేము తెలియవలసిన దేమున్నది? ఏమియును లేదు. మున్ముందు మేము కొనసాగించవలసియున్న భయంకరమైన పోరాటమును, ఎదుర్కొనవలసి యున్న ప్రతికూలశక్తులను నిండైన ఆత్మవిశ్వాసముతో ఇక మేము పర్యాలోకనము చేయగలము. ఈ ప్రతికూలశక్తులు, తమకు తెలియకుండగనే, ఈ కార్య ప్రణాలిక నెరవేరుటకు పర్యవసానములో తోడ్పడుచుండును. నీ కార్యప్రణాలికకు తోడ్పడుచెట్లో, ఏ యుపాయమున సకల ప్రతిఘటనలను నీవు జయింతువో ముందుగా మాకు తెలియజేయబడనంతమాత్రమున మే మాందోళనము చెందుట బొత్తుగా తగనిపనియే యగును. ఏలయన, ప్రతి అవరోధము, ప్రతి అసద్వృత్తి నిన్ను వ్యతిరేకించు ప్రతిద్వేషభావముకూడ, నీ విజయము మరింత విస్తృతము, సమగ్రము నై విలసిల్లుటకు సునిశ్చితముగ తోడ్పడునవే యగును. అంతటి విశుద్ధము, పరిపూర్ణము నైనది నీ విజయస్వరూపము.

ప్రతిఘటనయొక్క పరిమాణమునుబట్టి, భువిపై అభివ్యక్తము కానున్న నీ విశుద్ధశక్తుల చర్యకు ఎంతటి అవకాశమును నీవు కల్పింతువో అంచనా కట్టవచ్చును. ఏది ప్రతిఘటించునో దానిపై సరిగ బనిసేయునిమిత్తమే ఆ శక్తులు ప్రవర్తిల్లుచుండును. అత్యంత తమోభూయిష్ఠమగు ద్వేషమునే అయ్యవి స్పర్శించి, తేజోమయ శాంతిస్వరూపములోనికి రూపాంతరము చెందింపవలసి యున్నది.

నీ కార్యమునకు కేంద్రస్థానముగా, నీకు సాధనభూతముగా నీవు ఎంచుకొనిన మానవవ్యక్తి అవరోధములను, అపోహలను, ద్వేషప్రవృత్తిని ఏమంతగా ఎదుర్కొనుట సంభవింపదేని, ఆతనికి నీవు అప్పగించినకార్యము కడు పరిమితమైనదని, ఏమంత ఘనిష్ఠమైనది కాదని తలపవలసియుండును. పూర్వమే సంసిద్ధము చేయబడియుండిన పరిమితమగు సద్భావనా పరిధిలో మాత్రమే ఆతడు పనిసేయును. పుడమిపై మిక్కిలి గందరగోళపుస్థితిలోనున్న పదార్థరాశిపై ఆతను పనిచేయుట సంభవింపదు.

ఓ దివ్యప్రభూ, నీవు నా కనుగ్రహించిన యీ జ్ఞానమున మేమెల్లరమును పాలుపంచుకోగలుగునట్లు కృపసేయుము. దృఢవిశ్వాసపూర్వకమగు శాంతి మా యెల్లరి హృదయములందును తొణికిసలాడవలెను. అమోఘమగు నీ యండ దండలు మాకు కలవనెడి నిశ్చయభావమున స్థిరముగా నెలకొని మేము, శిరము లను ఉన్నతముగా పైకెత్తి, ఆవిష్కృతము కానున్న రూపాంతరీకరణము దెనకు అజ్ఞాతముగనే ఆకర్షితమగుచు, అంధతమోమయ అజ్ఞానరూపమును గైకొని, రూపాంతరీకరణసాధకమగు దివ్యప్రేమను తాను విచ్ఛిన్నము చేయగలననెడి భావ ముతోనున్న సకలావరోధమును ఎదుర్కొన గలుగుదుముగాక.

* * *

నవంబరు 16, 1914

ప్రభూ, దీర్ఘప్రయాణమునకు వలయు సరకులన్నింటితో నింపబడు పర్యం తమూ నావను తీరమునకు త్రోపివేయు సముద్రముమీది గాలివలె నీవున్నావు. జాగరూకత లేకుండ మేము ప్రయాణమునకు సిద్ధమగుట నీ కిష్టములేదు. నీ యనుచరులు ఎట్టి పరిస్థితినైనను ఎదుర్కొనుటకు సంసిద్ధులైయుండవలెను; ఎప్పుడు ఏపిలుపు వచ్చినను వెంటనే అందుకొని, ఏ అవసరమును తీర్చుటకై నను సమర్థులై యుండవలెను.

* * *

నవంబరు 17, 1914

ఓ దివ్యజననీ, నీ వెంతటి సహనముగలదానివో నమ్మా! స్వకీయమైన భ్రమాత్మకబుద్ధిచే పెడదారి పట్టిన జీవుని తప్పిదములను పరిదిద్ది, త్వరితగతి నతనిని పురోగమింపజేయగోరుచు, సరియైన మార్గముచూపి తొట్రుపాట్లు లేకుండ నడచు టకు వలయు శక్తినిచ్చుటకై నీ దివ్యసంకల్ప మభివ్యక్తము కాజూచినపుడెల్ల, సమ్యజ్ఞానము కొరవడి దేనినీ మెచ్చకయుండు సచివునిగా నిన్నతడు సదా త్రోపి

పుచ్చుచుండును. అస్పష్టము, అస్థిరము నైన ప్రేమతో. సిద్ధాంతరీత్యా నిన్ను ప్రేమించుట యాతని కిష్టమే; కాని, గర్విత మైన యాతని మానసము నిన్ను విశ్వసించుటకు నిరాకరించి, నీ సారధ్యమున పురోగమించుటకు మారుగా, ఒంటి పాటున స్వతంత్రముగా తిరుగాడ నభిలషించుచుండును.

అంతట నీవు, విసువులేని దయతో ఎప్పటివలెనే చిరునవ్వు నవ్వుచు, ఇట్లు సమాధానమిత్తువు: "మానవుని గర్వితునిగా నొనర్చి పెడదారిని బట్టించుచుండెడి యీ మేధాశక్తి విశుద్ధము, దీప్తము నగు నెడల, విశ్వప్రకృతికంటె మిన్నగా ఆతనిని మరింత ఉన్నతస్థాయికి, సమస్తసృష్టికినీ అతీతుడై వెలయుచు, మన కెల్లరకును ప్రభువై విరాజిల్లువానితో సాక్షాత్తుగా అనుసంధానము పెంపొందించుకో గల స్థాయికి,—తోడ్కొనిపోవ సమర్థమగును. అతనిని నానుండి విడదీయుట కుపచరించుచున్న యీ భేదభావయుక్తమైన మేధాశక్తియే, అధిరోహించవలసిన శిఖరస్థానములను జేరుట కాతనికి దోడ్పడుచు, అట్టి యధిరోహణమును త్వరిత గతిని విశ్వప్రకృతి సమష్టిగా తన పృథులమైన సంకీర్ణస్వరూపముతో సాధింపజాలక పోవుటమూలముగా నతని పురోగతి యెంతమాత్రమూ నిరుద్ధము కాకుండునట్లు చేయనేర్చును."

దివ్యజననీ, నీ దివ్యవాక్కులు సదా సుఖసంతోషములను, సమాశ్వాసమును, జ్ఞానదీప్తిని గలిగించునవియై యున్నవి. ఉదారమైన నీ దివ్యహస్తము అఖండజ్ఞానమును మరుగుపరచుచున్న తెరయందలి యొక మడత నొత్తిగిలజేయుచున్నది.

నిర్దుష్టమగు నీ ధ్యానస్వరూపవైభవ మెంతప్రశాంతము, ఎంత ఉదాత్తము, ఎంత విశుద్ధము!

* * *

నవంబరు 20, 1914

ప్రభూ, నీ ముందు నేను, వట్టి ఖాళీగా నున్న తెల్లకాగితపు పుటవలె నుండగోరుచున్నాను; అట్లుండుటచే, ఎట్టి కష్టముగాని, మిశ్రమముగాని లేకయే నీ యిచ్ఛ నాలో చక్కగా నుల్లిఖిత మగుటకు వీలగును.

మనోభావననుండి పూర్వానుభూతుల జ్ఞాపకము సైతము ఒక్కొక్కతరి పూర్తిగా తుడిచిపెట్టవలసిన అవసరము కలుగుచుండును. ఏలన, నిత్యనూతన పునర్నిర్మాణ రూపమగు నీ మహాకార్యమునకు జ్ఞాపక మొక యవరోధము కారాదు. ఈ సాపేక్షిక ప్రపంచమందు, ఇట్టి పునర్నిర్మాణము వలననే నీ పరిపూర్ణాభివ్యక్తికి సదవకాశ మేర్పడును.

విలువైన యొక అనుభూతిఫలితమును కోల్పోదుమేమో యను భయముతో, విస్తృతము, ఉన్నతము నగు చైతన్యస్థాయిని వదలుకొని తిరిగి క్రిందిస్థితిలోనికి దిగజారిపోదుమేమో నన్న వెరపున, తరచుగా మేము గతమును పట్టుకొని ప్రేలాడుట సంభవించుచుండును.

కాని, నీవాడై మననేర్చినవాడు భయపడదగిన దేమున్నది? నీ వతనికి మార్గము చూపుచుండగా, ఆ మార్గ మెట్టిదైనను, అది తన పరిమితబుద్ధికి బొత్తుగా అర్థముకానిదైనను గూడ, విస్తరిల్లెడి యాత్మచైతన్యముతో, దీప్తమంతమైన బుద్ధిపటిమతో, అతడేల ముందునకు సాగిపోలేకుండును?

ప్రభూ, నీ కార్యము నానాటికి మరింత చక్కగా నెరవేరుచు, పృథ్విపై నీ సేవ నిర్దుష్టముగ సాగిపోవుటకు అవసరమని నీవు భావించునెడల, మా బుద్ధియందలి ఈ పాతచట్రములనెల్ల విచ్ఛిన్నముచేయుము; గతానుభవముల నెల్ల నిర్మూలించుము; మే మేర్పరచుకొనియుండిన సమన్వయములను సైతము లయింపజేయుము.

* * *

నవంబరు 21, 1914

ప్రభూ, నీ దివ్యశాంతి, దివ్యానందము ప్రపంచమున రాజ్యమేలుటకుగాను నీ దివ్యశక్తిని నా కనుగ్రహించియున్నావు.

'నే' ననియెడి ఈ జీవసత్త యిపుడు పృథ్వినంతనూ ఆవరించుకొన్న శాంతిసమాశ్లేషరూపముగా, అంతటనూ నిండి పొంగిపొరలుచున్న ఆనందసాగరమై విలసిల్లుచున్నది.

ద్వేషభావ పూరితమైన ఓ పృథ్వీ, సైకతస్థలములపైని ముద్రల నన్నింటినీ సముద్రపుజలములు తుడిచివేయు రీతి, నీ హృదయములోనుండి ద్వేషమనునది ఇకమీద పూర్తిగా తుడిచిపెట్టబడును.

పగతోనే ఇంతవరకును జీవించుచున్న ఓ జీవులారా, తల్లిచేత ఊయెలలో ఊచబడు శిశువు ఆత్మయందు శాంతి ప్రవేశించురీతిగా, మీ హృదయములోనికి సైతమూ శాంతిప్రవేశము జరుగగలదు.

ఏలన, విశ్వజనని తన దృష్టి నిపుడు పుడమిమీదికి మరల్చి యద్దానికి దీవెన లందించుచున్నది.

* * *

డిసెంబరు 4, 1914

బాహ్యకార్యక్రమమందు పూర్తిగా నిమగ్నమై మౌనముగ గడచిన దీర్ఘవాసరముల యనంతరము, ఓ ప్రభూ, తిరిగి నాకెంతయో ప్రీతికరమైన నీతోడి యీ సంభాషణను కొనసాగింపుచు ఈపుటలను మరల వ్రాయు నవకాశము నాకీయబడినది.

కాని, నా యలవాటుల నన్నింటినీ నీవు ఛేదించివైచినావు; కారణము సమస్తమానసిక ప్రవృత్తివిశేషములనుండియు విముక్తి గాంచుటకు నన్ను నీవు సిద్ధముచేయదలచుటయే. కొన్ని మానసిక ప్రవృత్తి విశేషములు,— ముఖ్యముగా ప్రబలములు, స్వభావానుగుణములు నగు ప్రవృత్తివిశేషములు,—ప్రాభవోపేతమైన అనుభూతులకు మార్గము చూపునవిగా నుండును. కాని, ఆ యనుభూతులు కలిగినమీదట, అవి యిక ఏ మానసిక ప్రవృత్తివిశేషమునకును,—అది యెంత ఉన్నతము, లేక విశుద్ధము నైన నగుగాక,— బానిసలు గాక సర్వస్వతంత్రములు గావలెనన్నదే నీ యిచ్ఛ. అట్లవి స్వతంత్రము లైనప్పుడు; అత్యంత సత్యస్వరూపమున, ఆ యనుభూతి కత్యంతమూ అనుగుణమైన స్వరూపమున, వినూత్నరీతిలో వాని యభివ్యక్తి సాధ్యమగును.

అటుపిమ్మట నీవు. నా మానసిక ప్రవృత్తి విశేషముల నన్నింటినీ విచ్ఛిన్న మొనర్చివైచితివి. అంతట నేను, ఏ మానసిక కల్పనయు లేక, ఈ విషయములో అప్పుడే పుట్టిన శిశువురీతి అజ్ఞస్థితిలో నుండిపోతిని. శూన్యప్రాయమైన యీ చీకటియందు, వాక్కులలో వ్యక్తము కానిదయ్యును వస్తుత్వము కలదియే యైన ఒకానొక పరతత్త్వపు అఖండశాంతి ద్యోతక మయ్యెను. ఈ స్థితిలో, నిండువిశ్వాసముతో నీకు విధేయముగ మలచబడియున్న యీ యుపకరణమునందు ఏ బుద్ధిప్రవృత్తివిశేషము నీ యభివ్యక్తికి అత్యంత మనుగుణమని నీవు తలంతువో అద్దానిని అగాధతలముల లోలోతులనుండి మరల నీవు రూపొందించుపర్యంతమూ సహనము వీడక, భయము చెందక, నిరీక్షణము సల్పెదను.

వెలుగువచ్చి చీకటి తొలగిపోగలదనెడి నమ్మకము కలిగించుచున్న యీ బృహద్రాత్రిమ్రోల, పూర్వమెన్నడూ పొందియుండనంతగా అఖండమైన స్వతంత్రమైన భావానుభూతినీ, విస్తృతినీ పొందుచున్నాను.

మరియు, ఈ పరమానందస్థితిలో, ఓ ప్రభూ, నాయెడ నీవు చూపిన మహానుగ్రహవిశేషమునకు నీకు నేను కృతజ్ఞాంజలి సమర్పించుచున్నాను. అప్పుడే పుట్టిన శిశువువోలె నీమ్రోల నే నుండగలుగునట్లు చేయుటే యీ మహానుగ్రహము.

* * *

డిసెంబరు 10, 1914

ఆలకింపుము ప్రభూ, .... ప్రగాఢమైన అంతర్ముఖత్వపు నిశ్చల నీరవతలో భక్తిపురస్సరముగా నా ప్రార్థన నీ దెస కుద్గమించుచున్నది.

ఒక మానసిక ప్రవృత్తివిశేషముతో, ఒక మానసిక కల్పనతో,— అది యెంత విశాలము, శక్తిమంతము నైన నగుగాక,— అయ్యది తన సత్తకు, తన అనుభూతికి, కర్మాచరణకు ప్రాణప్రదమైన ముఖ్యకేంద్రమగునంతగా తాదాత్మ్యము చెందుట ఎవరికైనను గొప్పపొరపాటే యగును కాదా? సత్యమనునది నిశ్చయముగా, మనము భావించుదానికంటెను, వక్కాణించుదానికంటెను సదా వేరై విలసిల్లునట్టిది. ఈ సత్యమున కత్యంత మనుగుణము, అనువర్తనీయము నగు భావాభివ్యక్తివిశేషమును కనుగొన యత్నించుట నిశ్చయముగా ఉపయోగకరమే. వైయక్తిక సమగ్రవికాసమునకు, సమష్టి మానవజాతి వికాసమునకు గూడ అయ్యది అనివార్యమే యగునుగూడ. కాని, ఈ భావాభివ్యక్తివిశేషమున కెవరును బద్ధులైపోరాదు. బద్ధులుకాక స్వతంత్రులై, తమ చైతన్యకేంద్ర మద్దానికి అతీతముగా సత్యనిష్ఠితమై విలసిల్లున ట్లొనర్చుకోవలెను. కారణమేమన, ఒక మానసిక సూత్రకల్పన మెంత గొప్పదైనను, ఎంత సుందరము, నిర్దుష్టము నైనను, సత్యమనునది ఈ సూత్రకల్పనలకు సదా అందరానిదిగనే యుండును. ఈ ప్రపంచస్వరూపము మనము భావించెడి తీరున లేదు. దానిని గురించి మనకు కలుగుభావనకు ఒక విలువ యున్నమాట నిజమే. ఆ విలువ కర్మాచరణము విషయమున మన వైఖరి నది ప్రభావితముచేయుటకు సంబంధించినది. ఈ వైఖరి, ఎంతటి ప్రబలములైనను మానసిక భావకల్పనలచే కలుగు అంతఃప్రేరణకంటె ప్రగాఢము, వాస్తవికము, సుస్థిరమునైన అంతఃప్రేరణచే ప్రభావితమగుటకు సైతము వీలున్నది; పరమసత్యమును ఇంతకు పూర్వము వెల్లడించబడిన రూపములలోకంటె పూర్ణతరము, ఉచ్చతరము, నిష్కృష్టతరము నైన రూపములో లోకమునకు అనుపదించ వలెనన్న సంకల్పప్రేరణమును పొందుట మంచిదే. కాని, ఒక షరతుమాత్రమున్నది; దానికి బానిసలమైపోయి, ఆత్మసంయమును, స్వాతంత్ర్యమును కోల్పోవునంతగా ఈ కార్యముతో మన 'నేను' తాదాత్మ్యము చెందిపోరాదు. పార్థివ జీవనదృష్ట్యా దాని ప్రాముఖ్య మెట్టిదైనను, అది యొక

ప్రవృత్తివిశేషము మాత్రమే. అంతకు మించిన ప్రాముఖ్యము దానికి లేదు. ఇతర ప్రవృత్తు లన్నింటివలెనే అయ్యది సాపేక్షికమనియు, ఎట్టి వైరూప్యమును పొందకయే దివ్యశక్తులు మాద్వారా అభివ్యక్తమగుట కవకాశము కల్పించు ప్రగాఢశాంతిని, స్థిరతను మాలో కలగుండుపరచు నవకాశ మద్దానికి ఇవ్వరాదనియు మేము విస్మరింపరాదు.

ఓ ప్రభూ. నా ప్రార్థనకు రూపకల్పన జరుగలేదు; అయినను నీవు దాని నాలకించితివి.

* * *

డిసెంబరు 12, 1914

ప్రతిక్షణమునను మేము సకలమును పొందుటకై సకలమును వదలుకొను టెట్లో నేర్చుకొనవలసి యున్నది; గతమును మృతదేహమురీతి విసర్జించి ఘనతర పూర్ణత్వములోనికి పునర్జన్మము గాంచవలసియున్నది. ....నా అంతస్సత్తలోనుండి అభివ్యక్త మగుచున్న నిరంతరాకాంక్ష యిదియే. నీ కభిముఖముగ కొనసాగు నా ఆకాంక్ష, నిరంతర మంతకంతకు నిర్మలతరమై ప్రకాశించు దర్పణము రీతి నిన్నే ప్రతిబింబించుచున్నది. దానియందు, సాటిలేని తీవ్రతగల పురోగమనపు శక్తి ప్రేరణతో నీ అవ్యయానందము ప్రకటితమగుచున్నది; అత్యంత బాహ్యసత్తయం దీ శక్తి సుస్థిర, సునిశ్చిత సంకల్పముగ రూపాంతరము చెందగా, అద్దాని కిక ఏ యాటంకమూ అవరోధము కానేరదు.

ఓ నా పరదైవతమా, అగాధమైన ప్రేమనిండిన హృదయముతో, నేను నీ సేవకురాలనై యున్నాను; నిర్మలమైన అఖండ, అవ్యయానందముతో, వ్యక్తజగత్తున కవ్వలిదైన సమస్తములోనూ నేను నీవే యగుచు నీతో ఏకమై యున్నాను.

ప్రభూ, ఈ ఉభయ చైతన్యానుభూతులును అసదృశ పూర్ణత్వమున ఒక్కటై పోయినవికూడ.

డిసెంబరు 15, 1914

ప్రభూ, బలసంపత్తినడుమ శాంతిని, కర్మాచరణమునందు ప్రసన్నతను, సర్వకాల సర్వావస్థలయందును అవ్యయానందమును నీవు నా కనుగ్రహించి యున్నావు.

* * *

డిసెంబరు 22, 1914

ఓ ప్రభూ, పరమసత్యముకొరకై నిన్ను నే నర్థించుచున్నాను.

నీకు ఆత్మసమర్పణ మొనర్చుకొనుటకై తనను మూగయోగ యీ మనస్సును తిరిగి ప్రవృత్తియందు ప్రవేశపెట్టుము; నీ దివ్యసంకల్ప దానికి ప్రసాదింపుము.

తొలుత నది గ్రహణశీలము కలదై, నానావిధ సంభావ్యతలను తనయ రూపుగైకొనుట కవకాశమిచ్చెను; కాని, అటుపిమ్మట నది అవ్వాని పరస్పరవిరుద్ధ ప్రవృత్తుల సంఘర్షణను తుదముట్టించు నిమిత్తమై, తొందరపెట్టు స్వభావముగల ఈ యాగంతుకులకు ప్రవేశమునీయ నిరాకరించెను. "ప్రభూ, నీ యిచ్ఛనెరుంగు టకు కర్మక్షేత్రమందు నేను నివసింపవలసిన పనిలేదు; నిత్యమైన నీ దివ్యతేజః కిరణమును వికృతిని బొందింపకుండ నాలో, నా ద్వారా, ప్రసరింపజేసికొగలిగిన చాలును"—అని యది నీకు విన్నవించుకొనెను. అంతట, అది యట్లే జరిగెను; నా సంకల్పము విధేయత నలవరించుకొని, ఋజువై, నిష్కృష్టమై, సుదృఢమై తేజరిల్లెను. కాని, యిపుడు నా మనస్సు జ్ఞానము పొందవలెనన్నది నీ య యైనది. "ఓ మానసమా, నీ విక మేల్కాని. సత్యజ్ఞానము కలదానవగ హెచ్చరించితివి. అందులకది, మహదానందముతో సమ్మతించి,

స్వరూపుడగు సత్యసూర్యున కభిముఖమగుచు, ఆ సత్యాభివ్యక్తికొరకై అర్థానిని తనలోని కాహ్వానించుకొనుచున్నది.

అభివ్యక్తియొక్క సకల సంభావ్యతలయు సమగ్ర పౌష్కల్యమును మానవ సత్త అలవరించుకో గలందులకై, ఒకదాని వెంట నొకటిగా సకలావరోధములను కూలద్రోయుట నీ దివ్యసంకల్పమైయున్నది.

ప్రభూ, పృథ్వీసంబంధమైన సకల వాంఛలును ఇపుడు నాయందు కూడు కొనునుగాక. వానిని నీవే యవధరించి, మొత్తముమీదనేగాక, ప్రతి చిన్నవిషయమున సైతము నీ దివ్యేచ్ఛయే సకలమును స్పష్టముగా, నిష్కృష్టముగా, సునిశ్చితముగా తీర్చిదిద్దున ట్లనుగ్రహింపుము.

ఈవిధముగా, అపేక్షితమైన ఆవిష్కారసమయము త్వరితపరచబడును.

ఇదంతయు తలపోసి, నా యావత్సత్తయు, అమందానందముతో, అసదృశమైన నిండుదనముతో, ఎంతేనియు పరవశించిపోవుచున్నది.

* * *

జనవరి 2, 1915

ఏ భావమైనను,—అది యెంత శక్తిమంతము, గంభీరము నైన నగుగాక,—అతిగా మరల మరల ఉచ్చరింపబడుచు, అతిగా ఎడతెగక వ్యక్తముచేయబడుచుండునెడల, విసువు జనింపజేసి, సారము లేనిదిగను, విలువ లేనిదిగను తయారగును.....అత్యున్నతభావనలు సైతము కొంతకాలమైనపిమ్మట వాని నవ్యతను కోల్పోవుచుండును. అతీత భావకల్పనలతో ఆనందించుచుండిన బుద్ధి, హఠాత్తుగా తన హేతువాదమును, తత్వమీమాంసను వదలుకోవలసిన పరిస్థితి అత్యంత ప్రబలమై ఏర్పడగా, శిశువురీతి నాశ్చర్యదృష్టితో ప్రపంచజీవనమును కనుగొన నభిలషించును; ఆ జీవనసంబంధమైన పూర్వవిజ్ఞానమును,— అది యెంతటి దివ్య విజ్ఞానమైనను,— తెలిసికొనుట కుత్సహింపదు,

కాలవిభాగములు కేవలము యథేచ్ఛాకల్పితము లనుమాట నిజమే; నూతన సంవత్సరారంభమనునది కేవలము లోకాచారబద్ధముగ, అక్షాంశలనుబట్టియు, శీతోష్ణస్థితిగతులనుబట్టియు, అలవాటులనుబట్టియు మారుచుండును. ఈ విధమైన బుద్ధిభావన, మానవుని శిశుప్రవృత్తిని జూచి నవ్వుకొనుచు, ఇంతకంటె గంభీరమైన సత్యముల కనుగుణముగా తాను, నడచుకొనవలెనని యభిలషించును. కాని, అటుపిమ్మట హఠాత్తుగా, ఈ సత్యములను నిష్కృష్టముగా గ్రహించి అనువదించగల శక్తి తనకు లేదని ఈ బుద్ధికే తెలిసివచ్చి, తనకు తెలిసిన విజ్ఞానము నంతనూ త్రోసిపుచ్చుచు, ఉత్కాంక్షాపూరితమగు హృదయములోనుండి, — గాఢతరము, విశాలతరము నైన ఉత్కాంక్షకు ప్రతి పరిస్థితినీ సదవకాశముగనే గ్రహించు హృదయములోనుండి,—దివ్యగాన మావిష్కారము చెందుట కవకాశము కల్పించును.... పాశ్చాత్య నూతన సంవత్సర మారంభమైనది. ఈ సంకేతమును ప్రయోజనకరముగా ఏల ఉపయోగించుకొనరాదు? సంకేతము వాస్తవము కావలెననియు, వెనుకటి విషాదకర పరిస్థితులు తొలగి మహిమోపేతమైన పరిస్థితులు ఏర్పడవలెననియు వినూత్నాభినివేశముతో సంకల్పించవలసిన సమయ మేతెంచినది.

నిన్ను నిర్వచించి, మనఃకల్పిత సూత్రములందు నిన్ను బంధించగలుగుదుమని మేము సదా విశ్వసించుచుందుము. కాని, అవి యెంత విశాలములు, సంకీర్ణములు, సమన్వయపూర్వకములు నైనను, నిన్ను తెలిసికొని నీయందు జీవింపనేర్చినవానికి సైతము నీవు నిత్యమూ వర్ణనాతీతుడవే యగుదువు.....ఏలన, నిన్ను మాటలలో వ్యక్తము చేయజాలకపోయినను, నీయందు జీవించుటకు వీలున్నది; నీ స్వరూప నిర్వచనముగాని, వివరణముగాని సాధ్యముగాకపోయినను, నిన్ను సాక్షాత్కరించుకొని నీ యానంత్యమున నుండిపోవుట సాధ్యమే; మాకు అత్యంతాశ్చర్యమును గలుగజేయుచు నీవు నిత్యమూ గుహ్యాతిగుహ్యస్వరూపుడవుగనే యుందువు. అచింత్యము, అజ్ఞేయము నగు నీ సర్వాతీత స్థితియందే కాక, నీ జగద్రూపాభివ్యక్తియందును, మా సమగ్రస్వరూపమై యున్న సకలమునందును గూడ, నీవు అట్టివాడవే. భావనారూపము లెప్పుడును విశుద్ధతర, ఉచ్చతర పూర్ణతర నవ్యరూపములను ధరించుచుండును; వానిలో ఏ ఒకటియు నీ స్వరూపమును గురించిన భావనను తగినంతగా కలుగజేయగలిగి యున్నదని నిర్ణయించు

టకు వీలులేదు. ప్రతి వినూత్న విషయము పూర్వవిషయము లన్నిటికంటె ఎంతయో ఆశ్చర్యకరము, గుహ్యతరమునైన యొక వినూత్న సమస్యగనే చూప ట్టును. అయినను మనోమయపురుషుడు తన యీ అజ్ఞతను, అశక్తతను ఒక ప్రక్క ఎదుర్కొనుచునే, పరమజ్ఞానసంపత్తి తనకు ఒనగూడినరీతి దీప్తిమంతుడై, సుస్థిర ప్రశాంతితో, సుప్రసన్నతతో ప్రకాశించుచుండును. అసంఖ్యేయ వైవిధ్య ముతో, నిరంతరముగా, అఖండితముగా, అతిసరళముగా, అయ్యది నీవై యుండుటే గావలసినది.

* * *

జనవరి 11, 1915

పూర్వముకంటె ఎక్కువగా, మనోమయపురుషుని ఉత్కంఠ మహత్తర తీవ్రాభినివేశముతో నీవైపుగా ఉద్గమించుచున్నది. నిత్యత్వ, అనంతత్వ జ్ఞానోప స్థితి యచట ఎప్పటివలెనే కలదు. కాని, యది, అత్యంత భౌతిక పరిస్థితు లందు నన్ను పడద్రోయునిమిత్తము, సకల భక్త్యానందావేశమునకు, సమస్త ఆధ్యాత్మికానందపారవశ్యమునకు, నన్ను నీవు వెలిచేయ సంకల్పించితి వన్నట్లుగా నున్నది. కాని, ఓ ప్రభూ. అంతటనూగూడ నీ పూర్ణానందమునే నేను పొంద గనుచున్నాను. నీవు నా కనుగ్రహించియున్న యీ మహానుభూతినుండి న న్నేదియును వేరుచేయజాలదు; ప్రతి తావున, ప్రతి పరిస్థితిలోనూ అయ్యది నాతో డనే యున్నది. నేనును నీవును ఒకటైనట్లుగనే అదియును నేనునుగూడ ఒకటే. కాని, ఇకమీద కలుగవలసియున్నదానితో పోల్చిచూచుచో, ఈ యనుభూతి అల్ప మాత్రమేయని చెప్పక తప్పదు. అజ్ఞము, జడమునైన భౌతికపదార్థ గర్భము నుండి నీ దివ్యప్రేమను, దివ్యజ్యోతిని నేను అగ్నిపర్వతపు ప్రేలుడు రీతి ఉద్గమింపజేయవలెనన్నది నీ యిచ్ఛయై యున్నది. వెనుకటి భాషాపద్ధతులనెల్ల నతిక్రమించుచు ని న్నభివ్యక్తము చేయుటకై అశ్రుతపూర్వము, అత్యంత సమీచీనము నగు దివ్యవాణి ఆవిష్కృతము కావలెనన్నది నీ యిచ్ఛయై యున్నది; అధఃస్థితములగు అత్యల్పవస్తువులకు, ఊర్ధ్వస్థితములగు నత్యంత బృహద్వస్తువులకు పూర్ణైక్యము ఘటింపజేయవలెనన్నదియు నీ యిచ్ఛయైయున్నది. అందువలననే, ఓ ప్రభూ, సకల భక్త్యానందావేశమునకు, సమస్త ఆధ్యాత్మికా

నంద పారవశ్యమునకు నన్ను సంపూర్ణముగ వెలిసేయుచు, కేవలముగ నీయందే ఏకాగ్రదృష్టితో నిలిచిపోగల స్వాతంత్ర్య మేమియును నాకు లేకుండజేయుచు, నాతో నీ విట్లు పలికియున్నావు; "సామాన్య జీవులమధ్య సామాన్య మానవుని వలెనే కృషి సల్పుము; ఆవిష్కారము చెందుచున్నదాని విషయమున నీవును వారితోపాటే యగుటెట్లో నేర్చుకొనుము; వారి సమగ్ర సత్తాప్రవృత్తితో నీవును సహకారమున వర్తింపుము. ఏలయన, వారికి తెలిసినదాని కంతకును అతీతముగ, వారి ప్రవృత్తిలక్షణమున కంతకును అతీతముగ, చలించని నిత్యవైభవస్ఫూర్తితో వెలుగుజ్యోతి నీలో నున్నది. వారితో సహకారమున నీవు మెలగుటవలన, ఈ జ్యోతిని నీవు వారిమధ్యకు గొనిపోగలుగుదువు. ఈ వెలుగు నీనుండి ప్రసరించి వ్యాపించుచుండుకాలమున దీనిని నీవు అనుభవించుచు ఆనందించుట యవసరమా? నా ప్రేమను ఇతరులకు నీవు పంచిపెట్టుకాలమున, దాని ప్రబలస్పందనమును నీవు అనుభవించుచు ఆనందించుట ఆవశ్యకమా? మానవులమధ్య నా ప్రేమ దూతవై నీవు మెలగెడికాలమున నా సాన్నిధ్యపు టానందమును సమగ్రముగా నీవు అనుభవించి ఆనందించుట తప్పనిసరియే యగునా?"

ప్రభూ, నీ యిచ్ఛయే సమగ్రముగ నెరవేరునుగాక! అదియే నా ఆనందము, అదియే నా ధర్మము.

* * *

జనవరి 17, 1915

ప్రభూ, పరిస్థితు లిపుడు మారినవి. విశ్రాంతికాలము, పూర్వసన్నాహపు కాలము అయిపోయినది. తటస్థముగనుండి నిన్ను ధ్యానించుచు సేవించుటకు మారుగ, కార్యప్రవృత్తిలోనికి దిగి నీ సాక్షాత్కారోపలబ్ధి గాంచుచు నిన్ను నేను సేవించవలెనని నీవు ఇచ్ఛయించినావు; సంతోషపూర్వకమగు అనుమోదము సంతోషపూర్వకమగు సంగ్రామముగ మారవలెననియు, నీ ధర్మనియతి యిపుడు అత్యంత విశుద్ధ, సమున్నత రూపమున నెరవేరుటకు అడ్డుదగిలి ప్రతిఘటించెడి ప్రపంచప్రవృత్తు లన్నిటితో వీరోచితమైన పోరాటము ననవరతముగ కొనసాగించు చునే నేను, ప్రకృతమున నడచుచున్న తీరులో నీ నియతికి ఆత్మార్పణము గావించుకొనుటలోనుండు అక్షరమైన ప్రశాంతస్థాయిని నేను మరల చిక్కబట్టుకో వలెననియు నీవు ఇచ్ఛయించినావు. అనగా, నీ నియతిని ప్రతిఘటించు సమస్తము తోడను సరాసరి పోరాటమునకు దిగకుండ, ప్రతి సన్నివేశములోని ఉత్తమ లక్షణమును వెలికిదీయుచు, ఆచరణపూర్వకముగ, కడునెమ్మదిగా, సాంక్రమికము రీతి నద్దానిని వ్యాపింపజేయవలె ననునది నీ యిచ్ఛ.

పాక్షికము, పరిమితము నయ్యును, మహత్తరమగు నిహలోక సంఘర్షణకు ప్రాతినిధ్యము వహించునట్టిదైన యీ పోరాటమున, నేను నిక్కముగా నిన్ను సేవింపగలనో లేదో చూచుటకై, నా శక్తిని, కార్యనిశ్చయమును, ధైర్యమును నీవు పరీక్ష చేయుచున్నావు. నీ పునరుజ్జీవన కార్యమున మధ్యవర్తిగా పనిసేయుటకు నేను తగుదునని యీ పోరాటఫలితము తెలియజేయునెడల, నీ కార్యపరిధిని నీవు విస్తరింపజేయగలవు. నీవు నానుండి అపేక్షించు ఉన్నతస్థాయి నాలో ఎప్పుడును నిరూపిత మగునెడల, ఓ ప్రభూ, పుడమిపై నీవు అవతరించునట్టియు, పుడమియెల్ల నీ కెదురుతిరిగి ప్రతిఘటించునట్టియు దినము తప్పక రాగలదు. కాని, అపుడా పృథ్వినంతనూ నీవు నీ బాహువులలోనికి గైకొని రూపాంతరము చెందింపగలవు.

* * *

జనవరి 18, 1915

ప్రభూ, నా ప్రార్థన నాలకింపుము.....

నా లోపల నీవు, నా విధికంతకును మహాప్రబల నిర్ణేతవై, నా జీవన సారధివై, అవరోధములనెల్ల విచ్ఛిన్న మొనర్చు విజేతవై, మనస్సున గల స్థిర భావములను, ఊహాపూర్వక సంకల్పములను అధఃకరించి ప్రవర్తించువాడవై విలసిల్లుచున్నావు. బహుశః, బాహ్యప్రపంచమున మహాశక్తిమంతముగ బని చేయు నిమిత్తము, కార్యసాధకమగు నుపకరణమును వ్యవస్థచేసి రూపొందించుట కొరకు, నా మనస్సు నుపయోగించుకొనుట నీ కవసరమై యుండనోపు; కాని, ఉపకరణమును నీవు నిర్దుష్టముగ రూపొందించుకొన గలుగుదువేని, సాధించవలసిన కార్యము నెరవేరగలదనుటలో సందియమునకు తావే మున్నది? ఇందుకు ప్రతికూల భావమును సూచించు దుష్టచ్ఛాయ లన్నింటినీ మేము సుదూరముగ పారద్రోల వలసియున్నది. నీ అపారకృపయందు అచంచల విశ్వాసము నిండిన హృదయముతో నేను నీకు చేయుచున్న ప్రార్థన యిది.

"నీ శత్రువులను మిత్రులనుగ పరివర్తనము చెందింపుము. చీకటి నెల్ల వెలుగుగా మార్చివేయుము."

వీరోచితమైన యీ మహాసంఘర్షణమున, ద్వేషమును ప్రేమతోను, అన్యాయమును న్యాయముతోను, నీ పరమధర్మముపై తిరుగుబాటును విధేయతతోనూ ఎదుర్కొను నీ మహనీయ సంఘర్షణమున, కొంచెము కొంచెముగా నేను, మానవజాతిని పరతరశాంతిస్థానమున కర్హముగా జేయగలుగుదునుగాక. ఈ శాంతిమూలమున, అంతఃకలహము లన్నియు సమసిపోగా, మానవకృషి యెల్ల నీ దివ్యేచ్ఛను, నీ క్రమవికాసపూర్వక లక్ష్యమును పూర్ణముగా, సమగ్రముగా సాధింపగలుగుటకై సమైక్యము గావలసియున్నది.

* * *

జనవరి 24, 1915

ప్రభూ, భక్తిపూర్వక పూజాభావముతో నిండి, నీతోడి పరమతాదాత్మ్యమున పర్యవసించు అంతఃప్రణామము నీ కొనరించుచు, నిశ్చల నీరవతలో సుదీర్ఘ కాలము నీ ముందర నే నుండిపోతిని. ....ఇట్టి ప్రణామసందర్భములలో అనుభూతమగు రీతిని, ఎప్పటివలెనే, నీవు నాతో నిట్లు పలికితివి: "నీ దృష్టిని పుడమి పైకి మరలించుము," అని. అంతట, సుస్థిర, విశుద్ధతేజముతో ప్రకాశమానమగు మార్గము లన్నియు బాదుగా విచ్చుకొనినట్లు గోచరమయ్యెను.

పూజాభావమున మూగవోయి, నీ దివ్య సంకల్పము నాయందు సంపూర్ణముగ తొణికిసలాడగా, వెనువెంటనే పుడమి వైపుగా మరలితిని.

* * *

ఫిబ్రవరి 15, 1915

సత్యస్వరూపుడవైన ఓ ప్రభూ, గాఢమైన భక్తిభావమున నిన్నామంత్రణము చేయుచు, నీ యభివ్యక్తి కొరకు ముమ్మారు నిన్నర్థించితిని. అంతట, ఎప్పటివలెనే, నా యావత్సత్తయు సంపూర్ణముగా ఆత్మసమర్పణము గావించుకొనెను. ఆ సమయములో, అన్న, ప్రాణ, మనోమయాత్మకమైన యీ వ్యష్టి సత్త యెల్ల మట్టితో కప్పబడి నా చైతన్యమునకు పొడగట్టెను. మట్టియందు మట్టిగా, తన ఫాలతలముతో పుడమిని స్పృశించుచుండిన యీ వ్యష్టిసత్తనుండి ఇట్లు సంప్రార్థనము వెలువడెను: "ఓ ప్రభూ, మట్టితో నిర్మాణమైన యీ సత్త ఇకమీద నిన్నే అభివ్యక్తము చేయగలుగునిమిత్తము సత్యాగ్నియందు దగ్ధము కాగోరుచు నిన్నర్థించుచున్నది." అంతట నీ విట్లంటివి: "లెమ్ము, నీలోని మట్టి యెల్ల తొలగి విశుద్ధమైతివి." అపైన ఆకస్మికముగ, విడివిన పైయుడుపు నేలపై పడినరీతి ఒకేసారి మట్టి అంతయు రాలిపోగా, ఈ సత్త తిన్ననై నిలిచి, ఎప్పటివలె స్థూలాకృతి కలిగియు కనులు మిరుమిట్లు గొలుపు తేజస్సుతో ప్రకాశించుచు కానవయ్యెను.

* * *

మార్చి 3, 1915. (కాగామారూ ఓడపైన)

ఏకాంతము,—కఠోరమైన, ప్రగాఢమైన యేకాంతము; మరియు నెప్పటి వలెనే, అంధకారబంధురమైన నరకములోనికి పడద్రోయబడినట్లుగా ప్రబలమైన అనుభవము! నా జీవితకాలములో ఏ క్షణమునందును, ఏ పరిస్థితియందును, సత్యమని నే నెరిగినదాని కంతకునూ, ఇంత పూర్తిగా విరుద్ధమై, నా జీవితసార మన దగినదాని కంతకును ఇంత వ్యతిరేకమై కనుపట్టెడి పరిసరములందు నేను జీవించి యుండలేదు. ఈ వ్యత్యాసభావానానుభవము కడు తీవ్రరూపము దాల్చిన సమయములో ఒకొక్కప్పుడు, ఒక విధమైన విషాదచ్ఛాయ నాలోని పరిపూర్ణ విధేయతా స్థితిని అలముకొనుట అనివార్యమగుచుండును. అంతట అంతరమున సుస్థిర ప్రశాంతితో మౌనముగ ప్రభునితో కొనసాగించు సంభాషణము, ఒక క్షణము సేపు దాదాపు ప్రార్థనారూపమైన ఆమంత్రణముగా నిట్లు మార్పుచెందుచున్నది: "ఓ ప్రభూ, ఈ చీకటిరాత్రిలోనికి నన్నిట్లు నీవు కూలద్రోయుటకు నే నేమి చేసితిని?" అని. కాని, ఇంతలో ఉత్కాంక్ష మరల నాలో తీవ్రమై, "ప్రభూ, ఎట్టి బలహీనతయు నాయందు తలయెత్తనీకుండ జేయుము. నీవు తలపెట్టిన కార్యమెట్టిదైనను నగు గాక, అద్దానిని కడు విధేయముగ సుస్పష్టదర్శనముతో నెరవేర్చు నుపకరణమై నేను రూపొందున ట్లనుగ్రహింపుము;" అని యర్థించుచున్నది.

ప్రకృతమున సుస్పష్టదర్శనము లోపించి యున్నది; భవిష్యత్తు ఇంతగా ముసుగువడి ఇదివర కెన్నడును లేదు. వ్యష్టిభవితవ్యమునకు సంబంధించినంత వరకు, మే మొక దుర్భేధ్యమైన ఉన్నతకుడ్యమువైపుగా ముందుకు సాగుచున్న ట్లున్నాము. వివిధజాతులయు, మొత్తముమీద ఈ భూతలము యొక్కయు భవితవ్యములు మాత్రము స్పష్టతరముగ గానవచ్చుచున్నవి. కాని, వానినిగురించి యిప్పుడు ప్రసంగించుట నిరర్థకము; భవిష్యత్కాలమే వాని నెల్లరకును,—మిక్కిలి గుడ్డివారికిసైతము,— స్పష్టముగ గానవచ్చునట్లు వెల్లడిచేయగలదు.

* * *

మార్చి 4, 1915

నిరంతముగ నింకను ఆదే కఠోరమైన ఏకాంతస్థితి !....కాని, అది బాధాకరముగ గాక తద్భిన్నముగ నున్నది. పృథ్వి నంతను ముంచెత్తు అఖండ, విశుద్ధ ప్రేమ ఆ స్థితియందు మరింత విశదముగా గోచరమగుచున్నది. ఈ ప్రేమవలననే ప్రతిదియు జీవింపుచు చైతన్యవంతమగుచున్నది; కటిక చీకటులు సైతము పారదర్శకములై, ఆ ప్రేమప్రవాహములు తమలో ప్రవహిల్లుట కవకాశమిచ్చుచున్నవి; తీవ్రతరమగు బాధసైతము ప్రబలానందముగ రూపాంతరము చెందుచున్నది.

ఈ మహాసముద్రముపై తలయెత్తు ప్రతి ఆవర్తపు మలుపూ నన్ను నా యథార్థమైన భవితవ్యమునుండి,— ఈశ్వర సంకల్పమును ఉత్తమోత్తముగ అభివ్యక్తము చేయజాలు భవితవ్యమునుండి,—అంతకంతకు దూరము చేయుచున్నట్లగపడుచున్నది. వినూత్న, విశాలతర సాక్షాత్కారోపలబ్ధుల గాంచు నిశ్చయముతో నేను లోగడ తెగతెంపులు చేసుకొనియుండిన గతములోనికి గంటగంటకూ మరింతగా విసరివేయబడుచున్నట్లున్నాను; నా ఆత్మజీవనమే యింకనూ అప్రతిద్వంద్వముగ నా బాహ్యప్రవృత్తుల ననుశాసించుచున్ననూ, అద్దానికి పూర్తిగా విరుద్ధమైనపరిస్థితులలోనికి ప్రతి సందర్భము నన్ను లాగుచున్నట్లుగా నున్నది; ఈ వ్యక్తిగత పరిస్థితికి విషాద మొకవంక ద్యోతకమగుచున్నను, వైయక్తికపరిధుల నన్నివైపులను అధిగమించిన లోకమందు నా చైతన్యము సుదృఢముగా నెలకొనియుండిన హేతువుచేత, నిరంతరముగా శక్తిప్రేమల అనుభూతివిశేషముచే నా యావత్సత్తయు సంతోషమున నుప్పొంగుచునే యున్నది.

భౌతికముగ మాత్రము, రే పనునది అస్పష్టముగా, అగమ్యగోచరమై కనుపట్టుచున్నది. దిగ్భ్రాంతి నొందిన నా దృష్టికి దైవసాన్నిధ్యమును సూచించు వెలు గిసుమంతయును పొడగట్టుట లేదు. అయినను, నా చైతన్యపు లోతులయం దేదియో, అప్రత్యక్షస్వరూపుడగు పరమసాక్షి వంకకు దిరిగి యాతనితో నిట్లు పలుకుచున్నది: "ప్రభూ, దట్టమైన చిమ్మచీకటిలోనికి నీవు నన్ను విసరివైచినావు; నీ వెలుగును నాలో సుప్రతిష్ఠిత మొనర్చియుంటివి కావున, ఈ

విపత్కర పరీక్షకు నేను నిలువజాలుదునని నీ వెరిగినందువలననే ఇట్లు నీవు చేసి యుందువు. నీ దివటీ చేపట్టి ఈ నరకపు సుడిగుండములోనికి ప్రవేశించుటకు నన్నెంచుకొంటివా? నా గుండె బెదురునది కాదని, నా చేయి వణకునది కాదని, నీవు తలచితివా? అయినను, ఈ నా వ్యష్టిసత్తకు తన అశక్తత, దుర్బలత్వమే పొడగట్టుచున్నది. నీ దివ్యసాన్నిధ్యమును నీవు అభివ్యక్తము చేయనప్పుడు, దీని శక్తిసామర్థ్యములు, నిన్ను తెలియనివారిలోనూ, గుర్తించని వారిలోనూ అధికసంఖ్యాకుల శక్తిసామర్థ్యముల కంటె కడు హీనమై యుండును. దీని శక్తిసామర్థ్యము లన్నియు కేవలము నిన్నుబట్టి యేర్పడినవే. దీనిని ఉపయోగించుకొనుటే నీ యిచ్ఛ యైనచో, ఇక దీనికి ఎట్టి దుష్కరము, బృహత్తరము, జటిలము నగు కార్యమైనను సుకరమే యగును. అట్లుగాక, దీనినుండి నీవు వైదొలుగుదువేని, ఇయ్యది కేవలము నీ చేతులలో ఒదుగుట తప్ప ఇతరమేమియు చేతకాని శిశువువంటిది మాత్రమే యగును. అట్లిది నీ చేతులలో ఒదిగి, ఏ కలలును లేని కమ్మని నిద్ర పోవునపుడు, అచట భాసించునది నీ వాకడవు మాత్రమే.

* * *

మార్చి 7. 1915

మధురమైన నిశ్చల నీరవతలో మనస్సు నిలిచిన కాలము గతించినది. ప్రశాంతము. నిర్మలమునైన ఆ కాలమునను, మహాశక్తిసంపన్నమగు తన సత్యస్వరూపమును వ్యక్తీకరించుకొను నీ గభీరసంకల్పము మాత్రమే స్ఫురించినది. ఇప్పుడా సంకల్పస్ఫూర్తి లేదు. మనస్సు మరల ప్రవృత్తిలోనికి దిగుటచే, విశ్లేషించుట, వర్గీకరించుట, నిశ్చయించుట, వరించుట, ప్రతిస్పందించుట మొదలైన పనులు నిరంతరముగ చేయ మొదలిడినది. అత్యంత విశాలము, సంకీర్ణము, ఛాయాతప సమ్మిశ్రము నగు ప్రపంచముతోడి సంబంధము నిమిత్తముగ విశాలతను బొందిన వ్యక్తిత్వముపై విధించబడినదానినెల్ల రూపాంతరము చెందించుటకై ప్రవర్తిల్లు కార్యక్రమమది. ఈ స్థితి సమస్త ఆధ్యాత్మికానందమునకును వెలిచేయబడిన ప్రవాసస్థితివోలె నున్నది. ప్రభూ, నీవు నాకు విధించగల కఠినపరీక్షలలో కెల్ల ఇయ్యది నిశ్చయముగా అత్యంత బాధాకరము. అన్నిటినీ

మించి, నీ సంకల్పస్ఫూర్తిని నీవు విరమింపజేయుట, నీ యసమ్మతిని సూచించునదై బాధపెట్టుచున్నది. నీవు త్రోసిపుచ్చితివన్న భావము అంతకంతకు బలవత్తరమై పెరుగుచున్నది. ఇట్లు త్రోసిపుచ్చబడిన బాహ్యచేతనను అపారదుఃఖ మావరించకుండ కాపాడవలెననిన, ఎట్టి పరిస్థితియందును బడలిపోని తీవ్రవిశ్వాసము కావలసియుండును.

నిరాశ కేవలమాత్రమూ సందివ్వకయే బాహ్యచేతన యిపుడు నిలిచియున్నది. ఈ యభాగ్యస్థితి తొలగిపోదన్న అపనమ్మకము దాని కెంతమాత్రమును లేదు. నీ వినిర్మలానంద నిశ్శ్వసితము మరల తనలోనికి చొచ్చుకొని రాగలందులకై కానరాని ప్రయత్నముచేయుచు కడు వినమ్రతతో నయ్యది వేచియున్నది. నిరాడంబరముగా, నిగూఢముగా అయ్యది సాధించు ప్రతి విజయమూ పృథ్వికి నిక్కమైన సాహాయ్య మందించునదే కావచ్చును.

ఈ బాహ్యచైతన్యపు స్థితిలో నుండి నిశ్చితముగా బయటపడి నీ దివ్యచేతననాశ్రయించుట సాధ్యమగుచో నెంత బాగుండును!....కాని, అది నీవు నిషేధించినావు; ఇప్పటికిని, ఎప్పటికిని నిషేధించుచునేయుందువు; ప్రపంచమునుండి పలాయనము కారాదన్నది నీ యిచ్ఛ; దైవసాహాయ్యము పూర్తిగా విరమింపబడినట్లు తోచుపరిస్థితిలోసైతము, అసుందరము, అంధకారబంధురము నైన ఈ దురవస్థను కడవరకూ భరింపక తప్పదు, దారిచూపుటకు లోన నెట్టి దిక్సూచియు. దీపశిఖయు, మార్గదర్శియు లేకపోయిననుగూడ నిశాగర్భమున నిలద్రొక్కుకొని నేను ముందునకు సాగుచునే యుండవలెను.

నీ దయను అర్థించుట సైతము నేను చేయనొల్లను. ఏలయన, నా కొరకై నీ వేమి సంకల్పించిన నదియే నా సంకల్పము కూడ. చీకటి యెంత దట్టముగ నున్నను. దారిలో ఎట్టి యాటంకములున్నను. ఒక్కొక్క అడుగే ముందుకు వేయుచు ముందుకు సాగిపోవుటకే,—నిరంతరముగ సాగిపోవుటకే నా యావచ్ఛక్తితోడనూ నా ప్రయత్నము, ప్రభూ, ఏమి సంభవించినను, చలించని నిండుప్రేమలో నీ నిర్ణయమునకు సుస్వాగతము పలికెదను. ఈ యుపకరణము నీ సేవకు పనికిరానిదిగ నీవు భావించిననుగూడా ఇది నీదే; దీనికి స్వతంత్రమైన ఉనికి ఏమాత్ర

మును లేదు....దీనిని నీవు నశింపజేయనూ గలవు, పెంపొందింపజేయనూ గలవు. నీవు లేకుండ స్వతంత్రముగ దానికి మనుగడలేదు: సంకల్పములేదు; ఏమియును చేయజాలదుగూడ.

* * *

మార్చి 8, 1915

సామాన్యరీతిలో, ఇది యొక ప్రశాంత గంభీరమైన ఔదాసీన్యస్థితి; ఇచట జీవికి రాగముగాని ద్వేషముగాని, ఉత్సాహముగాని నిరుత్సాహముగాని, సుఖముగాని దుఃఖముగాని లేవు. జీవితము నొక దృశ్యమాత్రముగ నవలోకింపుచు, అత్యల్పముగ తా నందు పాల్గొనెడిస్థితి; జీవితములోని ఆయా చర్యలను, ప్రతిచర్యలను, సంఘర్షణలను, తన అల్పవ్యక్తిత్వమును మించి అన్నివైపులకు పొంగిపొరలు తన ఉనికికి సంబంధించినవిగా ఒక ప్రక్క కనుగొనుచుండియు, ఆ వ్యక్తిత్వమున కవి కేవలము విజాతీయములుగా కూడ లక్షింపగలుగుచుండెడి స్థితి.

కాని, ఎడనెడ, ఒక గొప్ప విషాదచ్ఛాయ అలముకొనుచున్నది; వేర్పాటుచే కలిగిన ఆందోళన, ఆధ్యాత్మిక వైకల్యము వ్యాపించుచున్నవి. ఇది యొక రీతిగా, దైవముచే విడనాడబడిన భూదేవి భగ్నహృదయముతో పెట్టుకొనెడి మొరయని చెప్పవచ్చును.... ఈ బాధ ఎంత కఠోరమో అంతనీరవము; తిరుగుబాటు చేయక, తప్పించుకోవలెనని కోరక, పరమ విధేయతతో అనుభవించెడి విషాదమిది. దుఃఖము, ఆనందము అత్యంతముగ సమ్మిశ్రితమైన అఖండమాధుర్య మీ విషాదములో నున్నది. అత్యంత విస్తృతము, ప్రగాఢము నైన దీని లోతు మానవుల కర్థమగునది కాదు. దీనిలో, ఆవిష్కారము చెందనున్న 'రేపు' అనుదాని బీజము గర్భితమైయున్నది.

* * *

లూనెల్, ఏప్రియల్ 19, 1915

అత్యవసరపరిస్థితి నన్ను మరల నా అన్వేషణలకు, ఆత్మసాధనలకు ఆశ్రయస్థానమగు ఆ ప్తసఖుని తప్పనిసరిగ జేకొనున ట్లొనర్చినది.

బాహ్యపరిస్థితు లన్నియు మారినవి. ఆదర్శప్రవృత్తి భౌతిక జీవన వ్యాపారములందు సైతము ప్రకటితము గావలెనన్న స్వప్నమునకు భంగము వాటిల్లినది. బాహ్యజీవనమున ఆనందదాయకమగు సాక్షాత్కారోపలబ్ధికి తరుణ మింకను రాలేదు. ఏ మార్పును లేక విసువు జనింపజేసెడి యే చీకటిరాత్రినుండి తరుణము రాకుండగనే బయటపడవలెనని భౌతికసత్త కోరినదో, దానిలోనికే మరల నది కూలద్రోయబడినది. ఓ సత్యస్వరూపా, సాక్షాత్కృతమైన నీ సంకల్పము కల్పనాసక్తమైయున్న మనస్సును గాంచి, "దాని సత్యత నీ ఊహ కందునదికాదు, అయినను అది సత్యమే సుమా" అని హెచ్చరించినది. మన స్సంతట సవినయముగ తన పొరపాటును తెలిసికొని, నీవు సంకల్పించినదాని కెల్ల సంపూర్ణముగ విధేయమై ఆత్మార్పణమొనర్చుకొన్నది. ప్రాణమయసత్త అన్ని పరిస్థితులలోనూ నెమ్మదిగ సంతృప్తివహించినది. దాని భావనలు సమతా విశిష్టమైన విశుద్ధశాంతిలో నోలలాడినవి. సత్తయందంతటను నిత్యమగు నీ బృహత్తేజము వెల్లివిరిసినది; నీ దివ్యప్రేమ దానిలోనికి చొరబారి దానిని చైతన్య వంత మొనర్చుచున్నది. అయినను బాహ్యజీవన మసత్యమను భావ మింకను సమ సిపోలేదు. శరీరము నిస్సంశయముగ నెంతటి సద్భావవిశిష్టమై యున్నను కడుం గడు విచలితమై యుండిన హేతువుచే తన ఆరోగ్యస్థాయిని మరల చిక్కబట్టుకో జాలకయున్నది.

ఈ సత్తయొక్క బాహ్యజీవనమెల్ల, ఆదినుండి ఇప్పటివరకు, దీని దృష్టిలో తనతో దాదాపుగ ఎట్టి సంబంధమూ లేని అవాస్తవిక స్వప్నమువోలె గన్పట్టుచున్నది. ఈ బాహ్యయంత్రము కేవలము దీనిచే నడపబడు యంత్రము మాత్రమే. అది యట్లగుట దీని మూలసత్యమునందలి సంకల్పఫలితము. కాని, ఇంతకు మించిన ఆసక్తి ఈ యంత్రమునందు దీని కేమియు లేదు. పొరుగున గల యంత్ర మెంతో ఇదియు నంతే,—అంతకంటె తక్కువ ఆసక్తిజనకమని

సైతమూ చెప్పవచ్చును. అంతేకాదు, భూమిపై భవిష్యత్తులో రూపొందించబడ గల అజ్ఞాతయంత్రమునం దెంత ఆసక్తియో దీనియందును అంతే. ఈ పృథ్వి సైతము విజాతీయమై కన్పట్టునదే యగును. నిత్యసత్యమగు నిశ్చల నీరవత దక్క వేరొండేదియు నెరుగకుండు హేతువుచేత, రూపసహితమగు సమస్తమూ కూడ దీని దృష్టికి దాదాపు అసత్యముగనే చూపట్టును. ఎవరుగాని దేనినైనను కోరుట, ఒకదానికి బదులు ఇంకొకదాని నపేక్షించుట కడు వింతయై తోచును; కారణము వానికి ఎట్టి సత్యత్వము లేకపోవుటయే. అయినను, కర్మాచరణమును —అది యెట్టిదైనను—వర్జింపదగినదిగా అయ్యది భావింపదు. కారణము సమస్త కర్మలు సమానముగ అవాస్తవికములగుటయే. లేని ప్రపంచమునుండి పారిపో వలసిన అవసరము దానికి కనుపట్టదు. దాని ఉనికి బొత్తిగా లేనిదగుటచే దాని కది ఎంతమాత్రమూ భారము కానేరదు.

ఏ ఆకారమూలేక, ఏ నిర్వచనమునకూ అందక, తేజోమయము, శాంతి మయము, అనంతము నైన ఒకానొక శూన్యస్థితిని ఇదంతయు స్ఫురింపజేయు చున్నది. ఇయ్యది శూన్యమేకాని, వాస్తవమైన శూన్యము, నిత్యముగ నిలిచి యుండెడి శూన్యము; ఏలన, శూన్యము యొక్క పరిపూర్ణ ఆనంత్యము కలిగియు నియ్యది ఉండనేయున్నది.... నిశ్చల నీరవత సైతము వెల్లడింపజాలనిదానిని నిరుపేద మాటలతో వెల్లడించుటకు జేయు ప్రయత్నమిది.

అస్తవ్యస్తపు మాటలతో తన్ను దాను నిర్వచింపజూచుకొనుచున్న యీ స్థితి కొన్ని వారములుగా నాలో నెలకొని వృద్ధినందుచున్నది. ఒక్కొక్కదినము గడచినకొలదీ ఇయ్యది మరింత సునిశ్చితముగా, మరింత గాఢముగా, మరింత అనివార్యముగా నాయందు నిలువద్రొక్కుకొనుచున్నది. తాను సంకల్పించకయే, అన్వేషింపకయే, వాంఛింపకయే, యావత్సత్తయు ఈ స్థితిలోనికి అంతకంతకు కూరుకొనిపోవుచు, వ్యష్టిభావన నతిక్రమించిన వర్ణింపనలవికాని అచలత్వమున వెలయు, ఒకానొక పరచైతన్యానుభూతియందు స్వీయచైతన్యమును మరచి అంత కంత కధికముగా లీనమగుచున్నది. ఆ చైతన్యానుభూతియందు వ్యష్టితత్వమును వేరుచేసి చూచుకొనుట కిక ఎంత మాత్రమును అవకాశము లేదు.

* * *

మే 24, 1915

ప్రభూ, ఒకనాడు నీవు నా మనస్సునకు, అద్దాని జ్ఞానోపలబ్ధిపూర్వక భావ కల్పనలయందు, బాహ్యసత్తకు సంబంధించిన సంభావ్యతల సంకుచితక్షేత్రముచే పరిమితిని బొందకయే, నీ దివ్యసత్యాభివ్యక్తికి సాధనముగా, నీ దివ్యసంకల్ప పరిపూర్తికి మధ్యవర్తిగా, ఎటుల పూర్ణప్రవృత్తితో మెలగుట సాధ్యమో బోధించితివి. అప్పటివరకును,— అరుదైన ఏవోకొన్ని సందర్భములలో తప్ప,— ఈ మనస్సునకు గల అభ్యాస మేమనిన, అచింత్యమగు నీ ఆనంత్యము మ్రోల మౌనధ్యానమున మునుగుటచేగలుగు మూకానంద స్థితిలోనుండి వెలికివచ్చినపుడెల్ల, అయ్యది బాహ్యసత్తరూపమగు వ్యాపారకేంద్రముపై తన దృష్టిని కేంద్రీకరించుచుండెడిది. అత్యంత సంకుచితమైన రీతిలో ఇది ఒకవిధమైన దాస్యమే యగును; మానసిక జ్ఞానోపలబ్ధిని పొందెడి శక్తికిని, అయ్యది తన అభివ్యక్తి కొరకు ఉపయోగించుకొను ఉపకరణమునకును వైరుధ్య మేర్పడుచుండెను; దాని సద్యఃఫలిత మేమనగా, మానసిక శక్తులు వ్యర్థము లగుటయు, పరిమితము లగుటయు సంభవించుచుండెను. అంతట మనస్సు, కర్మప్రవృత్తియందు సంతృప్తిని గాంచకపోవుటచే, మరల నీ ఆనంత్యమున నిమగ్న మగుటకే ఎంతయూ స్వాభావికముగ వెనుదిరిగిపోవుచుండెను.

ఈ అవ్యవస్థితిని ఆకస్మికముగా నీవు తుదముట్టించితివి; మనస్సునకు గల తుది యవరోధమునుండి దానికి విముక్తి కల్పించితివి; అప్పటివరకును తన వ్యక్తీకరణమునకు సహజసాధనములుగా, కేవలము తన సొంతమని భావించుచుండిన రీతులలోగాక, సకల రీతులలోనూ స్వతంత్ర ప్రవృత్తి గలిగియుండుటెట్లో నీవు దానికి నేర్పితివి.

ప్రాణమయసత్త యీ స్వాతంత్ర్యము నిదివరకే చాలకాలమునుండియు అనుభవింపుచు, జీవితాభివ్యక్తికి సమర్థములైన సకలరీతులలోనూ సర్వసమృద్ధముగ ఇంద్రియానుభూతులను, హృదయభావావేశములను పొందనేర్చియుండెను. మనోమయసత్త మాత్రము ఈ విధముగా, సకల జీవనప్రవృత్తులను సమానముగా ఎరుకతో చైతన్యవంతము గావించి వ్యవస్థీకరించుచు దీప్తమొనర్చుటెట్లో నేర్చ

కొని యుండలేదు. నీవీ యడ్డంకుల నెల్ల తొలగించి, నీ యఖండాభివ్యక్తిని సుగమమొనర్చు కవాటములను తెరచివైచితివి.

ఈ నూతన విజయము కొలది దినములలోనే దృఢమై స్థిరపడిపోయెను. పుడమిపై ప్రకృతమున నా పూర్ణసత్తారూపమగు చైతన్యకేంద్రమునుండి నీ వేది సంకల్పింతువో అది యెల్ల స్పష్టముగ అభివ్యక్తమై అద్దానికి కనుపట్టసాగెను. ప్రాణప్రవృత్తి సమస్త శారీరిక వ్యాపారరీతులలోనూ అభివ్యక్తమగుట, మనః ప్రవృత్తి ఈ ప్రాణప్రవృత్తి రీతులనెల్ల వ్యవస్థీకరించి ఉపయోగించుకొనుట, ప్రేమప్రవృత్తి నానావిధములైన ఈ మనః ప్రవృత్తిరీతులనెల్ల విస్తృతపరచి, దీప్తము గావించి, తీవ్రతరమొనర్చి, ఏకము చేయుట, ఈ విధముగా వ్యక్తజగత్తుతో పరిపూర్ణ తాదాత్మ్యము సాధించి అద్దాని రూపాంతరీకరణమునకై పూర్ణ శక్తితో వ్యవహరింపనేర్చుట,—— ఇదియే ఆ అభివ్యక్తి స్వరూపము.

ఇది యిట్లుండగా, పరతత్వమునకు సంపూర్ణముగా ఆత్మార్పణ మొనర్చుకొని, పరమసత్యమునూ దాని నభివ్యక్తము చేయు పరమ సంకల్పమునూ గుర్తెరుగ వలసియున్నది. ఈ విధమైన తాదాత్మ్యముతో, ఆ పరమసంకల్పమునకు నమ్మినబంటై, దూతయై మెలగుచు, ఎరుకతోకూడిన యీ పరతత్వముతోడి తాదాత్మ్యమును (వ్యక్తజగద్రూపమైన) సంభూతితోడి తాదాత్మ్యముతో ఏకము గావించి, సంభూతియందలి ఆ మనః ప్రాణ ప్రేమప్రవృత్తులను పరతత్వపు సత్యధర్మమున కనుగుణముగా మలచి రూపొందించుటయు జరగవలసియున్నది.

పరమసత్యమునకును వ్యక్తజగత్తునకును మధ్యవర్తిగా ఎరుకతో మెలగుచు వ్యష్టిజీవి, విశ్వప్రకృతిచే కడు నెమ్మదిగా అనిశ్చిత పురోగతి పూర్వకముగ కొనసాగింపబడుచున్న యోగసాధనయందు జోక్యము కలిగించుకొని, త్వరితముగా, సునిశ్చితముగా, ప్రగాఢమై కొనసాగు దివ్యయోగముగా నద్దానిని రూపొందించెడి విధాన మిదియే.

భూలోక జీవనసరళి కొన్ని సమయములలో అత్యద్భుతముగ ఇట్టి దశా విశేషములతోనే పురోగమించుచున్నట్లు కానవచ్చును; ఇతర సమయములం దీ దశలను పొందుటకు వేలకొలది సంవత్సరములు పట్టును.

ప్రభూ, ప్రకృతమున, నే నెరిగినంతవరకు, నీ దివ్యసంకల్పమునకు సంపూర్ణముగా ఎరుకతో ఆత్మార్పణము గావించుకొన్నస్థితి మనఃప్రాణ శరీరముల ప్రతి చర్యయందును, ప్రతి సంచలనమునందును మార్పులేక నిలుకడగనే యున్నది. ఏ క్షణమునను నన్ను వీడని యీ సుస్థిర ప్రశాంతి, ఈ యవ్యయానందము దాని నిదర్శనములే కావా? అభివ్యక్తియం దంతటను మనఃప్రాణప్రేమ ప్రవృత్తుల తోడి యీ తాదాత్మ్యానుభూతి సుస్థిరతను దాల్చియున్నది. అయ్యది విశుద్ధపరమ సత్యమునకు ఆత్మార్పణము గావించుకొన్నదాని అనివార్య సత్ఫలితము.

అయినను, ప్రాణతత్వము శారీరిక ప్రవృత్తులను పటిష్ఠముగ సచేతన మొనర్చి మలచునట్టియు, బుద్ధితత్త్వము (మనస్సు) ప్రాణప్రవృత్తులను సువ్యవస్థిత మొనర్చునట్టియు, ప్రేమతత్త్వము బుద్ధిని దీప్తిమంతము గావించునట్టియు రీతిలో, సంపూర్ణమైన యెరుకతో, సామూహికముగను అత్యంత స్వల్పవిషయము లందునూగూడ, సర్వసమృద్ధము, నిష్కృష్ట శక్తిసమన్వితము నగునట్లుగా చైతన్యస్థితి రూపొందు సమయములు అంతకంతకు తరచుగ సంప్రాప్తమగుచు ఎక్కువ సేపు నిలువగలుగుచున్నను, వానికి తెంపులేని స్థితిమాత్ర మింకనూ కలుగకయే యున్నది.

ఇటువంటి సమయములలోనే ఈ యుభయ చైతన్యములును ఏక కాలమున ప్రవర్తిల్లుచు ఒకే అచింత్యము, అవర్ణనీయము నగు ఒకే చైతన్య స్వరూపముగ మిశ్రితమై పోవుట సంభవించుచున్నది. అచలమైన అనంతము, అనంతమైన చలనము ఏకత్వము గాంచు స్థితి యది. ఇట్టి సమయములందే వర్తమానకాలపు కార్యనిర్వహణమునకు శుభారంభము.

* * *

మార్సియ్యార్గ్, జులై 31, 1915

ప్రభూ, సేవాభావముతో నే నొక ఉపకరణమునగుచు నీకు అభిముఖముగా నిలచి నిన్ను స్తోత్రము చేయుదునా? నీ సచ్చిదానంద స్వరూపముతో తాదాత్మ్య ముచు బొందుచు మానవజాతికి వా రెరుగనేరకున్న శాంత్యానందములను గురించి బోధింతునా?.... ఈ యుభయదృష్టులును ఏకకాలికములై సమానాంతరముగా ప్రసరించుచున్నవి. రెండునూ అవిచ్ఛేద్యముగ అత్యంతమూ ఏకమైపోవుటలోనే పూర్ణసమృద్ధి కలదు.

ఊర్ధ్వలోకవిజయము నాకు నిశ్చితముగా సిద్ధించినది. దానినుండి నన్ను విడదీయు శక్తి దేనికిని, ఎవరికిని లేదు. కాని, ఈ భూలోకవిజయమే ఇంకనూ సాధింపవలసియున్నది. సంక్షోభమధ్యమున నా విజయసాధనప్రయత్న మిపుడు కొనసాగుచునేయున్నది. కాని, ఈ విజయసిద్ధి సాపేక్షికమే యని చెప్పకతప్పదు. ఏలన, ఈ లోకమునందు సాధింపబడు విజయములు, ముమ్ముందు ఇంకనూ అంతకంతకు ఘనతరముగ సాధింపబడవలసిన విజయ పరంపరకు పూర్వరంగ ములు మాత్రమే. చేరవలసిన గమ్యముగా, సాధించవలసిన విజయముగా నీ దివ్యసంకల్పము నా మనస్సునకు పొడగట్ట జేయుచున్నది నీ అనంతయోజనలోని యొక అల్పాంశము మాత్రమే; కాని, నీతోడి పరిపూర్ణైక్యమున నేను ఈ యోజ ననూ, ఈ నీ సంకల్పమునూ, అయియున్నాను. భేదభావ యుక్తమైన యీ ప్రపంచమున నీవు నాచే ప్రత్యేకముగ నాడించదలచిన యీ యాటను నేను భక్త్యు త్సాహములతో నియమభంగ మేమాత్రమూ వాటిల్లకుండ ఆడుచుండిన సమయ ములోకూడ, నీ యనంత స్వరూపానందమాధుర్యమును నే ననుభవించుచునే యున్నాను.

ప్రబలము, సారవంతము నగుచు నాలో సంఘటిత మగుచున్న శక్తి, కొండరాళ్ళవెనుక రొదచేయుచు తన శక్తిసామర్థ్యముల నెల్ల కూడగట్టుకొని పిమ్మట ఆ యవరోధమును భేదించుకొని యథేచ్ఛగ బయటికి ఉరుకులు పెట్టుచు మాగాణులను సారవంత మొనర్పగోరు నీటియూటవలె నున్నది. అది బహిర్గత మగుట ఎన్నడు? ఆ సమయము వచ్చినపు డది అమాంతము ముందునకు

లంఘించును. అనంతమైన కాలములో ఆ సమయము, ఆ ఘడియ ఒక లెక్క లోనిదికాదు. కాని, భావికాలపు నీ దివ్యేచ్ఛను అభివ్యక్తము చేయు మృదుత్వముతో నొప్పారు సకలశక్తులనూ ఆంతరికముగ కూడగట్టుకొనెడి యీ ప్రగాఢమైన యేకాగ్రతచే గల్గు అఖండానందమును ఏ మాటలు వర్ణింపగలవు ? ప్రపంచమంతటను వ్యాపింప సన్నద్ధమగుచు, గతకాలపు నీ యిచ్ఛను మాత్రమే అభివ్యక్తము చేయుటకు సదా కృషిసల్పు సమస్తమునూ తన అఖండ ప్రవాహజలముతో ముంచివైచి పృథ్వి నంతనూ నీ పేరట కైవసము గావించుకొనుచు, నీ దివ్యస్వరూపమునకు పూర్ణప్రతిరూపముగా అద్దానిని నీకు సమర్పింప నభిలషించెడి సన్నాహమది.

పృథ్వి మృతినొంద గలదని,—— తన అజ్ఞాన స్వరూపమున మృతినొంద గలదని,—— నీవు పలికితివి.

పృథ్వి జీవించగలదని,—— నీ దివ్యశక్తిచే పునరుజ్జీవితమై జీవించగలదనియు పలికితివి.

నీ దివ్యధర్మ వైభవమును, అత్యద్భుతమగు నీ దివ్యమహిమను ఏ మాటలు వర్ణింపగలవు ? నీ దివ్యజ్ఞాన పరిపూర్ణతను, నీ దివ్యప్రేమానందైక ఘనతను ఏ పలుకు లభివ్యక్తము చేయగలవు ?

ఏ మాటలు, అచింత్యమగు నీ దివ్యశాంతిని కీర్తించుటనుగాని, ప్రాభవోపేతమగు నీ నిశ్శబ్ద స్వరూపమునూ, మహాశక్తి సంపన్నమగు నీ సత్యవైభవస్ఫూర్తినీ నల్గడల చాటుటకుగాని సమర్థము లగును ?

ఈ వ్యక్తజగత్తు నీ వైభవము నేమాత్రమూ వర్ణింపజాలదు; నీ అద్భుత చర్యల నేమాత్రమూ లెక్కింపజాలదు; అనంతకాలములో, అనంతముగా, అంతకంతకు ఎక్కువ నేర్పుతో చేయుటకు అయ్యది పూనుకొనుచు వచ్చిన ప్రయత్నమిదియే.

* * *

పారిస్, నవంబరు 2, 1915

(పరిచిత వస్తువులను గొన్నింటిని సర్దుచు కొన్నిక్షణములు గడపిన యనంతరము)

సముద్రముపై బలమైన గాలి వీచి, దాని లెక్కలేని యలలకు నురుగు కిరీటము ధరింపజేసిన రీతి, స్మృతిపథమున నిశ్వాస మొందు ప్రసరించి ఎన్నియో జ్ఞాపకములను మేలుకొల్పెను. అంతట, ప్రగాఢము, సంకీర్ణము, సంకులము నైన గతమంతయూ తన రసగంధములనూ తన సుసంపన్నతనూ ఏమాత్రము కోలుపోకయే, మెరపు మెరపినట్లు మరల సచేతనమై కానవచ్చెను.

అపుడు, ఉవ్వెత్తున లేచిన పూజాభావములో నా యావత్ప్రత్తియు ఆ తన జ్ఞాపకముల నెల్ల, పుష్కలముగ పండిన పంటనువలె ప్రోగుచేసి, ఓ ప్రభూ, నీ పాదముల మ్రోల నునిచి నీకు సమర్పించినది.

ఏలన, తన మనుగడయం దంతటనూ అయ్యది, తనకు తెలియకుండగనే కాని, ఏ కొంచెమో సూచన మాత్రముగ తెలిసిగాని, నిన్నే అన్వేషించుచు వచ్చినది; తన వాంఛితములు, ఉత్సాహావేశములు, ఆశానిరాశలు, సుఖదుఃఖములు, —వీటన్నిటియందును గాఢముగ నయ్యది నిన్నే అభిలషించినది. ఇప్పుడది నిన్ను కనుగొని, సొంతము చేసికొని, పరమమైన శాంత్యానందములతో వోల లాడుచున్నది. కావున, నిన్ను కనుగొనుటకై ఇన్ని ఇంద్రియసంవేదనములు, ఇన్ని హృదయభావావేశములు, ఇన్ని అనుభూతివిశేషములు కావలసివచ్చెనా యని అచ్చెరువొందుచున్నది.

కాని, ఒకప్పుడొక తీవ్రసంఘర్షణముగా, మహాపరిశ్రమముగా, ఎడతెగని ప్రయత్నముగా గోచరించినదంతయు నిప్పుడు ఎరుకతో కూడిన నీ దివ్యసాన్నిధ్యపు పరమానుగ్రహవిశేషముచే వెలలేని పెన్నిధియై చూపట్టగా, దానిని నీకు కానుకగ సమర్పించి యానందించుచున్నది. విశుద్ధికరమగు నీ దివ్యజ్ఞాన దీపజ్వాలచే

లంఘించును. అనంతమైన కాలములో ఆ సమయము, ఆ ఘడియ ఒక లెక్క లోనిదికాదు. కాని, భావికాలపు నీ దివ్యేచ్ఛను అభివ్యక్తము చేయు మృదుత్వముతో నొప్పారు సకలశక్తులనూ ఆంతరికముగ కూడగట్టుకొనెడి యీ ప్రగాఢమైన యేకాగ్రతచే గల్గు అఖండానందమును ఏ మాటలు వర్ణింపగలవు ? ప్రపంచమంతటను వ్యాపింప సన్నద్ధమగుచు, గతకాలపు నీ యిచ్ఛను మాత్రమే అభివ్యక్తము చేయుటకు సదా కృషిసల్పు సమస్తమునూ తన అఖండ ప్రవాహజలముతో ముంచివైచి పృథ్వి నంతనూ నీ పేరట కైవసము గావించుకొనుచు, నీ దివ్యస్వరూపమునకు పూర్ణప్రతిరూపముగా అద్దానిని నీకు సమర్పింప నభిలషించెడి సన్నాహమది.

పృథ్వి మృతినొంద గలదని,— తన అజ్ఞాన స్వరూపమున మృతినొంద గలదని,— నీవు పలికితివి.

పృథ్వి జీవించగలదని,— నీ దివ్యశక్తిచే పునరుజ్జీవితమై జీవించగల దనియు పలికితివి.

నీ దివ్యధర్మ వైభవమును, అత్యద్భుతమగు నీ దివ్యమహిమను ఏ మాటలు వర్ణింపగలవు ? నీ దివ్యజ్ఞాన పరిపూర్ణతను, నీ దివ్యప్రేమానందైక ఘనతను ఏ పలుకు లభివ్యక్తము చేయగలవు ?

ఏ మాటలు, అచింత్యమగు నీ దివ్యశాంతిని కీర్తించుటనుగాని, ప్రాభవోపేతమగు నీ నిశ్శబ్ద స్వరూపమునూ, మహాశక్తి సంపన్నమగు నీ సత్యవైభవ స్ఫూర్తినీ నల్గడల చాటుటకుగాని సమర్థము లగును ?

ఈ వ్యక్తజగత్తు నీ వైభవము నేమాత్రమూ వర్ణింపజాలదు; నీ అద్భుత చర్యల నేమాత్రమూ లెక్కింపజాలదు; అనంతకాలములో, అనంతముగా, అంత కంతకు ఎక్కువ నేర్పుతో చేయుటకు అయ్యది పూనుకొనుచు వచ్చిన ప్రయత్న మిదియే.

* * *

పారిస్, నవంబరు 2, 1915

(పరిచిత వస్తువులను గొన్నింటిని సర్దుచు కొన్నిక్షణములు గడపిన యనంతరము)

సముద్రముపై బలమైన గాలి వీచి, దాని లెక్కలేని యలలకు నురుగు కిరీటము ధరింపజేసిన రీతి, స్మృతిపథమున నిశ్వాస మొండు ప్రసరించి ఎన్నియో జ్ఞాపకములను మేలుకొల్పెను. అంతట, ప్రగాఢము, సంకీర్ణము, సంకులము నైన గతమంతయూ తన రసగంధములనూ తన సుసంపన్నతనూ ఏమాత్రము కోలుపోకయే, మెరపు మెరసినట్లు మరల సచేతనమై కానవచ్చెను.

అపుడు, ఉవ్వెత్తున లేచిన పూజాభావముతో నా యావత్సత్తయు ఆ తన జ్ఞాపకముల నెల్ల, పుష్కలముగ పండిన పంటనువలె ప్రోగుచేసి, ఓ ప్రభూ, నీ పాదముల మ్రోల నునిచి నీకు సమర్పించినది.

ఏలన, తన మనుగడయం దంతటనూ అయ్యది, తనకు తెలియకుండగనే కాని, ఏ కొంచెమో సూచన మాత్రముగ తెలిపిగాని, నిన్నే అన్వేషించుచు వచ్చినది; తన వాంఛితములు, ఉత్సాహావేశములు, ఆశానిరాశలు, సుఖదుఃఖములు, —వీటన్నిటియందును గాఢముగ నయ్యది నిన్నే అభిలషించినది. ఇప్పుడది నిన్ను కనుగొని, సొంతము చేసికొని, పరమమైన శాంత్యానందములతో నోలలాడుచున్నది. కావున, నిన్ను కనుగొనుటకై ఇన్ని ఇంద్రియసంవేదనములు, ఇన్ని హృదయభావావేశములు, ఇన్ని అనుభూతివిశేషములు కావలసివచ్చెనా యని అచ్చెరువొందుచున్నది.

కాని, ఒకప్పుడొక తీవ్రసంఘర్షణముగా, మహాపరిశ్రమముగా, ఎడతెగని ప్రయత్నముగా గోచరించినదంతయు నిప్పుడు ఎరుకతో కూడిన నీ దివ్యసాన్నిధ్యపు పరమానుగ్రహవిశేషముచే వెలలేని పెన్నిధియై చూపట్టగా, దానిని నీకు కానుకగ సమర్పించి యానందించుచున్నది. విశుద్ధికరమగు నీ దివ్యజ్ఞాన దీపజ్వాలచే

నవన్నియు వెలగల రత్నములుగ మారి, నా హృదయాగ్నివేదికపై ఆత్మాహుతి రూపముగా సమర్పిత మగుచున్నవి.

చేసిన తప్పులన్నియు సోపానములుగను, కన్ను కనిపించని తడుములాట లన్నియు విజయములుగను మారినవి. అపజయముల నెల్ల నీ మహిమ నీ యఖండ తత్వపు విజయములుగా మార్చివేయును; నీ దివ్యతేజఃప్రసారముచే నీలినీడ లన్నియును కానరాకుండ పారిపోయినవి.

గమ్యము, గమ్యమును చేరగోరిన ఆశయము, — రెండునూ నీవే; నీవే కర్తవూ, కార్యమునుగూడ.

వ్యష్టిజీవన మనునది నిత్యనూతనమై కొనసాగు సంకీర్తనము; దానినే యీ విశ్వము నీ యచింత్య మహావైభవమునకు కానుకగా సమర్పించుచున్నది.

* * *

నవంబరు 7, 1915, (మూడు గంటల వేళ)

సకల బాహ్యచిహ్నములకును, సకల విశేషసందర్భములకును అతీతముగ అత్యంత ప్రాభవముతో, అతి గంభీరమగు ఆంతరిక నిశ్చల నీరవతాస్థితిలో, అగాధమైన సువిశాల సుస్థిర ప్రశాంతస్థితిలో, కాలము అల్లనల్లన ప్రవహించి పోవుచుండుట గని నా కనులవెంట అశ్రువులు ధారలు గట్టినవి. కడచిన రెండు దినములుగా పృథ్వి యొక మహాసంకటము నెదుర్కొనుచున్నట్లుగా నున్నది. భౌతిక ప్రతిఘటనమునకును, ఆధ్యాత్మిక శక్తులకును నడుమ కొనసాగు భీషణక్రీడ ముగింపునకు వచ్చుచున్నట్లున్నది; లేక, ఏదెట్లున్నను, అత్యంత ప్రాముఖ్యముగల విశేష మేదియో ఈ క్రీడయం దావిర్భవించినట్లుగా, లేక ఆవిర్భవించనున్నట్లుగా తోచుచున్నది.

ఇట్టి సమయములందు, వ్యక్తిత్వము లనునవి ఏపాటివి? పశువ్రేత్తుచు బోవు సుడిగాలిచే నెగరగొట్టబడి యించుకసేపు నేలకు పైగా గిర్రున తిరుగుచు

షరల నేలపైకి విసరివేయబడి ధూళిలో గలిసిపోవు గడ్డిపోచల వంటివవి. తమ పరిస్థితి ఇంత అస్థిరమని, ఎట్టి ప్రాముఖ్యమూ లేనిదని ఇట్లు తెలిసికొనిన యీ వ్యక్తిత్వములు ఆందోళనకు గురియగుచు నెంతగనో బాధనొందుచుండును. నిరీక్షణ సైతము ఇట్టి వ్యక్తిత్వములకు అంతులేని బాధగానే తోచును; ప్రమాదము, వినాశము,— అనువానిని గురించి మాత్రమే ఇవి ప్రసంగించుచుండును.

కాని, అంధీభూతమైన యీ వ్యక్తిత్వకుడ్యములు కూలి, వ్యష్టిచేతన నీ యఖండ చైతన్యముతో ఏకమగుటకై అనంతములోని కెగసినప్పుడు, పూర్తిగా సంకుచితాహంకారముతో రూపొందిన యీ బాహ్యాందోళన గర్భమున ఎట్టి మహనీయత, ఎట్టి మహాసౌందర్యము మరుగువడియున్నవో కాననగును; కూడగట్టిన అంతర్ముఖత్వముచే అర్చావిధిగ రూపొందిన యీ నిరీక్షణమున ఎట్టి మహావైభవము నెలకొనియున్నదో తెలియనగును.

ప్రభూ, దుఃఖితమైన యీ ప్రపంచము, మూగ ప్రార్థనతో నీ మ్రోల మోకరిల్లియున్నది; బాధాసంకులమైన యీ అన్నమయ శరీరము, తనకు నేకైక శరణ్యమైన నీ పాదముల మ్రోల వ్రాలియున్నది. నీ వెవరవో తెలియనిదయ్యును, అర్థము చేసుకోనిదయ్యును నిన్నే పూజించి ప్రార్థించుచున్నది. దాని ప్రార్థనము దుర్భరవేదనతో చిట్టచివరగా పెట్టుకొన్న మొరవోలె నున్నది; తాను నశించిపోవుచుండియు నీలో పునర్జీవనము పొందు నాశను గజిబిజిగా పూరించుకొనుచు పెట్టుకొన్న మొర అది; నీ నిర్ణయమునకై పృథ్వి ఘనముగా సాగిలవడి నిరీక్షించుచున్నది. దాని మొరను ఆలకింపుము, ఆలకింపుము. ఏమి నీ నిర్ణయము? ఏమి నీ యాదేశము? ఓ సత్యస్వరూపా, వ్యష్టిప్రపంచము నీ సత్యస్వరూపము నింకనూ ఎరుగకున్నను, దానికి జయము పలుకుచు, దాని నామంత్రణము చేయుచు, తన జీవచైతన్యపు శక్తుల ఆనందోత్సాహ శక్తిసామర్థ్యముల మేరకు దానినే అంటిపెట్టుకొని యున్నది.

అతి విస్తృతముగా, గంభీరముగా, మృత్యువు సాగిపోయినది; అది యట్లు సాగిపోవుచుండ, పూజాభావ సమన్వితమగు నిశ్చలనీరవత అంతటను వ్యాపించినది; భూమిపై అతిమానుష సౌందర్యము ద్యోతకమైనది.

అత్యాశ్చర్యకరమైన ఆనందము కంటె అత్యాశ్చర్యకరమైన దేదియో దాని దివ్యసాన్నిధ్యస్ఫూర్తి ననుభవింపజేసినది.

*   *   *

నవంబరు 26, 1915

సమస్త చైతన్యమూ దైవధ్యానమునందు మునిగినది; యావత్సత్తయూ పరమమైన బృహదానందము ననుభవించినది.

అట్టి తరుణమున, భౌతికశరీరము, తొలుత అద్దాని అవరవిభాగములలోను, పిమ్మట అపాదమస్తకమూగూడ, పావనమైన ఒకానొక కంపమునకు గురియై, వ్యక్తిగతమైన పరిమితులన్నియు నెమ్మదినెమ్మదిగా అత్యంత స్థూలసంస్పర్శయందు సైతమూ విగళితములై పోయెను. జీవసత్త ఒక క్రమ పద్ధతిలో, అధికాధికముగా, అడ్డుకట్టలనెల్ల కూలద్రోయుచు, ఆటంకములనెల్ల విచ్ఛిన్నమొనర్చుచు, అంతకంతకు అతిగాఢమై, అతి పృథులమై విస్తరిల్లెడి శక్తివిశేషము నభివ్యక్తము గావించునిమిత్తము ఒకానొక మహనీయతను సంతరించుకొనినది. పృథ్వితో పూర్ణతాదాత్మ్యము పొందుపర్యంతమూ శరీరగత జీవకణములు అంతకంతకు విస్తరిల్లుచుండినట్లు తోచిన పరిస్థితి అది. ప్రబుద్ధమైన శరీరచైతన్యము అనంతాకాశమున క్రమగతిలో పరిభ్రమించు భూగోళరూపమును దాల్చినది. గోళరూపమైన తన శరీరము విశ్వప్రకృతి చేతులలో నీరీతిగా నడయాడుచుండినట్లు చైతన్యమునకు తెలియనగుచుండెను. శాంతిసంభరితమగు నానందపారవశ్యమున నయ్యది తనను దా నామెకు అర్పణము గావించుకొనెను. అప్పుడది తన శరీరము విశ్వశరీరము నందు లీనమై, దానితో ఏకమైనట్లు అనుభూతిని పొందెను. తన సమష్టిస్వరూపమునందు అచలము, ఆంతరిక సంకీర్ణస్వరూపమునందు నిరవధిక భ్రమణాత్మకము నైన ఆ విశ్వచైతన్యమే తానై పోయెను. తీవ్రమైన ఆకాంక్షతో, పరిపూర్ణమైన ఆత్మసమర్పణభావముతో, ఆ విశ్వచైతన్యము పరమాత్ముని దిశగా నుద్గమించెను. సుస్వచ్ఛమైన దివ్యతేజోవైభవమధ్యమున ఆదివ్యపురుషుడు బహుఫణములు గల సర్పముపై నిలిచియున్నట్లు కానవయ్యెను. ఆ సర్పశరీరము విశ్వముచుట్టును అనంతముగ చుట్టవేసికొనియుండెను. విజయసూచికమైన భంగిమతో ఆ పురు

షుడు ఏకకాలముననే ఆ సర్పమును, దానినుండి యావిర్భవించిన విశ్వమును వశీకరించుకొని సృజించెను; సర్పముపై నిటారుగ నిలిచి, తన అప్రతిహతశక్తితో దానిని స్వాయత్తము గావించుకొనెను. విశ్వమునావరించిన సర్పము నారీతిగా అణగ ద్రొక్కిన భంగిమయే దానికి శాశ్వతజన్మను ప్రసాదించెను. చైతన్యమంతట ఈ విశ్వపురుషుడుగ రూపొంది, మరల తన రూపము మార్పుచెందుచున్నట్లు పొడగనెను. రూపరహితమయ్యునూ అన్ని రూపములూ తానేయైన ఒకానొక స్థితిని,—తాను కేవలము అక్షర మయ్యును సకలమునూ జూచు దివ్యచక్షువుగ, సర్వసాక్షిగ నుండెడిస్థితిని— అయ్యది పొందెను. ఆ స్థితిలో, తాను చూచినదెల్ల ఉన్నదియే యగును. అటుపిమ్మట ఈ కట్టకడపటి రూపపుజాడ సైతము అంతర్ధానమై పోగా, అవర్ణనీయము, అచింత్యము నైన తత్వస్థితిలోనికి చైతన్యము విలీనమైపోయెను.

అనంతరము వ్యష్టిశరీరచైతన్య స్థితిలోనికి మరలి వచ్చుట కడు నెమ్మదిగా, అంచెలంచెలుగా, దివ్యజ్యోతి, దివ్యశక్తి, దివ్యానందము, దివ్యప్రేమల అనవరత అక్షరవైభవస్ఫూర్తిపూర్వకముగా సంభవించెను. సమష్టిప్రపంచ చైతన్యరూప విశేషముల ద్వారా గాక, సరాసరిగ వ్యష్టిశరీరచైతన్యములోనికే ఈ మరలివచ్చుట సంభవించినది. కడు సామాన్యమైన యీ వ్యష్టిశరీరచైతన్యమే, ఏ మధ్యవర్తితోనూ పనిలేకుండ, సరాసరిగా, తక్షణమే, నిత్యుడైన యాపరమసాక్షి సాక్షాత్సంబంధముతో విలసిల్లినట్లాయెను.

* * *

జనవరి 15, 1916

ప్రభూ, సర్వాతీత సత్యమునకు సగుణ రూపుడవై, నా వ్యష్టిజీవత్వము నకు కారణము, మూలము, వాస్తవిక స్వరూపమునై విలసిల్లుచుండెడి నీవే నా పరమదైవతమవు. ఈ జడవస్తు వొకనాటికి ఎరుకతో నీతోడి తాదాత్మ్యమున అనన్యముగ నీవే అయిపోగలందులకై, యుగయుగములుగా దీనిని కడు నెమ్మదిగా. సుసూక్ష్మముగా తీర్చిదిద్దుచు వచ్చినావు. అంతేకాదు, నీ పరిపూర్ణ దివ్య వైభవముతో నాకు సాక్షాత్కరించి నన్ననుగ్రహించియున్నావు. అట్టి ఆత్మేశ్వరుడవగు నీకు ఈ నా యావత్సత్తయు తన సంకీర్ణస్వరూపముతో పరమభక్తి పూర్వకముగా తనను దాను అర్పణము చేసికొనుచున్నది; నీతో సంపూర్ణముగా తాదాత్మ్యము నొంది, నీ సత్యస్వరూపమున శాశ్వతముగ లీనమై, ఎప్పటికినీ నీవుగనే అయిపోవలెనని యాకాంక్షించుచున్నది. కాని, అందుల కది సిద్ధమైనదా ? నీ పని యంతయు పూర్తియైనదా ? చీకటి, అజ్ఞానము, ఆవరణము దానినుండి పూర్తిగా తొలగిపోయినట్లేనా ? సంపూర్ణముగ దానిని నీవు స్వాయత్త మొనర్చుకొని, అజ్ఞానబంధమునుండి శాశ్వతముగా విముక్తి కలిగించి, పరమమైన పరిపూర్ణ రూపాంతరీకరణము ద్వారా, సత్యప్రపంచ జీవన మద్దానికి ఘటింపజేయుటకు తరుణము వచ్చియున్నదా ?

వేరొక రీతిలో, సమస్త దోషములనుండియు, పరిమితులనుండియు విముక్తమైన నేనే నీవు. ఇట్టియెడ, నా సత్తయందలి ప్రతి అణువులోనూ నేను సంపూర్ణముగా ఈ నా నిజాత్మస్వరూపమే యైతినా ? అప్రతిహతమగు రూపాంతరీ కరణము నాయందిపుడు జరుగునా, లేక, అది యింకనూ కడు నెమ్మదిగ కొనసాగి శరీరమునందలి ఒక్కొక్క జీవకణమునే క్రమక్రమముగా అజ్ఞానావరణమునుండి బలిమిని ఉద్ధరించవలసిన ఆవశ్యకత గలదా ?

నీ రాజ్యమును స్వాయత్త మొనర్చుకొన సిద్ధమైయున్న రాజువు నీవు; ఈ రాజ్యమును నీవు నీతో ఏకముగావించుకొని దానితో నీవు ఏకశరీరమై విలసిల్లుటకు తగిన సన్నద్ధత దీనియం దింకనూ నీకు కానరాలేదా ?

వ్యష్టిజీవియందు పరిపూర్ణ దివ్యజీవన విలసన మనెడి మహాద్భుత కార్యము పర్యవసానమున నెరవేరగలదా ?

* * *

జనవరి 22, 1916

ప్రభూ, దీనమైన యీ యుపకరణమును నీవు పూర్తిగా కైవస మొనర్చుకొని యున్నావు. దీనిని నీవు సంపూర్ణముగ రూపాంతరము చెందించుటకు ఇది యింకను తగిన పూర్ణయోగ్యతను సంతరించుకొని యుండని కారణమున, దాని యందలి ఒక్కొక్క జీవకణమునే చక్కదిద్ది, మృదువొనర్చి, దీప్తముగావించి, మొత్తము సత్తలో సముచితరీతి నది పొత్తుగూడి యుండునట్లుగా వ్యవస్థీకరించు కార్యములో నీవు నిమగ్నుడవై యున్నావు. సర్వమూ కదలబారి మార్పుచెందు చున్నది. అణువు లన్నిటిలోనికిని ప్రసరించు విశుద్ధిప్రదాయక పావనాగ్ని జ్వాల నమునకు మహామూలమై విలసిల్లుచు నీ దివ్యకర్మ సుప్రత్యక్షముగ అనుభూత మగుచున్నది. దీని ఫలితముగా, ఇంతకుపూర్వ మెన్నడును అనుభవమునకు వచ్చియుండనంతటి మహాద్భుతానందము యావత్సత్తలోనూ కలుగుచున్నది. దేనిని తీర్చిదిద్దుపనిలో నీవు నిమగ్నుడవై యున్నావో, అద్దాని యాకాంక్ష ఈ రీతిగా నీ దివ్యకర్మకు కృతజ్ఞత దెల్పుకొనుచున్నది. ఈ యుపకరణము తన దౌర్బల్యస్థితిని సంపూర్ణముగా, ఉన్నది ఉన్నట్లు తెలిపికొనియుండిన హేతువుచే, ఈ యాకాంక్ష మరింత తీవ్రమై యుద్గమించుచున్నది.

ప్రభూ, భువిపై దైవాభివ్యక్తి రూపమైన మహాద్భుత దివ్యకార్యము నెరవేరెడి శుభసమయమును త్వరితపరచుము; ఇదియే నా సంప్రార్థనము.

* * *

జనవరి 23, 1916

ఈ స్థూలరూపములో వసించువాడవైన ఓ దేవా, ఈ రూప మనేక పరిమితులతో కూడియున్నదని నీకు తెలియును; నీ యనంతవిభూతిలో నియ్యది పాల్గొనగలుగుటకు, ఈ పరిమితుల నన్నింటినీ విచ్ఛిన్నము చేయవా? చీకట్ల మధ్య నిది తడుములాడుకొనుచున్నదని నీకు తెలియును; నీ దివ్యతేజోవైభవమున నిది పాల్గొనునిమిత్తము, నీ జ్యోతిఃప్రసారముచే ఈ తమస్సును విరియజేయవా? అజ్ఞాన మాలిన్యములచే నియ్యది కప్పువడియున్నదని నీకు తెలియును; తన చైతన్యమున నిది సంపూర్ణముగా నీతో ఏకత్వము పొందుటకు, ఈ మాలిన్యముల నన్నింటినీ సర్వభక్షకమగు నీ ప్రేమాగ్నిచే దహించివేయవా? దుఃఖభాజనము, తమోభూయిష్ఠము నైన అహంకారిక భేదదృష్టి, పృథ్వినీ, మానవజాతినీ కైవస మొనర్చుకొని రాజ్యమేలు కాలము మితిమీరినదని నీవు కనలేదా? పురోగతియందీ దశ నతిక్రమించి, నీ యైక్యస్వరూపానుభవదృష్టి ప్రధానమైన దశను చేరుకోవలసిన సమయ మాసన్నమైనది కాదా?

"ప్రభూ, ప్రభూ, నీ రాజ్యమును నీవు స్వాయత్త మొనర్చుకొనుము; నీ నిత్యసాన్నిధ్యముచే దానిని దీప్తిమంతము గావింపుము; వాస్తవమున తాను నీవైయుండియు నీకంటె వేరని తలచు దుర్భరమైన దీని యసజ్జీవితము నంతరింపజేయుము." ఇదియే ఎడతెగక అనుక్షణమూ నీకు నేను చేయు సంప్రార్థనము.

తుట్టతుది ఆటంకము లన్నింటినీ విచ్ఛిన్నముచేయుము; సకల మాలిన్యములనూ దహించివేయుము; అవసరమగుచో నీ యశనిపాతమునకు దీనిని గురిచేయుము; ఇది రూపాంతరము చెందుటకు ఏమి చేసినను సరే!

* * *

టోకియో, జూన్ 7, 1916

చెప్పుకోదగిన దేమియు లేకుండగనే సుదీర్ఘ మాసములు గడచిపోయినవి. పూర్వస్థాయినుండి అంతకంటె విస్తృతము, పూర్ణతరము నైన వేరొకస్థాయిని జేరుకొను మధ్యకాలమిది. ఈ జీవసత్త అనుభవసంపత్తి మరింత విస్తారము, సంకీర్ణము నగుటకై పెక్కు వినూత్న పరిచయములు దీనికి గావలసివచ్చె నన్నట్లు, అనేక బాహ్యపరిస్థితులు క్రొత్తవి ఏర్పడినవి. కాని, ఈ నూతనానుభవమున నిది పూర్తిగా నిమగ్నమైన కారణమున, తగినరీతిలో దీనినుండి, విడివడి సమగ్ర రూపమున దీనిని కనుగొనుచు, దీని పూర్వస్థితి యెట్టిదో, ఏ గమ్యమునకు చేర నున్నదో తెలియజాలకపోయెను.

ఆకస్మికముగా, జూన్ అయిదవ తేదీన తెర ప్రీలిపోయి, నా చైతన్యము నకు దీప్తి కలిగినది.

అనంతుడవైన ఓ పరమేశ్వరా, నీ వ్యష్టిరూపమున నిలిచి నిన్ను నేమ ధ్యానించుచు, ఈ నీ మాంసశరీర రాజ్యమును స్వాయత్త మొనర్చుకోవలసినదని ప్రార్థించినప్పుడు, ఈ ప్రాణసత్తను నీవు క్రియాపరము గావించితివి. ఇంతకు పూర్వ మియ్యది పెక్కు సంవత్సరములుగా, వికాసమును, ఏకత్వమును జెందు నిమిత్తము; గ్రహణశీలము, సామరస్యసహితము నైన తటస్థ లక్షణముతో మాత్రము విలసిల్లుచు, నీ యిచ్ఛను కార్యరూపమున అభివ్యక్తము చేయజాలని స్థితిలోనుండెను.

ప్రాణకోశమం దీ క్రియాపరత్వము సంపూర్ణముగ నొక క్రొత్తపద్ధతి ననుస రించెను. పూర్వ మీ క్రియాపరత్వము ప్రాణకోశమందు అద్దాని పూర్వాభ్యాస రీతులలో కొనసాగుచుండెడిది. ఇప్పుడీ క్రొత్త పద్ధతికి ఇది అలవాటుపడవలె ననిన, నీ దివ్యసాన్నిధ్యజ్ఞానము, నీ దివ్యనియతియెడ సంపూర్ణవిధేయత ఒకప్రక్క చెక్కుచెదరక తగినంతగా ప్రబలమై యుండి ఏ ప్రమాదభయమునకూ తావు లేకుండజేయుచున్ననూ, ఇందుకు చాల దీర్ఘకాలమే పట్టెను; ఈ కాలమందలి

యనుభవము కొంత బాధాజనకమై, ఒక్కొక్కతరి తమస్సుచే ఆవృత మగుచు వచ్చెను.

పూర్వము తటస్థలక్షణోపేతమైన ఆత్మార్పణమునకు తాను అలవాటుపడిన రీతిగనే, ప్రాణమయ సత్త యిప్పుడు నెమ్మది నెమ్మదిగా, నిర్విరామ కార్యప్రవృత్తితో సామరస్యమున మెలగుటకు అలవాటుపడ నేర్చెను. ఇట్టి సామరస్య స్థితి తగినంతగా నెలకొనుటతోడనే, సత్తయందలి సకల విభాగములలోనూ మరల వెలుగు నిండి, వెనుక జరిగిన దంతయూ సంపూర్ణముగ స్పష్టమై గోచరించెను.

కార్యాచరణమధ్యమున అనంతుడగు పరమేశ్వర దర్శనము ప్రాణమయ సత్త కిపుడు మరల చేకూరినది. ఇంద్రియస్పర్శ లన్నింటిలోనూ, అన్ని రూపములలోనూ నీ పరమసౌందర్యమునే అయ్యది పొడగాంచి, దానియందే మన నేర్చుకొనినది. ఎంతయును విస్తరిల్లి సంపూర్ణముగా వికసించిన తన ఇంద్రియ జ్ఞానానుభూతియందు సైతము అయ్యది, తద్వ్యతిరిక్తమైన ఇంద్రియజ్ఞానానుభవములను గుర్తింపనేర్చు సమకాలమందే, సదా నిన్ను దర్శింపగలుగుటయు సంభవించుచున్నది.

కాని, ఇది యొక మజలీమాత్రమే యని దానికి తెలియకపోలేదు. ప్రగాఢ భక్తిభావ పురస్సరముగా నయ్యది నీ మ్రోల మోకరిల్లి ఇట్లు విన్నవించుకొనుచున్నది. "ప్రభూ, నీ యుపకరణమును నీ కార్యోపయోగమునకై మరల నీవు చేపట్టినావు. లోపభూయిష్ఠమైన తన మాలిన్యస్థితి ఈ యుపకరణమునకు బాగుగ తెలియును. కావుననే తనను లోపరహితము, నిర్మలము గావించుటకై నీ కృప నర్థించుచున్నది. దినదినము క్రమక్రమముగా, దీని లోపములు, ప్రత్యేకాభిమతములు, అన్నియు నంతరించి, నిన్ను తాను పూర్ణతరముగ నభివ్యక్త మొనర్పసమర్థము గావలెనన్నదే దీని యాకాంక్ష.

* * *

నవంబరు 28, 1916

ప్రభూ, ఈ శిశుజల్పితముల నన్నింటినీ నీవు నాచేత మరల చదువజేసితివి. ఏలన, ఇంకనూ కడు బాల్యావస్థలో నుండిన మనస్సు స్వీయాభివ్యక్తికొరకై చేసిన వికృతప్రయత్నము లివి. నిష్కపటము, ఉత్సాహభరితము నగు బాల్యావస్థ లోని అనుభవముల నిర్మల మనోజ్ఞవేషముతో నియ్యవి నా కిపుడు ఏనాటివో, ఎక్కడివో నన్నట్లు గోచరించినవి. కాని, ఓ సనాతన ప్రభూ, నే నింకనూ ఏమాత్రమూ ఎదుగలేదు; ఇంచుకేనియు పురోగమించలేదు. ఇప్పటి భావాభివ్యక్తి ఆ వెనుకటి కాలపు అభివ్యక్తికంటె మిన్నయైనది కాదు. మనస్సు ఎప్పటివలెనే అల్ప ప్రజ్ఞము, వికృతప్రజ్ఞము నై యున్నది. అది అభివ్యక్తము చేయజాలు విశిష్ట విషయము మాత్ర మేమున్నది ? అచ్చెరువు కలిగింపగల అనుభూతి ఏదియునూ లేదు. అన్నియు కడు సామాన్యములై సహజములై తోచెడి అనుభవములే. ఏభావమూ నూతనము, శక్తిమంతము, అసాధారణమూ కాదు; ఏభావమూ క్రొత్తగా కనుగొన్న ఆనందానుభూతి నిచ్చునదికాదు. ఏ రూపమున గోచరించు నదైననూ, అన్ని భావములూ ఇప్పుడు పూర్వపరిచితులమాడ్కి గానవచ్చుచున్నవి. ఎదురైన పరిచితులకు కొందరకు అభివాదము మాత్రము చేసి మేము ముందుకు సాగిపోవుట జరుగుచుండును. ఈ భావములు అటువంటి పరిచితులను బోలినవే కాని, ఊహించని క్రొత్తవిశేషము లేవియో చెప్పగలరని అపేక్షింపదగిన పరిచితులవంటివి కావు. అటులనే, ఇప్పటిదనుక పరిశోధితము గాకయున్న భూమికను దేనినో క్రొత్తగ కనుగొనుటకు ఉపయోగపడగల సునిశిత, సవిస్తర ఆంతర్విమర్శకూడ ఏమియును లేదు; స్వయముగ రూపొందిన ఆంతరంగిక జటిలపరిస్థితులు సైతము ఏవియును లేవు; అయ్యది కేవలము పరిసరములందలి ఆంతరంగిక ప్రవృత్తుల సాక్షాత్ప్రతిబింబములు మాత్రమే; ఈ స్థితియందు, జీవసత్తయందు ద్యోతకమగుదాని వర్ణనము కేవలముగా అవచేతనపు తడబాట్లతోనూ సంచారముల తోనూ కూడిన ప్రపంచ వర్ణనమువలె కడు క్లిష్టమేగాక వినుగు జనింపజేయునదియు నగును.

ఏమి యీ అభాగ్యస్థితి ! ప్రభూ, నీవు నన్ను నిప్పచ్చరమైన వట్టి యెడారిలో వదలినట్లున్నావు. అయినను, ఇది నీ ప్రసాదము కావున నాకు మధురము

గనే యున్నది. ఏ మార్పునూ లేక, వర్ణశూన్యమై, బూడిదరంగువలె ప్రకాశ రహితమైయున్న యీ వెలుగునందు అనంతావకాశముల అనుభవపు రుచి నాకు తగులుచున్నది. మహాసముద్రము మీదుగా వీచు నిర్మలవాయువు, పర్వత శిఖరాగ్రముల నుండి వీతెంచు ప్రబలమారుతము నా హృదయాంతరాళమును పూరించుచు, నా జీవనములోనికి చొరబారుచున్నవి; నా లోపలనూ, చుట్టునూ గల అవరోధము లన్నియు కూలిపోయినవి; నిరాటంకముగ పై కెగయుటకై రెక్కలు విప్పుకొను విహంగమును బోలియున్నది యిప్పటి నాస్థితి, కాని, వెలిమంచు తెరవంటి ఆకసమున రెక్కల నా రీతిగ విప్పుకొని, తనకు తెలియని దేనికొరకో ఎదురు చూచుచున్నదానివలె, ఆ విహంగము రాతిగుట్టపైన అట్లు కూర్చుండియేయున్నది. ఎగరకుండ తనను బంధించున దేదియును లేదని తెలిసికొనియు, ఎగరవలెనన్న తలంపు నది విరమించినది. తన స్వతంత్రతను తాను గుర్తెరిగియు నది యీ స్వతంత్రత ననుభవింపక, చిక్కని పొగమంచు నడుమ తక్కిన వాటితోపాటుగ నేలపై కూర్చుండియే యున్నది.

* * *

డిసెంబరు 4, 1916

ప్రభూ, నీ వనుమతించితివి కావున, ప్రతి దినము మరల కొలది క్షణముల పేపు కార్యసంరంభమునుండి తెమల్చుకొని నీ కడకు వచ్చుట మొదలిడినాను. ఈ కార్యాచరణమున నేను నిమగ్నమైయుండు కాలమునందే, ఈ ప్రవృత్తి కేవలము సాపేక్షికమని నే నెరుగుదును. ఇంతకుపూర్వము నన్ను కార్యప్రవృత్తిలోనికిని, సామాన్య చేతనలోనికిని విసరివైచిన నీవు, ఇపుడు అనుదినమూ క్రమముదప్పక నీ సన్నిధికి వచ్చు వ్రాలు శక్తిని నాకు అనుగ్రహించినావు; దివ్యమైన నీ నిశ్చల నీరవతలోనికిని, సత్యచేతనలోనికిని ఇంచుక ఎగయు సామర్థ్యమును మరల నాకు ప్రసాదించినావు.

ఈ జీవసత్త మరింత విస్తృతినీ ఘనతనూ సంతరించుకోవలె నన్నదే నీ యిచ్ఛ. కనీసము తాత్కాలికముగ నైనను, పాక్షికముగ నైనను, మరల అజ్ఞానములోనికి, తమస్సులోనికి ప్రవేశించుట జరిగిననే తప్ప, ఈ పని సాధ్యము

కానేరదు. కావుననే, కఠిన పరీక్షలోకెల్ల కడు సౌమ్యము అన్నట్లుగా గానవచ్చెడి యీ అజ్ఞానమునూ, తమస్సునూ నీపాదములకడ నివేదించుట కది వచ్చియున్నది. ప్రశాంతిమయమైన విశుద్ధధ్యాన సమయములందు ఏ దివ్యచైతన్యానుభూతిని నీవు నాకు కలిగించుచుందువో అయ్యది అవిచ్ఛిన్నముగా అనుగ్రహింపబడవలెనని కాదు నిన్ను నే నర్థించునది. ఈ సమయములను మరింతప్రశాంతములుగను, విశుద్ధములుగను జేయవలసినదనియు, చైతన్యమును మరింత దృఢతరము, దీప్తిమంతము గావింపవలసినదనియు, తత్ఫలితముగా నయ్యది మరింత శక్తిసామర్థ్యముల జ్ఞానదీప్తితో అనుదినకార్యక్రమమును చేపట్టగలుగునట్లు చేయవలసినదనియూ నర్థించుచున్నాను.

* * *

డిసెంబరు 5, 1916

ప్రభూ, వైయక్తిక 'పరిధు లన్నియు కరిగిపోవు నీ దివ్యవిశ్రాంతి రూప కృపావిశేషమును నా కనుగ్రహించినావు. అన్నింటనూ తాను, అంతకంటె స్పష్టతరముగా అన్నియు తనలోను, ఉన్నట్లు కాననయ్యెడి అనుభూతి యిది. కాని, ఈ దివ్యానందమున నిమగ్నమైన మనస్సునకు మాత్రము, తనను దా నభివ్యక్తము చేసికోగల శక్తి యింకను కలుగలేదు.

"పృథ్వివైపునకు తిరుగుము,"—అనెడి యాదేశము ఆ యవ్యయ తాదాత్మ్యస్థితియందలి నిశ్చల నీరవతలో ఎప్పటివలెనే విననయ్యెను. చైతన్యమపుడు అన్నింటిలోనూ ఏకమై విలసిల్లువాని చైతన్యముగనే భాసిల్లెను. "ఏకత్వదర్శనము నీవు పొందనేర్చు సమస్తములోను, సర్వులలోను దైవముతోడి యీ తాదాత్మ్య జ్ఞానము ప్రబుద్ధము కాగలదు. వీక్షింపుము," (అను పలుకు లా పిమ్మట విన బడెను. )....అది జపానుదేశములోని ఒక వీథి. అందముగా అమర్చబడిన రంగు రంగుల దీపముల కాంతులతో అంతయూ కడు ప్రకాశవంతమై యుండెను. ఆ వీధివెంట సచేతనముగ నేది కదలాడి వచ్చుచుండినను, ప్రతిదానియందునూ దైవమే ప్రత్యక్ష మగుచుండెను. లఘుతతో నొప్పారెడి యచటి గృహములలో నొకటి స్ఫటికసదృశమై భాసింపగా, లోన నొక వనిత, రంగురంగుల అల్లిక

లతో, జరీపనితనముతో తళుకులీను ఊదారంగు కిమోనో ధరించి సుఖాసనమున నాసీనురాలై కానవచ్చెను. సౌందర్యవతియగు నామె వయస్సు ముప్పదియైదు నలభై మధ్య నుండును. బంగారు పనితనముగల వాద్యవిశేషము నామె వాయించు చుండెను. ఆమె పాదములచెంత నొక చిన్న శిశువుండెను. ఆ వనితయందు సైతమూ దైవమే ప్రత్యక్షమై గోచరించెను.

* * *

డిసెంబరు 7, 1916

ప్రభూ, నాలో ఏ యోగము, ఏ గుణవిశేషము లేదనియే న్యాయతః చెప్ప నగును. ఏలన, నిన్ను సేవింపగోరువారికి ఘనతను సంపాదించిపెట్టు సమస్తమూ ఇపుడు నాయందు లుప్తమై పోయినది. నా జీవిత మిపుడు బాహ్యదృష్టి కత్యంత సామాన్యరీతిలో నడచుచున్నది. మరి దాని ఆంతరంగికస్థితి యెట్టిది? ఏ మార్పునూ లేని, ఏ క్రొత్తదనమునకూ ఎదురుచూడని, స్థిరప్రశాంతి దక్క వేరొం డేదియును లేదు. ఈ ప్రశాంతి ఒకానొక సాక్షాత్కారఫలితముగ ఏర్పడినదేగాని సాక్షాత్కారమునకై ఇంకనూ అన్వేషించెడి స్థితిలోనిదికాదు; ఇచట జీవితమునుండి అపేక్షించదగిన దేమియును లేదు; ఏ లాభాపేక్షయు లేకుండగనే కర్మయందు ప్రవర్తించెడి స్థితి. ఈ కర్మయొక్క ప్రేరణగాని, ఫలితముగాని తనకు చెంది నది కాదని దానికి పూర్తిగా తెలియును; తనలో సంకల్పించునది ఆ పరమేశ్వరుని సంకల్పమనెడి యెరుకతో అయ్యది సంకల్పించును. సంశయరహిత నిశ్చయ భావము, నిర్విషయిక జ్ఞానము, నిర్నిమిత్తానందము, కాలావధుల నతిక్రమించిన చైతన్యస్థితి ఈ ప్రశాంతియందు నెలకొనియున్నవి. బాహ్యజీవనక్షేత్రమున సంచ రించుచునే, దానియందు తగుల మేమాత్రమూ లేక, దానినుండి తప్పించుకోవలె నన్నియూ జూడక విలసిల్లెడి అచలాయతనస్థితి అది. నే నిపుడేదియు ఆశించుట లేదు, అపేక్షించుటలేదు, వాంఛించుటలేదు, ఆకాంక్షించుట లేదు; నే నిపు డేది యును కాను; అయినను ఒకానొక సంతోషాతిశయము,—ప్రశాంతము, నిష్కలు షము నగుచు, తన స్వరూపస్థితి తానెరుగక, ఎరుగవలసిన అవసరము సైతము లేని సంతోషాతిశయము,—ఈ శరీరాయతనములో నెలవు గైకొనియున్నది. ప్రభూ, ఈ సంతోషము నీవే. ఈ ప్రశాంతియును నీవే; ఏలన, ఇది ఎంతమాత్రమూ

మానవప్రవృత్తులుకావు; వీటిని తెలిసికొనుట, అనుభవించుట మానవుని యింద్రియములకు సాధ్యమయ్యేడి పని గాదు. ఈ విధముగా నో ప్రభూ, ఈ శరీరమున నీవే నివసించుచున్నావు; అందువలననే ఈ శరీరము, తనలో నివసించు అద్భుతస్వరూపుడవగు నీకు తగిన యోగ్యత తనలో మృగ్యమై అల్పత్వము, జడత్వము, తనలో ఇంకనూ గూడుకట్టుకొని యున్నందుకు విచారపడుచున్నది.

* * *

డిసెంబరు 8, 1916

ప్రభూ, నేటి ఉదయము మన సంభాషణ మీ తీరుగా నడిచెను :

నీ ప్రేరణరూపమైన అద్భుత మంత్రదండముతో నీవు నా యందలి ప్రాణమయ సత్తను మేల్కొలిపి, దానితో— "లెమ్ము; కార్యాచరణమునకు నమయము త్వరలో రానున్నది కావున, నీ సంకల్పరూప ధనువును ఎక్కుపెట్టుము" —అని పలికితివి. ఆకస్మికముగ నిట్లు మేల్కొలుప బడుటతోడనే ప్రాణమయసత్త లేచి, ఒడలు సాగదీసికొని, చిరకాలముగ తనను అంటియున్న మాంద్యపుధూళి నంతనూ ఒక్కసారిగ దులిపివేసికొనెను. తన అవయవములందు గోచరమైన ఉత్సాహమును బట్టి, తనలో నింకనూ కార్యాచరణమునకు వలయు శక్తిసామర్థ్యములు కలవని తెలిసికొని, ప్రభు సమ్మతమైన నీ పిలుపునకు సమాధానముగా, "ప్రభూ, ఇదిగో నే నిచట సిద్ధముగ నున్నాను; ఏమి నీ యాజ్ఞ ?" అని శ్రద్ధాళువై పలికెను. ఇంకనూ నది ఏమియో మాటాడ నుంకించులోపలనే మనస్సు కలగజేసికొని, వినయపూర్వకముగ ప్రభుని మ్రోల మోకరిల్లి యిట్లు పలికెను : "ప్రభూ, నేను నీకు ఆత్మార్పణము చేసికొని యుంటిననియు, నీ దివ్యేచ్ఛను యథాతథముగా ననువర్తించు దూతనగుటకై శక్తివంచన ఏమియు లేక ప్రయత్నించుచుందుననియు నీ వెరుంగుదువు. కాని, నేను నా దృష్టిని పృథ్వివైపు మరల్చి చూచినప్పుడు, మానవుని కర్మక్షేత్ర మెంత విస్తృతి కలదైనను అత్యంత సంకుచిత మైనదిగనే నాకు పొడగట్టుచున్నది. మానవుని మనోమయ సత్తగాని, ప్రాణమయ సత్తగాని విశ్వమంత విశాలత గలిగినవే. కవీన మీ పృథ్వి యంతటి విశాలతనైనను కలిగియున్నవి. కాని, అతడు కార్యాచరణమునకు

దిగు సరికి, సంకుచితమైన భౌతిక కర్మక్షేత్ర పరిధులలోపల నిరుకువడి తగు ఫలితములు గాంచలేకున్నాడు. కర్మక్షేత్రమున ప్రవర్తించు మానవుడు,— అత డొక మతకర్తయైననూ సరే, లేక ఒక రాజకీయ పరివర్తనము సాధింపగోరువాడైననూ సరే,— ఒక మహాసౌధమందలి చిన్న శిలవంటివాడు, మానవ కర్మప్రవృత్తులనియెడు మేటి యిసుకదిబ్బలయం దొక చిన్న రేణువు వంటివాడు నగుచున్నాడు. పరిపూర్ణమైన యేకాగ్రతతో, తత్పరత్వముతో, యావత్సత్తనూ ప్రేరేపింపజాలు ఉత్తమ యోగ్యతా విశేషము ఇట్టి కర్మప్రవృత్తియందు కానరాదు. ప్రాణమయ సత్తకు సాహస ప్రవృత్తియందు ఆనంద మనుమాట నిజమే; అట్లని అది, నీ దివ్యసాన్నిధ్య జ్ఞానముగల యుపకరణమున కెంత మాత్రమూ ఉచితముకాని ఏదో ఒక విషాదకరమైన సాహసప్రవృత్తియందు నిమగ్నము కావలసినదేనా ? "భయపడవలదు;" అని సమాధాన మిచ్చుచు నీ విట్లంటివి : "ప్రాణమయసత్త యథేచ్ఛగ ప్రవర్తించ కుండునట్లే చేయబడును. చేయవలసినకార్యము ప్రాణమయసత్త గుణవిశేషములెల్ల పూర్తిగా సద్వినియోగ పడదగినంత విశాలము, సంకీర్ణమునైన పరిస్థితిలో దక్క, నీవు నీ కార్యనిర్వహణ శక్తిసామర్థ్యముల నన్నింటినీ వినియోగించవలసిన పనిలేదు. చేయవలసిన కార్యస్వరూప మెట్టిదో ఆ తరుణము వచ్చినపుడు నీవు తెలియగలవు. చేయు తరుణము వచ్చినపుడు దానిని నీవు త్రోసిపుచ్చకు సుమా యని ముందుగనే హెచ్చరిక చేయుచున్నాను. నీకును, నీ ప్రాణమయసత్తకును మరొక హెచ్చరిక యేమనిన, ఒడుదుడుకులు లేకుండ, ఒకే పద్ధతిలో, ప్రశాంతముగ అలతి జీవితము గడపు కాల మిక చెల్లిపోయినది. తీవ్రప్రయత్నము సల్పుచు, ప్రమాదములను, అస్థిర పరిస్థితులను, అనుకోని పరిణామములను ఎదుర్కొనుచు జీవించవలసిన తరుణము వచ్చినది. నీవు నిర్వహించవలసియున్న పాత్ర ఇదియే, తరుణము రానందువలనను, నీ వింకను సిద్ధముకాని హేతువుచేతను, ఈ పాత్రను నీవు పూర్తిగా మరచియుండుట సంభవించినది. ఇక లెమ్ము. నీ నిక్కమైన పాత్ర ఇదియే ననియు, దీని నిర్వహణము కొరకే నీవు సృజింపబడితివనియు గుర్తించి సిద్ధము కమ్ము."

ప్రాణమయసత్త, తొలుత, తన సహజోత్సాహముతో దీనిని గుర్తించినదై, "ప్రభూ, నేను సిద్ధముగనే యున్నాను, నీ నమ్మికను వమ్ము చేయబో" నని వాక్రుచ్చినది. ప్రాణమయసత్తకున్న విధేయతయే కలిగియు, కొంత దౌర్బల్యము,

భీరుత్వము గల హేతువుచే, మనస్సు మాత్రము, "ప్రభూ, నీ సంకల్పమే నా సంకల్పము; నేను పూర్తిగా నీ దాననే నని నీ వెరుంగుదువు; కాని, ఈ కార్య నిర్వహణస్థాయిని నే నందుకోగలనా, ప్రాణసత్త సాధింపగలదానిని వ్యవస్థీకరించు సామర్థ్యము నాకు అలవడగలదా?" అని విన్నవించుకొన్నది. అందులకు నీ వొసగిన సమాధాన మిది :

"ఆ స్థాయికి నిన్ను సిద్ధము చేయుటకే నే నిపుడు కృషి సల్పుచున్నాను; మృదుత్వము, పౌష్కల్యము అలవడు శిక్షణ నీవు పొందుచున్నది అందుకొరకే. దేనిని గురించియు నీ వాందోళన చెందవలదు. అవసరము ననుసరించి శక్తి యొనగూడును. ప్రాణమయసత్తవలెనే నీవును అల్పవిషయ ప్రవృత్తులందు నిమగ్నమై యుంటివనిన, దానికొక ప్రయోజన ముండుటవలననే అది యట్లు జరిగినది. తయారుకావలసినవి తయారగుటకు తగు అవకాశమిచ్చుటకే అది యట్లు సంభవించినది. అంతమాత్రమున, ఈ అల్పవిషయ ప్రవృత్తుల నతిక్రమించి నీ యథార్థస్థాయి కనుగుణమైన కర్మక్షేత్రములో బనిసేయుటకు నీకు సామర్థ్యము లే దనుకొనరాదు. పృథ్విపై నా ప్రత్యేక ప్రతినిధివిగా,— ఏదో చాటుమాటున గాక మానవ లోకమున కంతకూ ప్రత్యక్షముగ గానుపించునట్లు,— పనిసేయు నిమిత్తము నిన్ను నా అనంత్యములో నుండి ఎంచుకొనియున్నాను. ఎట్లుగా అగుటకై సృజింపబడితివో అట్లుగానే నీ వగుట నిస్సంశయము".

లోలోతులనుండి వాణి ఈ తీరుగా వినిపించి విరమించుటతోడనే, ఒకానొక పరమమైన, మహాశక్తిమంతమైన, మంగళాశాసనము నన్ను పూర్తిగా ఆవహించినట్లయ్యెను.

అంతట, ఆ క్షణములో, అనంతుడు, సత్యస్వరూపుడు, అద్వితీయుడునైన ప్రభువు, ఆయన ఉపకరణము,— ఈ రెండునూ ఏకమైపోయిన అనుభూతి కలిగెను.

* * *

డిసెంబరు 9, 1916

ధ్యానములోనుండి వెలికి వచ్చినపిమ్మట ఎంతో సేపటికి దాని స్వరూపము గురించిన విస్పష్టభావన నాకు కలుగుచున్నది.

నా చైతన్యము బహుప్రకారములగు వ్యష్టి, సమష్టి చైతన్యకేంద్రముల లోనికి విక్షిప్తమైన ఒకానొక అనుభూతిలోనికి నే నీ సాయంకాలము మరొక మారు ప్రవేశించితిని. ఆయా కేంద్రములు అవకాశ మిచ్చినంత మేరకు ఆ స్థితిలో బహువిధ కార్యసాధనకు ప్రయత్నమది.

మెరపులు మెరిపినట్లు, ఒక్కొక్క విషయము సుస్పష్టరూపమున గోచరమగుచు, వెంటనే అదృశ్యమై విషయాంతరమునకు తావిచ్చుచుండెను. ప్రతిచైతన్య కేంద్రమునకు తన కార్యప్రవృత్తిస్వరూపము స్పష్టముగ తెలియనగుచుండెను. కాని, సమష్టిచైతన్యజ్ఞానము మాత్రము అత్యంత సంకీర్ణస్వరూపముగలది యగుటచే అసాధ్యముగ గన్పట్టుచుండెను. అయినను, సాధించవలసిన కార్యాచరణమునకు దాని ప్రయోజన మేమియును లేదు.

* * *

డిసెంబరు 10, 1916

ప్రభూ, స్థూలదృష్టికి కడు నిర్దుష్టముగ గానుపించు స్థితికంటె దౌర్బల్యములుగ దోచు కొన్నికొన్ని స్థితులే ఒక్కొక్కప్పుడు నీ కార్యనిర్వహణకు ఉపయోగకారులగుచుండును. ఈ నిర్దుష్టస్థితిగ దోచునది ప్రపంచమునుండియు, ప్రపంచ కార్యరంగమునుండియు విరమించినవాని లక్షణము మాత్రమే. కాని, భువిపై నీ కార్యకర్తలలో నొకనిగా నీ వెంచుకొనినవాని విషయమున మాత్రము, స్థూల దృష్టికి గోచరించు కొన్ని దౌర్బల్యములూ, దోషపరిస్థితులే నీ దృష్టిలో ఎక్కువ ఉపయోగకారులై, తత్కారణముగ ఆ నిర్దుష్టస్థితి యనబడుదానికంటె కడు నిర్దుష్టములై విలసిల్లుచుండును. స్థూలదృష్టికి నిర్దుష్టమై తోచెడి యీ స్థితి పరిత్యాజ్యమే యగుచున్నది. తాను పరమాత్మకంటె వేరనుకొనునట్లు చేయు అజ్ఞానమును సంపూర్ణముగ పరిత్యజించుటయం దంతర్భాగమే ఈ పరిత్యాగముకూడ.

ప్రభూ, పూర్ణచైతన్యముతో కూడిన పూర్ణతాదాత్మ్యానందమును నాకు నీవు కడు అరుదుగా ప్రసాదించుచుండుట ఇందుకొరకేనా ?

ఇంతకు పూర్వము నన్ను చెడగొట్టినది నీవే. నిరంతరమూ నీ దివ్య సన్నిధియందే నన్ను మనునట్లుగా జేసితివి....కాని యిపుడు, అంధకారమధ్యమున గూడ అవ్యయానందము నెట్లు పొందవలెనో తెలిపి, చేతనాచేతన విభాగమున కతీతముగ నెట్లు మెలగవలెనో నాకు నేర్ప నుద్దేశించినట్లున్నావు.

కోరికలతో జీవించువారి స్థితిలోనికి కూల ద్రోయబడియు కోరికల కతీతముగా మననేర్చుకొనుట !....ఎంత విచిత్రము !

కాని, ఇంతకంటెనూ విచిత్రమేమనిన, ఈ స్థితిలో నేను పూర్ణమైన సుస్థిరతను, ప్రశాంతిని, సంతృప్తిని బొందగలుగుచున్నాను; ఈ అంధకారములో నొక గొప్ప శక్తి నాకు ద్యోతక మగుచున్నది; ఈ నిశాగర్భమునుండి కూడ పరమమైన దివ్య స్వరమేళనములను వినగలుగుచున్నాను.

ప్రభూ. నీ రాజ్యసీమయందు నేను వేయు ప్రతి అడుగూ ఎప్పటికప్పుడు వినూత్నమైన ఆశ్చర్యానుభూతికి గారణమే యగుచున్నది.

* * *

డిసెంబరు 12, 1916

నిరంతరమూ ఈ విధమైన స్వల్పవిషయములనే అవలోకింపుచు, ఈ విధమైన సంకుచిత వ్యవహారక్షేత్రమునందే సంచరించుచుండుటవలన నా మనస్సు కలత చెందియున్నది.

ప్రభూ, ప్రతి వస్తువునందును అది నిన్నే చూడనేర్చుకొనియున్నది; అణువునందు సైతమూ నిన్నే దర్శించి ఆనందించుచున్నది. కాని, యిట్లు అత్యంత విశాల, ఉదాత్త విషయప్రవృత్తులతో పాటు అత్యంత నిరర్థక విషయప్రవృత్తులందు సైతము తాను నిన్నే గుర్తించి ఆనందించుచున్న స్థితిలో, కొన్ని విషయ ప్రవృత్తులు తదితరములకంటె ప్రాబల్యము వహించుట కేమి హేతువోయని అయ్యది అచ్చెరువొందుచున్నది. ఈ ధోరణిని ప్రతిఘటించుటకది పెక్కు నెలలుగా అనేక పర్యాయములు ప్రయత్నించినదిగాని ప్రయోజనము లేకపోయినది. దీనికి కారణమేమి? అది అట్లుండుటే మంచిదని నీవు తలంచినందువలననా? లేక, వేరువిధముగ నుండుట కది అసమర్థమైనందువలననా? అది ఈ ప్రశ్న నిన్నడుగగా, ఎప్పటివలెనే, సమాశ్వాసపూర్వకముగా నీవు చిరునవ్వు మాత్రము నవ్వుచున్నావు; ప్రశ్నకు సమాధాన మింతవరకును వినరాలేదు.

ఇప్పుడీ మనస్సునకు అత్యల్పవిషయముసైతము అగాధమైన నిగూఢరహస్యమువలెనే కానవచ్చుచున్నది; సమస్తమూ ఎడతెగక మరల మరల ఆశ్చర్యము కల్గించునదిగనే యున్నది.

* * *

డిసెంబరు 14, 1916

ప్రభూ, నీకు ప్రణామము; నీ ముందు మోకరిల్లి యున్నాను; కాని, ఇపుడు నే నేమియు వ్రాయను. ఏలన, ఇప్పటి నా ధ్యానమును గురించిన ప్రశ్నకు నీ విపుడే ఇట్లు సమాధాన మిచ్చితివి—"మన మధ్య ఇపుడు నడచిన యేకాంతసంభాషణము నీ భౌతికశ్రోత్రములు సైతమూ వినగూడనిది," —అని.

* * *

డిసెంబరు 20, 1916

తుపానునందువలె సంక్షుభితములైనట్లు కానవచ్చియు, యథార్థమునకు నీ దివ్యసంకల్పమును ప్రతిబింబించుచు సుస్థిరప్రశాంతిని, దృఢతను వెలార్చుకొనిన దినములు గడచిపోయినవి; హృత్సంభూతము, బహుప్రకారము నైన నీ యప్రశాంత దివ్యలీలావైభవము నెల్ల మరల నొకసారి ప్రదర్శించుచు, ఆవిష్కరించుచు, విస్తరింపజేయుచు గడచిపోయిన దినము లివి; నీ సత్యసంకల్పముచే సముద్భూతమైన గతివిశేషముల యనంత సంశ్లేషవైవిధ్యమును సాక్షాత్కరింపజేయు నీ దృశ్యవైభవ మెంత మహాద్భుతము! ఇదంతయు ఒకే అనంతవస్తువునుండి ఆవిర్భూతమగుచున్నదనియు, మా లోపభూయిష్ఠ ప్రవృత్తుల దృష్టి కిదియొక అవిచ్ఛిన్న యథార్థఘటనా ప్రవాహముగ గానవచ్చుచుండుననియు, ఇందు మేము సంకల్పసహితుల మయ్యును ఏమియు తెలియని కార్యకర్తలమనియు గుర్తించినపుడిది మరింత ఆశ్చర్యకరమై కన్పట్టును. అజ్ఞానుల అంధత్వముతో మా కార్యకర్తృత్వము కొనసాగుచుండును. అయినను ఈ కార్యకర్తగ నున్న సమయమందే నేను సాక్షినని కూడ నాకు దెలియును. కాని, నే నింకను కర్మఫలితములనెల్ల సమష్టిగా నీవు నాకు పొడగట్టజేయునంతటి విశుద్ధిని గాంచియుండలేదు. పాక్షికముగను, అసమగ్రముగను మాత్రమే, ఈ కర్మఫలితములను కర్మాచరణమునకు ముందుగ నేను తెలియగలుగుటయు, ఎందుకు చేయవలెనో తెలిపి నానుండి నీ వావిష్కరింపజేయుదాని విషయమున సమగ్ర జ్ఞానముతో కర్మ చేయుటయు సంభవించుచున్నది. ప్రభూ, ఆ విశుద్ధి నా కెప్పటికి చేకూరును? కాని, దీని విషయమునకూడ నా కెట్టి తొందరపాటును లేదు; దీనికొరకై నిన్ను నే నర్థిం

చనుగూడ. అలతియైన యీ నిర్భాగ్యపు ఉపకరణమునందు నీ దివ్యవైభవము లెంతగా మసకబారి మరుగుపడియున్నవో నాకు కానవచ్చుచునేయున్నది. దీనికి కారణ మేమియో నీ వెరుంగుదువు. ఈ నీలి నీడలను, దౌర్బల్యములను నీ దివ్యప్రయోజనములకొరకు సముచితరీతి నుపయోగించుకొనుచుందువు కూడ,

తాను తెలియగలిగినంతలో నీ స్వరూపముమ్రోల నా యాత్మ సప్రేమముగా మోకరిల్లి ప్రార్థన చేయుచున్నది. నీతోడి తాదాత్మ్యమున పర్యవసించు పరమమైన భక్తితీవ్రతతో నీకు ఆత్మసమర్పణము గావించుకొనుచు ప్రార్థన చేయుచున్నది.... నా ఆత్మయేకాదు, నా శరీరముసైతము ప్రార్థన చేయుచున్నది. మూకమైన ఆనంద పారవశ్యమున నా మనస్సు నిశ్చలము, నీరవము నై యున్నది.

(సాయంకాలము 5-30 కి ధ్యానానంతరము అందుకొనిన సందేశము)

"నీవు నన్ను ధ్యానించుచుంటివి గాన, ఈ సాయంకాలము నీతో ప్రసంగించెదను. బంగారు కాంతిచే పరివేష్టితమైన వజ్రమణి నీ హృదయమున నాకు కానవగుచున్నది. స్వచ్ఛతతోపాటు వెచ్చదనము గలిగి, అయ్యది నిర్వ్యక్తిక ప్రేమను ప్రకటింపజాలినదై యున్నది; కాని, ఈ నిధిని నీవు చిక్కని ఊదా రంగు అస్తరుగల నీలిపేటికలో మూసియుంచుకొనినావెందులకు? దీని వెలిమూత ప్రకాశహీనమై కేవల మొక చీకటియుడుపువలె నున్నది. నీ తేజోవైభవమును ప్రకటించుకొనుటకు నీవు జంకుచున్నట్లున్నావు. వెలుగును నల్దెసల ప్రసరింపనిమ్ము; తుపానునకు వెరువకుము; వాయుప్రసారము మనలను తీరమునుండి కడు దవ్వునకుగొనిపోవుచున్నట్లున్నను, అది మనకు ప్రపంచమును జూపుచున్నది. నీ హృదయమార్దవమును పొదుపుచేయ దలంచుచుంటివా? ప్రేమమూలము అనంతమని గుర్తెరుగుము. లోకులు నిన్ను అపార్థము చేసికొందురని భయమా? కాని, దైవమును మానవుడు అర్థము చేసికోగలిగిన దెట్లైన గంటివా? పరమ సత్యము స్వీయాభివ్యక్తికి నిన్ను సాధనముగ గైకొనునేని, ఇక ఇతరమును గురించిన ఆలోచన నీ కెందులకు? గర్భాలయమునుండి వెలి కేతెంచు యాత్రికుని వలె నున్నది నీ స్థితి. ద్వారదేశముకడ జనసమూహమునెదుట నిలిచి యాతడు, తాను కనుగొన్న అమూల్యమైన పరమరహస్యమును వెల్లడించుటకు తటపటాయించును. వినుము; నేనుగూడ బహుదినములు తటపటాయించితిని.

ఏలన, నా యొనర్చుబోధను, దాని ఫలితమును గూడ నేను ముందుగా తెలియ గలిగియుంటిని; బోధను వ్యక్తీకరించుటలో నుండు లోపము, దానిని అవగాహన చేసికొనుటలోనుండు లోపము, రెండునూ నాకు తెలియును. అయినను, పృథ్వీవైపు మానవలోకమువైపు తిరిగి నా సందేశము నందజేసితిని. "పృథ్వీవైపు, మానవలోకమువైపు తిరుగు" మనెడి యాదేశమునేకాదా నీ హృదయమందు నీవు సదా వినుచున్నది? కృపకొరకు దప్పిగొనియున్నవారికి శుభసందేశము నందజేయునది హృదయమే. నీలోని వజ్రమణిపై నిక యెవ్వరును దాడి చేయ జాలరు. నిర్దుష్టమగు స్వస్వరూపముచేతనే ఎవ్వరికైనను అది చెనకరానిదై యున్నది. దానినుండి వెల్వడు మృదుకిరణప్రసారము మానవహృదయముల నెంతగానో మార్చివేయగలదు. నీశక్తిని నీవు శంకించి, నీ అజ్ఞానమును గురించి భయపడుచున్నావా? ఈ అజ్ఞానమే, తారకలులేని రాత్రివంటి చీకటి ముసుగువైచి నీశక్తిని గప్పివేయుచున్నది. ఒక నిగూఢరహస్యపు ద్వార దేశము చెంత నిలిచియున్నరీతి నీవు తటపటాయించుచు వణికిపోవుచున్నావు. పరమకారణతత్వ రహస్యముకంటె అభివ్యక్తతత్వ రహస్యము నీకు మరింత భయంకరము, అగాధమునై కన్పట్టుచున్నది. కాని, నీవు ధైర్యమూని, నీ లోలోతులనుండి వచ్చిన యాదేశమును విధేయతతో అనువర్తించుట అత్యంత ఆవశ్యకము. ఈ ఆదేశమును వినిపించిన వాడను నేనే. నన్ను నీవు తెలిసి ప్రేమించినరీతిగా, నిన్ను నేను తెలిసి ప్రేమించుచున్నాను. నా పలుకుల నెంత మాత్రమూ నీవు శంకించకుండుటకై నీ కనులకు నేను సుస్పష్టముగ సాక్షాత్కరించినాను. పరమ సత్యస్వరూపుని సంకల్ప మేదియో నీవు కనుగొని, అది నీ జీవనధర్మముగా నీవు గుర్తించుకోగలందులకై నీ హృదయమునుగూడ నీ కనులకు విప్పి చూపినాను. ఈ కార్యమింకను నీకు చాల కష్టసాధ్యముగా గన్పట్టుచున్నది. సత్యస్వరూపము ఉన్నది ఉన్నట్లుగాక వేరువిధముగ నీకు గనిపించినందుకు నీ వచ్చెరువొందు సమయము రాగలదు.

—శా క్య ము ని

* * *

డిసెంబరు 11, 1916

ప్రభూ, నిన్ను బాగుగా తెలిసిన యొకరి ముఖమున నాతో నీవు సంభాషించి యున్నావు. నీ యుపదేశమును నేను బాగుగ అర్థము చేసికోగలందులకై యిట్లు చేసితి వనుట నిస్సంశయము. (వేరుగ నీవు గావించిన సూచనను నేను పెడ చెవిని బెట్టితినని కాబోలు.) అయినను, ఇప్పటికిని నే నేమి చేయవలెనో అర్థ మగుట లేదు. నీ యనుగ్రహముచే నేను దివ్యప్రేమాగ్ని కుండికగా మార్పు చెందుదునేని, అది నా కెంత ఆనందదాయకమగునో నీ వెరుంగుదువు. పరమ సత్యపు మొట్టమొదటి మహోన్నతాభివ్యక్తియే ఈ దివ్యప్రేమ. ఇది యీ జగత్తు నందలి నీ పరమసత్యస్వరూపమును సంపూర్ణముగ అభివ్యక్తము చేయుటేగాక, దారితప్పిన మానవచేతనకు సూటిగా అద్దానిని చేరుకొను మార్గమును సైతమూ చూపుచున్నది. నీ కొరకై నేను ఆకాంక్షతో సంప్రార్థనము చేయుచుండిన కాల ములో ఎన్నిమారులు నేను, నా యాదర్శకర్మాచరణమున కత్యంత మనుగుణమైన యీ స్థితిని నా కనుగ్రహించవలసినదిగా కోరియుండలేదు ? ఆ కాలములో, సకల అహంకారిక ప్రవృత్తినుండియు నాకు విముక్తి కల్పింపబడునాడు, ఈ నా వ్యష్టి జీవసత్తను భువిపై నీ దివ్యప్రేమాభివ్యక్తికి ఉపకరణముగా జేకొనగలవనియును దోచినది. ఇప్పుడు నీవు నన్ను అదే ఆదేశించుచున్న సందర్భములో నా అశక్తత నాకు మరింతగా స్పష్టమై కానవచ్చుచున్నది. ఇంత కాలమూ ప్రేమ యన నేమియో నాకు తెలుసు ననుకొనుచు వచ్చితిని. ఇప్పుడు నాకు, ప్రేమ యని పిలువగూడని దేదియును కానుపించని స్థితిలో, ప్రేమయని ప్రత్యేకముగా పిలువదగినదియును కన్పట్టుట లేదు. మరి, నేను నిర్వచించి వివేచింపజాలని స్థితిని నే నెటుల పొందనేర్తును ? అయినను, నిన్నటిరోజున, నీ వొసగు కాను కలలో కెల్ల మిక్కిలి విలువైనదీ శక్తిమంతమైనదీ నాలో నొక చీకటిమూతలో దాగి యున్నట్లు కనుపింపజేసినావు.

ప్రభూ, నా యావత్సత్తయు నీ దివ్యవాణికి విధేయము కావలెననియు, నీ సత్యధర్మము ననువర్తింపవలెననియు నాకాంక్షించుచున్నది. కాని, దాని బాహ్య చేతనయందు మాత్రము, తననుండి నీ వేమి ఆవిష్కరింపచేయుచున్నదియు దాని కవగాహనము కాలేదు. తన ప్రేమ యిపుడు అకర్మక స్థితిలో నున్నదనియు,

దాని నిపుడు సకర్మక స్థితిలోనికి దెచ్చుట నీ సంకల్పమనియు దానికి బాగుగా తెలియును. కాని, ఆ స్థితిలోనుండి యీ స్థితిలోనికి మారుట యెట్లో దానికి అర్థమగుట లేదు. ఈ సకర్మక ప్రేమ అవిచ్ఛిన్నమై అకర్తృకముగ నుండవలెనని, —అనగా పరిస్థితులపైగాని, వ్యక్తులపైగాని అది యెంతమాత్రమూ ఆధారపడి యుండరాదని దానికి తెలియును. ప్రత్యేకించి ఏ ఒకదానియందును అయ్యది కేంద్రీకృత మగుటకు వీలులేదు. ఆ విషయములో నది విశుద్ధమై, మార్పులేక, అకర్తృకమై వెలయు నిప్పటి అకర్మకప్రేమను బోలియే యుండును. కాని, యిట్లు విశుద్ధమై, మార్పులేక, అకర్తృకమై వెలయు స్థితియం దుండియే అయ్యది కర్మప్రవృత్తి నవలంబించుట యెట్లన్నది సమస్య.

ఇది తెలియు నిమిత్తమే, నీ దివ్యప్రేమకు విశుద్ధప్రతీకయగు మిత్రదేవుని ఈ సాయంతనము ప్రార్థించితిని. నా అజ్ఞానమును బోకార్చి, సంశయములను బోగొట్టి, సంకోచమును తెగటార్చి, కట్టకడపటి సకలావరోధములనూ తొలగించి వైచి, యీ భౌతికోపకరణమును స్వాయత్త మొనర్చుకొని, నీ యావిష్కరణ కనుగుణముగా నియ్యది రూపొందునట్లు చేయుటకు నాకు తోడ్పడవలసినదిగా అర్థించితిని.

కాని, నా పలుకులు జంకుచున్నవి; నా గొంతులో కౌశలము లేదు; మిత్రదేవుడు నా ప్రార్థన నాలకించినాడో లేదో తెలియదు.

* * *

డిసెంబరు 24. 1916

ప్రభూ, ఏమి జరుగనున్నదో, ఎట్లు జరుగనున్నదో, నా మనస్సుకు తెలియ నీయకుండగనే, నానుండి నీవేమి యావిష్కరింపజేయ నెంచితివో ముందుగనే నాకు తోచునట్లొనర్చితివి; తోచుట మాత్రమే,— ఏలయన, అది నా యెదుట నీవు కొంతవరకు గనుపింపజేసిన యీ అద్భుత యాత్రాపథమున నేను చాల జంకుచు వైచిన తొలియడుగు వంటిది మాత్రమే; నదీ ప్రవాహము అంతకంతకు పొంగుచు, తుదకు కట్టలు దాటి సమస్తమునూ తన మంగళప్రదములైన జలములతో నింపివేయుటను బోలినదది. ఈ పర్యాయము, నీవు ప్రవహింపజేసిన ప్రేమ ప్రవాహపు టొత్తిడిచే ఈ విధముగా పొంగులువారినది నా హృదయము; అంతట నా యావత్సత్తయు ప్రేమించుట ప్రారంభించినది; ఒక నిర్ణీతలక్ష్య మేమియు లేక, సర్వమును, తనకు తెలిసినదానిని, తెలియనిదానిని, తాను చూచినదానిని, చూడనిదానిని ఏకకాలముననే ప్రేమింప మొదలిడినది; నెమ్మది నెమ్మదిగా, ఈ శక్తిగర్భితమైన ప్రేమ శక్తిమంతముగ మారి, మంగళప్రదములైన తన తరంగ ములతో, వెల్లిగొనిన తన కిరణప్రసారముతో, సమస్తమునూ ముంచెత్తుటకు సంసిద్ధమైనది.... ఇది కేవలము ప్రారంభము మాత్రమే,— చాల అల్పమైన ప్రారంభము. కాని, ఇదియే నీ యిచ్ఛ యని నే నెరుగుదును: ఎప్పటివలెనే నీ యిచ్ఛ అఖండానుగ్రహ రూపమున నా యవత్సత్తనూ దివ్యానందమున వెల్లి గొలిపి, క్షుద్రములైన దైవిక సంఘటనల కన్నింటికిని అతీతముగ, నీ దివ్యధామ మహిమోన్నతి వైపుగా దాని నుద్గమింపజేయుచున్నది.

నీ యిచ్ఛానుసారముగ జీవింపగలుగుటయే దివ్యత్వము !

* * *

డిసెంబరు 25, 1916

(గత సాయంకాలము నిశ్చల నీరవతలో నేను విని వ్రాసియుంచినది.)

"సమస్తమునూ—విజ్ఞాన, చైతన్యములను సైతమూ — పరిత్యజించుట ద్వారా, నీ హృదయకుహరమును నీవు, దాని కుద్దిష్టమైన పాత్ర నిర్వహణమునకై సిద్ధము గావించితివి. స్థూలదృష్టి కిది క్రొత్తగా మెప్పులేని పాత్రయే. తన ప్రవాహ జలములను సర్వదా సర్వత్ర పుష్కలముగ ప్రవహింపజేయుటే తప్ప, ఏ ఇతర ప్రవాహజలమూ తానున్నస్థాయికి ఆరోహించుట కవకాశములేని సహజస్రోతస్సును బోలిన పాత్రయిది; ఎంతసేపూ తన లోలోతులనుండి తరగని శక్తిని తాను చేది వెలువరించుటే తప్ప, వెలినుండి తాను అపేక్షించునది ఏమియు నుండదు. కాని, తరగని యీ ప్రేమవిస్తరణమునం దెంతటి పరమానందము కలదో నీ విదివరకే ముందుగా చవిజూచియున్నావు; ఏలయన, ప్రేమ స్వయంసంపూర్ణము; ప్రతిప్రేమ నపేక్షించవలసిన యవసరము దానికి లేదు; వైయక్తికప్రేమవిషయము ననే ఇది సత్యమై యుండ, అనంతుని అత్యుదాత్తముగ ప్రతిబింబించు దివ్యప్రేమ విషయమున నిది యెంత ఘనతర సత్యమో వేరుగ వివరించవలసిన పని యేమున్నది?

అన్నింటను, అన్నిచోట్లను, మరింత విస్తృతముగా, మరింత ప్రగాఢముగా, ఈ ప్రేమరూపముననే విలసిల్లుము; అప్పుడు, ఈ యాపత్ప్రపంచము నీ కార్యమై, నీ కార్యక్షేత్రమే, నీ విజయక్షేత్రమే యగును. నీ విస్తృతికి అడ్డుదగులుచున్న ఈ యలతి యవరోధములనెల్ల కూలద్రోయుటకు, నీయందలి దివ్యశక్తిచే దీప్తము చేయబడుచున్న మాయమూల చీకటులనెల్ల పారద్రోలుటకు, వీడని ప్రయత్నము సల్పుము. పోరాడి విజయసంసిద్ధిని గాంచుము; నూతనజ్యోతి నావిష్కరింపజేసి, ప్రపంచమున కావశ్యకమైయున్న నూతనాదర్శమును ప్రదర్శించుటకు, ఈనాటివరకు గల సకలావరోధములనూ అతిగమించుటకు తీవ్రకృషి యొనర్పుము. సకల బాహ్యాభ్యంతర ప్రతిబంధకములతోడనూ వీడని పట్టుదలతో పోరాడుము. వెలలేని యీ మహత్త్వమును సాధించి పొందుటకే నీ వాదేశించబడి యున్నావు."

* *

డిసెంబరు 26, 1916

ప్రభూ, నిశ్చల నీరవతలో నీవు వినిపించు వాణి సదా కడు మధురము, ఉత్సాహజనకము నై యున్నది. కాని, నీవు చూపు అనుగ్రహమునకు వలయు యోగ్యత ఈ యుపకరణమునకు దేనినిబట్టి కలిగినదో, దీనినుండి నీ వావిష్కరింప జేయుదాని ననుభూతమొనర్చుకొను సామర్థ్యము దీని కేవిధమున కలుగునో నాకు తెలియుటలేదు. దీనిలో నున్న సమస్తము మిక్కిలి అల్పమై, దుర్బలమై అతి సామాన్యమై కన్పట్టుచున్నది. ఈ మహనీయ పాత్రనిర్వహణమునకు గావలసిన దానితో పోల్చి చూచుచో, దీనిలో గాఢత్వము సామర్థ్యము, పౌష్కల్యము ఎంత గనో లోపించియున్నట్లు కానవచ్చుచున్నది. కాని, మనోభావనకు ఎట్టి ప్రాముఖ్యమూ లేదని నాకు తెలియును. ఆ విషయము మనస్సైత మెరిగినదే. కావున నది తటస్థముగ నుండి, నీ యనుశాసనము కార్యరూపము ధరించుటకై నిరీక్షించుచున్నది.

నిర్విరామముగ కృషి సల్పుటకు నీవు న న్నాదేశించియున్నావు. సకల కష్టములను అధిగమించగల అణపరాని తీవ్రోత్సాహము నాలో తీంద్రించవలెనని కోరుచున్నాను. కాని, ఒకానొక సుప్రసన్న శాంతిని నాయందు నీవు నెలకొల్పియున్నావు. ఇందుమూలమున, ప్రయత్న మేరీతిగా జేయవలెనన్నదియు నాకు తెలియుటలేదు..... పూవులు వికసించినట్లు, ఎట్టి ప్రయత్నమూ లేకయే, స్వచ్ఛందముగ, ఉనికిలో ఆనందము, పెరుగుటలో ఆనందము, నీ యభివ్యక్తివిధాన మెట్టిదైనను అద్దానిని అభివ్యక్త మొనర్చుటలో ఆనందము తొణికిసలాడునట్లుగ, ఆయా శక్తివిశేషములు, ప్రవృత్తులు, పరిణామములు నాలో వాటంతటవియే కలుగుచున్నవి. ఇందొకవేళ సంఘర్షణ మేదైనను న్నచో అయ్యది సంఘర్షణమని పిలువదగనంత సౌమ్యము, సరళమునై యొప్పారుచున్నది. కాని, ఇంతటి మహనీయ ప్రేమను ఈ చిన్నహృదయము తనలో ఎట్లు ఇముడ్చుకొనునో గదా! దీనిని ఎల్లరకు పంచిపెట్టగల శక్తి దుర్బలమైన యీ ప్రాణమయసత్తకు, భౌతిక శరీరమునకు ఎట్లు అలవడునోగదా! అత్యద్భుతమైన ఈ యాత్రాపథ ప్రవేశ ద్వారముచెంత నీవు, నన్ను నిలిపి యున్నావు. కాని, ఈ దారివెంట పురోగమించగల బలసంపత్తి నా పాదములకు గలదా? దారివెంట నడవదలంచుట

పొరపాటనియు, నేను చేయవలసినది పైకెగయుట యనియు నీవు నాకు సమాధానమిచ్చినావు. ప్రభూ, అంతులేనిదిగదా నీ దయ! మహాశక్తిసంపన్నము లగు నీ బాహువులలోనికి నీవు నన్ను మరల గైకొని అగాధమైన నీ హృదయపు టూయెలలో నన్నుంచి లాలించినావు. అప్పుడు నీ హృదయము నాతో నిట్లు పలికినది: "ఆందోళన మేమాత్రమూ చెందబోకుము; శిశువురీతి పూర్ణవిశ్వాస ముతో నుండుము; నీవు నా కార్యముకొరకై రూపొందిన నేనే యనుసంగతి నీకు తెలియదా?"

* * *

డిసెంబరు 27, 1914

ఓ నా ప్రియతమ దైవమా, వినమ్రహృదయముతో, చేతులు సాచి నిన్న ర్థించుచున్నాను.—నీ దివ్యప్రేమాగ్నితో నా యావత్సత్తను జ్వలింపజేయుము. ప్రపంచము నల్దెసల నది యీ ప్రేమను ప్రసరింపజేయునుగాక. నీ కభిముఖ ముగా నా హృదయము ఖాళీగా, అత్యంత విశాలముగా తెరువబడియున్నది. నీ దివ్యప్రేమతో ఈ ఖాళీని నీవు నింపివేయుదువుగాక. నీవుదక్క అన్యమేమియు నిచట లేదు; నీ సాన్నిధ్యమే ఇచట అంతటను నిండియుండియూ, ఇది ఖాళీగానే ఉన్నది. ఏలయన, వ్యక్తజగత్తునందలి అనంత వైవిధ్యమునకు స్థైతమూ ఇందు తావు కలదు.

ప్రభూ, చేతులు సాచి నిన్ను వేడుకొనుచున్నాను. నా హృదయము అత్యంత విశాలముగా తెరువబడియున్నది. దీనిని నీ యపారప్రేమసరోవరముగా మార్చివేయుము.

"సకలవస్తువులలో, సర్వత్రా, సర్వజీవులలో నన్నే ప్రేమింపుము."—అని నీ సమాధానము. అందుకు వలయు శక్తిని నా కనుగ్రహించవలసినదిగా కోరుచు నీ మ్రోల ప్రణమిల్లుచున్నాను.

* * *

డిసెంబరు 10, 1916

ఓ నా ప్రియతమ దైవమా, నీ దివ్యప్రేమోపకరణముగ నేను రూపొందు టెట్లో నాకు బోధింపుము.

* * *

డిసెంబరు 30, 1916

ప్రభూ, నా హృదయ మింత శీతలముగా, ఇంత రసవిహీనముగా గాన వచ్చుచున్న దేమి ?

నా జీవసత్త లోలోపల గల నా యాత్మదర్శనము నా కగుచున్నది. అంతటా, అన్నివస్తువులలోనూ అది నిన్నే పొడగనుచు, నిన్నే గుర్తించుచు, నిన్నే ప్రేమించుచున్నది. దీని విషయమై సంపూర్ణజ్ఞానము దానికి కలదు. నా బాహ్యసత్త కూడ దానికి తనను తాను అర్పణము చేసికొని యుండుటచే, ఆ యెరుక దానికిసైతమూ కలదు. మనోమయసత్తయు మరపనునది లేక ఎరుక గలిగియే యున్నది. ఇక ప్రాణమయసత్తయో, అయ్యది రాగద్వేషరహితముగ విశుద్ధమై యొప్పారుచు, సర్వత్ర, సదా, నీ దివ్యసాన్నిధ్యానందమునే అధికాధి కముగా చవిచూచుచున్నది. కాని, హృదయముమాత్రము శోషిల్లి నిద్రించుచు న్నట్లుగానున్నది. దానియందు తన అంతః ప్రేరణకు ప్రతిస్పందించగల ప్రవృత్తి ఆత్మకు గానవచ్చుటలేదు. ఎందువలన ? పోరాటమున నది యింతగా శోషిల్లి పోవునంత దుర్బలమా ? ఎత్తువడిపోవునంత తీవ్రముగా నయ్యది గాయపడినదా ? అంతఃప్రేరణకు ప్రతిస్పందించు కోరిక దానికి లేకపోలేదు. చలించని భక్తివిశ్వా సములతో అయ్యది అందుకొరకై సంకల్పించుచునే యున్నది. కాని, యౌవన క్రీడను గాంచి ఆదరముతో మందహాసము చేయుటేగాని, స్వయముగా ఆక్రీడలో పాల్గొనజాలకయుండు వృద్ధుని బోలియున్నది దాని స్థితి. అయినను, నిండారిన ఆనందముతో, నమ్మికతో నయ్యది విలసిల్లుచు, ప్రకృతి తనపై పుష్కలముగ వర్షించిన అనురాగమున కెంతయూ కృతజ్ఞతతో నుప్పొంగిపోవుచున్నది. విలు వైన ఈ కానుకలకు బదులుగ, జీవన ప్రదము, బలసంధాయకము, ఉత్సాహజన

కము, సమాశ్వాసకరమునైన బంగారుకాంతు లీను తరగని తన అనురాగరూప జీవనమధువును మానవు లెల్లరకును పంచియివ్వగోరుచున్నది. కోరి యత్నించు చున్నది కూడ....కాని, చేయవలెనని కలలుగన్నదానితో పోల్చిచూచినచో, చేసినది ఎంత అత్యల్పమో కదా! ఆశయముతో పోల్చిచూచినచో ఆచరణ మత్యంత సామాన్యమే యని చెప్పవలెను. ఏలయన. సర్వదా అది యారీతిని ఆశించుచునే యుండును. నీ పిలు పెన్నడును వ్యర్థముగ వినరాలేదని దానికి తెలియును. ఏ దివ్యవైభవముల నొకించుక నీవు తనకు దర్శింపజేసియుంటివో, వాటిని ఒకనాటికి తాను పూర్తిగ సాక్షాత్కరించుకోగలుగుదునని దానికి దెలియును.

ఇంకనూ మూతవడియే యున్న ఈ వెల్లువ తలుపుల నెవరు తెరచెదరు?

నా హృదయము మానవసహజమైన రీతిలో ప్రేమించుచున్నది. అరీతిలోనే అయ్యది ప్రబలముగా, నిలుకడగా, విశుద్ధముగా ప్రేమించునని నాకు దోచుచున్నది. కాని, నీ దివ్యప్రాభవము నఖండముగ విస్తరింపజేయుచు నది నీ దివ్యలక్షణముతో ప్రేమించవలె నన్నది నీ యిచ్ఛ: ఈ స్థితి దాని కింకనూ ఉపలబ్ధము కాలేదు.

ఇంకనూ మూతవడియేయున్న ఈ వెల్లువతలుపులు నెవరు తెరచెదరు?

* * *

జనవరి 4, 1917

ప్రభూ, నీ వరదానములను నాపై గ్రుమ్మరించుచున్నావు. ఇపుడు నా యీ జీవసత్త, జీవితమునుండి అపేక్షించునదిగాని, కోరునదిగాని ఏమియు లేనందున, మానవులు మూసియుంచుకొను పెన్నిధులను దానికి జీవితము అందించుచున్నది, వైయక్తిక క్షేత్రముల నన్నింటను, మానసిక, చైత్యాత్మక, భౌతిక వరప్రదానములతో నీవు నన్ను ముంచెత్తుచున్నావు. కడు సంపన్న స్థితిలో నన్నుంచినావు; సంపన్నతగూడ పేదరికమువలెనే సహజమై కాన్పించుచున్నది. అది నాకు అధిక సంతోషమును గూర్చుటలేదు. ఏలయన, తరచుగా, పేదరికమున, ఆధ్యాత్మిక జీవితము నాల్లో నెక్కువ ప్రగాఢముగా జాగరితమగుచున్నది. కాని, ఈ సంపన్నతను నేను చక్కగా గమనించుచున్నాను. నీ వరప్రదానములతో నిట్లు నీవు ముంచెత్తుచున్న యీ నా వ్యష్టిసత్త వర్ణనాతీతమైన కృతజ్ఞతతో నీ యెదుట ప్రణమిల్లుచున్నది.

నీ కళ్యాణగుణస్వరూపము సాటిలేనిది; నీ కృప అనంతము.

*　　　*　　　*

జనవరి 5, 1917

ప్రభూ, ప్రేమ యనునది నీ దివ్యకుసుమగుచ్ఛపు కుసుమముల నన్నింటినీ కలిపియుంచు దారపుముడియే కాని మరేమియు గాదు. కానరాని పాత్ర దానిది. కడు వినమ్రమై, గుర్తించబడకయుండు పాత్ర; ముఖ్యముగ నిస్స్వార్థమున నొప్పారు పాత్ర. దీని పూర్ణప్రయోజన మీ నిర్వ్యక్తికస్థితియందే కాననగును.

చెదరిన నీ దివ్యచైతన్య శకలముల నెల్ల చేర్చి కూర్చి, ఏక కాలముననే ఏకమూ అనేకమూకూడ నగు నీ దివ్యచైతన్యమును ఆ శకలములు అధికాధికముగా పునర్వ్యవస్థీకరించునట్లు చేసెడి యీ దారపుముడి రీతి నేను అధికాధికముగా రూపొందుచున్న హేతువుచేతనే ఈ విశ్వశక్తుల ఖేలనమందు ప్రేమయన నేమియో, దాని స్థానము, లక్ష్యము నెట్టివో కనుగొనుట నాకు సాధ్యమైనది.

ప్రేమ యనునది తానే చరమలక్ష్యముగాదు, చరమలక్ష్యమునకు పరమసాధనము. ప్రతిచోటను, ప్రతి వస్తువునందును, బనిసేయుచునే యుండియు, తానేకము చేయు ప్రతి వస్తువుచేతను తానే ప్రతిచోటను అయ్యాది ముసుగువడి యుండును. దాని ఫలితముల నా వస్తు వొకవైపున పొందుచునే యున్నను, ఒక్కొకసారి దాని సాన్నిధ్యమును సైతమా వస్తువు గుర్తింపనేరకయే యుండును.

ప్రభూ, నీ మాధుర్యము నా యాత్మలోనికి చొరబారి, నా యావత్సత్తనూ ఆనందముతో నింపివైచినది.

ఈ యానందములోనే నేను, నీవు వినుటకై యొక ప్రార్థన చేసితిని.

* * *

జనవరి 6, 1917

ప్రభూ, అనిర్వచనీయమైన ఒకానొక శాంతినీ అసదృశ విశ్రాంతినీ నా యందు నింపివైచినావు.... వ్యక్తిగత భావనగాని చింతనగాని ఏమియు లేక నీ యానంత్యపు టూయెలలో నే నూచబడుచున్నాను.

* * *

జనవరి 8, 1914

ప్రభూ, నా మనస్సులో, శిరస్సులో ఒకానొక నిశ్చల నీరవతను నీవు ప్రతిష్ఠించినావు; ఈ నీరవత లోతులలోనుండి ఏ వాణియు వెల్వడుట లేదు. మధురమంగళ స్వరూపముగల అతిథిగా శాంతి యొకతె రాజ్యమేలుచున్నది.

* * *

జనవరి 10, 1917

ప్రభూ, కేవలము నాయందే దృష్టితో నే జేయు ప్రయత్నమెల్ల వ్యర్థము, నిరర్థకము నని నాకు బోధ చేయుటయే నీ సంకల్పమా? నీ దివ్యానుగ్రహ ప్రసారణము లక్ష్యముగా గల కర్మ మాత్రమే సుకరముగా, విజయవంతముగా నిర్వర్తింపబడుచున్నది. సంకల్పము బాహ్యఫలితముకొరకై ప్రవర్తిల్లినప్పుడు, అయ్యది శక్తిమంతము, కార్యసాధకము నగుచున్నది. అది అంతర్ముఖ ప్రవృత్తి గలిగి యున్నప్పుడు, దాని కెట్టి శక్తియు ఫలితము నుండుటలేదు..... వ్యక్తిగతాభివృద్ధికై చేపట్టబడు కర్మయెల్ల నిట్లంతకంతకు నిష్ఫలమై, తత్పర్యవసానముగ అంతకంతకు అరుదైపోవుచున్నది. అంతియేగాక, అంతఃప్రవృత్తి వైఫల్య మంతయు బాహ్యప్రవృత్తి సాఫల్యమున కూడదీసుకొన్న ట్లగుచున్నది. ప్రభూ, ఈ తీరున నీవు, ఈ యుపకరణమును ఉన్నది ఉన్నట్లుగా జేకొనుచు, కర్మాచరణద్వారముననే దాని లోపములను సరిదిద్దుచుందువు.

* * *

జనవరి 14, 1917

"సుఖరహితులు సుఖు లగుదురుగాక; దుష్టులు శిష్టు లగుదురుగాక; రోగు లారోగ్యవంతు లగుదురుగాక!" ఈ తీరుగా నాలో, ఈ యుపకరణద్వారమున నీ దివ్యప్రేమాభివ్యక్తిని గురించిన యాకాంక్ష రూపు దాల్చినది. ఇది శిశువు తన తండ్రిని, తప్పక తీర్చగలడన్న నిశ్చయముతో గట్టిగా కోరిన కోరికవంటిది. ఏలన, నే నడిగినప్పుడు ఈ నిశ్చయమే నాలో నుండెను. అది నాకు కడు మట్టువైనది, సుకరమైనదిగా గన్పట్టినది, ఇది సాధ్యమే నన్న భావము నాలో స్పష్టముగా నుండెను. ఆనందమునుండి ఆనందమునకు, సౌందర్యమునుండి సౌందర్యమునకు అభివృద్ధిగాంచుట, అజ్ఞానముతో అనిచ్ఛాపూర్వకముగ నేదో సంఘర్షణకులోనై దుఃఖము ననుభవించుటకంటె ఎంతయూ సహజమూ సత్ఫలదాయకమూ కాదా? నీ దివ్యప్రేమస్పర్శతో నా యీ హృదయమును బాగుగా వికసింపజేయుదువేని, ఈ పరివర్తనము కడు సుకరమై దానంతటదియే జరిగిపోవును.

ప్రభూ, నీ కృపావిశేష చిహ్నముగ ఇది నాకు ఒనగూడ జేయవా ?

శిశువునకుండు నమ్మికతో నా హృదయ మీ సాయంకాలమున నీరీతిగా అర్థించుచున్నది.

* * *

జనవరి 19, 1917

ప్రత్యక్షానుభవమునకు రాని స్వప్నముల రీతి గంటలు గడచిపోవుచున్నవి.

* * *

జనవరి 23, 1917

ప్రభూ, పరిపూర్ణము, ప్రగాఢము నైన అనిర్వచనీయమగు ఒకానొక ప్రేమను, సౌందర్యమును, ఆనందమును నాలో నీవు ఎంతగా నింపివేసితివనిన, వానిని వ్యాప్తము చేయకుండ నాలోనే యిముడ్చుకొనుట నాకు అసాధ్యమై కాను పించినది. నా జీవసత్త యిపుడు, ప్రజ్వలించుచున్న అగ్నికుండికవలె నున్నది. మనోభావనా మారుతము దానినుండి విస్ఫులింగములను దూరదూరములకు గొని పోవుచుండ, అవి మానవహృదయముల నిగూఢతలములందు నీ ప్రేమవిలసనపు ఇతర విస్ఫులింగముల రగుల్కొన జేయునవిగా నున్నవి. మానవులను అనివా ర్యముగా ఆకర్షించు దివ్యప్రేమ అది. ప్రభూ, ఇది కేవలము నా చేతన యందలి ఆనందపారవశ్యముచే కలిగిన దర్శనము మాత్రమే గాక, ఇతర జీవనాళములను, వస్తుజాతమును యథార్థముగ రూపాంతరము చెందింపగల నా నవీన శక్తివిశేషమై వరలున ట్లనుగ్రహింపుము.

ఈ ప్రేమ, ఈ సౌందర్యము, ఈ ఆనందము అన్నావి తీవ్రతను భరింప గల తాహతు సమృద్ధిగా లేకున్న నా యావత్సత్తను వెల్లిగొలుపుచున్నవి. ఇటు లనే అవి, నేను చూచినట్టియు, తలంచి నట్టియు జనులెల్లరి చేతనతో పాటుగ, నేను చూడనట్టియు, తలంచనట్టియు జనులెల్లరి చేతనను సైతము వెల్లిగొలుపు

నట్లు అనుగ్రహింపుము .... సమస్త జనులలోనూ నీ యఖండానందచైతన్య ముద్భుద్ధమగునట్లు అనుగ్రహింపుము.

ఓ నా ప్రియతమ ప్రభూ, ఎల్లరి హృదయములను ఆనందముతో, ప్రేమతో, సౌందర్యముతో నింపివేయుము.

* * *

జనవరి 25, 1917

నా యావత్సత్తలోనూ నిండి ఆనందమును గ్రుమ్మరించుచున్న ఓ దివ్య ప్రేమస్వరూపా, నీవు ఇచ్చుకోబడితివా, పుచ్చుకోబడితివా? ఇది ఎవరునూ చెప్పలేరు. ఏలయన, ప్రతివారిలోనూ, ప్రతిదానిలోనూ ఏకకాలముననే అఖండితముగ, ఇచ్చువాడవు పుచ్చుకొనువాడవు నీవే కావున, నీకు నీవే ఇచ్చుకొనుచు, నిన్ను నీవే పుచ్చుకొనుచున్నావు.

* * *

జనవరి 29, 1917

భావప్రపంచమున సత్యము లోపించుట ఎంత గొప్ప తప్పో, రూపప్రపంచమున సౌందర్యము లోపించుటయు అంత గొప్పతప్పే. ఏలయన, జగత్ప్రభువునకు ప్రకృతి సల్పు అర్చనమే సౌందర్యము; అది రూపమ్మున వెల్వడిన దివ్యభాష. బాహ్యప్రవృత్తియందు సౌందర్యము నర్థము చేసుకోనట్టియు, అభివ్యక్తము చేయనట్టియు దివ్యచేతన అసంపూర్ణ చేతనయే యగును.

కాని, దైవము నభివ్యక్తము చేయు నితర లక్షణముల వలెనే, యథార్థమైన సౌందర్యమును కనుగొనుట, అర్థము చేసికొనుట, అభివ్యక్తము చేయుట కడుంగడు కష్టము. పరమసత్యమును, పరమానందమును కనుగొనుటకు అహంకార త్యాగము చేసి వ్యక్తిత్వము నతిక్రమించుట ఎంతగా అవసరమో అట్లేయే పరమసౌందర్యమును కనుగొనుటకు, అభివ్యక్తము చేయుటకుగూడ

అంతగానే అవసరము. అచ్చమైన సౌందర్యము విశ్వజనీనము, విశ్వ జనీనత లేనిదే దానిని కనుగొనుటయు, గుర్తించుటయు ఎవరికిని సాధ్యపడదు.

ఓ పరమసుందరా, నీయెడ నేను ఎన్ని తప్పులు చేసితినో, ఇంకనూ చేయుచున్నానో!....నీ సత్యధర్మపు పూర్ణజ్ఞానమును నా. కనుగ్రహింపుము. అపుడు నేను ఎట్టి లోపమూ లేకుండ దాని కనుగుణముగ మెలగనేర్తును. నీవు లేని ప్రేమ అసమగ్రము; అద్దాని అత్యుత్తమ భూషణము నీవు; అద్దాని అత్యంత ప్రసన్న మందహాసము నీవు. కొన్ని సమయములందు నీ పాత్రను నేను అపార్థము చేసికొంటిని. కాని, నా హృదయపు లోలోతులలో నిన్ను సదా ప్రేమించియే యున్నాను. నా శైశవమునుండి కూడ నిన్నునే విశ్వసించి నీకు అంకితము చేసికొనియున్నాను. సమూలపరివర్తనముల దెచ్చిపెట్టజూచు నెంతటి నిరంకుశ సిద్ధాంతములును నాలోని యీ విశ్వాసాగ్ని నార్పలేకపోయినవి.

నీ స్వరూపము తాము భావించునట్టిదే యని కొందరు గర్వితమతులై యనుకొనుచుందురు. ప్రత్యేకించి ఏ ఒక్క జీవనపద్ధతియందును నీకు అభిమానము లేదు. ఏ రూపమునందైనను నీవు జాగృతి పొంది ప్రకాశింపగలవు. కాని, ఇట్లు నిన్ను సాక్షాత్కరింప జేసికొనుటకు నీ రహస్య స్వరూపము తెలియుట అత్యంతావశ్యకము.

ఓ పరమసుందరా, నీ సత్యధర్మమును నేనెన్నడును తప్పకుండుటకై, అద్దాని పూర్ణజ్ఞానమును నా కనుగ్రహింపుము. సామరస్యమును సర్వత్ర అనుశాసింపగల ప్రేమతత్వపు దివ్యమకుటము భాతి నాలో నీవు ప్రకాశమానుడవు కమ్ము.

* * *

మార్చి 27, 1917

(ధ్యానసమయమున సంభాషణరూపములో అందిన సందేశము)

"ఇదిగో చూడుము; నీ యెదుట నొక చేతనమూర్తి, మూడు అచేతన మూర్తులు కానవచ్చుచున్నవి. చేతనమూర్తి ఊదారంగు వస్త్రముల ధరించి యున్నది. అచేతన మూర్తులు మట్టితోచేయబడినవైనను, ఆ మట్టి శుద్ధమైన తెల్లని మట్టి. నిశ్చల నీరవతలోని సుస్థిరతయందు మాత్రమే, చేతనమూర్తి తక్కిన మూడింటిని భేదించి, ఏకముచేసి, సచేతనమైన ఉడుపుగా రూపాంతరము చెందింప నేర్చును."

ప్రభూ, నేను నీకు ఆత్మార్పణము చేసికొని యుంటిననియు, నీ వేది యనుగ్రహించినను దానిని ప్రశాంతము, ప్రగాఢము నైన సంతోషముతో స్వీక రింతు ననియు నీ వెరిగియేయున్నావు.

"నీ వట్లు స్వీకరింతువని నే నెరుంగుదును. కాని, నీ చైతన్యమున వికా సము కల్పింప నుద్దేశించినాను. అందుకొరకై నీలో యింకనూ నిద్రాణమై యున్నదాని నెల్ల మేల్కొలుప దలచినాను. కనులు విచ్చి జ్యోతిర్దర్శనము చేయుము. నీవు తెలియవలసియున్నదానిని నిర్మలమైన నీ మనోదర్పణమున దర్శింపగలవు."

ప్రభూ, నాలోని సమస్తమూ నిశ్చలనీరవతయందు నెలకొని నిరీక్షణము సల్పుచున్నది.

"చైతన్యపు కవాటమును తట్టుము; అది నీకు తెరువబడగలదు."

రజతప్రభల నీను నిర్మలోదకములతో నది ప్రవహించుచున్నది; దాని యవిచ్ఛిన్న ప్రవాహము దివినుండి భువికి అవతరిల్లుచున్నది; కాని, నే నిపుడు తెలిసికోదగిన నీ యాదేశమేమి?

"నీ నీరవత యింకను తగినంతగా గాఢము కాలేదు; నీ మనమ్మునందు ఏదియో కదలాడుచున్నది."

అభివ్యక్తిచే కల్పితమైన ముసుగులలోనుంచి ఆత్మజ్యోతిని దర్శింపవలసి యున్నది; ప్రకాశమానమైన తెరపై లిఖించబడిన అక్షరపంక్తులవలె ఆ ముసుగులు పారదర్శకములు గావలసియున్నది. విత్తనములు చల్లబడిన పచ్చికబయలు మంచుచే కప్పబడి సురక్షితమైనట్లు, ఇది అంతయు నీ విశుద్ధ హృత్పీఠమందు భద్రతను గాంచవలసియున్నది.

"పచ్చికబయలున నీ విత్తనములనుచల్లియుంటివి కావునను, తెరపైన అక్షర చిహ్నములను లిఖించియుంటివి కావునను, నీ ఏక సుస్థిరప్రశాంతితో కూడిన నిశ్చల నీరవతలోనికి, ప్రసన్న విశ్రాంతిస్థానములోనికి మరలిపొమ్ము: మరింత లోతైన, నిక్కమైన, చైతన్యముతో ఆ విశ్రాంతిస్థానము సుసంపన్నము గాగలదు. నీ వ్యక్తిత్వభావనను మరచి, విశ్వజీవనతలోని సుఖమును మరల చిక్కబట్టు కొనుము."

"ఈ విశ్రాంతి ఘడియలలో నీకు శాంతి ఘటిల్లుమగాక; కాని, మేలు కొలుపు గంటను మరచెదవు సుమా, త్వరలోనే అది మ్రోగగలదు.

"ఎట్టి విధి నీకు ఏర్పడియున్నదో తెలిసికొని నీవు సంధానము చేయ గలవు.

"ఆవిర్భవించనున్న శక్తి నీ హృదయముచే వినియుక్తము కాగలదు."

"కట్టెలను మోపుగట్టు కట్టెలవాని భంగి నీవు నిలిచియుండలేవు. ముత్యముల కాంతివంటి ధావళ్యముగల రెక్కలను విప్పి కంటికి విశుద్ధిని చేకూర్చునట్టియు, అట్టిధావళ్యమే గల తన మెత్తనినెమ్రెక్కలతో హృదయమును పొదివిపట్టియు దివ్యహంసరీతి నీవు శోభిల్లగలవు.

"ఎల్లరను వారివారి పరమగమ్యము దెసకు నీవునడిపించుకొని పోగలవు."

"నిప్పుగూటిని నీవు చూచియున్నావు; అటులనే శిశువును జూచియున్నావు; అవి అన్యోన్యాకర్షణతో నొప్పారుచున్నవి; రెండింటిలోనూ తృప్తియున్నది; మండుచున్నతృప్తి నిప్పుగూటికి; వెచ్చదనము పొందుచున్న తృప్తి శిశువునకు.

"చక్కగా మండుచున్న యీ నిప్పుగూడు నీ హృదయములో నీకు కాన నగుచున్నది. ప్రమాదకరముగ పరిణమించకుండ దీని నెచ్చటి కైనను నీవు కొనిపోగలవు. ఇతరులు దానిని తాకిరేని దహింపబడుదురు. కావున, వారిని దానికి మరింత దగ్గరగా రానీయకుము. తనను అంతగా ఆకర్షించుచు, కనులకు మిరుమిట్లు గొలుపు నా మంటను తాను తాకగూడదని యీ శిశువు తెలిపికోవలెను. కొంత దూరమున నున్నప్పుడే అది యా శిశువునకు వెచ్చదనమిచ్చి, హృదయము నకు దీప్తిని కలుగజేయును; మితిమీరి దగ్గరినచో దానినది కాల్చి భస్మముచేయును.

"ఈ హృదయమున నిర్భయముగా వసింపగల్గునది తాను మాత్రమే. ఏలయన, దానిని రగిలించిన కిరణమూ తానే; ఆ మంటలో పునర్జన్మ మొందిన అగ్నిచరజీవి సైతమూ తానే,

"మండిపోవుదునన్న భయము లేనిది ఊర్ధ్వమున మరియొక టున్నది; అది ఆకసమునుండి దిగివచ్చిన పావనమైన 'ఫినిక్సు' పక్షి. తిరిగి ఆకసమున కెట్లు జేరవలెనో దానికి తెలియును.

"ఒకటి సాక్షాత్కారోపలబ్ధిని గాంచు శక్తి.

"రెండవది దివ్యజ్యోతి.

"మూడవది సర్వశక్తి సంపన్నమైన యీ పరమచైతన్యము."

ప్రభూ, నీవు పలికిన దంతయు ఆలకించినాను; వినమ్రతతో నీకు ప్రణమిల్లుచున్నాను. నా కోసమై నీవు కవాటము తెరచినావు; నాకు కనువిప్పు కలిగించినావు; చీకటి కొంత విచ్చినది.

* * *

మార్చి 30, 1917

తనను గురించిన తలంపు తన కేమియు లేకపోవుటయం దొక మహాప్రాభవమున్నది. కోరికలు కలిగియుండుట దౌర్బల్యమును చాటుకొనుటే యగును. దేనిని మేము 'మాది' యని వాదించినను అది మాకు లేదని నిరూపించుకొనుటే యగును. కోరుట అశక్తతా లక్షణము; అది మా లోపములను తెలిపికొని మేము వానిని చక్కదిద్దుకోలేని స్థితిలో నున్నట్లుగ ఒప్పుకొనుటే యగుచున్నది. సముచితమగు ఆత్మాభిమానము నిమిత్తముగ నైనను మానవుడు కోరికను విసర్జించగల యుదాత్తత గలిగియుండవలెను. విశ్వజీవనమునుండియు, దాని నుజ్జీవింపజేయు పరాశక్తినుండియు 'నాకు ఇది కావలెను' అని అడుగుకొనుట ఎంత అవమానకరము! అది మాకు అవమానకరమేగాక, ఆ పరాశక్తియెడ అజ్ఞానపూర్వకముగ మేము చేయు అపచారముగూడ నగును.

ఏలయన, అంతయును మా అందుబాటులోనే యున్నది; మా అహంకారిక పరిమితులు మాత్రమే మమ్ముల నీ సమస్త విశ్వమును సమగ్రముగా, ప్రత్యక్షముగా, మా స్వశరీరమును, తత్సన్నిహిత పరిసరములను మా విగా అనుభవించునట్లు అనుభవించనీయకుండ జేయుచున్నవి.

కర్మసాధనముల విషయమున గూడ మా దృష్టి ఇట్టిదిగనే యుండవలెను.

నా హృదయమున నివసించుచు నీ దివ్యసంకల్పముచే సమస్తమును నడపుచున్న నీవు, సంవత్సరము క్రిందటనే, (రూబికన్ నదిని దాటినప్పుడు సీజరు చేసినట్లుగ) వంతెనల నెల్ల కూలద్రోసి అమాంతముగ అజ్ఞాతసీమలోనికి దూకుమని ఆదేశించియుంటివి.

కర్మఫలితమును నాకు తెలియనీకుండ నీవు మరుగుపరచుచుందువు; ఇప్ప టికినీ నీ వది రహస్యముగనే యుంచినావు; అయినను, ఎట్టి ఘనత చేకూరనీ, లేక ఎట్టి దుఃఖము వాటిల్లనీ, నా యాత్మసమతలోనే నేను నెలకొనియుందునని నీ వెరుంగుదువు.

నా భవితవ్యము నాకు అనిశ్చితముగనే యుండవలెననియు, మార్గ మెచ్చ టికి జేర్చునో తెలియకుండగనే నేను విశ్వాసముతో ముందుకు సాగవలెననియు నీవు సంకల్పించితివి.

భవితవ్యమును గురించిన సకల బాధ్యతయు పూర్తిగా నీపై నిడి, నేను ఏ వ్యక్తిగత చింతనలును లేకయుండవలె నన్నది నీ సంకల్పము.

నేను ప్రయాణించు మార్గము నా మనోభావనకు సైతము సరిక్రొత్తది కావలసియుండుటే దీనికి కారణము.— సందేహము లేదు.

* * *

మార్చి 31, 1917

ప్రభూ, నీ దివ్యనిశ్వాసస్పర్శ కొక హృదయం ఉప్పొంగి గంతువేసినపు డెల్ల, భువిపై మరింత సౌందర్య మావిష్కృతమైనట్లు తోచి, వాతావరణ మెల్ల సుగంధపరిమళ భరితమై, సకలమూ మరింత సుహృద్భావ పూరితమై యున్నట్లు కాననగును.

ఓ సర్వేశ్వరా, నీ దివ్యశక్తి అత్యంత మహిమోపేతము: ఎంతటి చీకటినో విరియజేయుటకు, ఎందరి దుఃఖములనో తుడిచివేయుటకు, నీ దివ్యానందమునం దొకలేశము చాలును, ఎంతటి జడావస్థలోని అంధీభూతచేతన నైనను, దీప్తిమంతము గావించుటకు మహామహిమాన్వితమైన నీ దివ్యతేజఃకిరణ మొక్కటి చాలును.

ఎన్ని వరదానములనో నాపై నీవు క్రుమ్మరించినావు; ఎన్ని నిగూఢ రహస్యములనో నాకు వెల్లడించినావు. ఎన్నడునూ అనుకొనియుండని, ఆశించి యుండని, అతిశయ సుఖముల నెన్నింటినో నాకు చవిచూపినావు; కాని. నీవు చూపు అనుగ్రహ విశేషములం దేదియుగూడ, నీ దివ్యనిశ్వాసస్పర్శకు హృదయ ముప్పొంగి గంతువేయునట్లుగా జేయుచు ఇపుడు నాయెడ నీవు చూపిన యీ అనుగ్రహ విశేషమునకు ఎంతమాత్రమూ సమానము కాదనియే చెప్పనగును.

ఈ శుభసమయములో, సమస్త పృథ్వియు సంతోషమున కీర్తనము సల్పుచున్నది; గడ్డిపోచలు సైతము ఆనందపారవశ్యమున కంపించుచున్నవి; వాయుమండలము వెలుగుతో మిలమిల మెరయుచున్నది; వృక్షములు ఊర్ధ్వముఖమై అత్యంతభక్తితో ప్రార్థన చేయుచున్నవి; పక్షులు సంకీర్తన మొనర్చుచున్నవి; సముద్రతరంగములు ప్రేమతో పొంగి పొరలుచున్నవి; పసిపిల్లల చిరునగవు అనంతుని గురించి ప్రస్తావించుచున్నది; మానవుల అంతరాత్మలు వారి కన్నులలో ప్రత్యక్ష మగుచున్నవి.

ప్రభూ, మానవహృదయములలో, వా రెదురుచూచెడి యీ ఉషోదయము ఘటింపజేయగల అద్భుతశక్తిని నాకు నీవు ప్రసాదింప నెంచితివా? మానవచేతనను నీ దివ్యసాన్నిధ్యమున కుద్బుద్ధము గావించి, ఈ దుఃఖపూరిత ప్రపంచమున నీ పరంధామము నొకించుక వెలయింప: మంటివా? ఆహా! ఏ సుఖము, ఏ సంపద, ఏ ఐహికశక్తులు ఈ అద్భుతానుగ్రహ విశేషమునకు సమానము కాగలవు?

ప్రభూ, నీకు వే జేసిన యే ప్రార్థనమూ ఎన్నడూ వమ్ముకాలేదు; ఏలయన, నాలోపల నీతో మాటలాడునది నీవే.

సర్వశక్త్యాత్మకమగు నీ దివ్యప్రేమ సచేతనము, ముక్తిప్రదము నైన తేజోరూప వర్షబిందువుల నొక్కటొక్కటిగా కురియుచున్నది. అజ్ఞానభూయిష్ఠమగు మా ప్రపంచముపై నిత్యమైన యీ దివ్యతేజోబిందువు లిట్లు అవిరామముగా వర్షించునపుడు, నీలాకాశమునుండి ఒక్కటొక్కటిగా బంగరుతారకలు వర్షించుచున్నట్లనిపించును.

నిత్యనూతనముగ పునఃపునః ప్రవృత్తమానమగు నీ దివ్యసంఘటనము మ్రోల సర్వమూ భక్తిభావమున ప్రణమిల్లుచున్నది.

* * *

ఏప్రిల్ 1, 1917

చిత్రవిచిత్రములైన ప్రకృతిదృశ్యముల వైభవము నెల్ల, మూగవోయి శ్రద్ధాళువై తిలకించిన నా యాత్మకు నీవు దర్శింపజేసితివి; విశ్రాంతి స్థానములగు నా వృక్షములు, ఆ ఏకాంతపథములు ఆకాశమునకు ఎక్కుచున్నట్లుగా తోచినవి.

కాని, నా భవితవ్యముమగురించి నీ వేమియు పలుకలేదు; అది నాకు పూర్తిగా మరుగువడి యుండవలసినదేనా?

మరల ఎల్లెడల చెర్రీవృక్షములు నాకు గనబడుచున్నవి; ఈ పుష్పము లయం దేదియో మాంత్రికశక్తి యున్నది; నీ దివ్యసాన్నిధ్యము నవి ముచ్చటించు చున్నట్లున్నవి; నీ దివ్యమందహాసము వానిలో గానవచ్చుచున్నది.

నా శరీరము విశ్రాంతిగొనియుండ, నా యాత్మ విరియబూసినట్లుగ నున్నది; పుష్పించిన యీ తరువు లెంత మనోహరములు!

ఓ జపానుదేశమా, ఈ మనోజ్ఞతామహోత్సవము నీ సద్భావము ధరించిన విలువైన యుడుపువోలె నున్నది; ఇది నీ చర్పించు పరమపవిశుద్ధమైన కానుక; నీ పరమవిశ్వాస చిహ్నము, ఈ తీరుగా ఆకసమును నీవు భావనచేయుచున్నట్లు తెలియజేయుచున్నావు.

దేవదారు వృక్షములతో నిండిన ఎత్తయిన పర్వతములు, పచ్చనిపైరులు, తోటలతో గూడిన లోయలు గల యీ దేశ మత్యంత మనోజ్ఞము. ఈ జైనా జాతీయుడు గొనితెచ్చు నీ చిన్నిగులాబీపూలు సన్నిహిత భవిష్యత్తును గురించిన వాగ్దానములే యగునా?

ఏప్రిల్ 7, 1917

ప్రగాఢమైన ఏకాగ్రత నన్ను ఆవహింపగా, నేనొక చెర్రీకుసుమముతో తాదాత్మ్యము చెందియున్నట్లు నాకు కానవచ్చెను; పిమ్మట, ఆ కుసుమము ద్వారా, చెర్రీకుసుమము లన్నింటితోడనూ తాదాత్మ్యము నా కనుభూతమయ్యెను. ఈ చైతన్యానుభూతిలో ఒకానొక నీలకాంతి ప్రవాహము వెంట వేరు మరింత లోతునకు దిగి చూచుసరికి, ఆకస్మికముగా, అసంఖ్యాక పూజాకుసుమ సమర్పణపూర్వకముగ తన బహుశాఖారూప బాహుసంచయమును అంతరిక్షము వైపుగా సాచి నిలిచిన ఆ చెర్రీవృక్షమే నేనై పోతిని. అప్పుడు, ఈ క్రింది వాక్యము స్పష్టముగా నాకు వినవచ్చెను:

"చెర్రీ వృక్షముల ఆత్మతో ఏకత్వమును నీ విపుడు పొందియున్నావు. ఈ పుష్పాంజలి రూపమైన సంప్రార్థనము చేయుచున్నది ఆ పరమాత్మునే యని తెలిసికొనుము."

అది నేను వ్రాసిన యనంతరము, అంతయును చెరిగిపోయెను. కాని, చెర్రీ వృక్షములలో ప్రవహించు రసస్రోతమే నా రక్తనాళముల యందునూ ప్రవహించుచున్నది. దానితో పాటుగ, అసదృశమగు శాంతియు శక్తియు గూడ అటులనే ప్రవహించుచున్నవి. మానవ శరీరమునకునూ వృక్షశరీరమునకునూ భేద మేమున్నది? యథార్థముగ, ఏ భేదమును లేదు. ఉభయమునూ ఉజ్జీవింప జేయు చైతన్య మొక్కటే.

అపుడా చెర్రీవృక్షము నా చెవిలో రహస్యముగ నిట్లు పలికెను:

"వసంతఋతువు నందలి అవ్యవస్థితులను జక్కజేయజాలునది చెర్రీ కుసుమమే.

* * *

ఏప్రిల్ 9, 1917

ప్రభూ, సర్వజ్ఞత్వ విశిష్టమైన నీ రాజ్యద్వారము నొకపరి దాటుట సంభవించెనేమి, అటుపై మనోమయ ప్రపంచములోనికి తిరిగి వచ్చినపుడెల్ల, అచట దోచు ప్రతి భావమూ అంతకుపూర్వ మెన్నడును ఊహించియుండని అత్యద్భుత, అగాధసమస్యగనే కన్పట్టుచుండును.

మనోమయ ప్రపంచమునకు పైన, ఏ సమస్యయు లేదు; ప్రశాంతమైన ఆ నిశ్చల నీరవతలో, అనాద్యనంతముగ సర్వమూ తెలియనగుచునే యుండును. క్రిందికి వచ్చినప్పుడే, అంతయు క్రొత్తయై, తెలియనిదై, ఊహించియుండనిదై కనిపించును.

ఈ రెండును, ఒకే చైతన్యానుభూతియందు, ఏకమైనప్పుడు, దివ్యశాంతి, దివ్యజ్యోతి, దివ్యానందములను ఘటిల్లజేయు సంశయరహిత పరమాశ్చర్యమున కది ఆలవాలమై విలసిల్లును.

* * *

ఏప్రిల్ 10. 1917

నా హృదయము నా అంతరాంతములలోనికి డిగ్గి నిదురవోవుచున్నది.

సమస్త పృథ్వియు నిత్యపరివర్తనాత్మకమైన సంచలనమును, ఆందోళనమును చెందుచున్నది. సమస్త జీవలోకము, సుఖదుఃఖము లనుభవించుచు, యత్నము లొనర్చుచు, శ్రమలు పడుచు, విజయములు సాధించుచు, నశించి మరల రూపొందుచునున్నది.

నా హృదయము నా అంతరాంతములలోనికి డిగ్గి నిదురవోవుచున్నది.

నానా విధములైన యీ అసంఖ్యేయ తత్వము లన్నింటియందును, వానికి మూలభూతముగా పనిచేయు సంకల్పము, మనీష, ప్రాణశక్తి, జడపదార్థము,— అన్నియును నేనే.

నా హృదయము నా అంతరాంతరములలోనికి డిగ్గి నిదురవోవుచున్నది.

ఇక ఏ వైయక్తిక పరిధులును లేవు; ఏ వైయక్తిక ప్రవృత్తులును లేవు; సంఘర్షణ జనింపజేసెడి యే పృథగ్వ్యవైకాగ్రతయు లేదు; అఖండమైన ఒకే ఏకత్వము వినా మరేదియును లేదు.

నా హృదయము నా అంతరాంతరములలోనికి డిగ్గి నిదురవోవుచున్నది.

* * *

ఏప్రిల్ 28, 1917

ఓ నా ప్రియతమ దైవమా, నీ దివ్యవైభవమంతటితోనూ ఈ రాత్రి నీవు నాకు సాక్షాత్కరించినావు; ఒక్క క్షణములో నీవు నా యీ సత్తను అత్యంత విశుద్ధముగా, తేజోవంతముగా, పారదర్శకముగా, చైతన్యవంతముగా మార్చి వేయగలవు. దానిలో ఇంకనూ చోటు చేసికొనియున్న చీకటులను, అభిమాన ప్రవృత్తులను రూపుమాపగలవు; ఈ రాత్రి, వర్ణనాతీతమగు నీ దివ్యకాంతితో దీనిని ఛేదించినప్పుడే ఈ పని నీవు చేసియుండలేదా ?.... చేసియుండవచ్చును.... ఏలయన, ప్రశాంతము, అపారమునైన అతిమానుషశక్తి యపుడు నాలో ద్యోతక మగుచున్నది. ఈ శిఖరస్థానమునుండి నాకు పతనము లేకుండునట్లనుగ్రహింపుము. నా అంతరాంతరములందే కాక, అత్యంత బాహ్యప్రవృత్తి విశేషము లందును, అత్యల్పములైన హృదయభావ స్పందనలు, కర్మేంద్రియ వ్యాపారము లందును గూడ శాంతి సదా విలసిల్లునట్లు కృప సేయుము.

జీవులకు ముక్తిప్రదుడవైన ఓ మహాప్రభూ, నీకు ప్రణామము.

"ఇవిగో, పూవులు, దీవెనలు; ఇది దివ్యప్రేమ శుచిస్మితము; దీనికి రాగ ద్వేషములు లేవు...... ఎల్లరిపైనను అమృతవర్షము గురియుచున్నది; మహోద్భుతములగు వరముల ననుగ్రహించుచున్నది."

ఆనంద పారవశ్యముతో చేతులు సాచి ప్రత్యక్షమై, జగన్మాత తన దివ్య ప్రేమామృతము నెల్లరిపైనను వర్షించుచున్నది.

* * *

అకాకురా, జులై 13, 1917

"నా హృదయము నా అంతరాంతరములలోనికి డిగ్గి నిదురించుచున్నది."- అని నే నొకనాడు వ్రాసితిని. అది కేవలము నిదురించుచున్నదా ? అది నిద్రయని నే ననుకోను; శాశ్వతమైన శాంతిలో నిమగ్నమగుటగ భావించుచున్నాను. నిద్ర నుండి మెలకువ వచ్చును; శాంతినుండి అట్లు తొలగుట సంభవింపదు. ఆనాటి నుండియును నాలో, శాంతిభంగము కానరాలేదు. దీర్ఘకాలము ఎడనెడ ఆందోళనతో కూడిన గాఢైకాగ్రతకు మారుగా, ఎట్టి ఆందోళనయు లేని, ఒకానొక సుస్థిర సువిశాల అఖండానుభవము నాలో నిండారినది; లేక, ఈ నా జీవసత్తయే దాని యందు విలీనమైపోయినదని చెప్పనగును. ఏలయన, అపరిచ్ఛిన్నము పరిచ్ఛిన్న రూపమున నెట్లు ఇముడగలదు ?

శాంత గంభీరమైన ఆకారరేఖలతో శివిని వెలార్చుకొనుచు రోదసిలోనికి వ్యాపించి గవాక్షముగుండ నాకు గానవచ్చుచున్న యీ మహాపర్వతములు, అఖండ శాంతిలో నిమగ్నమైన యీ నా జీవసత్తతో ఎంతేనియు సామరస్యమును ప్రదర్శించుచున్నట్లున్నవి. ప్రభూ, నీవు నీ రాజ్యమును,— అథవా నీ రాజ్యము నందలి యీ భాగమును స్వాయత్తము గావించుకొంటివా ? ఏలయన, ఈ శరీర మింకనూ అజ్ఞాన దూషితమై, త్వరితగతిని ప్రతిస్పందింప జాలక, మృదుత్వ లక్షణ విహీనముగనే యున్నది. ఇదియు తదితరము రీతి నెప్పటికైన విశుద్ధిని గాంచి, తత్ఫలితముగ నీ విజయము సంపూర్ణమగునా ? అది కేవలము అప్రధానమైన విషయము. ఈ ఉపకరణము ఎటులుండవలెనని నీ యిచ్ఛయో అటులే యగునుగాక; ఎటులైనను దాని కానందమే.

* * *

సెప్టెంబరు 24, 1917

ప్రభూ, నీవు నన్ను కడు కఠిన శిక్షణలో బెట్టితివి; నీ దరికి జేర్చు నిచ్చెనను నేను ఒక్కొక్క మెట్టే ఎక్కుకొనుచు వచ్చితిని. కడపటి పై మెట్టులో నీతోడి సంపూర్ణ తాదాత్మ్యానందమును నాకు చవిచూపితివి. అంతట నీ యాజ్ఞననుసరించి, ఒక్కొక మెట్టే మరల దిగుచు, నిన్ను కనుగొనుటకై లోగడ వదలిన లోకములలోనికి పునఃప్రవేశపూర్వకముగ బాహ్యచైతన్య స్థితుల లోనికి వచ్చితిని. ఇపుడు నేను నిచ్చెన అట్టడుగు మెట్టునకు మరల చేరుకొని నందున, నా బాహ్యాభ్యంతరముల యందు అత్యంత సామాన్యస్థితి యేర్పడి ఏమియు అర్థము చేసికొనలేని స్థితిలో నున్నాను.

మరి, నానుండి యిపుడు నీ వేమి యపేక్షించుచున్నావు ? ఎట్టి శిక్షణ తోను పనిలేకయే మానవులలో అత్యధికసంఖ్యాకులు వర్తించు స్థితిలోనే నేనునూ వర్తించుట జరిగెనేని, ఇక సుదీర్ఘముగ ఇంతకాలమునుండియు చేయుచువచ్చిన ప్రయత్నమునకు ఏమి ప్రయోజనము ?

చూడదగిన వెన్నియో చూచినాను; అనుభవించ దగిన వెన్నియో అనుభ వించినాను. నీ దివ్యజ్ఞానమును, నీతోడి పూర్ణతాదాత్మ్యమును బొందనేర్చు పరమ పవిత్రస్థాయినిసైతము నన్ను నీ వనుభవింపజేసియున్నావు. ఇట్టి సందర్భములో, ఇంతటి సామాన్యపరిస్థితులతో కూడిన సామాన్యోపకరణముగా నన్ను నీ విట్లు రూపొందించినా వేమి ? ప్రభూ, అగాధములైన నీ లక్ష్యములు నాకు బొత్తుగా అర్థముగాకున్నవి.

విశుద్ధ తేజోమయమైన నీ దివ్యానందరూపమగు మహారత్నమును నా హృదయమందు నిక్షేపించియుండిన నీవు, దాని ఉపరితలమున వెలినుండి వచ్చు నీలినీడలు ప్రతిఫలించుట కవకాశ మిచ్చుచున్నావేమి ? దీని మూలముగా, నీచే నా కనుగృహీతమైన దివ్యశాంతిరూపమగు పెన్నిధి నాలో నున్నట్లు అను మానించుట కైనను వీలులేక యది నిరర్థక మగుచున్నట్లు తోచుచున్నది. దీని కేమి కారణమో, ఈ రహస్యము నాకు బొత్తుగా అవగాహన మగుటలేదు.

అటులనే, అంతరంగమున మహనీయమగు నిశ్చలనీరవతను నాకు ప్రసా దించియుండిన నీవు, నా నాల్క యింతగా వాచాల మగుచుండుటకును, నా మనో భావన యింతగా వ్యర్థాలాప నిమగ్న మగుచుండుటకును అవకాశ మిచ్చుచున్నా వేమి? ఎందుచేత? నిశ్చితము తేలక ఇట్టి ప్రశ్నలు నే నింకను ఎన్నయిన వేయ గలను. కాని, ఫలితముమాత్రము శూన్యమనియే తోచుచున్నది.

నీ నిర్ణయము తలదాల్చి, మారుమాట లేకుండ యిప్పటి నా స్థితి నంగీక రించి మెలగుటే ఇక నేను చేయదగిన కార్యము.

జగద్రూపమగు మహాసర్పము అనంతముగా తన చుట్టలను విప్పుకొను చుండ తిలకించుచు నిలిచిన సాక్షిని మాత్రమే ఇపుడు నేను.

* * *

(కొన్ని రోజుల తరువాత)

ప్రభూ, నీ యాదేశము పాటిపేయక దుర్బలత చాటుకొనుచు ఎన్నిమారులు నేను, ఈ యైహికచేతనాటోపము నాకు తప్పించి పరమమైన నీ యేకస్వరూపము నందు నన్ను లీనము కానిమ్మని నీకు విన్నవించుకొనుచు ప్రార్థించితినో! నా యీ ప్రార్థన పిరికితనపు లక్షణమని నే నెరుగుదును. కావుననే అది నిష్ఫల మగుచున్నది.

* * *

అక్టోబరు 15, 1917

ప్రభూ, నిరాశావశమున నీకు నేను మొరవెట్టుకొనగా నీవు నా మొర నాలకించితివి.

నా జీవితములో నా కేర్పడియున్న పరిస్థితులగురించి మొరవెట్టుకొను హక్కు నా కెంతమాత్రమూ లేదు. అవి నా స్వరూపస్థితికి అనుగుణమైనవే కదా.

నీ దివ్యవైభవ ద్వారదేశమునకు నన్ను నీవు దోడ్కొనిపోయి, నీ పరమ సామరస్యస్వరూపములోని ఆనందమును నాకు ప్రసాదించియుండుటచే, చేరవలసిన గమ్యమును నేను చేరినట్లుగా తలపోసితిని; కాని. వాస్తవమున నీవు ఈ నీ యుపకరణమును సర్వజ్ఞమగు నీ దివ్యదృష్టితో చక్కగ నవలోకించి, మరల కొత్తగా కరగించి శుద్ధము చేయునిమిత్తముగా. ఈప్రపంచపు మూసలోనికి విసరివైచినావు.

అత్యంత తీవ్రావేదనతో కూడిన యాకాంక్ష నాలో తీంగ్రడించియున్న యీ తరుణములో నన్ను నీవు రూపాంతరీకరణమార్గము వెంట దిగ్భ్రమ నొందించు వేగముతో లాగుకొని పోవుచున్నట్లుగా నాకు కాననగుచున్నది. అనంతునితోడి సంస్పర్శను ఎరుకతో అనుభవింపుచు నా యావత్సత్తయు నిలువెల్ల స్పందించి పోవుచున్నది.

వినూత్నమైన యీ కఠినపరీక్షను నేను అధిగమించగలందులకే, నీవు నాకు సహనమును, బలమును అనుగ్రహించియున్నావు.

* * *

నవంబరు 25, 1917

ప్రభూ, ఒకానొక మహోదుస్థితి సమయములో నేను, అంతశ్శుద్ధి పూర్వక మగు నిండు విశ్వాసమున, 'నీ యిచ్ఛయే జరుగునుగాక' యని వాకొనగా, నీ మహావైభవస్ఫూర్తి దొలుకాడు వేషముతో నాకు సాక్షాత్కరించితివి. నే నంతట నీ పాదముల ముందు వ్రాలితిని; నీ వక్షము నాశ్రయించి విశ్రాంతి బొందితిని. నీవు నా యావత్సత్తనూ నీ దివ్యకాంతితో నింపి నీ దివ్యానందమును వెల్లివిరియ జేసితివి; నీ యనుబంధమును పునరుద్ఘాటించి, నీ సాన్నిధ్యము నాకు సదా అలవడ గలదని అభయ మొసంగితివి. ఎన్నడును విడనాడబోని మిత్రుడవు నీవు; శక్తి నొసగి, తోడు నిలుచు మార్గదర్శివి; చీకటిని పటాపంచలు చేయు వెలుగువు; విజయము చేకూర్చు విజేతవు; నీ సాన్నిధ్యము వలననే సర్వమూ సుస్పష్టమైనది. బలిష్ఠముగ జేయబడిన నాహృదయమునందు అగ్నిదేవుని పునఃప్రజ్వలనము జరిగినది. అతడు మహాదీప్తితో ప్రకాశించుచు, వాతావరణము నెల్ల విశుద్ధము, దీప్తిమంతము గావించుచున్నాడు.

ఇంతవరకును అణగియుండిన నా ప్రేమ మరల ప్రాబల్యముతో, ప్రాభవముతో అప్రతిహతమగుచు పైకి లంఘించినది; తాను పొందిన అగ్నిపరీక్షవలన పదింతలుగ వృద్ధిపొందినది. వెనుకటి యేకాంతస్థితి వెలికివచ్చుటలో దానికి బలము చేకూర్చి యావచ్చేతనకూ అధినేత కాగలుగునట్లునూ, వెల్లువయై ప్రవహించు తన ప్రవాహములోనికి సమస్తమునూ లోగొనునట్లునూ చేసినది.

"నేను తిరిగివచ్చినది యెన్నడును మరల నిన్ను విడనాడకుండుటకే." అని నీవు అభయము పలికితివి.

క్షోణితలంబున నెన్నుదురు సోకగా మ్రొక్కుచు ఈ వాగ్దానమును నేను గ్రహించితిని.

* * *

జులై 12, 1918

ఆకస్మికముగా నీ మ్రోల నా గర్వమెల్ల విచ్చిపోయినది. నీ సన్నిధిలో నా అతిశయమును చాటుకొనజూచుట ఎంత పనికిమాలిన పనియో నా కవగతమైనది ....పెల్లుగా, అదుపేమియు లేకుండ, నా జీవితములో నెన్నడునూ గార్చియుండని మధురాశ్రువుల గార్చుచు శోకించితిని.....అవును, అవి మధురాశ్రువులే,—నా కెంతయో శాంతి విశ్రాంతుల జేకూర్చిన అశ్రువులవి; ఎట్టి సిగ్గుగాని, అదుపుగాని లేకుండ నీ మ్రోల నేను గార్చిన అశ్రువులు. అది తన తండ్రి చేతులలో బిడ్డ యేడ్చిన యేడ్పువంటి దగునా? కావచ్చుగాని, ఎట్టివాడా తండ్రి? ఆహా, ఏమి యా ఘనత, ఆ అనుగ్రహము, ఆ విజ్ఞానము! ఆ ర్తి బాపుటలో ఏమా శక్తి, ఏమా నిండుదనము! నిజముగా ఈ అశ్రువులు పరమపవిత్రమైన మంచుబిందువుల వంటివి. ఇవి నా కష్టము నిమిత్తముగ నేను గార్చిన అశ్రువులు కాకపోవుటవలననేనా వానికి పవిత్రత? నా హృదయమును ఎట్టి సంకోచమూ లేకుండ నిండుగా విప్పారజేసి, నీ నుండి నన్ను వేరుచేయగలుగునట్టి సకలావరోధశేషమునూ ఒక్క అద్భుతక్షణములో కరగించివైచిన ఆ అశ్రువు లెంత మధురాతి మధురములు, ఎంత శుభప్రదములు!

కొలది దినముల క్రిందట నా కీ వాక్కులు వినబడెను,—"ఎట్టి దాపరికము గాని, నిర్బంధముగాని లేకుండ నీవు నాయెడ విధేయత చూపుదువేని, ఎన్నియో మార్పులు సంఘటిల్లగలవు; ఘనవిజయము సంప్రాప్తము కాగలదు."—అని. అందువలననే, నా హృదయాంతరమునుండి అశ్రువులు కనులలోనికి పెల్లుబికి రాగా, నేను నీ యెదుటికి వచ్చి కూర్చుండి, భక్తిపూర్వక సమర్పణముగా ఆ కన్నీటిని గార్చివైచితిని. నా కెంతేనియు ఓదార్పు కలిగించిన యా సమర్పణ మెంత మధురము!

ఇపుడు నాలో ఆ దుఃఖ మేమియు లేదు; కాని, మరింత దగ్గరగ నీ సాన్నిధ్యము ననుభవింపుచు నా యావత్సత్తయు ఆనందమున గంపించిపోవుచున్నది.

నట్టు పలుకులతో నా భక్తిభావము నిట గొంత వెల్లడించుకొనియెదను:

శిశూల్లాసము నాలో క్రేళ్ళురుకుచుండ నే నిట్లు భాషించితిని:

ప్రభూ, మాకు పరమవిశ్వాస పాత్రుడవు నీ వొక్కడవే; మేము నీతో ఏమి చెప్పుకొనగోరినను అది యెల్ల నీవు ముందుగనే ఎరుగుదువు; కారణమేమన, ఆ చెప్పుకోదలచువానికి మూలమైనవాడవు నీవే.

ప్రభూ, మాకు పరమమిత్రుడవు నీ వొక్కడవే; మాలోని గుణదోషము లెట్లున్నను మమ్ములను ఉన్నపాళముగ ప్రేమించి, అర్థముచేసికొని, స్వీకరించు చున్నావు; కారణమేమన, ఆ రీతిగ మమ్ములను రూపొందించినవాడవు నీవే.

ప్రభూ, మాకు పరమగురుడవు నీ వొక్కడవే, మాలోని ఉన్నతసంకల్ప మును నీ వెన్నడును త్రోసిపుచ్చవు, కారణమేమన, ఆ సంకల్పములోపల సంక ల్పించునది నీవే. మమ్ము విని, అర్థముచేసికొని, ప్రేమించి, యుక్త మార్గ మున నడిపించుటకు నిన్ను గాక ఇతరులను మే మాశ్రయించుట వట్టి అవివేకమే యగును. ఏలయన, అట్లు నడిపించుటకు నీవు సర్వదా సిద్ధముగనే యుందువు: ఎన్నడును మమ్ము విడనాడవు. పరమ విశ్వాసమును, పరమభద్రతను, పరమ విధేయతను అప్రయత్నముగా, నిర్బంధరహితముగ పూరించుకొనుటలోని పరమా నందమును నీవు నా కనుగ్రహించియున్నావు.

ఓ నా ప్రియతమ దైవమా, శిశూల్లాసము నాలో క్రేళ్ళురుకుచుండ, నీ సన్నిధిలో నేను ఏకకాలముననే నా సుఖదుఃఖముల వెళ్ళబోసికొంటిని.

* * *

అక్టోబరు 10, 1918

ఓ నా ప్రియతమ దైవమా, నా కార్యాచరణ మెల్ల కేవలము నీకొరకే యని నేను భావించుకొనుటలో ఎంత ఆనందమున్నది! నిన్ను సేవించుటకు నే నిదే సిద్ధముగ నున్నాను. కర్తవ్యమును నిర్ణయించునది, ఆదేశించునది, ఆచరణలో పెట్టునది, నడుపునది, సాధించునది,— అంతయును నీవే. ఇది నే గుర్తించుట వలన నాకు గలుగుచున్న శాంత్యానందములకు మేర లేదు. నీ చేతిలో ఒదుగుట నేర్చుకొని, శ్రద్ధాపూర్వకముగ నీకు ఆత్మసమర్పణము గావించుకొనుటే మేము చేయవలసినది. నీవే యథేచ్ఛగ మాలో పనిచేయు నవకాశము మేము కల్పింపవలెను. అప్పుడిక ఎట్టి పొరపాటులు, తప్పులు, లోపములు సంభవింప నేరవు. కారణ మేమన, ఏది ఎట్లు జరగవలెనని నీ సంకల్పమో అది యట్లు నీవే నెరవేర్చెదవు.

ప్రభూ, నీయెడ కృతజ్ఞతాపూర్వకము, పరమవిశ్వాస సంభరితము నైన యీ నా భక్తినివాళి నందుకొనుము.

నా ప్రియజనకుడు చిరునగవుతో నన్ను గనుగొని, సర్వశక్తి సంపన్నము లగు తన చేతులలోనికి నన్ను దీసికొన్నాడు. ఇక భయపడవలసిన దేమున్నది? ఆయనలో నేను కరిగి లీనమైపోయినాను. తన అభివ్యక్తి కొరకు తానే నిర్మించు కొనిన యీ శరీరమున వసించునది, కార్యాచరణ మొనర్చునది ఆయనయే.

* * *

ఓయివాకే, సెప్టెంబరు 3, 1919

నే నెంతో ప్రేమతో, శ్రద్ధతో వండి సిద్ధముచేసిన భోజనమును మానవుడు త్రోసిపుచ్చుటచే, దాని నారగించుటకు పరమేశ్వరు నాహ్వానించితిని.

పరమేశ్వరా, నీవు నా యామంత్రణము నంగీకరించి వచ్చి, నాతో కలిసి కూర్చుండి, భక్తితో నే నర్పించిన యలతి పదార్థములను స్వీకరించి, అందుకు ప్రతిగా నాకు చరమముక్తినే ప్రసాదించితివి. నేటి ఉదయము వరకును, ఎంతయో చింతావ్యాకులమై యుండిన నా హృదయము, బాధ్యతా సంకులమై యుండిన నా శిరస్సు, తమ భారమును దించివేసికొని, యిపుడు చాల తేలికపడి ఉల్లాసముతో నున్నవి. ఈ విధమైన స్థితిలో నా యంతస్సత్త ఇప్పటికి చాల కాలముగనే ఉండియున్నది. అటులనే, ఇంతకు పూర్వము నా యాత్మ నీ స్పర్శ, సుఖముచే మందస్మితముతో విలసిల్లుచుండెడిది. ఇపుడు నా శరీరముకూడ చిరునగవుతో నొప్పారుచున్నది.

ఈ యానందమును నాలోనుండి యిక ఎన్నడును నీవు ఉపసంహరింపబోవనియే తలంచుచున్నాను. ఏలయన, ఈసారి నేను శిక్షానుభవమును చాలినంతగనే పొందియున్నాను. విషమ పరీక్షల నెన్నింటినో ఎదుర్కొని భ్రమపరంపరల నుండి బయటపడి పునరుత్థాన యోగ్యతను సంపాదించియున్నాను. నిర్మలమైన శిశుహృదయమును, దేవతామూర్తిలో కానవగు భావస్వాతంత్ర్యమును నాకు చేకూర్చు సామర్థ్యము గల ప్రేమదక్క, గతకాలావశేష మేదియును ఇపుడు నాలో లేదు.

* *

పుదుచ్చేరి, జూన్ 22, 1920

ఓ నా ప్రియతమ దైవమా, వర్ణనాతీతమైన ఆనందమును నా కనుగ్రహించిన యనంతరము, తీవ్ర సంఘర్షణకును, కఠిన పరీక్షకును నీవు నన్ను గురి చేసినావు. కాని, వీటినిగూడ నీ మహనీయ సందేశహరులను జూచినట్లుగ. ప్రసన్న దృష్టితోనే చూచినాను. పూర్వము, సంఘర్షణమనిన నాకు భయ ముండెడిది; శాంతి సామరస్యముల యెడ నాకుగల ప్రీతి కా సంఘర్షణ సహింప రానిదిగ నుండెడిది. కాని, యిపుడో, సంఘర్షణకు సంతోషపూర్వకముగ స్వాగతము పలుకుచున్నాను; అది నీ వవలంబించు కార్యపద్ధతులలో నొక పద్ధతి. మరపున బడిపోగల కొన్ని యంశములను మరల వెలుగులోనికి దెచ్చుట కది యొక ఉత్తమ సాధనము,— విపులము, సంకీర్ణము, శక్తిమంతము నైనదిగ ద్యోతకము కాగల సాధనము. ఈ సంఘర్షణమును రేకెత్తించినది నీవే యని నేను గుర్తించిన విధముగానే, వివిధ సంఘటనలయు, విరుద్ధ లక్షణములయు చిక్కులనెల్ల విడదీయుచు, నీ దివ్యతేజశ్శక్తులను మరుగుపరచు సమస్తము పైనను తుదకు విజయము సాధించునదియు నీవేయని కనుగొనుచున్నాను; ఏలయన, ఈ సంఘర్షణ పర్యవసానముగనే, నీ పూర్ణతర సాక్షాత్కారోపలబ్ధి ఒనగూడ వలసియున్నది.

* * *

మే 6, 1927

మనము పొందవలసియున్న సాక్షాత్కారోపలబ్ధుల నెల్ల మనకు అనుగ్రహించువాడైన పరమేశ్వరునకు, మన జీవన మరణములను, మన సుఖదుఃఖములను ఏ రీతిగా అర్పణము చేయవలెనో, సకల సందర్భములలో సకలమునకును ఆయనమీదనే మన మేరీతిగా ఆధారపడియుండవలెనో మనము నేర్చుకొనవలసియున్నది. కారణమేమన, మనకు సుఖము కలుగుట, కలుగకపోవుట, మనము జీవించుట, జీవించకపోవుట, ఆయా సాక్షాత్కారోపలబ్ధులను పొందుట, పొందకపోవుట నిర్ణయించవలసినవాడు, నిర్ణయించువాడు ఆయనయే.

నిర్నిబంధముగ, సర్వసమగ్రముగ, ప్రేమపూర్వక ఆత్మసమర్పణము నిట్లు చేయనేర్చుకొనుట వలననే, అఖండానందోపలబ్ధికి అత్యంతావశ్యకమైన పునాది వంటిదగు పూర్ణశాంతిని మనము పొందగలుగుదుము.

* * *

అక్టోబరు 28, 1928

ఏ అనుశాసనమునకును లోబడని దివ్యశక్తి యొకటున్నది; ఏ ఐహిక విజయము వలనను చేకూరనేరని దివ్యసుఖ మొకటున్నది; ఏ విజ్ఞానముచేతను పొంద శక్యముగాని దివ్యజ్యోతి యొకటున్నది; ఏ తత్త్వశాస్త్ర, ప్రకృతి విజ్ఞాన శాస్త్ర జ్ఞానము వలనను సాధింప వీలుకాని దివ్యజ్ఞాన మొకటున్నది; ఏ కామోపభోగము వలనను లభించనేరని దివ్యానంద మొకటున్నది; ఏ మానవ సంబంధము వలనగాని తీరనేరని దివ్యప్రేమతృష్ణ యొకటున్నది. ఎచ్చోటనూ,— మరణమునందుగూడ పొందవలవికాని దివ్యశాంతి యొకటున్నది.

ఆ దివ్యశక్తి, దివ్యసుఖము, దివ్యజ్యోతి, దివ్యజ్ఞానము, దివ్యానందము, దివ్యప్రేమ, దివ్యశాంతి మనకు పరమేశ్వరుని దివ్యానుగ్రహము వలననే లభించును.

* * *

నవంబరు 24. 1931

ప్రియతముడవైన ఓ పరమేశ్వరా, నీ కార్యనిర్వహణముకొరకై భౌతికపదార్థపు అగాధతల పర్యంతమూ మునిగితిని; భయంకరమైన అనృత, అచేతన లోక స్పర్శను ప్రత్యక్షముగా పొందితిని; పరమమైన అజ్ఞానాంధకార గర్భమును సైతము ప్రవేశించితిని; కాని, నా హృదయమందు, నిన్నుగురించిన జ్ఞప్తి ఉండనేయున్నది; నిన్ను చేరజాలెడిపిలుపు నా హృదయములోనుండి యిట్లు పైకి లంఘించినది: "ప్రభూ, ప్రభూ, నీ శత్రువులెల్లెడలను విజయము గాంచుచున్నారు; అనృతమే ప్రభువై జగమును పాలించుచున్నది; నీవు లేని జీవనము మరణము, శాశ్వతనరకము. సంశయము ఆశాభావమును పారద్రోలినది; తిరుగుబాటు ప్రవృత్తి విధేయతను నెట్టివేసినది; శ్రద్ధ అంతరించినది; కృతజ్ఞత తలసూపలేదు; కన్నుగానని ఉద్వేగములు, హింసాప్రవృత్తులు, దోషజన్యమగు దౌర్బల్యము, చక్కనైన ప్రేమనియతి నణగార్చివై చినవి. ప్రభూ, నీ శత్రువు విట్లు విజృంభించవలసినదేనా ! అనృతము, వికారము, దుఃఖము, ఈ రీతి చెలరేగవలసినదేనా ? ప్రభూ, జయము సాధించుట కాదేశమిమ్ము; జయము సిద్ధించును. మా అయోగ్యత నాకు తెలియును; ప్రపంచమింకను సిద్ధము కాలేదనియు నే నెరుంగుదును. కాని, నీ యనుగ్రహమునెడ గల పరమవిశ్వాసముతో నీకు నే నిటుల మొరవెట్టుకొనుచున్నాను; మమ్ములను నీ యనుగ్రహమే రక్షించ గలదని నాకు తెలియును.''

ఈ తీరుగా నీకు నే జేసిన ప్రార్థన వెల్లుబికి వచ్చినది; అట్టడుగు అగాధతలములలోనుండి దివ్యవైభవముతో విరాజిల్లు నిన్ను దర్శించితిని; నీవు ప్రత్యక్షమగుచు నాకిటుల అభయ మొసంగితివి; ''అధైర్యము చెందకుము; సుస్థిరతతో దృఢవిశ్వాసమున నిలువుము. నేను వచ్చెదను."

* * *

## ఈశ్వర సేవకులు కాగోరువారి కొరకు వ్రాయబడిన ప్రార్థన.

సర్వప్రతిరోధములను జయించువాడవైన ఓ పరమేశ్వరా, నీ మహిమ అతిశయిల్లునుగాక.

మాలో ఏదియును నీ దివ్యకార్యమునకు అవరోధము కాకుండునట్లు అనుగ్రహింపుము.

నీ దివ్యాభివ్యక్తిని మాలో నేదియు జాగుపరచకుండునట్లు అనుగ్రహింపుము.

ప్రతి విషయమునను, ప్రతిక్షణమునను నీ దివ్యేచ్ఛయే నెరవేరునట్లు అనుగ్రహింపుము.

మాలోని అత్యున్నతస్థానములు మొదలుకొని సూక్ష్మాతిసూక్ష్మశరీరాణువుల పర్యంతము. ప్రతిఅంశములో, ప్రతికార్యప్రవృత్తిలో, నీయిచ్ఛయే నెరవేరగలందులకై నీ మ్రోల మేమిట నిలిచియున్నాము.

పరిపూర్ణముగ నెప్పటికిని నీ యెడలనే మేము శ్రద్ధ గలిగియుండునట్లు అనుగ్రహింపుము.

అనన్యదృష్టితో సంపూర్ణముగ నీ ప్రభావమునకే మేము వశులమై యుందుముగాక.

నీయెడ ప్రగాఢము, ఘనిష్ఠము నైన కృతజ్ఞతతో నుండుట మే మెన్నడును విస్మరించకుండునట్లు అనుగ్రహింపుము.

ప్రతిక్షణమునను నీవు కృపసేయు అద్భుతమైన కార్యాలను మేము విచ్చలవిడిగ వృథపుచ్చకుండునట్లు అనుగ్రహింపుము.

మాలోని ప్రత్యంశమూ నీ దివ్యకార్యమున పాల్గొనునట్లును, నీ దివ్యసాక్షాత్కారోపలబ్ధికై సకలమూ సంసిద్ధమగునట్లునూ అనుగ్రహింపుము.

సకల సాక్షాత్కారోపలబ్ధులకును పరమాధినేతవైన ఓ ప్రభూ, నీ మహోమహిమకు జయమగుగాక!

గాఢము, కార్యతత్పరము, అఖండము, అచంచలము నైన విశ్వాసము నీ ఘనవిజయమునెడ మాలో కుదురుకొనునట్లు అనుగ్రహింపుము,

అక్టోబరు 23, 1937

*
* *